# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

VEEKSHANAM, TELUGU MONTHLY

సంపుటి : 14 సంచిక : 3 హైదరాబాద్ 176 మార్చ్ 2016 పేజీలు : 68 రు. 20

※ రోహిత్ - జెఎన్‌యు - విద్యార్థుల కదలిక - ఐదు వ్యాసాలు

※ కాపుల ఆందోళన - రిజర్వేషన్లు

※ బాక్సైట్ వ్యతిరేక ప్రజా ఉద్యమం

※ బస్తర్‌లో 'సాక్ష్యాలు లేని యుద్ధం'

※ బెంగళూరులో వర్ణ వివక్ష

※ అరుణాచల్‌లో భాజపా రాజకీయం

※ దావోస్ సంపన్నుల సదస్సు




దండకారణ్యంలో మావోయిస్టు ఆచరణ

# జనతన రాజ్యం

## పాణి

**విరసం ప్రచురణ**

డి.వి. రామక్రిష్ణారావు,
ఎం.ఐ.జి. - 14, ఎ.పి.ఐ.ఐ.సి. కాలనీ,
కార్బైడ్ కంపెనీ ఎదురుగా, మౌలాలి,
హైదరాబాద్ - 500 040

పేజీలు : 565

వెల : రు. 300

Advt.




# కవిత్వంతో ములాఖాత్

## ఎన్. వేణుగోపాల్

స్వేచ్ఛా సాహితి ప్రచురణ

పేజీలు : 206

వెల : రు. 120

Advt.

**పై రెండు పుస్తకాల ప్రతులకు : వీక్షణం, మైత్రీ రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నం. 3, హిమాయత్‌నగర్, హైదరాబాద్ - 500 029. ఫోన్: 040 66843495**

176 ISSN 2231-6892

# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

మార్చ్ 2016
సంపుటి : 14
సంచిక : 3







**'వీక్షణం' పేరిట రచనలు, ఎం.ఓలు, చెక్కులు,డి.డి లు పంపాల్సిన చిరునామా**

**వీక్షణం** VEEKSHANAM

మైత్రీ రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్,
హైదరాబాద్ - 500 029. ఫాక్స్, ఫోన్ : 040-66843495

Email : veekshanam2003@gmail.com
www.veekshanam.wordpress.com

ప్రింటర్స్ : **చరితా ఇంప్రెషన్స్**
ఆజామాబాద్, హైదరాబాద్. ఫోన్ : 040 - 27678411

**వీక్షణం చందా వివరాలు**

| | సంస్థలకు / లైబ్రరీలకు | వ్యక్తులకు |
|---|---|---|
| విడి ప్రతి | రు. 20 | రు. 20 |
| సంవత్సరం | రు. 240 | రు. 200 |
| మూడు సంవత్సరాలు | రు. 600 | రు. 540 |
| ఐదు సంవత్సరాలు | రు. 1000 | రు. 900 |
| పది సంవత్సరాలు | రు. 2000 | రు. 1700 |

ఆన్‌లైన్ ద్వారా డబ్బులు పంపేవారు మాత్రమే బ్యాంక్ స్లిప్‌లపై '**VEEKSHANAM**' అని రాసి వీక్షణం అకౌంట్ నెంబర్ – **013911011002175** ఆంధ్రాబ్యాంక్, గగన్‌మహల్ బ్రాంచ్, హైదరాబాద్ పేరు మీద వేయాలి. ఇతర బ్యాంకులలో వేసేవారు **ANDB 000/0139** నెంబర్ రాసి వేయవచ్చు.

***వీక్షణం చేస్తున్న కృషి పదికాలాల పాటు కొనసాగాలనే ఆకాంక్షతో మూలనిధికి 2016 ఫిబ్రవరి నెలలో వచ్చిన విరాళాలు - ముత్తన్నగారి సంపద, మెదక్ - రు. 500. మిత్రులకు కృతజ్ఞతలు- సం.***

*వీక్షణంలో అచ్చువుతున్న వ్యాసాలపై నా అభిప్రాయాలు విమర్శనాత్మకంగా రాయాలనుకుంటున్నాను. ఆర్థిక విషయాలు వివరణాత్మకంగా, లెక్కలతో సహా ఇస్తున్నారు. చాలా బాగుంది. అయితే (భూగోళం శీర్షికలో 5వ వార్త) సిరియాలో నరమేధం లాంటి వార్తలు రాకుండా ఉండాల్సింది. అలాగే పాకిస్తాన్‌లో ఉగ్రవాదుల దాడి లాంటి వార్త. వీక్షణం పత్రికలో రాకుండా ఉండాల్సింది. ఎందుకంటారా? సామ్రాజ్యవాదుల దుర్మార్గ విధానాల వలన, దోపిడీ వలన రాజకీయాలను ఎంతో సీరియస్‌గా పట్టించుకున్న వాళ్లు. వాళ్లు ఉగ్రవాదులు గాని, మరెవరైనా గాని, వాళ్లు నమ్మిన ఆలోచన సిద్ధాంతం కోసం (వాళ్లకంత వరకే తెల్సి) ఆయుధం పట్టినవారు, మిగతా వారికన్నా ఎంతో కొంత స్వేచ్ఛా స్వాతంత్ర్యం తోని వారి జీవితాలని తృణప్రాయంగా ఎంచి పోరాడతారు కదా. ఇంకా, ఇంకా పోరాడుతూనే ఉంటారు. అలా...వారు ఏ రాజకీయాలతో ఉన్నాసరే, వారి చర్యల గురించి (వృద్ధులని ఊచకోత కోశారు, తలలు నరికారు. దారుణంగా చంపారు) అని అనకుండా ఉండాల్సింది. వారిని వారి చర్యల గురించి డైరెక్టుగా వారు ఎందుకంతలాగా చెయ్యాల్సి వస్తోందో అడగలేదు కదా! తను నేర్చుకున్న లేదా తను నమ్మిన సిద్ధాంతం ప్రకారం అలా చేస్తున్నాడు. తనకెదురొచ్చిన వాళ్లనెవరినైనా సరే. ఒక్కరైనా లేదా పది మందినైనా సరే వేసెయ్ అని వారికి చెప్తారు. వాళ్లలాగే చేస్తారు. కొంత కాలానికి తనలో తానే పరివర్తన చెంది అసలింత మందిని చంపాల్సిన అవసరం ఉందా? అని ఆలోచనలో పడ్డపుడు సరైన దారిలోకి వస్తాడు. ఆ పరిస్థితులే వారిని అలా మార్చుతాయి. మరొక్క ఉదాహరణ ద్వారా దీన్ని వివరిస్తాను! మనమే అన్నీ తెల్సివుండి విపరీతమైన దాహంతో ఉన్నపుడు డబ్బులిచ్చి మరీ, కొనుక్కొని పురుగుల మందు కలిపిన కోకాకోలా కొనుక్కొని తాగడం లేదా! సరే ఇవన్నీ ఇదివరకే అన్ని పేపర్లలోనూ నిత్యం వచ్చేవే. ఐఎస్ ఉగ్రవాదులనీ, టెర్రరిస్టులనీ ఇవన్నీ సామ్రాజ్య దోపిడీ దొంగలు పెట్టిన పేర్లే కదా! ఇవన్నీ తిరిగి మళ్లీ మన పేపరులో చెప్పడం వలన చర్విత చర్వణం అవుతుందని నేను భావిస్తున్నాను. ఇదొక చంద్రునిలోని చిన్న మచ్చలాంటిదే. ఇలాంటి వార్తలు రాకుండా ఉంటే బాగుంటుంది అని అనుకుంటున్నా. ఇకపోతే! మిగతా ఆర్థిక విషయాలు చాల చక్కగా పూర్తి నిజాలతో, పరిపూర్ణ సమాచారంతో ఎంతో శ్రమకోర్చి సేకరించి ఇస్తున్నారు. చాలా బాగుంది. సవాలక్ష సమస్యలకి చక్కని పరిష్కారాలు తెలిసి కూడా చెప్పని సవాలక్ష పత్రికలని తలదన్నే లాగ. నిజాలని, వాటి పరిష్కారాలని తెలియజేస్తున్న వీక్షణం సాగాలని మనసారా కోరుకుంటూ..*

**– ఎస్. పట్టాభి,**
విశాఖపట్నం

*వీక్షణం ఫిబ్రవరి సంచికలో 'రోహిత్ జీవితమూ మరణమూ సమాజానికి పాఠాలు – అనే వ్యాసం చూసి, నాకు అర్థమైన మేరకు కొన్ని విషయాలు రాస్తున్నాను. దళిత సమస్యల పైనా, దళిత జీవితాల పైనా అనుభవమూ, ఆవేదనా, తపనతో పాటు – మనువాద భావజాలం పైనా – అదే పునాదులపై నిర్మితమైన ఈ దుష్ట సమాజం పైనా కూడా, ఆగ్రహం అసహ్యం వ్యతిరేకతా, శతృత్వమూ, ఇంకా ఏవేవి విరక్తులుండాలో అవన్నీ ఉండడమేగాక, దళిత ఉద్యమాలతో వెన్నంటి నడవడమే గాక, కులాంతర, మతాంతర, వివాహాలు కూడా మా కుటుంబంలో చేసి, మేము కూడా అందులో ఒక దారానిమే అని చెప్పుకునే చోటు దక్కించుకున్నాం. అశ్వఘోషుడన్నట్టు, ఎవరు ఏ కులానికి ప్రతినిధో ఏ కులంలో పుట్టారు అన్నది ముఖ్యం కాదు. ఎవరు ఏ భావజాలానికి ప్రతినిధిగా ఉన్నారన్నదే ముఖ్యం. ఈ ప్రాతి పదికపైనే కొన్ని సందేహాల్ని, సంపాదకులకి వేస్తున్నాను. రోహిత్ ఆఖరి లేఖని చదువుతుంటే తను, ఒక సైన్స్ విద్యార్థిలా కాక, భావవాదిలా తన ఆలోచనల్ని ఆ లేఖలో రాశాడే? ఎందుకిలా? అన్నది. నా సందేహం? దీనికాధారం. 1) ఆ లేఖలో తల్లీ–తండ్రీ (లేక) ఇతర కుటుంబ సభ్యుల కనీస ప్రస్తావన లేకపోవడం కుటుంబంతో అనుబంధాలూ, ఆప్యాయతలూ లేవా? 2) ఒక సైన్స్ విద్యార్థి నా శరీరానికీ ఆత్మకీ దూరం పెరుగుతుందనడమూ – నక్షత్రాలలోకీ, ఇతర లోకాలలోకి వెళ్లి తెలుసుకుంటాననంటాడు? 3) ప్రపంచాన్ని అర్థం చేసుకోవడంలో ఎప్పుడూ పొరబడడం నా తప్పేనేమో? ప్రేమనూ, బాధనూ, జీవితాన్నీ, మరణాన్నీ, అర్థం చేసుకోవడంలో కూడా నంటాడు? 4) ఈ క్షణంలో ఏ బాధా లేదు.*

*(మిగతా 58వ పేజీలో)*

Statement about ownership and other particulars of periodical **Veekshanam as require**d to be published in the first issue of every year after the last day of February

Form IV (See Rule 8)

| | | |
|---|---|---|
| 1. Place of publication | : | Hyderabad |
| 2. Periodicity of its publication | : | Monthly |
| 3. Printer's name | : | N. Venugopal Rao |
| Whether citizen of India | : | Indian |
| Address | : | Mythri Residency<br>3-6-394, Street No. 3<br>Himayatnagar,<br>Hyderabad - 500 029. |
| 4. Publisher's name | : | N. Venugopal Rao |
| Whether citizen of India | : | Indian |
| Address | : | Mythri Residency<br>3-6-394, Street No. 3<br>Himayatnagar,<br>Hyderabad - 500 029. |
| 5. Editor's name | : | N. Venugopal Rao |
| Whether citizen of India | : | Indian |
| Address | : | Mythri Residency<br>3-6-394, Street No. 3<br>Himayatnagar,<br>Hyderabad - 500 029. |
| 6. Name and addresses of individuals who own the newspaper | : | N. Venugopal Rao |

I, N. Venugopal Rao, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

*Sd/-*
*(N. Venugopal Rao)*

Date : 1st March, 2016 Signature of the Publisher

**అసహజ మరణాల సూచి జిల్లాల కరస్పాండెంట్లు**

**తెలంగాణ :** ఆదిలాబాద్ – సి.ఎచ్. శ్రీమన్నారాయణ మూర్తి; హైదరాబాద్ – డి. విజయభాస్కర్; ఖమ్మం – సి.ఎచ్. గిరిజ; మెదక్ – ఎం. రాజేందర్‌రెడ్డి; మహబూబ్‌నగర్ – మహమ్మద్ ఇక్బాల్; నిజామాబాద్ – ఎం. నర్సయ్య; రంగారెడ్డి – వి. శంకరయ్య;
**ఆంధ్రప్రదేశ్ :** అనంతపూర్ – కె. నాగేశ్వరాచారి; చిత్తూరు – పలమనేరు బాలాజి; కడప – కొండ్రాయుడు; కర్నూలు – జి.వి. సుధాకర్ రెడ్డి; తూర్పు గోదావరి – కె.ఎస్. ప్రకాష్‌రావు; శ్రీకాకుళం – ఆర్. శ్రీలత; విశాఖపట్నం – పి.వి. రమణ

(ఈ సంచికలోని వరంగల్, నల్గొండ, కృష్ణా, గుంటూరు, ప్రకాశం, నెల్లూరు, విజయనగరం, ప. గోదావరి జిల్లాల అసహజ మరణాల వివరాలు అందిస్తున్న వారు ఎస్. వెంకటేశ్)

# అవసరమైన చర్చకు తెరతీస్తున్న జెఎన్‌యు వివాదం

**తా**ము నిర్వచించిందే దేశభక్తి అని, ఆ నిర్వచనానికి లోబడని వారందరూ దేశద్రోహులేనని సంఘ్ పరివార్ ఫత్వా జారీ చేస్తున్నది. తాము ఎవరినైనా దేశద్రోహులుగా అభివర్ణిస్తే, వారిని కొట్టి చంపవచ్చుననీ, అరెస్టు చేయవచ్చుననీ, న్యాయస్థానం ప్రాంగణంలో, న్యాయరక్షణలో కూడ "ఉచ్చపడేట్టు" కొట్టవచ్చుననీ, పత్రికలలో, ఛానళ్లలో ఆ దేశద్రోహులకు వ్యతిరేకంగా గగ్గోలు పెట్టవచ్చుననీ సంఘ్ పరివార్ ప్రజాస్వామ్యానికీ, చట్టబద్ధపాలనకూ, న్యాయవ్యవస్థకూ కొత్త అర్థాలు చెబుతున్నది. ఇదేదో మనకు సంబంధం లేని చర్చ అని, జెఎన్‌యు విద్యార్థులు చేసిన తప్పుకు శిక్ష అనుభవించవలసిందే అని ఆలోచనాపరులు అనుకుంటే ఇక ఈ దేశంలో ప్రజాస్వామ్యానికి, న్యాయ వ్యవస్థకు, రాజ్యాంగ ప్రవేశికకు, ఆదేశిక సూత్రాలకు, ప్రాథమిక హక్కులకు సమాధి కట్టడానికి జరుగుతున్న ప్రయత్నంలో మనమూ ఒక ఇటుక అందించిన వాళ్లమవుతాం. జెఎన్‌యు లేవనెత్తిన చర్చ మన సమాజ మౌలిక విలువలకు, మన సమాజ చరిత్రకు సబంధించినది. అత్యవసరమైనది. మతోన్మాద, అసహన, నిరంకుశ పాలకులకు తలొగ్గడమా ఎదిరించడమా అనే దానికి సంబంధించినది.

దేశభక్తి ఏమిటో నిర్వచించే అధికారం రాజకీయాధికారం నిర్వహిస్తున్న వారికి లేదు. ఆ భావనకు అనేక చారిత్రక, రాజకీయార్థిక, సామాజిక, సాంస్కృతిక కోణాలున్నాయి. తన అధికారాన్ని సమర్థించుకునే, బలపరచుకునే ప్రయత్నంలో భాగంగా ఒక రాజకీయ పక్షం నిర్వచించగలంత సంకుచితమైనది కాదది.

భారత దేశం అనేదే ఇవాళ ఉన్న ప్రాదేశిక అర్థంలో 1947 ఆగస్ట్ 15కు ముందు లేదు. చప్పన్నారు దేశాల భరత ఖండం ఉండేది. భాషలలో, ఆహారపుటలవాట్లలో, కట్టుబొట్టులో, ఆర్థిక జీవనంలో, సంస్కృతిలో ఒకదాని కొకటి ఎంత మాత్రమూ సంబంధంలేని అనేక జాతుల ప్రజలు, ఇతర ప్రాంతాల నుంచి వలస వచ్చిన ప్రజలు ఈ భరత ఖండంలో వేల ఏళ్లుగా నివసిస్తూ వచ్చారు. ఆదాన ప్రదానాలతో అభివృద్ధి చెందారు. మౌర్యుల నుంచి మొఘల్ ల దాకా భరత ఖండం మొత్తానికి ఒకే కేంద్ర ప్రభుత్వాన్ని, పాలనను ఇవ్వడానికి ప్రయత్నించిన చరిత్రకెక్కిన పెద్దరాజ్యాలలో ఏ ఒక్కటీ విజయం సాధించలేదు. విశాల మార్కెట్‌ను కోరుకునే వలసవాదం మొదటిసారి పందొమ్మిదో శతాబ్దిలో ఈ ఉపఖండంలో అత్యధిక భాగానికి రాజకీయ ఏకీకృత అస్తిత్వం కలిగించింది. అది కూడ మూడో వంతు భాగాన్ని నేరుగా తన పాలన కిందికి తెచ్చుకోలేక వదిలేసింది. అధికార మార్పిడితో మాత్రమే నెహ్రూ అధికారం కిందనే ఒక దేశంగా భారతదేశం ఏర్పడింది. సిక్కింను ఆక్రమించి ఇందిర మరింత పెద్దదేశాన్ని పాలించింది. మరి ఎప్పటికప్పుడు మారుతూ వచ్చిన ఈ భూభాగం మీద భక్తి దేశభక్తి అవుతుందా, ఈ భూభాగంలో నివసిస్తున్న ప్రజల అభ్యున్నతి గురించిన తపన దేశభక్తి అవుతుందా తేలవలసి ఉంది. జాతీయ గీతంగా ప్రకటించుకున్న గీతం ఒకప్పటి దేశం గురించి రాసింది. కాబట్టి, ఇవాళ దేశంలో లేని భూభాగం (సింధ్) పేరు ఆగీతంలో ఉన్నా ఇప్పటికీ తొలగించకుండా పాడుకుంటున్న తెలివితక్కువ, లేదా దురాక్రమణ పూరిత దేశభక్తి ఈ పాలకులది.

'దేశమంటే మట్టి కాదోయి, దేశమంటే మనుషులోయి' అన్నాడు గురజాడ. ఆ మనుషుల జీవితాలను భగ్నం చేసే రాజకీయార్థిక విధానాలు అమలు చేస్తున్న పాలకులకు దేశభక్తిని నిర్వచించే కనీస అర్హత లేదు. పైగా ప్రపంచీకరణ క్రమంలో ఈ దేశ పాలనావిధానాలను సామ్రాజ్యవాద ప్రభుత్వాల, బహుళజాతి సంస్థల ఆదేశాల ప్రకారమే నిర్ణయిస్తున్న దేశద్రోహ పాలకులు మరొకరికి దేశభక్తి ఉందోలేదో ధ్రువీకరించబోవడం హాస్యాస్పదం. దేశంలోని వనరులను దేశ ప్రజలకు దక్కకుండా దేశదేశాల సంపన్నులకు, బహుళజాతి సంస్థలకు అప్పగిస్తున్న, తెగనమ్ముతున్న పాలకులకు దేశం గురించి మాట్లాడే అర్హత లేదు. దేశాన్ని అజ్ఞానం నుంచీ, అంధకారం నుంచీ, ఆకలి నుంచీ, అవిద్య నుంచీ విముక్తి చేయలేకపోయిన పాలకులకు దేశం గురించి మాట్లాడే అర్హతే లేదు. దేశాన్ని పట్టి పీడిస్తున్న కుల అసమానతలను, కుల వివక్షను, అత్యంత దుర్మార్గమైన అస్పృశ్యతను నిర్మూలించడం అలా ఉంచి కనీసం తగ్గించలేకపోయిన పాలకులకు దేశం గురించి మాట్లాడే అర్హత లేదు.

తమకు కనీసమైన దేశభక్తి లేదని, దేశం గురించి, అంటే ప్రజల గురించి, ప్రజల అభ్యున్నతి గురించి మాట్లాడే అర్హత తమకు లేదని ఈ పాలకులకు తెలుసు గనుకనే వాళ్లు ప్రజలలో దేశభక్తి గురించి తప్పుడు భావాలు ప్రచారం చేస్తున్నారు. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల పాలనలను, విధాన నిర్ణయాల్ని విదేశీ ద్రవ్య సంస్థలకు అప్పగించిన వాళ్లే సరిహద్దుల మీద సైన్యాన్ని మోహరించి, పొరుగు దేశాలతో ఆరని చిచ్చులు రగిలిస్తూ, కుహనా దేశభక్తిని రెచ్చగొట్టి పబ్బం గడుపుకుంటున్నారు. దేశంలోపలి అసలు సమస్యల నుంచి ప్రజల దృష్టి మళ్లించడానికి ఒక పొరుగు దేశపు బూచిని నిరంతరం చూపుతున్నారు. ఆ దిష్టిబొమ్మను చూపి ప్రజలను భయపెట్టి దేశ సంపదను సామ్రాజ్యవాదులకు, వారి దళారీలకు అప్పగిస్తున్నారు. ఆకలి నుంచి విముక్తి, అణచివేత నుంచి విముక్తి, అవిద్య నుంచి విముక్తి, భూస్వామ్యం నుంచి విముక్తి, సామ్రాజ్యవాదం నుంచి విముక్తి అని ప్రజలు, విభిన్న జాతులు, అణగారిన వర్గాలు, బాధిత వర్గాలు నినదించినప్పుడల్లా అది సరిహద్దులను సవాలు చేయడమేనని తప్పుడు అర్థాలు చెప్పి, దేశంలోని అమాయక మధ్యతరగతిని రెచ్చగొడుతున్నారు. ఈ దేశ సంపదల సరిహద్దులు చెరిపి దేశదేశాల దోపిడీదారుల ముందర ఈ దేశ ప్రజలను, వనరులను నిస్సహాయంగా బలి ఇస్తున్న పాలకులే సరిహద్దుల గురించి బుడిబుడి ఏడుపులు ఏడుస్తున్నారు.

వలసవాదం నాటి నుంచి అపరిష్కృతంగా ఉండిపోయిన దేశంలోని వివిధ జాతుల ఐక్యత సమస్యను 1947 తర్వాత పాలకులు పరిష్కరించలేదు సరికదా, తీవ్రమైన అణచివేత ప్రయోగించి మరింత జటిలం చేశారు. అందువల్ల ఆ సమస్యలు మళ్లీ మళ్లీ చర్చకు వస్తూనే ఉన్నాయి. అవి చర్చకు వచ్చినప్పుడల్లా తప్పించుకునే మార్గంగా చర్చించేవాళ్లను దేశద్రోహులని ముద్రవేస్తూ, దేశభక్తి ఉన్మాదాన్ని రెచ్చగొడితే ధ్వంసమయ్యేది మన సమాజపు బహుళత్వం, ప్రజాస్వామిక చర్చా సంప్రదాయం. ఆ చర్చా సంప్రదాయాన్ని పరిరక్షించి బలోపేతం చేయవలసిన అవసరాన్ని జెఎన్‌యు వివాదం మరొకసారి దేశం దృష్టికి తెస్తున్నది. వీ

సంపాదకీయ వ్యాఖ్య - తెలంగాణ

# తెలంగాణ ప్రయాణం ఎటువైపు?

**తె**లంగాణ రాష్ట్ర ప్రభుత్వం, దాన్ని నడుపుతున్న తెలంగాణ రాష్ట్ర సమితి మధ్యతరగతిని మోసం చేయడానికి రూపంలో మాత్రం తెలంగాణ పేరు జపిస్తూ, సారంలో తెలంగాణ ప్రజల ఆకాంక్షలను, ఉద్యమ ఆదర్శాలను తుంగలో తొక్కడానికి నిర్ణయించుకున్నదనడానికి ఎన్నెన్నో ఉదాహరణలు ఉన్నాయి. ఉద్యమం ఆదర్శాల వైపు నుండి బండి వెనక్కి తిప్పి వ్యతిరేక దిశలో ప్రయాణం చాల దూరమే సాగినప్పటికీ ఇంకా కొందరిని భ్రమల్లో ఉంచగలగడమే తెరాస విజయం. ప్రచార సాధనాలను నయానో భయానో లొంగదీసుకుని, చేస్తున్న పనులన్నీ తెలంగాణ బాగు కోసమే అని భక్తజన సముదాయంతో భజన చేయించుకుంటూ ఇవాళ పబ్బం గడుపుకోవడం సాధ్యమే కావచ్చు. కాని ప్రజలందరినీ మోసం చేయడం సాధ్యం కాదు. ఎల్లకాలానికీ మోసం చేయడమూ సాధ్యం కాదు. ఏ పద్ధతులలో, ఎంత అనైతికంగా, ఎంత అధికార దుర్వినియోగంతో ఎన్నికలలో గెలుపు సాధించడం జరుగుతున్నదో చూడకుండా కేవలం గెలుపును, అంకెలను చూసి, ఆ వాపే నిజమైన బలం అని భ్రమ పడితే, భ్రమ పెడితే అది ఎక్కువకాలం సాగదు. నిజానికి ఎన్నికల గెలుపులను, అఖండ విజయాలను, అత్యధిక మెజారిటీలను అంగీకరించదలుచుకుంటే, తెలంగాణ పట్ల అత్యంత దుర్మార్గంగా, అన్యాయంగా ప్రవర్తించిన వారెందరో ఆరు దశాబ్దాల పాటు తెలంగాణలో అటువంటి విజయాలే పొందారు. ఆ అక్రమాల నుంచి విముక్తి, స్వచ్ఛమైన పాలన వస్తుందనే ఆశతోనే తెలంగాణ ప్రజలు ఉద్యమించారని మరిచిపోగూడదు. తెలంగాణను వ్యతిరేకించినవారిని, తెలంగాణ వాదుల మీద దాడులు చేసిన వారిని, నరనరానా ఏ కోశానా తెలంగాణ మీద ప్రేమ లేని వారిని, పచ్చి అవకాశవాదులను కేవలం గుత్తాధిపత్యం సాధించడం కోసం అధికార పార్టీలో చేర్చుకుంటూ అదంతా 'తెలంగాణ శక్తుల పునరేకీకరణ' అని గప్పాలు కొట్టుకుంటున్నారు. తెలంగాణ ప్రజలకు నిన్నటిదాకా శత్రువులుగా ఉన్నవాళ్లను, ఇవాళా రేపూ కూడ శత్రుత్వం వహించగలవాళ్లను కలుపుకోవడం పునరేకీకరణ అయితే, ఈ ఏకీకృత శక్తులకు వ్యతిరేకంగా ఉన్నవారెవవరు మరి, తెలంగాణ ప్రజలేనా? తెలంగాణ ప్రజల వ్యతిరేకుల పునరేకీకరణ జరుగుతున్నట్టే ఉన్నది. ఆరు దశాబ్దాల ఆంధ్రప్రదేశ్ లో తెలంగాణ పోలీసు రాజ్యంగా ఉండింది. తెలంగాణ ప్రజలకు వాక్సభాస్వాతంత్ర్యాలు కరువయ్యాయి. ప్రస్తుత పునరేకీకరణ యుగంలో కూడ అదే రకమైన పౌరహక్కుల ఉల్లంఘన, తెలంగాణ ఉద్యమ కేసులు కూడ ఉపసంహరించకపోవడం, గ్రామాల్లో పోలీసు అధికారుల బెదిరింపులు, కుట్ర కేసులు, ఎన్‌కౌంటర్ కట్టు కథలు, అబద్ధాలు సాగుతున్నాయి. పెద్దమనిషి, తెలంగాణ ఉద్యమ ప్రముఖుడు, పాత్రికేయుడు అని కూడ చూడకుండా పాశం యాదగిరి మీద పోలీసు అధికారి దౌర్జన్యం చేస్తే, ప్రభుత్వం ఆ పోలీసు అధికారి మీద కనీసం చర్యలు తీసుకోలేదు. పైగా పోలీసులకు అడిగినవీ అడగనివీ ఇచ్చి అచ్చోసి వదులుతున్నది. విద్యార్థులు నిరసన తెలిపితే స్వయంగా ముఖ్యమంత్రే ఉక్కు హస్తంతో అణచివేస్తాం అని హెచ్చరిస్తున్నారు. నిజమే, తెలంగాణలో ప్రజా వ్యతిరేకుల పునరేకీకరణ జరుగుతున్నది. ప్రజల పునరేకీకరణ కోసం చరిత్ర ఎదురుచూస్తున్నది. వీ

సంపాదకీయ వ్యాఖ్య - ఆంధ్రప్రదేశ్

# వాగ్దాన భంగ రాజకీయాల ఫలితం హింస

**తూ**ర్పు గోదావరి జిలా తునిలో జనవరి 31న కాపులకు వెనుకబడిన కులం గుర్తింపు ద్వారా రిజర్వేషన్ సాధించే లక్ష్యంతో ఏర్పాటయిన కాపు ఐక్య గర్జన సభ హింసకూ విధ్వంసానికీ దారి తీయడం మన రాజకీయ వ్యవస్థలో ఒక అనివార్యమైన విషాదం. కాపు కులం ప్రత్యేకించి గోదావరి జిల్లాలో ఆర్థికంగా, సామాజికంగా బలమైన, ఆధిపత్య పోకడలున్న సామాజిక వర్గంగానే ఉన్నప్పటికీ, మిగిలిన రాష్ట్రంలోనూ, తెలగ, బలిజ, నాయుడు, మున్నూరు కాపు, ఒంటరి, తూర్పు కాపు వంటి ఉపకులాల్లోనూ వెనుకబాటుతనం పెద్ద ఎత్తునే ఉంది. కాపుల రిజర్వేషన్ ఆందోళనను పటేళ్లు, జాట్లు జరుపుతున్న ఆందోళనతో పోల్చి పూర్తిగా వ్యతిరేకించేవారు, కాపులను వెనుకబడిన కులాలలో చేర్చడం మిగిలిన వెనుకబడిన కులాలకు హానికరమనేవారు, ఉపకులాల వెనుకబాటుతనాన్ని పరిగణనలోకి తీసుకుని, న్యాయబద్ధమైన సమీక్ష జరిపి, మినహాయింపులతో కాపులను వెనుకబడిన కులంగా గుర్తించవచ్చుననే వారు కూడ తెలుగు ఆలోచనాపరులలో ఉన్నారు. అయితే, కాపుల పట్ల రాజకీయ వ్యవస్థలు, ప్రధాన రాజకీయ పార్టీలు ప్రదర్శించిన అవకాశవాదం, ఎన్నికలకు ముందు అలవిగాని వాగ్దానాలను ఇవ్వడం, ఎన్నికలలో గెలిచిన తర్వాత ఆ వాగ్దానాల అమలు ఊసే ఎత్తకపోవడం వంటి రాజకీయ వ్యవస్థ అక్రమాల నేపథ్యంలో కాపుల సమస్యను పరిశీలించవలసి ఉంది. బ్రిటిష్ వలసవాద కాలం నుంచి వెనుకబడిన కులంగా వీరికి ఉన్న గుర్తింపు ఆంధ్రప్రదేశ్ ఏర్పాటు తర్వాత 1960ల చివర ప్రభుత్వం నియమించిన అనంతరామన్ కమిషన్ సిఫారసులతో రద్దయింది. మళ్లీ ఆ గుర్తింపు సాధించాలనే కాపుల ఆకాంక్ష నుంచి వికసించిన బలమైన నాయకుడు ముద్రగడ పద్మనాభం. 1978లో కాంగ్రెస్ నుంచి ఎంఎల్ఎ అయి, 1982లో తెలుగుదేశంలోకి వెళ్లి మంత్రి కూడ అయి, 1989 ఎన్నికల్లో కాంగ్రెస్‌లోకి వచ్చారు. నేదురుమల్లి జనార్దనరెడ్డి మంత్రి వర్గంలో ఉండి, కోట్ల విజయభాస్కరరెడ్డి మంత్రి వర్గంలో స్థానం దొరకనప్పుడు కాపుల సమస్యను లేవనెత్తి ఆందోళన ప్రారంభించి, ఆమరణ నిరాహారదీక్షకు దిగారు. దానికి ప్రతిస్పందనగా ప్రభుత్వం 1994లో కాపులకు బిసిలుగా గుర్తింపు ఇచ్చింది. న్యాయస్థానపు వివాదాలలో పడి ఆ గుర్తింపు వెనక్కి పోగా, ఈ సమస్యను పరిశీలించడానికి ఇప్పటికి కనీసం మూడు కమిషన్లు ఏర్పడ్డాయి. తాను అధికారంలోకి వస్తే కాపులకు బిసిలుగా గుర్తింపు ఇస్తానని 2014 ఎన్నికల్లో తెలుగుదేశం పార్టీ వాగ్దానం చేసింది. ఈ మధ్య కాలంలో ముద్రగడ భారతీయ జనతా పార్టీలోకి, కాంగ్రెస్‌లోకి, వైఎస్ఆర్ కాంగ్రెస్‌లోకి కూడ మారి చివరికి 2014లో స్వతంత్ర అభ్యర్థిగా పోటీ చేసి ఓడిపోయారు. అధికారంలోకి వచ్చి పద్దెనిమిది నెలలు గడిచినా తెలుగుదేశం ప్రభుత్వం తన వాగ్దానాన్ని నెరవేర్చకపోవడం ముద్రగడకు మరొక అవకాశం ఇచ్చింది. ఆ అవకాశం హింసకు దారితీసింది. సమస్య న్యాయాన్యాయాలు ఎలా ఉన్నా, అవకాశవాదం, తాత్సారం చేయడం, సరిగా వ్యవహరించక పోవడం వంటి రాజకీయ అవలక్షణాలు ప్రజా సమస్యలను ఎంత జటిలం చేస్తాయో, చివరికి విస్ఫోటక పరిణామాలకు ఎలా దారి తీస్తాయో చూడడానికి ఈ చరిత్ర ఒక ఉదాహరణ. వీ

# దక్షిణ చైనా సముద్రంలో ఉద్రిక్తత

**హిం**దూ మహాసముద్రంలో ఉమ్మడి నిఘా అవకాశాలు కేంద్రంగా అమెరికా, భారత్ చర్చలు జరిపినట్లు తెలుస్తోంది. ఆ చర్చల్లోనే దక్షిణ చైనా సముద్రం (ఎస్‌సిఎస్)లో అమెరికా, భారత్ ఉమ్మడిగా నావికా దళ నిఘా చేపట్టాలని నిర్ణయించినట్లు అమెరికా రక్షణ శాఖ అధికారి తెలిపారు. ఈ గస్తీ కార్యకలాపాలు దక్షిణ చైనా సముద్రంతోపాటు, హిందూ మహాసముద్రంలోనూ ఉంటాయని ఆ అధికారి తెలిపారు. వ్యూహాత్మక సముద్ర మార్గాలపై రెండు దేశాలు ఉమ్మడిగా నియంత్రణ సాధించాలనే ఓ అభిప్రాయానికి వచ్చాయి. దక్షిణ చైనా సముద్రం సహజవనరులకు నెలవుగా ఉన్నది. నౌకాయానానికి అనువైనది. ప్రపంచంలోని సగానికిపైగా వాణిజ్యం నౌకల ద్వారా ఇండో-పసిఫిక్ జలమార్గం గుండా కొనసాగుతోంది. దక్షిణ చైనా సముద్ర మార్గం ద్వారా ఏటా ఐదు ట్రిలియన్ డాలర్ల వాణిజ్యం జరుగుతోంది. వియత్నాం, మలేసియా, బ్రూనే, ఫిలిఫీన్స్, తైవాన్‌లు కూడ ఈ సముద్ర మార్గంపై హక్కును ప్రకటించుకుంటున్నాయి. దక్షిణ చైనా సముద్రం విషయంలో చైనా చాలా కఠినంగా వ్యవహరిస్తున్నది. వియత్నాం, ఫిలిప్పీన్స్, మలేసియా, బ్రూనే వంటి ఆసియా దేశాల అభ్యంతరాలను సైతం చైనా పట్టించుకోవడం లేదు. దక్షిణ చైనా సముద్రంలోని జలమార్గంలో స్ప్రాట్లీ ద్వీప సమూహంలో ఏడు మానవ నిర్మిత ద్వీపకల్పాలను నిర్మిస్తోంది. చైనా చర్యలను ఆసియా దేశాలన్నీ మరింత ఐక్యతతో వ్యతిరేకించాలని అమెరికా బలంగా కోరుకుంటోంది. భారత్, అమెరికాలు ఇటీవల మిలిటరీ సంబంధాలు పెంచుకుంటున్నాయి. గత ఏడాది హిందూ మహాసముద్రంలో భారత్, జపాన్‌లు సంయుక్తంగా నావికాదళ విన్యాసాలు నిర్వహించాయి.

చైనా కట్టడికి భారత్, జపాన్, ఆస్ట్రేలియా దేశాలను ఒక కూటమిగా అమెరికా ఏర్పరిచింది. ఫిబ్రవరి 15 నుంచి కాలిఫోర్నియా రాష్ట్రంలోని సన్నీలాండ్స్‌లో అమెరికా, ఆసియన్ దేశాల సమావేశం జరుగుతున్న తరుణంలో దక్షిణ చైనా సముద్రంలో విమాన విధ్వంసక క్షిపణులను చైనా మోహరించింది. దీనికి ప్రతిగా అమెరికా తన నౌకల కార్యకలాపాలను కొనసాగిస్తామని ప్రకటించింది. ఇటీవల భారత్ చైనాతో ఆర్థిక సంబంధాలు మెరుగు పరచుకోడానికే ప్రాధాన్యత ఇస్తూనే తన నావికాదళ పరిధిని విస్తరిస్తోంది. హిందూ మహాసముద్రానికి దూరంగా ఉన్న దక్షిణ చైనా సముద్రంలోకి ఇటీవల ఓ నౌకను పంపింది. ఈ సముద్రంపై ఆధిపత్యంకోసం చైనాతో పోరాటానికి వేగంగా సైన్యాన్ని శక్తివంతం చేసుకుంటున్న ప్రయత్నంలో భాగంగా భారత్ నౌక అనేక సార్లు ఈ జలాలను సందర్శిస్తోంది. అమెరికాతో కలిసి సంయుక్త గస్తీ చేపట్టాలని భారత్ తీసుకున్న నిర్ణయం చైనాకు ఆగ్రహం కలిగించక మానదు. దీంతో దక్షిణ చైనా సముద్రంలో ఉద్రిక్తత నెలకొననుంది. అంతర్జాతీయ కుమ్ములాటల్లోకి భారత్‌ను ఈడ్వడం ద్వారా భారత ప్రభుత్వం అమెరికా బంటునని రుజువు చేసుకుంటున్నది.

- ఎ. నర్సింహారెడ్డి వీ






❖ **టువార్డ్స్ ఎ వరల్డ్ ఆఫ్ ఈక్వల్స్** – ఎ బైలింగ్వల్ టెక్స్ట్‌బుక్ ఆన్ జెండర్– తెలుగు అకాడమీ – 269 పేజీలు, 1/4 క్రౌన్, రు. 145, ప్రతులకు: తెలుగు అకాడమీ, హైదరాబాద్




❖ **మార్క్స్, అంబేద్కర్ :** – ఆనంద్ తేల్‌తుంబ్డే – సమీక్ష ప్రచురణలు – 111 పేజీలు, 1/8 డెమీ, రు. 60, ప్రతులకు: సమీక్ష ప్రచురణలు, మొదటి అంతస్తు, కృష్ణాజిల్లా స్వాతంత్ర్య సమరయోధుల సంఘం భవనం, బందరు లాకులు వద్ద, గవర్నర్‌పేట, విజయవాడ–520 002; ఫోన్ : 0866 2578454




❖ **గుడ్డినమ్మకాల గుట్టుమట్టులు** – బి. రామకృష్ణ – చార్వాకాశ్రమ ప్రచురణలు – 72 పేజీలు, 1/8 డెమీ, రు. 50, ప్రతులకు: బి. సుధాకర్, చార్వాక విద్యాపీఠం, నిడమర్రు, మంగళగిరి, గుంటూరు – 522 503; ఫోన్: 9290619550




❖ **గ్యాట్స్ ఒప్పందం – భారతదేశ విద్యారంగం** – పిడిఎస్‌యు ప్రచురణ – 60 పేజీలు, 1/8 డెమీ, రు. 40, ప్రతులకు: సహచర బుక్ మార్క్, బాగ్ లింగంపల్లి, హైదరాబాద్, మైత్రి బుక్ హౌస్, ఏలూరు రోడ్డు, విజయవాడ



❖ **యక్షగానం** – దేవులపల్లి కృష్ణమూర్తి కథలు – డికె ప్రచురణలు – 152 పేజీలు, 1/8 డెమీ, రు. 120, ప్రతులకు: హైదరాబాద్ బుక్ ట్రస్ట్, ప్లాట్ నెం. 85, బాలాజీ నగర్, గుడిమల్కాపూర్, హైదరాబాద్ – 500006; ఫోన్: 040–23521849



❖ **ముప్పై ఏళ్ల దండకారణ్య సాహితీ సాంస్కృతికోద్యమ చరిత్ర (1980–2010)** – విరసం ప్రచురణ – 208 పేజీలు, 1/8 డెమీ, రు. 100, ప్రతులకు: పాణి, 50–348, ఎల్ 19, బి2, అరోరానగర్, బి క్యాంప్, కర్నూలు – 518 002; అన్ని ప్రముఖ పుస్తక కేంద్రాలు




❖ **సాహస యోధురాలు** – గజ్జల సరోజ రచనలు – విరసం ప్రచురణ – 80 పేజీలు, 1/8 డెమీ, రు. 40, ప్రతులకు: అన్ని ప్రముఖ పుస్తక కేంద్రాలు




❖ **మా కేరళ యాత్ర** – ముత్తేవి రవీంద్రనాథ్– విజ్ఞాన వేదిక పచురణ – 256 పేజీలు, 1/8 డెమీ, రు. 250, ప్రతులకు: విజ్ఞాన వేదిక, ఇ. నెం. 20–40–5, మోతాదు లేన్, చినరవూరు, తెనాలి–522 201; ఫోన్: 98491 31029; విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్




❖ **దహనం** – సాగర్ శ్రీరామకవచం – గుండ్లకమ్మ రచయితల సంఘం ప్రచురణ – 184 పేజీలు, 1/8 డెమీ, రు. 80, ప్రతులకు: ఉషారాణి శ్రీరామ కవచం, ఇ. నెం. 8-1-21(03-005-421), జమ్మిచెట్టు బజార్, పోస్ట్: లాయర్ పేట్, ఒంగోలు – 523 002; ఫోన్: 9885473934




❖ **అజరామరం** – ఎమ్వీ రామిరెడ్డి కవిత్వం–ముప్వా చినబాపి రెడ్డి మెమోరియల్ ట్రస్టు ప్రచురణలు – 102 పేజీలు, 1/8 డెమీ, రు. 80, ప్రతులకు: ఎం. రాజ్యలక్ష్మి, 102, శ్రీకోట రెసిడెన్సీ, పాత పోలీస్‌స్టేషన్ దగ్గర, మియాపూర్, హైదరాబాద్– 500 049




❖ **వీర తెలంగాణ విప్లవ పోరాటంలో కా. పద్మ** – జంపా గౌతమ్ రావు – జయంతి ప్రచురణలు – 139 పేజీలు, 1/8 డెమీ, రు. 75, ప్రతులకు: జయంతి పబ్లికేషన్స్, కారల్‌మార్క్స్ రోడ్, విజయవాడ 520 002; ఫోన్: 0866–2577828, 8978261496




❖ **మన మంచి తెలుగు** – డా. మలయశ్రీ – నవ్యసాహిత్య పరిషత్ ప్రచురణ – 96 పేజీలు, 1/8 డెమీ, రు. 80, ప్రతులకు: డా. మలయశ్రీ, అదిత్య భవన్, వేమన నగర్, ఇ.నెం. 1–113/7, రేకుర్తి, కరీంనగర్ – 505 451; ఫోన్: 9866546220




❖ **ముస్లిం పర్సనల్ లా – కొన్ని అపార్థాలు** – అనువాదం ముహమ్మద్ యాకూబ్ – ఆల్ ఫారూఖ్ ప్రచురణలు – 104 పేజీలు, 1/8 డెమీ, రు. 40, ప్రతులకు: ఆల్ ఫారూఖ్ పబ్లికేషన్స్, 20/373, మస్తాన్‌వలీ స్ట్రీట్, కడప, ఆంధ్రప్రదేశ్; ఫోన్: 9885409930




❖ **లోపలి మెట్టు**– నిర్మలా రాణి తోట – కవి సంగమం – 129 పేజీలు, 1/8 డెమీ, రు. 100 ప్రతులకు: అన్ని ప్రముఖ పుస్తక కేంద్రాల్లో దొరుకును




❖ **దొరకని నాణెం** – వి. వెంకట్రావు – ఎన్.కె. పబ్లికేషన్స్, – 212 పేజీలు, 1/8 డెమీ, రు. 60, ప్రతులకు: వి. వెంకట్రావు, అచ్యుతరావు టైలర్స్, ఎం.జి. రోడ్, మినర్వా దగ్గర, విజయనగరం – 535 002; ఫోన్: 9247235401



❖ **ఆరుద్ర పురుగు** – కూకట్ల తిరుపతి కవిత్వం– సాహితి సోపతి ప్రచురణ – 124 పేజీలు, 1/8 డెమీ, రు. 100 ప్రతులకు: కూకట్ల లక్ష్మి, ఇ.నెం. 1–29/1, గ్రా: మద్దికుంట, మం: మానకొండూర్, జి: కరీంనగర్ – 505 505; ఫోన్: 99492 47591

# 2016 ఆశాసూచిక - విద్యార్థి ఉద్యమాల వెల్లువ

***రోహిత్ వేముల బహిష్కరణ - ఆత్మహత్యతో మొదలై జెఎన్‌యు వివాదం దాకా గత కొన్ని వారాలుగా దేశవ్యాప్తంగా విస్తరిస్తున్న క్రియాశీల విద్యార్థి ఆందోళనల పూర్వాపరాలను వివరిస్తున్నారు* ఎన్. వేణుగోపాల్**

హైదరాబాద్ కేంద్రీయ విశ్వ విద్యాలయంంలో పరిశోధక విద్యార్థి రోహిత్ వేముల ఆత్మహత్య చేసుకున్న 2016 జనవరి 17న మొదలైన దేశవ్యాపిత విద్యార్థి ఆందోళనలు ఫిబ్రవరి 10 తర్వాత జవహర్లాల్ నెహ్రూ విశ్వవిద్యాలయ ఘటనతో కలిసి, మొత్తం మీద నెల, రెండు నెలలుగా దేశవ్యాప్తంగా విద్యార్థి లోకంలో విస్కృతమైన కదలిక కనబడుతున్నది. మొదట కుల వివక్షకూ, సంఘ్ పరివార్ దౌర్జన్య అసహనానికీ, యూనివర్సిటీ అధికారుల బ్రాహ్మణీయ పెత్తందారీతనానికీ వ్యతిరేకంగా ప్రారంభమైన ఈ కదలిక జెఎన్‌యు వివాదంతో మరింత విస్తరించంది. కుల వివక్ష గురించి చర్చిస్తూనే, ఆ సమస్యతో పాటే కలగలిసిన దేశద్రోహం – దేశభక్తి సమస్యను కూడ కలుపుకుని ఇవాళ భారత సమాజంలో అత్యవసరమైన రెండు మౌలిక సమస్యలను మళ్లీ ఒకసారి ప్రధాన చర్చనీయాంశాలుగా మార్చింది.

నిజానికి విద్యార్థి ఉద్యమాలకు ఇది కాలం కాదనీ, విద్యార్థులు తమ సొంత ఉన్నతిని కోరుకునే కెరీరిజం ఉచ్చులో పడిపోయారనీ, సామాజిక సమస్యలను పట్టించుకునే తీరికా ఓపికా వారికి లేవనీ చాల సిద్ధాంతాలను స్వప్రయోజన శక్తులు వ్యాప్తిలోకి తెచ్చి ఉన్న సందర్భంలో ఇవాళ్టి ఆందోళనలు జరుగుతున్నాయి. ఈ ఆందోళనలు మొదలైన తర్వాతనే వ్యాఖ్యానిస్తూ సంఘ్ పరివార్ భావజాల సిద్ధాంతకర్త, జర్నలిస్టు ప్రభు చావ్లా ఇవాళ విద్యార్థులకు మార్క్స్ మీద కన్న ఎంబిఎ మీదనే ఎక్కువ దృష్టి ఉంది అని రాశాడు. 1960ల నాటి అంతర్జాతీయ, విదేశీ విద్యార్థి ఉద్యమాల వంటివి మరొకసారి తలెత్తే అవకాశం లేదని, విద్యార్థులు యథాస్థితివాదులు అయిపోయారనీ, తమ బాగు తప్ప మరొకటి పంచుకునే స్థితిలో లేరనీ నిరాశావాదులు ప్రకటిస్తున్న తరుణంలో ఇవాళ్టి విద్యార్థి ఉద్యమం ఉవ్వెత్తున విస్తరించడం, మౌలిక సమస్యల మీద ప్రశ్నలు సంధించడం చాల ఆశలు రేకెత్తిస్తున్నది. వాస్తవానికి 2016 కన్న ముందే, గత దశాబ్ది కాలంలో విద్యార్థులు పెద్ద ఎత్తున కదిలిన సందర్భాలు కొన్ని ఉన్నాయి. ఒకరకంగా 2016 అటువంటి చెదురుమదురు పోరాటాలన్నిటినీ సమీకృతం చేసి ఉన్నత స్థాయికి తీసుకువెళ్తున్నది.

రాజకీయ నాయకులు తమకు అవసరమైనప్పుడల్లా విద్యార్థులను వాడుకుంటూనే, తమకు ఇబ్బందికరమైన ప్రశ్నలు వచ్చినప్పుడు విద్యార్థులకు రాజకీయాలెందుకని ప్రశ్నిస్తుంటారు. సరిగ్గా అట్లాగే కేంద్ర మానవ వనరుల అభివృద్ధి మంత్రి స్మృతి ఇరానీ దగ్గరి నుంచి చోటామోటా రాజకీయ నాయకుల వరకూ రోహిత్ ఆత్మహత్య నేపథ్యంలో అదే ప్రశ్న ముందుకు తెచ్చారు. విద్యార్థులకు చదువు మీద తప్ప మరొక అంశం మీద దృష్టి ఉండగూడదని, యువ హృదయాలను రాజకీయాలతో కలుషితం చేయవద్దనీ హితవులు పలికారు. మౌలిక అంశాల మీద నుంచి విద్యార్థుల దృష్టి మళ్లించే ఈ పన్నాగాన్ని కొన్ని ప్రచార సాధనాలు కూడ తలకెత్తుకున్నాయి.

కాని విద్యార్థులు సామాజిక సమస్యలను పట్టించుకోవడం, సామాజిక, రాజకీయ పోరాటాలలో భాగస్వాములు కావడం ఎప్పటి నుంచో ఉన్న ఉజ్వల సంప్రదాయం. విద్యార్థి దశలో ఉండే ఉద్వేగాల వల్ల, క్రియాశీల చైతన్యం వల్ల, వేడి నెత్తురుతో కూడిన ఆదర్శవాదం వల్ల విద్యార్థులు తమ చుట్టూ ఉండే అన్ని సమస్యలనూ పట్టించుకుంటారు. వాటి మీద ఉద్యమాలు చేస్తారు. సాగుతున్న ఉద్యమాలలో పాల్గొంటారు. భారత చరిత్రలో ఇది నిరంతరాయంగా సాగుతూ వస్తున్నదే. ఇంకా దేశంలో ఏ విద్యార్థి సంఘమూ ఏర్పడకముందే, బ్రిటిష్ వలసవాద వ్యతిరేక ఉద్యమంలో 1920 డిసెంబర్ లో నాగపూర్ లో అఖిల భారత కళాశాల విద్యార్థుల మహాసభ జరిగింది. అక్కడ అధ్యక్షోపన్యాసం ఇస్తూ లాలా లజపత్ రాయ్ , నేను విద్యార్థులు రాజకీయాల్లో పాలు పంచుకోగూడదని భావించేవాణ్ని కాను. పైగా ఆ సిద్ధాంతం ఉట్టి పిచ్చి సిద్ధాంతమనీ, అసాధ్యమైన సిద్ధాంతమనీ నేను భావిస్తాను. ఆ సిద్ధాంతాన్ని తయారు చేసినవాళ్లు గందరగోళపు మనస్కులు మాత్రమే కారు, నిజాయితీ లేని మెదళ్ల నుంచి ఆ సిద్ధాంతం పుట్టుకొచ్చింది అన్నాడు. కాని ఇవాళ్టికీ చాల మంది రాజకీయ నాయకులు, తమను తాము మేధావులుగా భావించుకునే వాళ్లు విద్యార్థులకు రాజకీయాలెందుకనే తప్పుడు ప్రశ్నను లేవనెత్తుతూనే ఉన్నారు. గత మూడు నాలుగు వారాలుగా భారత విద్యార్థిలోకం ఆ ప్రశ్నను తుత్తునియలు చేస్తున్నది.

ఈ విద్యార్థి కదలికకు తక్షణం కారణం సంఘ్ పరివార్ గుత్తాధిపత్య నిరంకుశత్వం. హిందూత్వ శక్తులు అధికారం చేపట్టిన తర్వాత దేశవ్యాప్తంగా పేట్రేగిపోతున్న అసహనానికి ప్రతిస్పందనగానే ప్రస్తుత విద్యార్థి ఉద్యమాల వెల్లువను చూడాలి. గుజరాత్ మారణకాండలో హతులైన మూడు వేల మంది ముస్లింల నెత్తురంటిన చేతులతో సంఘ్ ప్రచారక్ నరేంద్ర మోడీ అధికారికిని వచ్చిన తర్వాత దేశవ్యాప్తంగా సంఘ్ పరివార్ శక్తులు ఇష్టారాజ్యంగా ప్రవర్తించడానికి అవకాశం వచ్చినట్టుగా భావించడం మొదలుపెట్టాయి. మన సమాజపు బహుళత్వాన్ని అణచివేసి, ఏకరూప, శిలాసదృశ, హిందూత్వ బ్రాహ్మణీయ విలువలనూ, ఆచారాలనూ, పద్ధతులనూ ప్రవేశపెట్టడానికి ప్రయత్నాలు ప్రారంభించాయి. అది కేవలం ప్రభుత్వం లోకి వచ్చిన ఒకానొక పాలకవర్గ ముఠా ద్వారా మాత్రమే కాదు, మిగిలిన పాలకవర్గ ముఠాలనూ బెదిరించి లొంగదీసుకుని, తప్పుడు ప్రశ్నలు వేసి బ్లాక్ మెయిల్ చేసి తనలో

కలుపుకుని, తటస్థంగా మార్చి సంఘ్ పరివార్ భావజాలమే సమాజపు సాధారణ జ్ఞానంగా మార్చడానికి ప్రయత్నిస్తున్నాయి. ప్రచార సాధనాలనూ, విద్యా వైజ్ఞానిక సాంస్కృతిక సంస్థలనూ తన బాకాలుగా మార్చుకోవడానికి ప్రయత్నిస్తున్నాయి. న్యాయవ్యవస్థను కూడ తన భావజాల సమర్థకురాలిగా మార్చుకుంటున్నాయి. మొత్తం మీద సామాజిక రాజకీయార్థిక సాంస్కృతిక వ్యవస్థలన్నిటిలో సంఘ్ పరివార్ భావజాలం ఉన్నవారికే నిర్ణయాధికారం దక్కడం, వారి మాటే చెల్లుబాటు కావడం అనే స్థితి 2014 మే తర్వాత పెద్ద ఎత్తున మొదలయింది. అంతకు ముందే విద్యార్థి లోకంలో, విద్యాసంస్థలలో అసంతృప్తి ఉన్నప్పటికీ, అది కొన్ని సందర్భాలలో ఆందోళనా రూపం ధరిస్తూ వచ్చినప్పటికీ, సంఘ్ పరివార్ అధికారానికి వచ్చిన తర్వాత ఆ అసంతృప్తి భగ్గున మండడానికి అవకాశం వచ్చింది. అంతకు ముందే 2009 – 13 మధ్య ప్రత్యేక తెలంగాణ రాష్ట్రం కోసం ఆందోళనలో, 2012 డిసెంబర్ లో నిర్భయపై అత్యాచారానికి వ్యతిరేక ఆందోళనలో విద్యార్థుల భాగస్వామ్యం ఉన్నప్పటికీ, 2014 సెప్టెంబర్ లో జాదవ్ పూర్ విశ్వవిద్యాలయంలో విద్యార్థుల సమస్యల మీద మొదలై, విద్యార్థులు, అధ్యాపకులు, విస్తృత సమాజం పాల్గొన్న ఆందోళన ప్రస్తుత పరిణామాలకు నాందిగా చెప్పాలి.

కలకత్తాలోని జాదవ్ పూర్ విశ్వవిద్యాలయం క్యాంపస్ లో జరిగిన ఒక అత్యాచార సంఘటనపై చర్య తీసుకోవాలని కోరుతూ విద్యార్థులు ఆందోళన ప్రాంభించినప్పుడు, అధికారులు నేరస్తులపై చర్య తీసుకోలేదు సరిగదా, పోలీసు పాశవికత్వంతో నిరసనలను అణచివేయడానికి ప్రయత్నించారు. ఆ అణచివేతకు వ్యతిరేకంగా జాదవ్ పూర్ విశ్వవిద్యాలయ విద్యార్థులు మాత్రమే కాదు, మొత్తం కలకత్తా నగరంలోని వేలాది విద్యార్థులు ఉవ్వెత్తున లేచారు. హొక్కొలరబ్ (శబ్దం చెలరేగనీ) అనే పేరుతో ప్రసిద్ధమైన ఆ ఆందోళన రాష్ట్రమంతా వ్యాపించింది. దేశవ్యాపిత ప్రతిధ్వనులను చూసింది. ఉద్యమకారుల ప్రధాన డిమాండ్ అయిన వైస్ చాన్సలర్ తొలగింపులో విజయం సాధించింది. ఆ ఆందోళన చివరిదశలో బెంగాల్ లోని ప్రెసిడెన్సీ విశ్వవిద్యాలయంలోనూ, శాంతి నికేతన్ లోనూ కూడ విద్యార్థుల ఆందోళనలు చెలరేగాయి.

సంఘ్ పరివార్ అధికారం మొదలైన సంవత్సరానికి, 2015 మేలో మద్రాస్ ఇండియాన్ ఇన్ స్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజీ లో విద్యార్థులు, అధ్యాపకులు నడుపుకుంటున్న అంబేద్కర్ – పెరియార్ స్టడీ సర్కిల్‌కు వ్యతిరేకంగా కేంద్ర మావన వనరుల అభివృద్ధి మంత్రి స్మృతి ఇరానీకి ఒక ఆకాశరామన్న ఫిర్యాదు వచ్చింది. ఈ స్టడీ సర్కిల్ గౌరవ ప్రధాన మంత్రులకు వ్యతిరేకంగా ద్వేషాన్ని సృష్టిస్తున్నదనీ, మానవ వనరుల అభివృద్ధి మంత్రిత్వ శాఖకూ కేంద్ర ప్రభుత్వానికీ వ్యతిరేకంగా దళిత, ఆదివాసి విద్యార్థులను రెచ్చగొడుతున్నదనీ ఆ ఫిర్యాదులో రాశారు. స్మృతి ఇరానీ మంత్రిత్వ శాఖ వెంటనే ఆ స్టడీ సర్కిల్ ను రద్దు చేయవలసిందిగా ఐఐటి అధికారులను కోరింది. ఒక విద్యాసంస్థలో ఏ చర్చలు జరగాలో, జరగకూడదో ఆదేశించడానికి ప్రభుత్వం చేసిన ఈ దుష్ప్రయత్నం పట్ల విద్యార్థిలోకం తన ఆగ్రహం వ్యక్తం చేసింది. ముఖ్యంగా అంబేద్కర్, పెరియార్ ల మీద ఉన్న ఒక పరిశోధక, చర్చా వేదికను రద్దు చేయమని ప్రభుత్వం ఆదేశించడం సంఘ్ పరివార్ అసహన భావజాలంలో భాగమని రుజువైంది. ఐఐటి విద్యార్థులు ప్రారంభించిన ఆందోళన నగరం మొత్తానికీ, దేశం మొత్తానికీ కూడ వ్యాపించింది. విద్యార్థుల ఆందోళన తర్వాత అధికార వర్గాలు వెనుకకు తగ్గి స్టడీ సర్కిల్ మీద నిషేధాన్ని ఎత్తివేయవలసి వచ్చింది గాని, దేశవ్యాప్తంగా పెల్లుబికిన నిరసనతో ఎన్నో విద్యాసంస్థల్లో ఇటువంటి చర్చా వేదికలు ఏర్పడ్డాయి.

సరిగ్గా అదే సమయంలో పుణె లోని ఫిల్మ్ అండ్ టెలివిజన్ ఇన్ స్టిటూట్ ఆఫ్ ఇండియా (ఎఫ్‌టిఐఐ) పాలక మండలి అధ్యక్షుడిగా గజేంద్ర చౌహాన్ అనేఏ భాజపా కార్యకర్తను నియమించాలని కేంద్ర ప్రభుత్వం నిర్ణయించింది. ఆ సుప్రసిద్ధ, ప్రామాణిక కళా సంస్థకు కీలక నిర్ణయాధికార స్థానంలో ఉండేందుకు ఎటువంటి అర్హత లేకపోయినా కేవలం భాజపా కార్యకర్త కావడం, మహాభారత్ టెలివిజన్ సీరియల్ లో ధర్మరాజు పాత్ర వహించడం మాత్రమే అర్హతలుగా కేంద్ర ప్రభుత్వం ఆయనకు ఆ పదవిని కట్టబెట్టింది. ఈ నిర్ణయానికి వ్యతిరేకంగా ఎఫ్‌టిఐఐ విద్యార్థులు ఒక్కుమ్మడిగా తిరగబడ్డారు. విద్యార్థుల ఆందోళనకు దేశవ్యాపిత మద్దతు దొరికింది. విద్యార్థులు మాత్రమే కాదు, గత విద్యార్థులు, సినిమా రంగ నిపుణులు, మేధావులు ఎందరో వారి ఆందోళనలో పాల్గొన్నారు. 140 రోజుల పాటు సమ్మె జరిగినా ప్రభుత్వం దిగిరాలేదు. తనకు అప్పగించిన పదవిని చేపట్టడానికి చౌహాన్ ఆరు నెలల తర్వాత గాని ఎఫ్‌టిఐఐ లో అడుగు పెట్టలేకపోయాడు. అప్పటికీ నిరసనలు, లాఠీ చార్జీలు, అరెస్టుల మధ్య, చుట్టూ రక్షణ బలగాల మధ్య ప్రమాణస్వీకారం జరగవలసి వచ్చింది. ఆ ఆందోళన ఇప్పటికీ చల్లారిందని చెప్పడానికి వీలులేదు.

పుణె విద్యార్థి ఆందోళన సాగుతుండగానే ఢిల్లీలో విద్యార్థులు ప్రారంభించిన ఆక్యుపై యుజిసి (యూనివర్సిటీ గ్రాంట్స్ కమిషన్ కార్యాలయ ముట్టడి) ఆందోళన దేశవ్యాపిత ప్రతిస్పందనను చూసింది. అప్పటివరకూ ఉన్న సంప్రదాయానికి భిన్నంగా, నేషనల్ ఎలిజిబిలిటీ టెస్ట్ కు బైట విద్యార్థులకు స్కాలర్ షిప్ రద్దు చేస్తూ యుజిసి నిర్ణయం తీసుకుంది. ఆ నిర్ణయానికీ, అటువంటి మరికొన్ని నిర్ణయాలకూ వ్యతిరేకంగా 2015 అక్టోబర్ లో ఢిల్లీ విశ్వవిద్యాలయాల విద్యార్థులు యుజిసి ప్రాంగణాన్ని ఆక్రమించే ఆందోళన చేపట్టారు. రెండు రోజుల తర్వాత పోలీసులు బలప్రయోగంతో విద్యార్థులను అక్కడి నుంచి తరలించి నిర్బంధించినప్పటికీ, ఈ అణచివేత చర్యలు విద్యార్థుల సంకల్పాన్ని, ఆందోళనను బలోపేతం చేశాయి. యుజిసి తాజా నిర్ణయాలు దేశవ్యాప్తంగా విద్యార్థులందరి భవిష్యత్తు మీద గొడ్డలిపెట్టు వంటివి గనుక విద్యార్థుల ఉద్యమం అన్ని విశ్వవిద్యాలయాలకూ విస్తరించింది. విద్యార్థులను ప్రాంగణం నుంచి బైటికి పంపి నిర్బంధించినా, ఇప్పటికీ యుజిసి గేట్ల ముందర విద్యార్థుల నిరసన కొనసాగుతున్నది. దేశవ్యాప్తంగా విద్యార్థులు తరలివచ్చి ఆ నిరసనలో పాల్గొంటున్నారు. వారి మీద లాఠీచార్జిలు, వాటర్ కానన్ దాడులు సాగుతున్నాయి. ప్రభుత్వం ఒక కమిటీని నియమించి చర్చలు జరుపుతానని దిగి వచ్చింది గాని విద్యార్థి ఆందోళన ఆగలేదు. ఫిబ్రవరి 18న ఈ సమస్యపై దేశావ్యాప్త యూనివర్సిటీల సమ్మెకు పిలుపు ఇచ్చారు.

విద్యాసంస్థల మీద తమ పట్టుకోసం, భిన్నాభిప్రాయాలు ఉన్న వాళ్లను విద్యాసంస్థల నుంచి బైటికి తరిమేయడం కోసం సంఘ్ పరివార్ ఈ పద్దెనిమిది నెలల్లో చేసిన, చేస్తున్న ప్రయత్నాలు లెక్కలేనన్ని ఉన్నాయి. బనారస్ హిందూ విశ్వవిద్యాలయంలో ఇండియన్ ఇన్ స్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజీలో విజిటింగ్ ప్రొఫెసర్‌గా రెండున్నర సంవత్సరాలుగా పనిచేస్తున్న సామాజిక కార్యకర్త, మెగసేసే అవార్డు గ్రహీత సందీప్

పాండేను యూనివర్సిటీ యాజమాన్యం హఠాత్తుగా జనవరి 7న తొలగించింది. ఆయన నక్సలైట్ అని, దేశద్రోహకర కార్యకలాపాలు సాగిస్తున్నాడని, క్యాంపస్‌లో ఒక నిషిద్ధ చిత్రం (నిర్భయ ఘటన మీద తీసిన ఇండియాస్ డాటర్) ప్రదర్శించాడని ఆరోపించారు. భిన్నాభిప్రాయాలున్న వాళ్ల మీద దేశద్రోహకర కార్యకలాపాలు అని ఆరోపణలు చేయడం విస్తరించింది.

ఈలోగా హైదరాబాద్ కేంద్ర విశ్వవిద్యాలయంలో ఎప్పటి నుంచో దళిత, బహుజన విద్యార్థుల పట్ల కొనసాగుతున్న వివక్ష దుర్మార్గ రూపాలకు వ్యాపించింది. హైదరాబాద్ కేంద్ర విశ్వవిద్యాలయాన్ని హిందుత్వ, బ్రాహ్మణీయ అగ్రహారంగా మార్చిన అధికారవర్గం, దానికి వత్తాసుగా నిలిచిన సంఘ్ పరివార్ సంస్థలు విశ్వవిద్యాలయం తమ అదుపు ఆజ్ఞలలో ఉండాలని, భిన్నాభిప్రాయాలు, వైవిధ్యం ఉండగూడదని ప్రయత్నాలు ప్రారంభించాయి. అనేక విద్యార్థి సంఘాలు ఉండడం, విద్యార్థులలో అత్యధిక సంఖ్యాకులు సంఘ్ పరివార్ విద్యార్థి సంస్థ అఖిల భారతీయ విద్యార్థి పరిషత్ లో కాకుండా ఇతర విద్యార్థి సంఘాలలో ఉండడం వారికి కంటగింపయింది. ప్రగతిశీల విద్యార్థి సంఘాల ప్రభావాన్ని, ముఖ్యంగా అబేద్కర్ స్టూడెంట్స్ యూనియన్ (ఎఎస్ఎ) ప్రభావాన్ని దెబ్బతీయడానికి అవకాశాల కోసం ప్రయత్నాలు ప్రారంభించారు. కేంద్రంలో అధికారం తమదేనన్న అహంకారం కూడ జత కలిసిన తర్వాత క్యాంపస్ లో ప్రగతిశీల కార్యక్రమాలపై ప్రతికూల వ్యాఖ్యల, ఫిర్యాదుల పరంపర మొదలయింది. మరణశిక్షకు వ్యతిరేకంగా, యాకూబ్ మెమన్ ఉరికి ముందురోజు ఎఎస్ఎ జరిపిన నిరసన ప్రదర్శన ఒక సాకుగా దొరికింది. ఆ తర్వాత ఢిల్లీలో ముజఫర్ నగర్ బాకీ హై డాక్యుమెంటరీ ప్రదర్శన మీద ఎబివిపి జరిపిన గూండా దాడిని నిరసిస్తూ ఎఎస్ఎ జరిపిన ప్రదర్శన మరొక కారణమైంది. ఆ తర్వాత నాలుగు నెలల పాటు సంఘ్ పరివార్ చేసిన ప్రయత్నాలు, అంతిమంగా డిసెంబర్ లో ఐదుగురు ఎఎస్ఎ సభ్యుల బహిష్కరణ, యూనివర్సిటీ క్యాంపస్ లో వెలిసిన వెలివాడ, రోహిత్ ఆత్మహత్యగా గుర్తింపు పొందిన వ్యవస్థాగత హత్య వివరాలు అందరికీ తెలిసినవే.

రోహిత్ మృతి దేశవ్యాప్తంగా ఒక అత్యవసరమైన, కీలకమైన చర్చను ముందుకు తెచ్చింది. ఆర్థిక రాజకీయ సామాజిక సమానత్వం, అస్పృశ్యతా నిర్మూలన, కుల నిర్మూలన ఆదర్శాలను పునాదిగా పెట్టుకున్న రాజ్యాంగం ఆరున్నర దశాబ్దాల పాటు అమలైన తర్వాత ఈ మహా ఘనత వహించిన భారత ప్రజాస్వామిక గణతంత్రంలో ఒక అత్యున్నత విద్యాసంస్థలో సామాజిక సామనత్వం రాలేదని, అస్పృశ్యత తొలిగిపోలేదని, కుల వివక్ష యథాతథంగా ఉన్నదని, మనుస్మృతి అమలవుతున్నదని మరొకసారి బయటపడి దేశవ్యాపిత చర్చకు దారి తీసింది. దేశంలోని వందలాది విద్యాసంస్థలలో రోహిత్ వేముల సంస్మరణ సభలు, సమావేశాలు జరిగాయి. సామాజిక న్యాయాన్ని కోరుతూ విద్యార్థి కార్యాచరణ సమితులు పుట్టుకొచ్చాయి. రోహిత్ కు సంఘీభావంగా, విశ్వవిద్యాలయాలలో కుల వివక్షకు వ్యతిరేకంగా జనవరి 25 ఒక్కరోజునే దేశంలో 242 చోట్ల నిరసన ప్రదర్శనలు జరిగాయంటే ఈ ఉద్యమం ఎంత విస్తరించిందో అర్థమవుతుంది. ప్రతి విశ్వవిద్యాలయంలోనూ జాయింట్ ఆక్షన్ కమిటీ ఫర్ సోషల్ జస్టిస్ లు, అఖిల భారత సమన్వయ సమితులు ఏర్పాటు కావడం మొదలయింది. ఎన్నో నగరాలలో సంఘ్ పరివార్ సంస్థల ముందూ, ఇతర చోట్లా నిరసన ప్రదర్శనలు జరిగాయి. చిత్తశుద్ధి లేని రాజకీయవాదులతో సహా ఎందరెందరో ఈ ఉద్యమానికి సంఘీభావం ప్రదర్శించారు. పత్రికలలోనూ, ఛానళ్లలోనూ ఈ విషయమై పెద్ద ఎత్తున చర్చ జరిగింది. విద్యార్థి సమస్యలు, ప్రత్యేకించి దళిత, బహుజన కులాల విద్యార్థుల పరిస్థితి, వాటికి మూలమైన సామాజిక అవ్యవస్థ చర్చకు వచ్చి, దేశవ్యాప్త విద్యార్థి కదలిక ప్రారంభమయింది.

సహజంగానే ఈ ఆందోళన రాజధాని ఢిల్లీ నగరంలోనూ, ప్రత్యేకంగా జవహర్ లాల్ నెహ్రూ విశ్వవిద్యాలయం (జెఎన్‌యు) లోనూ పెద్ద ఎత్తున జరిగింది. ఈ చర్చతో మనువాదం, హిందూ బ్రాహ్మణీయ దుర్మార్గాలు, వాటిని సమర్థించే సంఘ్ పరివార్ రాజకీయాలు చర్చకు వచ్చాయి గనుక ఈ చర్చను పక్కదారి పట్టించడానికి, మరొక సమస్యను దేశ ప్రజల ముందుకు తీసుకురావడానికి సంఘ్ పరివార్ ప్రయత్నాలు ప్రారంభించింది. దేశభక్తి – దేశద్రోహం అనే వైపు చర్చను మళ్లిస్తే, అది ప్రజల భావోద్వేగాలను రెచ్చ గొట్టగలుగుతుందని, తాము కోరుకునే హిందూ – ముస్లిం, భారత – పాకిస్తాన్ విద్వేషాలను వ్యాపింపజేసి, కుల సమస్య మీద చర్చను పక్కదారి పట్టించవచ్చునని, ప్రస్తుతానికి బైటపడవచ్చునని సంఘ్ పరివార్ భావించింది. మన సమాజంలో రాజ్యమేలుతున్న తప్పుడు చైతన్యం వల్ల దేశభక్తి – దేశద్రోహం, భారతమాత – పాకిస్తాన్ శత్రువు వంటి సమస్యను రగిల్చడానికి సంఘ్ పరివార్ కు లెక్కలేనన్ని అవకాశాలు దొరుకుతాయి. అటువంటి ఒక అవకాశం దానికి సులభంగానే దొరికింది. జెఎన్‌యు లో డెమొక్రటిక్ స్టూడెంట్స్ యూనియన్ అనే ప్రగతిశీల విద్యార్థి సంస్థ నుంచి ఇటీవలే బైటికి వచ్చిన పరిశోధక విద్యార్థి ఉమర్ ఖాలిద్, ఆయన సహచరులు తొమ్మిది మంది కశ్మీర్ జాతి స్వయం నిర్ణయాధికార హక్కు కోసం జరుగుతున్న పోరాటం గురించీ, కశ్మీర్ లో అమలవుతున్న నిర్బంధం గురించీ, కశ్మీర్ పరిస్థితుల గురించీ ఒక సాంస్కృతిక కార్యక్రమం నిర్వహించాలనుకున్నారు. జమ్మూ కశ్మీర్ లిబరేషన్ ఫ్రంట్ నాయకుడు మఖ్బూల్ భట్ ను ఢిల్లీలోని తిహార్ జైలులో ఉరితీసిన రోజు ఫిబ్రవరి 11, 1984. అదే జైలులో తప్పుడు ఆరోపణలతో, సరైన విచారణ కూడ లేకుండా, మరణశిక్ష విధించి, కశ్మీరీ యువకుడు అఫ్జల్‌గురును ఉరి తీసిన రోజు ఫిబ్రవరి 9, 2013. ఈ రెండు తేదీలనూ కలిపి, ఫిబ్రవరి 9 సాయంకాలం ఐదు గంటలకు ఒక సాంస్కృతిక సమ్మేళనం జరపాలని ఈ విద్యార్థులు అనుకున్నారు. ది కంట్రీ విత్‌ఔట్ ఎ పోస్ట్ ఆఫీస్ అనే శీర్షికతో కవుల, కళాకారుల, గాయకుల, రచయితల, విద్యార్థుల, మేధావుల, సాంస్కృతిక కార్యకర్తల నిరసన, కళా – చాయాచిత్ర ప్రదర్శనతో కూడిన ఈ సాంస్కృతిక సాయంకాలంలో పాల్గొనమని క్యాంపస్ అంతటా బహిరంగంగానే పోస్టర్లు వేశారు. ఆ పోస్టర్ల మీద బ్రాహ్మణవాద సామూహిక అంతరాత్మకు వ్యతిరేకంగా, అఫ్జల్ గురు, మఖ్బూల్ భట్ ల చట్టబద్ధ హత్యకు వ్యతిరేకంగా, కశ్మీరీ ప్రజల ప్రజాస్వామిక హక్కు అయిన స్వయం నిర్ణయాధికారం కోసం జరుగుతున్న పోరాటానికి సంఘీభావంగా అని కూడ రాశారు.

ఈ కార్యక్రమం గురించి గుర్తించవలసిన అంశాలు కొన్ని ఉన్నాయి. ఈ కార్యక్రమ శీర్షిక అయిన ది కంట్రీ విత్‌ఔట్ ఎ పోస్ట్ ఆఫీస్ అనేది కశ్మీరీ – అమెరికన్ కవి ఆఘా షాహిద్ అలీ (1949 – 2001) రాసిన సుప్రసిద్ధ కవితా శీర్షిక. కశ్మీర్ లో 1990లో జరిగిన అల్లర్ల సమయంలో ఏడు నెలల పాటు అక్కడి పోస్టాఫీసులన్నిటినీ మూసేశారు. ఉత్తరం అనే మానవ సంబంధానికి అవకాశం లేని, నిషేధించిన దేశం అనే

అర్థంతో ఆయన రాసిన ఆ కవితా శీర్షిక 1997లో వెలువడిన ఆయన కవితా సంపుటానికి శీర్షికగా కూడా ఉంది. నిజానికి ఆ మాటే కశ్మీర్ ప్రజలు అనుభవిస్తున్న నిర్బంధానికీ, నిషేధాలకూ, మానవ సంబంధాల విచ్ఛిత్తికీ ఒక బలమైన వక్తీకరణ. జెఎన్‌యు సాంస్కృతిక సాయంకాలం ఆ కవితాత్మక శీర్షికతో సాహిత్య సాంస్కృతిక నిరసనగా, కశ్మీర్ ప్రజల కష్టాల గురించి, పోరాటాల గురించి మాట్లాడదలచింది. అఫ్జల్ గురుకు ఉరిశిక్ష విధించిన తీర్పులో స్వయంగా సుప్రీం కోర్టే, సాక్ష్యాధారాలు లేనప్పటికీ అఫ్జల్ గురుకు మరణశిక్ష విధిస్తేనే, పార్లమెంట్‌పై దాడివల్ల గాయపడిన సామూహిక అంతరాత్మను సంతృప్తి పరచగలుగుతాము అని రాసింది గనుక ఆ చట్టబద్ధ హత్య గురించీ, బ్రాహ్మణవాద సమూహిక అంతరాత్మ గురించీ ఈ సమావేశం మాట్లాడదలచింది.

సాధారణంగా క్యాంపస్ లో విద్యార్థులు జరుపుకునే సమావేశాలకు అధికారుల అనుమతి అవసరం లేదు. ఏదైనా హాలులో సమావేశం జరుపుకుంటేనే అనుమతి కావాలి. అటువంటి అనుమతి కోసం సమావేశ నిర్వాహకులు అధికారులకు దరఖాస్తు పెట్టి అనుమతి తీసుకున్నారు. సమావేశం జరగడానికి కొన్ని గంటల ముందు అఖిల భారత విద్యార్థి పరిషత్ కార్యకర్తలు ఈ సమావేశం క్యాంపస్ వాతావరణానికి హానికరమని, ఈ సమావేశాన్ని జరగనివ్వగూడదని అధికార వర్గానికి ఫిర్యాదు చేశారు. ఎబివిపి ఫిర్యాదుకు స్పందనగా వైస్ ఛాన్సలర్ సమావేశానికి అనుమతి ఉపసంహరించుకొమ్మని అదికారులను ఆదేశించాడు. చివరి నిమిషంలో సమావేశాన్ని రద్దు చేసుకోలేమని, కాకపోతే మైకులు లేకుండా బైట జరుపుకుంటామని నిర్వాహకులు అన్నారు. అనుమతి నిరాకరణ వల్ల ఏర్పడిన ఉద్రిక్త పరిస్థితిని చక్కదిద్దడానికి ఎన్నికైన విద్యార్థి సంఘ ప్రతినిధులు, క్యాంపస్ లో బలమైన ఇతర ప్రగతిశీల విద్యార్థి సంఘ బాధ్యులు కూడ రావాలని కోరారు. సమావేశం ప్రారంభానికి ఇరవై నిమిషాల ముందే అక్కడికి చేరిన సంఘ్ పరివార్ శక్తులు భజరంగ్ దళ్ కీ జై, భారత్ మాతాకీ జై అని నినాదాలు ఇస్తూ సమావేశ నిర్వాహకుల మీద, సమావేశానికి హాజరైన వారి మీద దాడి చేశారు. తోపులాట, కొట్లాట, అరుపులు, ఘర్షణ జరిగిన వీడియోలు ఇంటర్నెట్ మీద ప్రచారంలోకి వచ్చాయి. సమావేశానికి పెద్ద సంఖ్యలో హాజరైన కశ్మీరీ విద్యర్థులు సంఘ్ పరివార్ నినాదాలకు ప్రతి నినాదాలు చేశారు. ఆ ఘర్షణలో అన్ని రకాల నినాదాలు వినవచ్చాయి. కశ్మీరీ ప్రజల స్వయం నిర్ణయాధికార హక్కును బలపరిచే నినాదాలు ఉన్నాయి. ఆ హక్కును గురించి అడిగితే చంపేస్తాం అనే నినాదాలూ ఉన్నాయి. ఒక ఉద్రిక్త వాతావరణంలోఏ రెండు పరస్పర విరుద్ధ భావజాల విద్యార్థులు ఉన్నప్పుడు అటువంటి నినాదాలు వెలువడడంలో ఆశ్చర్యమేమీ లేదు. భారత్ కీ బర్బాదీ తక్ జంగ్ చలేగీ అని, పాకిస్తాన్ జిందాబాద్ అని నినాదాలు వచ్చాయని ప్రచారం జరుగుతున్నది. కాని సంఘ్ పరివార్ ఎంతో కాలంగా దూద్ మాంగోగే తో ఖీర్ దేంగే, కశ్మీర్ మాంగోగే తో చీర్ దేంగే అనే హింసాత్మక నినాదం ఇస్తూనే ఉన్నది. మామూలు సందర్భాలలోనే అటువంటి నినాదాలు వస్తున్నప్పుడు, ఉద్రిక్త వాతావరణంలో అప్పనిసరిగా వస్తాయి. ఆ నినాదాలు అభ్యంతరకరమైనవనుకున్నా అటువంటి సందర్భాలలో అవి ఎవరు ఇచ్చారో తెలియని స్థితి ఉంటుంది. ఈ సమావేశ సమయంలో అభ్యంతరకరంగా చూపబడుతున్న నినాదాలను ఎబివిపి కార్యకర్తలే ఇచ్చారని కూడ ఒక వాదన ఉంది.

జెఎన్‌యు భావప్రకటన స్వేచ్ఛకు, స్వేచ్ఛాయుతమైన భావ సంఘర్షణకు వేదికగా, అందువల్ల ప్రగతిశీల రాజకీయాల వేదికగా ఉన్నదని సంఘ్ పరివార్ కు చాలకాలంగా కంటగింపుగా ఉన్నది. అక్కడి వాతావరణాన్ని కలుషితం చేయాలని, అక్కడ తమ హిందూ బ్రాహ్మణీయ మనుధర్మమే చలామణీ కావాలని సంఘ్ పరివార్ చాల కాలంగా ప్రయత్నిస్తున్నది. అందువల్లనే మోడీ అధికారంలోకి రాగానే అనేక విద్యా వైజ్ఞానిక, శిక్షణా సంస్థల నిర్ణయాధికార స్థానాలలో సంఘ్ పరివార్ వ్యక్తులను నింపినట్టుగానే జెఎన్‌యు వైస్ ఛాన్సలర్ గా సుబ్రమణ్య స్వామిని నియమిస్తారని ఊహాగానాలు వచ్చాయి. దాని మీద పెద్దఎత్తున నిరసన చెలరేగగా, సంఘ్ పరివార్ భావజాలానికి దగ్గరగా ఉండే సాంకేతిక నిపుణుడిని, ఒక సామాజిక శాస్త్రాల విశ్వవిద్యాలయం ఎలా నడుస్తుందో తెలియని వ్యక్తిని వైస్ ఛాన్సలర్‌గా నియమించారు.

ఆ వైస్ ఛాన్సలర్ అధికారానికి వచ్చీ రాగానే క్యాంపస్ లో స్వేచ్ఛాయుత చర్చా వాతావరణాన్ని భగ్నం చేసే కార్యక్రమం ప్రారంభించాడు. ది కంట్రీ విదౌట్ ఎ పోస్ట్ ఆఫీస్ సాంస్కృతిక సాయంకాలం సమావేశపు అనుమతిని ఉపసంహరించుకొమ్మని అధికారులను ఆదేశించాడు. ఆ సమావేశంలో దేశద్రోహకర నినాదాలు ఇచ్చారని సంఘ్ పరివార్ చేసిన ప్రచారం మీద ఆధారపడి క్యాంపస్‌లోకి పోలీసులు ప్రవేశించడానికి అనుమతించాడు. వెంటనే ఒక విచారణ కమిటీ వేసి, దాని మధ్యంతర నివేదిక ప్రకారం ఎనిమిది మంది విద్యార్థులను విశ్వవిద్యాలయం నుంచి డిబార్ చేశాడు. క్యాంపస్ లోకి పోలీసుల ప్రవేశాన్ని, విద్యార్థులను డిబార్ చేయడాన్ని నిరసిస్తూ సభ నిర్వహించినందుకు విశ్వవిద్యాలయ విద్యార్థి సంఘం అధ్యక్షుడి మీద కూడ పోలీసు దాడి మొదాలయింది.

ప్రభుత్వమూ సంఘ పరివారమూ పోలీసులూ కలిసి సాగించిన ఈ ముప్పేట దాడికి అత్యాధునిక సాంకేతిక పరిజ్ఞానపు హంగులూ రంగులూ కత్తిరింపులూ అతికింపులూ జతకలిశాయి. విద్యార్థి సంఘ అధ్యక్షుడు కన్హయ్య కుమార్ ఇవ్వని నినాదాలు ఇచ్చినట్టు కనిపించడానికి ఒక వీడియోని దృశ్యాన్ని, మరొక వీడియోలోని ధ్వనిని కలిపి దొంగ వీడియోలు తయారు చేసి జాతీయ వార్తా ఛానళ్ల మీద పదే పదే ప్రసారం చేశారు. జెఎన్‌యు సభ నిర్వహించమని తామే ఆదేశించామని లష్కర్ ఎ తొయిబా అధిపతి హాఫీజ్ సయీద్ ట్విట్టర్ మెజేజి పంపాడని ఒక రోజంతా ప్రచారం చేశారు. ఆ మెసేజి ఆయనది కాదని, దేశంలోనే ఆయన పేరు మీద తప్పుడు ఖాతా సృష్టించి ఆ దొంగ మెసేజి పంపారని మర్నాడు రుజువయింది. సమావేశ నిర్వాహకుడు ఉమర్ ఖాలిద్ రెండు సార్లు పాకిస్తాన్ వెళ్లి వచ్చాడనే అబద్ధం, ఆయన కశ్మీరీ అనే అబద్ధం ప్రచారం చేశారు. ఆయనకు అసలు పాస్ పోర్టే లేదని, ఎప్పుడూ దేశం దేశం వదిలి వెళ్లలేదని, ఆయనది కశ్మీర్ కాదని, మహారాష్ట్ర అని వాస్తవాలు బైట పడేలోపు సంఘ్ పరివార్ అబద్ధాలు ప్రపంచం చుట్టి వచ్చాయి. ఉమర్ ఖాలిద్ జైష్ ఎ మహమ్మద్ సభ్యుడని ఇంటిలిజెన్స్ బ్యూరో పరిశోధించి నిగ్గుదేల్చిందని మొదటి పేజీ వార్తగా ప్రచారం చేశారు. తాము అటువంటి పరిశోధనేదీ చేయలేదని, ఆ నిర్ధారణా చేయలేదని మర్నాడు ఇంటిలిజెన్స్ బ్యూరోనే అధికారికంగా ఖండించింది. ఇలా గత రెండు వారాలుగా పచ్చి అబద్ధాల మీద ఆధారపడి పొంగుకొచ్చిన దేశభక్తితో ఆవేశకావేశాల చర్చ జరుగుతున్నది.

అబద్ధాల మీద ఆధారపడి చర్చలు జరిగినా ఫరవాలేదు, ఇవాళ

# అనుమానాల జాతీయవాదం రక్షణ ఇవ్వదు

**నాలుగున్నర దశాబ్దాలు భారత సైన్యంలో పనిచేసిన అనుభవంతో, ప్రస్తుత చర్చా సందర్భంలో జాతీయవాదాన్నీ, దేశభక్తినీ ఎలా అర్థం చేసుకోవాలో వివరిస్తున్నారు అడ్మిరల్ ఎల్. రాందాస్**

**భా**రత నావికాదళ ప్రధానాధికారిగా 1993లో పదవీ విరమణ చేయడానికి ముందు నలభై ఐదు సంవత్సరాలు నేను యూనిఫామ్‌లో భారత సైనిక దళాలలో సగర్వమైన సభ్యుడిగా ఉన్నాను. మన అత్యున్నత విద్యాసంస్థలలో ప్రస్తుతం నెలకొన్న సంక్షోభం, మూక హింస ఆధిపత్యవాద ప్రవర్తన, అసహనం నన్ను మళ్లీ ఒకసారి మాట్లాడమనీ, నా ఆందోళనలు మీతో పంచుకొమ్మనీ పురికొల్పుతున్నాయి గనుక ఈ బహిరంగ లేఖ రాస్తున్నాను. ఇటీవల నేను రాష్ట్రపతిని, ప్రధానమంత్రినీ ఉద్దేశించి రాసిన రెండు లేఖలు సాధారణ అధికార స్పందనను మించి మరేమీ సాధించలేదు. ప్రభుత్వ విధానానికి మద్దతు ఇవ్వకుండా బహిరంగ వైఖరి తీసుకునే విశ్రాంత సైనికుల సముదాయం చాలా చిన్నదనీ, నేను వారిలో ఒకరిననీ నాకు బాగానే తెలుసు. కాని నావంటి ఒక మాజీ సైనికుడికీ, పౌరుడికీ ఇది హక్కు అనీ, బాధ్యత అనీ నేను భావిస్తాను. ఇంకా విధి నిర్వహణలో ఉన్న యూనిఫాం సైనికులు ఉద్యోగ నిబంధనల ప్రకారం తమ భావాలు వ్యక్తీకరించడానికి వీలులేదని నాకు తెలుసు. కాని పదవీవిరమణ చేసిన మాజీ సైనికులు తప్పనిసరిగా మాట్లాడాలి, మాట్లాడగలం. నావంటి వాడు ఇవాళ మౌనంగా ఉండిపోతే, రేపు నా మనుమలు, “నువ్వు కాకపోతే ఇంకెవరు తాతా” అనీ, “ఇప్పుడు కాకపోతే ఇంకెప్పుడు తాతా” అనీ అడుగుతారు.

కాకపోతే రేపు అబద్ధాలు బైటపడతాయి. కాని అబద్ధాల మీద ఆధారపడి నేరారోపణలు, అరెస్టులు, చిత్రహింసలు, కనబడితే కొట్టి చంపమనే వీరాలాపాలు కూడ సాగుతున్నాయి. సంఘ్ పరివార్ భావజాలంలో, అలావాటైన పద్ధతులలో ఇవి సహజమే గాని తనను తాను ప్రజాస్వామికమని, చట్టబద్ధ పాలన అని, రాజ్యాంగ ఆదర్శాలు అని చెప్పుకుంటున్న సమాజంలో ఇవి అనాగరికతకు చిహ్నాలు.

వేరువేరు వీడియోలు కలిపి కన్హయ్య కుమార్ మీద నేరారోపణలు చేవారని రుజువైన తర్వాత కూడ ఆ తప్పుడు కేసు యథాతథంగా నడుస్తున్నది. ఏ నేరమూ చేయకుండానే ఆయన ఇప్పటికి రెండు వారాలుగా జైలులో మగ్గిపోతున్నాడు. విచారణలో ఉన్న ఖైదీగా, న్యాయరక్షణలో న్యాయస్థానానికి వచ్చిన ఆయన మీద సంఘ్ పరివార్ గుండాలు దాడి చేశారు. ఆయననూ, ఆ కోర్టు హాలులో ఉన్న జెఎన్‌యు విద్యార్థులనూ అధ్యాపకులనూ పాత్రికేయులనూ కోట్టారు. అలా కొట్టిన గూండాలను సంఘ్ పరివార్ శక్తులు సన్మానిస్తున్నాయి. ఆ గూండాలు బహిరంగంగా తామాపని చేశామని చెప్పుకుంటున్నారు. అయినా వారి మీద ఏ విచారణా లేదు.

ఇదంతా సరిగ్గా జర్మనీలో 1933లో హిట్లర్ అధికారంలోకి రాగానే నాజీ గూండాలు సాగించిన అక్రమాలకు, అత్యాచాలరాలకు, హింసకు ప్రతిబింబంగా ఉన్నది. హిట్లర్ సాగించిన నరంహంతక, దుర్మార్గ పాలన ఒక దశాబ్ది సాగిందేమో గాని, చివరికి హిట్లర్, నాజీలు ఎట్లా అంతమయ్యారో చరిత్ర కళ్లముందు చూపుతున్నది.

ఈ దేశభక్తి చర్చతో రోహిత్ ప్రారంభించిన కుల వివక్ష చర్చ పక్కకుపోయిందని సంఘ్ పరివార్ తన భుజాలు తానే చరుచుకుంటున్నది. కాని కొరివితో తల గోక్కున్నట్టు, జెఎన్‌యు ఘటన దేశవ్యాప్తంగా మరిత పెద్ద చర్చకు దారి తీసింది. ఈ దేశంలో సంఘ్ పరివార్ పాలనలో భావ ప్రకటనా స్వేచ్ఛ ఉన్నదా లేదా? ఈ దేశ పౌరులు తమ ఇష్టం వచ్చిన భావాలను ఆలోచించవచ్చునా లేదా, వ్యక్తీకరించవచ్చునా లేదా? ఆరుగాలం కష్టపడుతూ, తమ శ్రమ ఫలితం కూడ తమకు దక్కకుండా ఈ దేశ సంపద పెంచడానికి కృషి చేస్తున్న అశేష పీడిత ప్రజానీకం దేశభక్తులా? ఆ సంపదను దేశదేశాల సంపన్నులకు, బహుళజాతి సంస్థలకు తెగనమ్ముకుంటున్న పాలకులు దేశభక్తులా? దేశభక్తి అంటే దేశంలోని ప్రజల సౌభాగ్యం ఆకాంక్షించడమా, దేశ వనరులను సామ్రాజ్యవాదుల పాదాల దగ్గర సమర్పించడమా? అసలు విభిన్న జాతుల నిలయమైన భారతదేశంలో దేశభక్తి అనేది ఏ దేశానికి భక్తి, ఎప్పటి దేశానికి భక్తి? అతి భయంకరమైన కుల వివక్ష, అస్పృశ్యత, అసమానతలు, ఆర్థిక అంతరాలు నిండి ఉన్న ఈ దేశంలో నిజమైన దేశభక్తి ఈ అవలక్షణాలను వదులుకోవడమా, వాటినే పెంచి పోషిస్తుండడమా... ఎన్నెన్నో ప్రశ్నలకు ఈ చర్చా క్రమంలో జవాబు చెప్పవలసి ఉంది.

నిజానికి దేశంలోని సమస్యలలో ఒకదానికి మరొకదాన్ని పోటీ పెట్టనవసరం లేదు. భూస్వామ్య హిందూ బ్రాహ్మణీయ నిచ్చెనమెట్ల కుల వ్యవస్థ, దానికి సంపూర్ణ మద్దతు ఇస్తూ మిలాఖత్తు అయిన సామ్రాజ్యవాదం అన్ని సమస్యలకూ పునాది. కనుక భూస్వామ్యానికీ, సామ్రాజ్యవాదానికీ, వాటి ప్రయోజనాలు కాపాడుతున్న దళారీ పాలక వర్గానికీ వ్యతిరేకంగా విశాల ప్రజారాశుల ఐక్యతతో సమగ్ర, సమన్వయ పోరాటమే ఇవాళ భారత ప్రజల ముందున్న కర్తవ్యం. ఈ విశాల సమస్యలలో అతి ముఖ్యమైన రెండు సమస్యల మీద, కుల వివక్ష మీద, హిందూ బ్రాహ్మణీయ మతోన్మాదం మీద, ఇవాళ విద్యార్థులు ఒక క్రియాశీల పోరాటానికి నడుం బిగించారు. ఈ రెండు పోరాటాలనూ ఏకం చేయడం, వాటికి మరింత శాస్త్రీయమైన, నిర్మాణ యుతమైన, సంఘటితమైన పునాది కల్పించడం ఇవాళ ప్రగతిశీల బుద్ధిజీవుల బాధ్యత.

*(రచయిత వీక్షణం సంపాదకులు)* వీ

హైదరాబాద్ సెంట్రల్ యూనివర్సిటీలో 2015 డిసెంబర్‌లో జరిగిన విషాదకరమైన రోహిత్ వేముల ఆత్మహత్యతో ప్రారంభమై. జె.ఎన్.యూలో అపరిష్కృతంగా ఇవాళ్టిదాకా సాగుతున్న ఘటనా పరంపర గురించి నేను మాట్లాడుతున్నాను. గతంలో ఎన్నడూ లేని విధంగా క్యాంపస్‌లోకి పోలీసులు ప్రవేశించడం, తర్వాత రణగొణ ధ్వనితో, తీవ్రమైన ఉద్వేగాలతో "ప్రచార సాధానాలలో విచారణ" జరగడం, ఆ తర్వాత రాజద్రోహం, దేశద్రోహం, తీవ్రవాదం వంటి తీవ్రమైన నేరారోపణలతో విద్యార్థులను నిర్బంధించడం వంటి ఘటనలు దేశవ్యాప్తంగా పతాకశీర్షికలకు ఎక్కాయి. ఈ మొత్తం పరిణామాలలో అత్యంత మొరటుగా వ్యవహించడం వల్ల నివారించగదిన విభజన జరిగిపోయింది. విద్యార్థులను దుర్మార్గులుగా చూపడంతో, కుట్ర సిద్ధాంతాలు వెల్లువెత్తడంతో ఆ సంక్షోభం పూర్తిస్థాయికి చేరింది. వేలాది మంది విద్యార్థులు, పౌరసమాజ బృందాలు, జర్నలిస్టులు ఢిల్లీ వీధుల్లోకి వచ్చి ఇటీవలి కాలంలో కనీవినీ ఎరగనంత పెద్ద శాంతియుత ప్రదర్శనలు జరుపుతున్నారు.

### ఒక అవలోకనం

నేను ఎక్కడి నుంచి వచ్చానో సరిగ్గా అర్థం కావడం కోసం కాస్త నా సొంత కథ క్లుప్తంగా చెప్పనివ్వండి. నేను 1949 జనవరిలో అప్పుడప్పుడే రెక్కవిప్పుకుంటున్న భారత నావికా దళంలో చేరాను. దేశం స్వాతంత్ర్యం సాధించి ఇంకా 16 నెలలు కూడా నిండలేదు. అది చాలా గొప్ప ఆశల, పెద్ద కలల, మహా అవకాశాల కాలం. బ్రిటిష్ వలస పాలన నుంచి బయటపడి లేచి నిలుస్తున్న భారత దేశపు సైనిక దళాల్లో చేరే అవకాశం రావడమంటే, ఒక పదిహేను సంవత్సరాల యువకుడికి మహదానందకర సందర్భమే. నావికాదళంలో 45 సంవత్సరాల సేవ నాకు ప్రపంచ రంగస్థలం మీద సాగిన అనేక ఘటనల విస్తారమైన దృశ్యాన్ని చూపింది. దేశ విభజన సమయంలో అసాధారణమైన పాశవికత్వాన్నీ, ఊచకోతలనూ చూసి కలత చెందిన దేశంలో ఆ ఘటనలను నేను అతి దగ్గరి నుంచి చూడగలిగాను. ఆ విషాదఘటనల మచ్చలు ఇంకా నా వ్యక్తిగత జ్ఞాపకాలలో ఉన్నాయి. సరిహద్దులకు రెండువైపులా మన ఉమ్మడి చైతన్యంలో కూడా అవి భాగమయ్యాయి.

నాయకులూ పౌరులూ కలిసి ఒక్కొక్క ఇటుకగా, ఒక్కొక్క మెట్టుగా ఒక నవభారత స్వప్నాన్ని, స్వేచ్ఛాభారత స్వప్నాన్ని సృష్టించారు. నిర్మించారు. రాజ్యాంగ నిర్ణయసభలో జరిగిన సుదీర్ఘమైన, కష్టతరమైన చర్చలలో ఆ స్వప్నం రూపుదిద్దుకుంది. మన సమాజంలోని విస్తారమైన, పరస్పర ఘర్షణామయమైన వైవిధ్యాన్నంతటినీ ఒడిసి పట్టి ఒక వైతాళిక రాజ్యాంగ పత్రంలో గుదిగుచ్చవలసి వచ్చింది. ఎందరో ప్రశంసనీయమైన ఆలోచనాపరుల, స్వాప్నికుల విభిన్న భావాలను ఒక్కచోటికి చేర్చిన భారత రాజ్యాంగం సంకుచిత, గుత్తాధిపత్య ఏకరూపతను స్థిరంగా నిరాకరించింది. బాబా సాహెబ్ అంబేద్కర్ మార్గదర్శకత్వంలో ఈ జాతికి ఒక సమ్మిళితమైన విశ్వాసభరితమైన, పరివర్తనాశీలమైన విప్లవ నిర్వచనం అందింది.

### సాయుధ దళాలు–దేశం

ఈ కొత్త దేశంలో జాతి నిర్మాణం అనే ఉమ్మడి కృషిలో సైనిక బలగాలకు కూడ సమానమైన పాత్ర ఉంది. ఆ పాత్ర భిన్నమైన మార్గాల్లో సాగవలసి ఉండింది. సుశిక్షితులైన సైనికులుగా క్రమశిక్షణతో, నైపుణ్యంతో ప్రవర్తిస్తూ, అదే సమయంలో దయార్ద్ర హృదయంతో, మానవత పట్ల, ఆదర్శాల పట్ల చిత్తశుద్ధితో ఉండవలసి ఉండింది.

సైనిక బలగాలలో ఉన్నవారికి వర్తించే అలిఖిత, పవిత్ర సూత్రమేమంటే రాజకీయాలతో సంబంధం లేకుండా ఉండడం. నిజంగానే ఒకసారి మనం సైనిక బలగాలలో చేరామంటే పౌరులందరికీ వర్తించే, రాజ్యాంగంలో పొందుపరిచిన సాధారణ హక్కులను వదులుకున్నట్టే. సాయుధ దళాలు రాజకీయ నాయకత్వపు అదుపులో ఉండాలనే సూత్రాన్ని స్వాతంత్ర్యం సాధించిన తర్వాత ఎటువంటి మినహాయింపులు లేకుండా ఆమోదించడం జరిగింది. అయితే నాకిది–నీకది అనే ఈ ఏర్పాటుకు అలిఖిత అర్థం ఏమంటే అధికారంలో ఉన్న ప్రభుత్వం ప్రజల పట్ల, సైన్యం పట్ల తన బాధ్యతలను సగౌరవంగా నిజాయితీతో నెరవేర్చాలనేది.

యూనిఫామ్‌లో పనిచేసిన వారందరమూ పదవీ విరమణ తర్వాత సాధారణ భారత పౌరులుగా మారిపోతాం. అంటే పౌరసత్వానికి ఉండే అన్ని హక్కులు, విధులు, బాధ్యతలు మాకు కూడా ఉంటాయి. నావికాదళంలో, సైన్యంలో, వైమానికదళంలో ఉన్నపుడు వర్తించే నియమనిబంధనలు ఇపుడు ఉండవు. అలాగే, యూనిఫామ్‌లో ఉన్నప్పుడూ లేనపుడూ కూడా, సైనిక బలగాలలో పనిచేసేవారిమి మా ఓటు హక్కుకు చాలా విలువ ఇచ్చాం. అది మన ప్రజాస్వామిక రాజ్యానికి ఒక చిహ్నంగా గుర్తించాం. ఓటు వేస్తున్నామంటేనే ఒక ప్రత్యేక రాజకీయ వైఖరినో, అవగాహననో ఎంపిక చేశామన్నమాట. ఇలా పరిణతి చెందుతున్న, కాని సంక్షుభితంగా ఉన్న మన ప్రజాస్వామ్యంలో నాలుగు దశాబ్దాల పాటు చేసిన సైనిక సేవ, పదవీ విరమణ తర్వాత నా రాజకీయ అవగాహనల మీద కచ్చితంగా ప్రభావం చూపుతున్నది.

### యుద్ధసైనికుడి నుంచి శాంతికాముడిగా

1993 సెప్టెంబర్‌లో నా పదవీ విరమణ తర్వాత, నేను మహారాష్ట్రలోని ; అలీబాగ్‌లో ఒక గ్రామానికి వచ్చి స్థిరపడ్డాను. సేంద్రియ వ్యవసాయం చేసుకుంటూ జీవిస్తున్నాను. గ్రామీణ భారతదేశంలో జీవించడం నాకు కొత్త విద్య నేర్పింది. నాకు అంతకు ముందు లేని లోతైన అవగాహనలు కలిగేందుకు దోహదం చేసింది. ఒక సాధారణ రైతు ఏ ఒడిదుడుకులను ఎదుర్కొంటున్నాడో అవన్నీ నేనెదుర్కున్నాను. ప్రకృతి వైపరీత్యాలు, కాలుష్యం వల్ల జరుగుతున్న మార్పులు, స్థానిక రాజకీయాలు, ప్రత్యేక ఆర్థిక మండలం అభివృద్ధి పేరు మీద వ్యవసాయం నుంచి వెళ్లగొడతామనే బెదిరింపులు, వంటివెన్నో నేనూ అనుభవించాను. యూనిఫామ్‌లో గడిపిన సంవత్సరాలూ, రెండు యుద్ధాలలో పాల్గొన్న అనుభవమూ, మన దేశ జనాభాలో 70శాతాన్ని అతలాకుతలం చేస్తున్న వ్యవసాయ సంక్షోభాన్ని దగ్గరి నుంచి అర్థం చేసుకోవడమూ నా ఆలోచనల మీద ప్రత్యక్ష ప్రభావం వేశాయి. ఇప్పుడు నాకు ఏర్పడిన నమ్మకమేమంటే, ఈ దేశంలోని ఉన్నతవర్గాల వారు కొంతయినా నిజాయితీని, కాస్త తక్కువ అత్యాశనూ ప్రదర్శిస్తేగాని ఈదేశానికి దారిద్ర్యం నుంచీ, ఆకలి నుంచి నిజమైన విముక్తి, "ఆజాదీ" రాదు అని.

ఇండియన్ ఎక్స్‌ప్రెస్ దినపత్రిక సమాచార హక్కు చట్టం కింద

అడిగిన ప్రశ్నకు జవాబిస్తూ ఇటీవల రిజర్వ్ బ్యాంక్ ఆఫ్ ఇండియా త ఎలియజేసినదాని ప్రకారం ఈ దేశంలో పరిశ్రమల పేరు మీద ప్రభుత్వం రంగ బ్యాంకుల నుంచి రెండు లక్షల పదకొండు వేల కోట్ల రూపాయలు అప్పు తీసుకున్నారు. ఈ మొత్తంలో దాదాపు సగాన్ని మొండి బాకీలుగా గుర్తించి 2013-15 మధ్య ప్రభుత్వం కొట్టివేసిందని తేలింది. ఈ సమాచారాన్ని గాని, ఆర్థిక వ్యవస్థ మీద దాని ప్రభావాన్ని గానీ అధికారికంగా ఆర్థిక మంత్రిత్వ శాఖ ప్రకటించలేదనేది ఆశ్చర్యకరమైన విషయం. అయినా బలహీనవర్గాలకు చెందిన విద్యార్థులకు జెన్‌యూలో, ఇతర విశ్వవిద్యాలయాల్లో చదవు కోసం ఇస్తున్న చిల్లర డబ్బుల మీద తీవ్రాతితీవ్రమైన విమర్శలు వింటున్నాం. పన్ను చెలింపుదార్ల డబ్బును ఇలా దుర్వినియోగం చేయడమా అని ప్రశ్నలు వింటున్నాం. పారిశ్రామికవేత్తలకు ఇచ్చిన రుణాలు కూడా పన్ను చెల్లింపుదార్ల డబ్బు నుంచి వచ్చినవేననే వాస్తవాన్ని మనం ఎప్పుడూ ప్రశ్నించడం లేదు.

సుస్థిర అభివృద్ధి మీద ఆధారపడిన మరింత న్యాయమైన సమాజాన్ని సాధించాలంటే, మనం ఇరుగుపొరుగు సంబంధాలను మెరుగుపరుచుకోవడం ద్వారా శాంతిని నెలకొల్పాలి. అంటే అర్థం ప్రస్తుతం కొనసాగుతున్న సమస్యలకు రాజకీయ పరిష్కారాలను అన్వేషించాలి. అపుడు మాత్రమే మన యుద్ధ ఆయుధాల మీద పెడుతున్న ఖర్చును తగ్గించగలం. వినియోగ వస్తువుల వాడకాన్ని నియంత్రించగలం. ఇంధన అవసరాలలో సమతుల్యత పాటించగలం. పౌరులందరికీ ఆహారం, ఆశ్రయం, విద్య, ఉపాధి కల్పించగలం.

రాయగడ్‌లో ప్రతిపాదించిన ప్రత్యేక ఆర్థిక మండలాలకు వ్యతిరేకంగా సుదీర్ఘకాలం పాటు సాగిన ఉద్యమానికి నేను నాయకత్వం వహించాను. దానిలో భాగస్వామిగా ఉన్నాను. పునరుత్పత్తి చేయగల ఇంధన వనరుల, శక్తి వనరుల అభివృద్ధి కోసం ప్రయత్నాలు సాగిస్తున్నాను. భద్రత, ఖర్చు, వ్యర్థ పదార్థాలను వదుల్చుకోవడం అనే సమస్యలను దృష్టిలో పెట్టుకుని అణ్వాయుధ నిరాయుధీకరణ ఉద్యమంలో నేను క్రియాశీలంగా పాల్గొన్నారు. కార్బన్ లేని, అణుశక్తి లేని పరిష్కారం కనిపెట్టాలనే ఆకాంక్షతో అణువిద్యుత్ వ్యతిరేక ఆందోళనలలో పాల్గొన్నాను. శాంతి స్థాపన వల్ల సాధించగల విజయాల పట్ల నమ్మకంతో పాకిస్తాన్ ఇండియా పీపుల్స్ ఫోరమ్ ఫర్ పీస్ అండ్ డెమొక్రసీ (పాకిస్తాన్ భారత శాంతి, ప్రజాస్వామ్య ప్రజావేదిక), ఇండియా పాకిస్తాన్ సోల్జర్స్ ఇనిషియేటివ్ ఫర్ పీస్ (భారత పాకిస్తాన్ సైనికుల శాంతి ప్రయత్నం) అనే సంస్థలకు నాయకత్వం వహించాను. ఈ రెండు సంస్థలూ భారత పాకిస్తాన్ దేశాల ప్రజలకూ ప్రజలకూ మధ్య సంబంధాలు కుదర్చడానికి, పాకిస్తాన్‌తో మెరుగైన సంబంధాలు ఏర్పడడానికి ప్రయత్నాలు చేస్తున్నాయి. అలాగే నేను మరణశిక్షకు, ఉరిశిక్షకు పూర్తి వ్యతిరేకిని. భయంకరమైన సాయుధ దళాల ప్రత్యేక అధికారాల చట్టాన్ని ఇంకా అమలు చేయడాన్ని కూడా నేను తీవ్రంగా వ్యతిరేకిస్తున్నాను. వీటి మీద నేను ఎన్నో బహిరంగ ప్రజావేదికల మీద రాశాను, మాట్లాడాను.

ఈ అంశాలలో ప్రతి ఒక్కటీ పౌరులుగా మనం మన హక్కుల గురించి స్పృహతో మాత్రమే కాదు, బాధ్యతల పట్ల స్పృహతో కూడా మాట్లాడాలని నేననుకుంటాను. అలా మాట్లాడడం ఆ రోజున అధికారంలో ఉన్న ఒకానొక ప్రభుత్వ విధానానికి వ్యతిరేకమైనా సరే. ఈ మాటలన్నీ మాట్లాడుతున్నానంటే నేనైనా, లేదా ఈ మాటలు మాట్లాడే ఎవరైనా దేశ వ్యతిరేకులవుతారా? జాతి వ్యతిరేకులవుతారా? వారి దేశభక్తికి లోటు వస్తుందా? వారు దేశద్రోహులవుతారా? ఎంతమాత్రమూ కారని నా విశ్వాసం.

ఈ విషయంలో నా విశ్వాసానికి మూలం ఈ దేశంలో రాజకీయ పార్టీలైనా, ప్రభుత్వాలైనా ఈ దేశం రచించుకున్న రాజ్యాంగానికి లోబడి ఉండవలసిందేనన్న మౌలిక సూత్రం. ఏ ప్రతీకారం జరుగుతుందో అనే భయం లేకుండా ఆలోచించడానికీ, భావాలను వ్యక్తం చేయడానికీ ప్రతి పౌరుడికీ హక్కు, స్వాతంత్ర్యమూ ఉన్నాయి. కాలం చెల్లిన వలసవాద రాజద్రోహ చట్టానికి ఆధునిక ప్రజాస్వామ్య దేశంలో స్థానం లేదు.

అందువల్ల ఒక ప్రశ్న తలెత్తుతుంది: మనం ఒక రోహిత్ వేములను, ఒక కన్హయ్య కుమార్‌ను, ఒక ఉమర్ ఖాలిద్‌ను జాతి వ్యతిరేకులనీ, రాజద్రోహులనీ, తీవ్రవాద కార్యకలాపాలలో పాల్గొన్నారనీ ఎందుకు నిందారోపణ చేస్తున్నాం? లభ్యమవుతున్న సమాచారం ప్రకారం ఈ ముగ్గురు యువకులూ మన రాజ్యాంగంలో ప్రకటించుకున్న ఆదర్శాలను ముందుకు తీసుకుపోయే కార్యక్రమాలు చేశారు. ఎటువంటి జాతి వ్యతిరేక కార్యక్రమాలలో పాల్గొనలేదు.

**జాతీయవాదాన్ని ఎవరు నిర్వచించాలి?**

కొన్ని రకాలుగా ఒక మంచిపని జరిగిందనాలి. రోహిత్ వేముల మరణం, కన్హయ్య అరెస్టు, ఉమర్ ఖాలిద్‌కు వ్యతిరేకంగా నిందారోపణల దాడి వాస్తవంగా జాతి, జాతి వ్యతిరేకత నిర్వచనాల మీద బహిరంగ చర్చకు దారితీశాయి. మన సమాజంలో కులం, మతం, వివక్ష వంటి లోతైన, చెరపరాని విషయాల మీద చర్చకు దారి తీశాయి. ఈ చర్చలో భాగమైనదే నాకు జాతీయవాదం ఉన్నదో లేదో నిర్ణయించే అధికారం ఎవరికి ఉంది, ఎవరికైనా ఉందా అనే జటిలమైన ప్రశ్న. ఈ ప్రశ్న మీద సుదీర్ఘమైన, మరింత పరిణతమైన చర్చ అవసరం. స్వాతంత్ర్యం నాటి నుంచీ కూడా నాకు తెలిసినంతవరకు ఈ విషయం మీద అవసరమైన చర్చ జరగలేదు. ఈ విషయానికి సంబంధించి ఇవాళ ఉనికిలో ఉన్న చట్టాలు, అలవాట్లు ప్రధానంగా వలసవాదుల వారసత్వంగా కొనసాగుతున్నవే. సమకాలీన చట్రంలో వాటిని సవరించుకునే ప్రయత్నమే జరగలేదు. ఒక పరిణత ప్రజాస్వామ్యానికి అది చాలా అవసరం. యుద్ధోన్మాదం, జాతీయ పతాకాన్ని గాలిలో ఊపడం, నినాదాలు ఇవ్వడం దేశభక్తిని ధ్రువీకరించడానికి సమానం కావు. ద్వేషాన్ని రెచ్చగొట్టడం, రాజద్రోహకరంగా ప్రవర్తించారని, తీవ్రవాదులతో సంబంధాలున్నాయనీ ఆరోపణలు చేయడం న్యాయవ్యవస్థ విచారణకు నిలబడవు. ఆ యువకుల నినాదాలతో, వారి నిరసన రూపాలతో అంగీకరించడం లేదని కూడా చాలామంది బహిరంగంగానే చెప్పారు. కాని ఆ నినాదాలూ నిరసనలూ కొత్తవి కావు, విప్లవకరమైనవీ కావు. నిజం చెప్పాలంటే కొద్దిమంది విద్యార్థులు ఈ దేశ ఐక్యతను ప్రమాదంలోకి నెట్టగలరని భావించడమే హాస్యాస్పదం. కాని కొన్ని ప్రచార సాధనాలూ, వారి వెనుక అదృశ్యంగా ఉన్న వారి పోషకులూ అలా భావిస్తున్నారు, దాన్ని స్థిరపరుస్తున్నారు.

నా వంటి వాడికి అత్యంత తీవ్రంగా ఆందోళన కలిగిస్తున్న విషయం

ఏదైనా ఉందంటే, అది న్యాయవాద వృత్తిలో ఉన్నామని చెప్పుకుంటున్న కొందరు వ్యక్తులు న్యాయస్థానం లోపల రౌడీ మూకల్లా ప్రవర్తించడానికి అనుమతి దొరకడమే. వారు పాత్రికేయులను, విద్యార్థులను, అధ్యాపకులను, న్యాయరక్షణలో ఉన్న నిందితుడు కన్హయ్యకుమార్‌ను బెదిరించారు, కొట్టారు. పెద్ద సంఖ్యలో పోలీసులు మౌన సాక్షులుగా నిలబడి ఉండగా ఇది జరిగింది. యూనిఫాం వేసుకున్న, క్రమశిక్షణాయుత సిబ్బంది అని పేరున్న పోలీసుల నుంచి ఈ ప్రవర్తన ఎంతమాత్రమూ అంగీకారయోగ్యం కాదు.

జె.ఎన్.యూ. హెచ్.సి.యుల క్లిష్ట సమస్యల గురించి బహిరంగంగా విస్తృతంగా అచ్చయిన నివేదికలు, ఆడియో వీడియో సమాచారం అంతా నేను పరిశీలించాను. నా వరకు నాకు నిజమైన విషాదంగా కనబడినదేమంటే, విదేశీ నిధులతో నడుస్తున్నాయని, తీవ్రవాద, రాజద్రోహకరమైన కార్యకలాపాలు అని బూచి చూపడం ఇటువంటి ప్రతిష్ఠాత్మకమైన విద్యాసంస్థలను మూసివేయమనీ, లేదా అక్కడి నుంచి ఈ శక్తులను తొలగించి 'ప్రక్షాళనం' చేయమనీ అడగడానికే తయారు అయిందనేదే. ఇదంతా తప్పుడు ఆరోపణల కుతంత్రం కావచ్చునని అనుమానించడానికి అవకాశం ఉంది. అవి తప్పుడు ఆరోపణలైతే మరింత ప్రమాదకరం. అన్ని రకాలుగానూ ఈ ఆరోపణల మీద విచారణ జరపాలి. విద్యార్థుల మీద తగిన క్రమశిక్షణా చర్యలు తీసుకుని పరిస్థితిని చక్కదిద్దే అవకాశం విశ్వవిద్యాలయ అధికారవర్గానికే ఇవ్వాలి. విశ్వవిద్యాలయ ప్రాంగణంలోకి పోలీసులను పిలిచే ముందుకు చాలా జాగ్రత్త, విచక్షణ అవసరమవుతాయి. అన్నిటికన్న ఘోరం రాజద్రోహం వంటి నేరారోపణలు చేయడం.

**ఏం చేయాలి?**

జె.ఎన్.యు ను మూసివేయమనీ, ప్రక్షాళన చేయమనీ గగ్గోలుకు నాయత్వం వహిస్తున్నవారికి తాము అడుగుతున్నదానికి అర్థం ఏమిటో తెలిసినట్టు లేదు. మూక మనస్తత్వం వెంట తోకపట్టుకుపోయే ప్రమాదకర ధోరణిని ప్రదర్శిస్తున్నారు.

మనకు మనం ఒక విషయం గుర్తుచేసుకోవడానికి ఇది తగిన సందర్భం అనుకుంటాను. జవహర్‌లాల్ నెహ్రూ విశ్వవిద్యాలయం అంతర్జాతీయంగానే అత్యంత గౌరవప్రతిష్టలు సంపాదించుకున్న విశ్వవిద్యాలయం మాత్రమే కాదు. అది దేశంలో నేషనల్ డిఫెన్స్ అకాడమీ, నేషనల్ డిఫెన్స్ కాలేజ్, నావల్ అకాడమీ వగైరా సైనిక విద్యాసంస్థలు నిర్వహించే కోర్సులను ఆమోదించిన అతి కొద్ది విశ్వవిద్యాలయాలలో ఒకటి. ఈ సైనిక విద్యా శిక్షణా సంస్థలకూ ఆ విశ్వవిద్యాలయ శాఖలకు మధ్య సంబంధాలు చాలా జాగ్రత్తగా సంవత్సరాల తరబడి పెంపొందాయి. ఆ విశ్వవిద్యాలయంతో సంబంధాల వల్ల మన సైనికాధికారులెందరో ఎంతగానో ప్రయోజనం పొందారు. అందువల్లనే వారు తమ వ్యూహాత్మక ఆలోచనాసరళిలో ఇతరుల కంటె మెరుగైన స్థానంలో ఉన్నారు. ఎంతోమంది సైనికాధికారులు జె.ఎన్.యులో విద్యాసంబంధమైన కోర్సులలో శిక్షణ పొందారు. చాలామంది సైనికాధికారులు జె.ఎన్.యు మాజీ విద్యార్థులు. అలాగే పౌర అధికారులలో, పోలీసు అధికారులలో కూడా జె.ఎన్.యు విద్యార్థులు ఎందరో ఉన్నారు. నేనిది ఉద్దేశపూర్వకంగానే రాస్తున్నాను. ఎందుకంటే ఆ విశ్వవిద్యాలయ డిగ్రీలను, అవార్డులను వెనక్కి ఇచ్చే తొందరపాటు చర్యకూ, ఆ విశ్వవిద్యాలయాన్ని కించపరిచే చర్యలకూ పర్యవసానాలేమిటో నా సోదర సోదరీమణులైన మాజీ సైనికోద్యోగులు జాగ్రత్తగా ఆలోచించవలసి ఉంది.

నేనీ రచన ఎందుకు చేయవలసి వస్తున్నదో వివరంగానే రాశాను. నావంటి వృద్ధులైన సామాజిక వ్యక్తులు, ఇతరులు ఇవాళ మాట్లాడవలసి ఉంది. హెచ్చరికలు చేయవలసి ఉంది. సమయం మించిపోతే మళ్లీ రాదు. మంచి మనుషులు మౌనంగా ఉండిపోవడం వల్లనే నిరంకుశ పాలనలు అధికారం చలాయించాయని ఇటీవలి చరిత్ర చూపుతున్నది. అన్నిటికన్న ముఖ్యంగామనం మన ప్రజాస్వామిక స్థలాలను, స్వేచ్ఛను కాపాడుకోవలసి ఉంది. ప్రశ్నించడానికీ, అసమ్మతి తెలపడానికీ, చర్చించడానికీ ఉన్న హక్కును కాపాడుకోవలసి ఉంది. మరీ ముఖ్యంగా ఉన్నత విద్యాసంస్థలలో ఆ హక్కును కాపాడుకోవలసి ఉంది. బహిరంగంగా మాట్లాడడానికి భయపడని ఆలోచనాపరులను, నిపుణులను తయారు చేయడంలో జవహర్ లాల్ నెహ్రూ విశ్వవిద్యాలయం ఇన్నాళ్లుగా అగ్రభాగాన నిలిచింది. నిజం చెప్పాలంటే, విద్యార్థి సంఘ నాయకుడు కన్హయ్య ఉపన్యాసాన్ని జాగ్రత్తగా విన్న తర్వాత ఈ దేశానికి భవిష్యత్తు ఉన్నదని నాకు భరోసా కలిగింది. ఈ సంక్లిష్టమైన, అసమానతలు నిండిన దేశంలో ఈ దేశం ఎదుర్కొంటున్న సవాళ్ల గురించీ ప్రమాదాల గురించీ ఇరవయో పడిలో ఉన్న ఆ యువకుడు అంత సహానుభూతితో, మేధో పరిజ్ఞానంతో, హృదయానుభూతులతో మాట్లాడడం నిజంగా ప్రశంసనీయమైన విషయం.

జాతీయ పతాకానికి నేను ఇప్పటికీ గౌరవంతో, ప్రపత్తితో వందనాలు అర్పిస్తాను. కాని జెండా వందనం కన్న ముఖ్యమైనది ఒక రోహిత్ వేముల, ఒక కన్హయ్య కుమార్, ఒక షెహ్లారషీద్, చెప్పాలంటే ఒక ఉమర్ ఖాలిద్ వంటి యువ ఆదర్శవాదులు, వారితోపాటు దేశవ్యాప్తంగా పేరు రాకుండా, నలుగురికి తెలియకుండా ఉండిపోయిన అనేక మంది యువతీయువకులు వ్యక్తం చేస్తున్న ఆలోచనలే జాతీయవాదపు, దేశభక్తివాదపు నిజమైన స్ఫూర్తిని మూర్తీభవింపజేస్తాయి. రోహిత్ వేముల లాగ తీవ్రమైన అడుగు వేసే వైపు ఈ యువకులను నెట్టకుండా మనం ఉమ్మడిగా వారిని రక్షించవలసి ఉంది. అంతేకాదు, ఇవాళ నిర్బంధంలో ఉన్నవారికీ, ప్రాణాలకు ప్రమాదం జరుగుతుందనే అనుమానంతో అజ్ఞాతంలోకి వెళ్లిన వారికీ న్యాయం దక్కుతుందని హామీ ఇవ్వవలసి ఉంది. న్యాయం దక్కేలా చూడవలసి ఉంది.

అంతిమ పరిశీలనలో జాతీయ భద్రతకు అత్యుత్తమమైన హామీ ఇచ్చేది మనుషుల భద్రతే.

*(మూలం – http://www.indiaresists.com)*

*(రచయిత భారత నావికాదళ ప్రధానాధికారిగా పదవీ విరమణ చేశారు. 83 సంవత్సరాల వయసులో మహారాష్ట్రలో రైతుగా జీవితం గడుపుతూ ప్రజాసమస్యలపై నిశితంగా స్పందిస్తున్నారు, ఉద్యమాలలో పాల్గొంటున్నారు.)* వీ

# వాళ్లు మనల్ని జాతి వ్యతిరేకులంటున్నారు!

*ప్రస్తుతం చెలరేగుతున్న జాతి వ్యతిరేకత చర్చ నేపథ్యంలో సంఘ్ పరివార్ శక్తుల జాతి వ్యతిరేక చర్యలను వివరిస్తున్నారు*

**ఆనంద్ పట్వర్ధన్**

వాళ్ల పూర్వీకులు, అతి సంకుచిత బ్రాహ్మణ కులాల నుండి వచ్చారు. వాళ్లకి అధికారాన్ని, ఆధిపత్యాన్ని కలిగించిన సంస్కృతి పట్ల వాళ్లకు అపారమైన నమ్మకం.

వాళ్లు జాతీయ స్రవంతికి చెందిన లౌకిక జాతీయోద్యమాన్ని వ్యతిరేకించి, 20వ శతాబ్దపు ప్రారంభం నుండి మత ప్రాతిపదిక మీద ప్రజల్ని సమీకరించడం మొదలు పెట్టారు. వాళ్లు హిట్లర్‌ను బహిరంగంగానే పొగిడారు. మైనార్టీల పట్ల నాజీల వైఖరిని అనుసరిస్తే, భారతదేశానికి 'లాభ' మని అన్నారు.

వాళ్లు ముగ్గుర్ని – 1) మహమ్మదీయులు, 2) క్రైస్తవులు, 3) కమ్యూనిస్టులు – తమ ప్రధాన శత్రువులుగా ప్రకటించుకున్నారు.

హిందువులకూ, మహమ్మదీయులకు మధ్య రాజీ కుదరదని వాదించారు. వాళ్ల ప్రతిపక్షమైన ముస్లిం లీగ్‌లాగనే వాళ్లు ద్విజాతి సిద్ధాంతాన్ని ప్రచారం చేశారు.

1942 క్విట్ ఇండియా ఉద్యమం సందర్భంతో సహా, ముస్లిం లీగ్‌లాగానే, వాళ్లు కూడా బ్రిటిష్ పాలనను సమర్థించారు.

ముస్లిం లీగ్‌తో పాటు, వాళ్లు కూడా దేశ విభజన కాలంలో కనీవినీ ఎరుగని రక్తపాతాన్ని రేకెత్తించారు.

1947లో స్వాతంత్ర్యపు తొలి వేకువన వాళ్లు జాతీయ జెండాను నిరాకరించి, తమ కాషాయ జెండాను ఎగురవేశారు.

1948లో మహాత్మాగాంధీని హత్య చేసి మిఠాయిలను పంచుకున్నారు.

మనుస్మృతికి ప్రాధాన్యతనిస్తూ, వాళ్లు 1950లో భారత రాజ్యాంగానికి వ్యతిరేకంగా తీవ్ర నిరసనను వ్యక్తం చేశారు.

హిందూ పురుషులతో సమానంగా, హిందూ స్త్రీలకు సమాన హక్కులకు అవకాశమిస్తూ, న్యాయ శాఖా మంత్రి డా. అంబేద్కర్ ప్రతి పాదించిన హిందూ కోడ్ బిల్లును 1951లో వాళ్లు వ్యతిరేకించారు. విసుగు చెందిన అంబేద్కర్ రాజీనామా చేశారు. ఆయన తన లక్ష్యంగా ప్రకటించిన ఉమ్మడి పౌరస్మృతి ఇప్పటికీ రూపం దాల్చలేదు.

కుల తత్వంతో కూడిన హిందూ మతాన్ని వదిలి, కుల రహితమైన బౌద్ధంలోకి 1956లో ప్రవేశించిన అంబేద్కర్‌తో సహా వాళ్లు అందర్నీ వ్యతిరేకించారు. దళితుల పట్ల నీచమైన అకృత్యాలను కొనసాగిస్తూ కుల వ్యవస్థను ప్రతిపాదించిన 'పవిత్ర గ్రంథాలను' ప్రశ్నించేవాళ్లందర్నీ వాళ్లు వ్యతిరేకిస్తున్నారు. ఈ భూమ్మీద అన్ని మతాల కంటే అత్యంత సహనశీలమైన మతం తమదేనని, ప్రపంచం చేత నమ్మింప జూస్తున్నారు.

వాళ్లు కశ్మీర్‌లో కశ్మీర్‌కు స్వతంత్ర ప్రతిపత్తినిచ్చిన ఆర్టికల్ 370ను తీవ్రంగా వ్యతిరేకిస్తూ, అక్కడ మిలిటెన్సీ రేకెత్తడానికి ప్రధాన కారకులయ్యారు

వాళ్లు ఎన్నికల్లో లబ్ధికోసం 1987లో రాజస్థాన్‌లో 'సతిని' శ్లాఘించారు

దళితులకూ, ఒబిసిలకూ రిజర్వేషన్లు ఇవ్వడాన్ని వాళ్లు వ్యతిరేకించారు. ఇది తమకు ఎన్నికల్లో నష్టాన్ని కలిగిస్తుందని గుర్తించాకనే కొంత గుర్తించారు.

వాళ్లు 1992లో బాబ్రీ సమీదును కూల్చివేసి, హిందువులకు, ముస్లింలకు మధ్య ఉన్న కొద్దిపాటి ఐకమత్యాన్ని కూడా నాశనం చేశారు.

ఆదివాసుల విద్య, వైద్య అవసరాల కోసం పనిచేస్తున్న క్రైస్తవులను లక్ష్యం చేసుకుని హత్య చేశారు.

1998లో వాళ్లు ఆటంబాంబు తయారీని ప్రోత్సహించి, దానికొక గుడి కూడా కట్టాలనుకున్నారు. పాకిస్తాన్‌తో అణ్వాయుధాల పోటీని ప్రారంభించి ఉపఖండాన్ని అణ్వాయుధ సుడిగుండం దరిదాపులకు నెట్టారు.

స్వాతంత్రానంతరం దేశంలో అంతులేని మత కలహాలను సృష్టించి, వాళ్లు 2002లో గుజరాత్‌లో ముస్లింలకు వ్యతిరేకంగా దారుణ మారణకాండను ప్రారంభించారు. వాళ్ల ఎన్నికల అవసరాలకు అనుగుణంగా ముజఫర్‌నగర్ తదితర అనేక ప్రాంతాలలో మత కలహాలకు కారకులయ్యారు.

గోవా, ఠానే, మాలెగావ్, సంఝౌతా ఎక్స్‌ప్రెస్, మక్కా మసీద్ వంటి అనేక ప్రాంతాలలో వాళ్లు టెర్రరిస్టు దాడులు, బాంబు విస్ఫోటనాలకు పాల్పడి నేరాన్ని ముస్లింలపైకి నెట్టివేయడానికి ప్రయత్నించారు. హేమంత్ కర్కారే అనే ధైర్యవంతుడైన పోలీస్ అధికారి వాళ్ల కుటిలత్వాన్ని బహిర్గతం గావించే వరకు వాళ్ల కుటిలత్వం కొనసాగింది.

2013 నుండి వాళ్లు ముగ్గురు ప్రసిద్ధులైన హేతువాదులను, అనేక మంది అనామకులను హత్య చేశారు.

ప్రస్తుతం బీఫ్‌పై నిషేధం, లవ్ జిహాద్‌ల పేరిట దేశ వ్యాప్తంగా మైనారిటీలపై దాడులు చేయడం కోసం వాళ్లు పుట్టగొడుగుల్లా పుట్టకొస్తున్న వాళ్ల అనుబంధ సంఘాలు కొన్ని రహస్య బృందాలకు ఆయుధ శిక్షణనిస్తున్నాయి.

దేశ వ్యాప్తంగా విద్యాలయాలలో వేగంగా పెరుగుతున్న వాళ్ల యువజన సంఘాలు – లౌకిక, ప్రజాస్వామిక, గాంధేయ, వామపక్ష, దళిత విద్యార్థి సంఘాలను వ్యతిరేకిస్తూ, భయోత్పాతాన్ని కలిగిస్తున్నారు. వాళ్ల ఆధిపత్యాన్ని ప్రశ్నించే వ్యక్తుల్ని, సంస్థల్ని అపఖ్యాతి పాల్జేయడం, హింసాత్మకంగా వ్యతిరేకించడం చేస్తున్నారు. బి.హెచ్.యు.లో ప్రొ. సందీప్ పాండే నుండి, కబీర్ కళామంచ్‌కు చెందిన సీతల్‌సాథే వరకు పూనాలోని ఎఫ్‌టిఐఐ విద్యార్థుల నుండి, హైదరాబాద్‌లో అంబేద్కర్ స్టూడెంట్స్ అసోసియేషన్ వరకు వాళ్లు ఈ వైఖరే అనుసరించారు.

ప్రస్తుతం వాళ్లది మధ్యయుగాల సాంస్కృతిక మనస్తత్వం, విదేశీ బహుళజాతి సంస్థలకు, సార్వభౌమత్వాన్ని, సహజ వనరులను అప్పజెప్పే స్వేచ్ఛా మార్కెట్ ఆర్థిక నమూనా కలగలిసిన భావజాలం.

ఇలాంటి 'వాళ్లు' తమ నూతన బాధితుడైన వేల సంవత్సరాలుగా తమ అణచివేతకు గురైన వర్గానికి చెందిన రోహిత్ వేములను 'జాతి వ్యతిరేకి' అంటున్నారు.

(అనువాదం : సిఎస్ఆర్ ప్రసాద్)

వీ

# కవిత్వ పఠనమే రాజద్రోహమైన చోట

***ఢిల్లీ జవహర్‌లాల్ నెహ్రూ విశ్వవిద్యాలయంలో జరిగిన ఒక కవిత్వ పఠన సమావేశాన్ని రాజద్రోహకరమైనదిగా చిత్రిస్తూ సంఘ్ పరివార్ శక్తులు సాగిస్తున్న ప్రచార నేపథ్యంలో భారత ప్రజలకు వాస్తవాలను వివరిస్తున్నారు* తహీబా ఉల్ఫత్**

ప్రియమైన భారత ప్రజలారా,

ఒక ప్రజా సమూహం అనుభవిస్తున్న వేదనతో, ఆందోళనతో సహానుభూతి చెందుతూ సత్యం గ్రహించడానికి ప్రయత్నిస్తే, ఆ సత్యాన్ని చెప్పడానికి ప్రయత్నిస్తే దాన్ని దేశద్రోహంగా, తీవ్రవాదంగా ముద్ర వేయవచ్చునని మీరు భావిస్తే మీ ఆలోచనా పద్ధతిలోనే సమస్య ఉందన్నమాట. మీరు అలా ఆలోచిస్తున్నట్టయితే అసలు మీకు మాట్లాడే అర్హతే లేదని నేననుకుంటాను. నేను నిజంగానే చెపుతున్నాను. ఎవరైనా ఒకరు భారత పతాకాన్ని పట్టుకుని, దాన్ని గాలిలో ఎగరేస్తూ, సైన్యపు త్యాగనిరతిని పొగుడుతూ (ఏరోజుకారోజు తమ శ్రమను అమ్ముకుంటూ, ఆ రోజు బతకడానికి కూడ తగినంత వేతనాలు దొరకని సంఘటిత, అసంఘటిత రంగ కార్మికుల త్యాగాన్ని ఏమనాలి మరి?) ఉన్నంతమాత్రాన వారికి దేన్నయినా అవమానించడానికీ, పాత్రికేయులనూ, న్యాయవాదులనూ కొట్టడానికీ, పురుషాహంకార తిట్లు గుప్పించడానికీ, ఎవరినైనా సరే దేశద్రోహిగా చిత్రించడానికీ అధికారం వస్తుందని మీరు అనుకుంటే, మీలో ఉన్నది రాజ్యాంగ వ్యతిరేక స్ఫూర్తి. అది మన ప్రజాస్వామ్య వ్యవస్థ మౌలిక విలువలనే ధ్వంసం చేసే అవగాహన. ఈ మాట చెప్పక తప్పదు, క్షమించాలి.

సహదేశవాసుల బాధలనూ, వేదనలనూ అర్థం చేసుకోలేని జాతీయవాదం ఎటువంటి జాతీయవాదమో నాకు అర్థం కావడం లేదు. జాతీయవాదిగా ఉండడమంటే మీరు ఏ అర్థం చెపుతున్నారో నాకు తెలియడం లేదు. ఈ దేశంలోని ప్రతి ఒక్క ముస్లింనూ దేశద్రోహిగా, పరాయిగా చిత్రించి వారిని పాకిస్తాన్ కో, సిరియాకో, మరో ఇతర ముస్లిం దేశానికో పంపించాలనడమే జాతీయవాదమా? ప్రజల ప్రమేయం లేకుండా భూభాగాలు నావా నీవా అని కొట్లాడుకోవడం జాతీయవాదమా? బాబ్రీ మసీదు వంటి పురాతన కట్టడాన్ని కూలగొట్టడం జాతీయవాదమా? కశ్మీర్ లో, మణిపూర్ లో సాయుధ దళాల ప్రత్యేక అధికారాల చట్టాన్ని అమలు చేయడం జాతీయవాదమా? యువతులను వేధించడమూ, పరువు హత్యల పేరిట ప్రాణాలు తీయడమూ జాతీయవాదమా? కుల వ్యవస్థ విధినిషేధాలను పాటించనందుకు ఒక దళిత కుటుంబాన్ని మొత్తం తగులబెట్టి చంపడం, ఆ కుటుంబ స్త్రీలపై అత్యాచారం చేయడం జాతీయవాదమా? మనచుట్టూ పేట్రేగిపోతున్న హిందుత్వ మతఛాందసవాదాన్ని ప్రశ్నించకుండా ఉండడం జాతీయవాదమా? గోమాంస రాజకీయాల సాకుతో మరింతమంది అఖ్లాక్ లను చంపడం జాతీయవాదమా? సామ్రాజ్యవాద భావజాలాన్ని సమర్థించడం జాతీయవాదమా? దురాక్రమణలను సమర్థించుకోవడం జాతీయవాదమా? 2002లో గోధ్రాలో ఒక నిర్దిష్ట మత అస్తిత్వం ఉన్నవాళ్లను ఎంచుకుని ఉద్దేశపూర్వక ప్రణాళిక ప్రకారం వేలాది మందిని ఊచకోత కోయడం జాతీయవాదమా?

భారత భూభాగంలోని అన్ని రాష్ట్రాల్లో, అన్ని ప్రాంతాల్లో ఉన్న ప్రజలందరూ మీకు తెలుసా? వారందరినీ మీ సహ భారతీయ పౌరులుగా మీరు గుర్తిస్తారా? భారత ఉపఖండంలో నివసిస్తున్న ప్రతి వ్యక్తినీ మీరు మీతో సమానమైన మనిషిగా భావిస్తారా? వాళ్ల బాధలతో మమేకమవుతారా? మణిపూర్ లో, కశ్మీర్ లో భారత సైన్యం చేతుల్లో అత్యాచారాలకు గురవుతున్న మహిళల తరఫున మీరు గొంతెత్తుతారా? ఈ దేశ కార్మికుల తరఫున, వారు నిత్య జీవితంలో అనుభవిస్తున్న అమానవీయ పరిస్థితుల గురించి మీరు మాట్లాడుతారా? తమ జీవనాధారాన్నీ, భూమినీ కోల్పోతున్న ఆదివాసుల తరఫున మీరు మాట్లాడుతారా? ఈ దేశంలో వస్త్రధారణ పద్ధతులు, ఆహారపుటలవాట్లు, ఆరాధనా పద్ధతులు విభిన్నంగా ఉన్నాయని గుర్తించి గౌరవించడానికి మీరు సిద్ధంగా ఉన్నారా? మత, కుల, లింగ అవరోధాలను అధిగమించి మీ కొడుకులకూ, కూతుళ్లకూ, స్నేహితులకూ వారు ఇష్టపడిన, కోరుకున్న వ్యక్తితో వివాహం జరిపించడానికి మీరు సిద్ధంగా ఉన్నారా? ఎవరైనా తన ఇష్టప్రకారం ఏ కులాన్నయినా, మతాన్నయినా తోసివేయవచ్చుననీ, ఇతరుల జీవితాలలోకి జొరబడకుండా తన ఇష్టప్రకారం జీవితాన్ని కొనసాగించవచ్చుననీ అంగీకరించడానికి మీరు సిద్ధంగా ఉన్నారా?

మానవ సంఘీభావం పునాదిగా సహపౌరులతో సమ్మతి సాధించడానికి మీరు సిద్ధంగా ఉన్నారా? వ్యక్తులు వారి ఇష్టం వచ్చిన ఆహారం, అది గోమాంసం అయినా సరే, పంది మాంసం అయినా సరే, తినవచ్చునని ఒప్పుకోవడానికి మీరు సిద్ధంగా ఉన్నారా? ఒక స్త్రీ ఇష్టప్రకారం ఏ సమయంలోనైనా, రాత్రయినా పగలయినా తన ఇష్టం వచ్చిన వారితో కలిసి నడిస్తే అంగీకరించడానికి మీరు సిద్ధంగా ఉన్నారా? ఎవరైనా తన ఇష్టం వచ్చిన పని ఎంచుకోవచ్చుననీ, తన ఇష్టం వచ్చిన పాట పాడవచ్చుననీ, తన ఇష్టం వచ్చిన చిత్రం చిత్రించవచ్చుననీ అంగీకరించడానికి మీరు సిద్ధంగా ఉన్నారా? కొందరు ఉన్నతులనీ, కొందరు కింది స్థాయివాళ్లనీ అంతరాలు సృష్టించే మడి, వెలి భావాలను తిరస్కరించడానికి మీరు సిద్ధంగా ఉన్నారా?

దేశం అనే మీ భావన కేవలం సరిహద్దులకూ, సరిహద్దుల లోపలి భూభాగానికీ మాత్రమే సంబంధించినది అయితే, మీ ఆగ్రహానికి అర్థం లేదు. నేను ఆ జాతీయవాద భావనను అంగీకరించలేను. అది ప్రజలతో సంబంధంలేని ఆస్తి సంబంధమైన స్వార్థపర భావన మాత్రమే. ఒక జాతి భావన ఆ భూభాగంలోని ప్రజలను గౌరవించినప్పుడే, సమానంగా పరిగణించినప్పుడే బలమైనదవుతుంది. కాని ఇవాళ ప్రజలను గౌరవించాలని అనడమంటే జాతి భావనను ప్రశ్నించడమేనని ఆరోపిస్తున్నారు. ఉదాహరణకు జవహర్ లాల్ నెహ్రూ విశ్వవిద్యాలయం దానికదే ఒక జాతికి సంక్షిప్త రూపం. అక్కడ ఆ విశ్వవిద్యాలయ భావన చాల బలంగా ఉంది. అక్కడి విద్యార్థులను లక్ష్యంగా చేసుకుని దాడి జరుగుతున్నప్పుడు ఆ విద్యార్థులు ఐక్యంగా ఒక సముద్రంలా ఉవ్వెత్తున వీథుల్లోకి వస్తున్నారు. ఎవరి మీదా హింస జరపడానికి కాదు, కేవలం

తమ నిరసన తెలపడానికి.

ఎవరైనా ఊరికే సరదాగా అల్లర్లు సృష్టిస్తారనీ, స్వాతంత్ర్యం కావాలని నినదిస్తారనీ మీరు అనుకుంటున్నారా? ఆ నినాదాలు ఇవ్వడానికి ఒక పునాది ఉంది. ఒక తార్కిక కారణం ఉంది. భారత్ మాతాకీ జై అని నినాదాలు ఇవ్వడమూ, ఎవరో ఒకరిని చితకబాదడమూ, చంపివేయడమూ గురించి కాదు నేను మాట్లాడుతున్నది. భారత్ మాతాకీ జై అని బాబ్రీ మసీదును కూల గొట్టడం గురించి కాదు. భారత్ మాతాకీ జై అని స్త్రీలను లంజెలని తిట్టడం గురించి కాదు, వారిపై అత్యాచారాలు చేస్తామని బెదిరించడం గురించి కాదు. భారత్ మాతాకీ జై అంటూ దళితులను కుక్కలు అనడం గురించి కాదు. మీరు ఒక్కసారి మీలో లోపలికి అంతరంగంలోకి వెళ్లి, మీ అస్తిత్వాలన్నిటినీ పక్కనపెట్టి, లింగం, కులం, జాతి, పితృస్వామ్యాల పునాదిగా కాక మానవప్రాణిగా ఆలోచించగలరా? మీరది చేయగలిగినప్పుడు మాత్రమే మీకు మీ ఆగ్రహాన్ని ప్రకటించడానికీ, మీ నిరసనను ప్రదర్శించడానికీ అధికారం ఉంటుంది.

ఫిబ్రవరి 9న జవహర్‌లాల్ నెహ్రూ విశ్వవిద్యాలయంలో ఏం జరిగింది? ఆ రాత్రి అక్కడ జరిగిందని ప్రచార సాధనాలు ఊదరగొట్టి కుఖ్యాతి అందించిన 'దేశద్రోహకర సంఘటన' వాస్తవానికి ప్రజాస్వామిక మూలసూత్రాల వ్యక్తీకరణ స్ఫూర్తితో జరిగినది. కశ్మీర్ లో నివసిస్తున్న ప్రజల బాధలకు సంఘీభావాన్ని వ్యక్తం చేయడానికి ఏర్పాటయిన సమావేశం అది. ఒక మనిషిని మరొక మనిషితో అనుసంధానం చేయడానికి జరిగిన సమావేశం అది. హృదయాన్ని కదిలించే స్థాయి సమావేశం అది. సరిహద్దులను చెరిపివేసే సమావేశం అది. మన అంతరాత్మను ప్రశ్నించే సమావేశం అది. కాని ఆ సమావేశాన్ని రాజద్రోహకరంగా చిత్రిస్తున్నారు. భారత రాజ్యానికీ, జాతీయవాదానికీ వ్యతిరేకంగా జరిగిన కుట్రగా అభివర్ణిస్తున్నారు. ఆ సమావేశం ఏర్పాటు చేసినవారిని దేశద్రోహులుగా, వారిలో కొందరిని మూలకారకులైన కుట్రదారులుగా చూపుతున్నారు. ఉమర్ ఖాలిద్ అనే ముస్లిం పేరు ఉండడం లక్ష్యమై పోయింది. ఆయనను ఆ ఘటనకు రూపకల్పన చేసిన మహాకుట్రదారుగా, తీవ్రవాదులతో సంబంధాలున్న వ్యక్తిగా చెప్పడానికి ప్రచారసాధనాలు ఉవ్విళ్లూరాయి. వాస్తవానికి ఉమర్ జవహర్ లాల్ నెహ్రూ విశ్వవిద్యాలయ ప్రాంగణంలో 'బహిరంగ స్థలం'లో 'బహిరంగ, ప్రజాస్వామిక' సమావేశాలు ఏర్పాటు చేసే ప్రజాస్వామిక సంప్రదాయంలో భాగంగానే ఈ సమావేశం ఏర్పాటు చేశాడు. అందుకోసం విశ్వవిద్యాలయ అధికారుల నుంచి అనుమతి కోరాడు. ఫేస్ బుక్ మీద ఈ సమావేశానికి ప్రచారం ఇచ్చాడు. తన పేరు, ఇతర మిత్రుల పేర్లు ప్రకటించిన సమావేశపు పోస్టర్లను అంతటా బహిరంగంగా ఉంచాడు.

ఇంత ప్రజాస్వామికంగా, బహిరంగంగా జరిగిన కుట్ర గురించి ప్రపంచంలో ఎప్పుడన్నా విన్నారా, చూశారా? విశ్వవిద్యాలయంలోనైనా, బైటనైనా ఎక్కడైనా ఎప్పుడైనా ఏదైనా ఒక కార్యక్రమాన్ని ఎవరో ఒకరు నిర్వహిస్తారనే సంప్రదాయం ప్రకారమే వాళ్లు ఆ కార్యక్రమాన్ని నిర్వహించారు. కాని ఆ కార్యక్రమం నిర్వహించినందుకు వాళ్లను కుహనా జాతీయవాదులు లక్ష్యంగా చేసుకున్నారు. ఈ కుహనా జాతీయవాదులు వాస్తవానికి ప్రజాస్వామ్య వ్యతిరేకులు. రాజ్యాంగ వ్యతిరేకులు. వాళ్లు 'చిత్తు పడితే నాది గెలుపు, బొత్తు పడితే నీది ఓటమి' అనే రకం. వాళ్లు దేశద్రోహి అనే ముద్ర వేస్తారు. తర్వాత కన్హయ్యనూ, ఉమర్ ఖాలిద్‌నూ, ఇతర కామ్రేడ్స్ నూ విచారణ లేకుండానే చిత్రవధ చేయమని ప్రేరేపిస్తారు. కన్హయ్య మీద న్యాయస్థానం జరుపుతున్న విచారణను అడ్డుకుంటారు. అక్కడ జర్నలిస్టులనూ, న్యాయవాదులనూ కొడతారు. వాళ్లకు పోలీసుల రక్షణ ఉంటుంది. కేంద్ర ప్రభుత్వ రక్షణ ఉంటుంది. కేంద్ర మంత్రుల రక్షణ ఉంటుంది. కొన్ని ప్రచార సాధనాలు చిలకపలుకుల్లో వాళ్లను ప్రశంసిస్తాయి.

ఒక పీడిత అస్తిత్వంగా ముస్లింలు ఎప్పుడూ ఇటువంటి బలహీనమైన స్థానంలోనే ఉంటున్నారు. ముస్లింల మీద ఎక్కుపెట్టడం, వాళ్ల మీద ముద్రలు కొట్టడం చాల సులభం. ఈ దేశంలో ప్రజల చైతన్యంలో స్థూలంగా భాగమైన విషయం అది. ఇప్పటికే విభిన్న భావజాలాల వల్ల విడిపోయి, ఒకరికొకరు దూరమై ఉన్న ప్రజల్లోని ఈ చైతన్యాన్ని సంతృప్తి పరచడానికి వారి సొంత శత్రువులు ఉండనే ఉంటారు. అసలు ఆ సమావేశ నిర్వాహకుల మీద మాత్రమే కాదు, విశ్వవిద్యాలయ విద్యార్థి సంఘ అధ్యక్షుడి మీద, మొత్తంగా విశ్వవిద్యాలయం మీదనే దేశద్రోహులనే ముద్ర వేసి, ప్రచార సాధనాలలోనే విచారణ జరుపుతూ, గూండాల, ముష్కరుల కండబలానికి దారులు వేస్తున్నప్పుడు మనకిక ఒక రాజ్యాంగం, దాని మౌలికాంశాలను పరిరక్షించే విభిన్న వ్యవస్థలు అవసరం ఉంటాయా? ఈ మూకుమ్మడి దాడి ఇంకా సాగుతూనే ఉంది. ఇప్పటికే భారత్ మాతాకీ జై అని అరుస్తున్న రక్తపిపాసుల గుంపు ఇష్టారాజ్యంగా హింస కొనసాగించడానికి సిద్ధంగా ఉంది.

ఇంత చట్టవ్యతిరేక ప్రవర్తనకు అర్థమేమిటి? నిందితులను న్యాయస్థానంలో హాజరు పరచకముందే ఈ ప్రచారసాధనాల విచారణలేమిటి? తీర్పులు ప్రకటించడానికి ఇంత హడావుడి ఎందుకు? గూండాలనూ, దుర్మార్గులనూ కిరాయికి తెచ్చి ఇప్పటికిప్పుడు శిక్షలు అమలు చేయాలనే తొందరపాటు ఎందుకు? అధికారంలో ఉన్నవారి కారణాలూ కార్యక్రమాలూ ఏమిటి? ఏది ఏమైనా వారి కార్యక్రమం ప్రజాస్వామికం కాదనీ, రాజ్యాంగ స్ఫూర్తికి అనుగుణమైనది కాదనీ సుస్పష్టంగా చెప్పవలసి ఉంది.

ఇవాళ ఈ భావనను, ఒక ప్రజాస్వామిక సమావేశం నిర్వహించడానికి హక్కు ఉందనే భావనను మనం పరిరక్షించుకోవలసి ఉంది. మనం మన భావప్రకటనా స్వేచ్ఛను పరిరక్షించుకోవలసి ఉంది. మన జాతిలో, మన దేశంలో పీడనకూ వేదనకూ గురవుతున్నవారి బాధలనూ వేదనలనూ వ్యక్తం చేసే నినాదాలను మనం పరిరక్షించుకోవలసి ఉంది. మనం మన సంఘీభావ కార్యక్రమాలను పరిరక్షించుకోవలసి ఉంది. ఈ భావనలో ఏ మాత్రం రాజీ గాని, ఏ మాత్రం సడలింపు గాని మనను దుర్మార్గులుగా మారుస్తుంది.

తా. క. ఉమర్ ఖాలిద్ లాగనే నాకు కూడ ముస్లిం పేరు ఉంది. కాని దానితో నన్ను నిర్ణయించకండి. మేం మనుషులం. ఏ మతం లేని వాళ్లం. ఉమర్ ఒకసారి నాతో అన్నమాట మీకు చెప్పదలిచాను: "బాధ్యతాయుత స్థానాల్లో ఉన్నవాళ్లు మనకు వ్యతిరేకంగా ఏమైనా మాట్లాడవచ్చు. ఒక అభిప్రాయం ఏర్పరచుకునే ముందు అవతలి పక్షం ఏమంటున్నదో కూడ ఒకసారి వినమని మాత్రమే నా విన్నపం." ఒకవేళ ఉమర్ ఖాలిద్ కో, కన్హయ్యకో, ఇతర విద్యార్థులకో ఏమైనా జరిగితే, చరిత్ర మిమ్మల్ని క్షమించదు. మా విద్యార్థులం మిమ్మల్ని వదిలిపెట్టం. ఒక రోహిత్ ఇప్పటికే హత్యకు గురయ్యాడు. ఇప్పుడు ఇతర రోహిత్ లు హత్యకు గురి కాకముందే వాళ్లను రక్షించండి. వాళ్లకు మద్దతు ఇవ్వండి. భారతదేశానికి 'భిన్నాభిప్రాయానికి తావు లేని దేశం" అనే పేరు రానివ్వకండి.

*మూలం – http://www.indiaresists.com*

*(రచయిత డిల్లీ విశ్వవిద్యాలయంలో అర్థశాస్త్ర పరిశోధక విద్యార్థి)* వీ

# రోహిత్ కుటుంబానికి, స్నేహితులకు లేఖ

*బొంబాయి ఐఐటిలో ఆత్మహత్య చేసుకున్న అనికేత్ తల్లి సునీత అంభోర్ రోహిత్ కుటుంబాన్ని, స్నేహితులను ఉద్దేశించి రాసిన లేఖ* **సునీత అంభోర్**

రోహిత్ వేముల చివరి ఉత్తరాన్ని చదివినప్పటి నుండి నాకు ఊపిరి ఆడడం లేదు. అసహనంగా ఉన్నది. శిక్ష పేరిట ఏడు నెలలుగా ఆయనకు రావలసిన ఉపకార వేతనం అందుకోలేని పరిశోధక విద్యార్థి అతడు. అతన్ని హాస్టల్ నుండి గెంటి వేశారు. అతడి మానసిక స్థైర్యాన్ని పూర్తిగా నాశనం చేయడం కోసమే ఈ ప్రయత్నాలన్నీ! రోహిత్ తన ఉత్తరంలో ఎవరినీ నిందించలేదు గానీ, అది గుండెల్ని పిండి వేస్తుంది. రోహిత్, అనికేత్‌ల ఆలోచనల మధ్య ఉన్న పోలికలను నేను చూడగలుగుతున్నాను. ఆయన తల్లి, వాళ్లు ఎంతటి ఆవేదనను అనుభవించారో అర్థం చేసుకునే ప్రయత్నం చేస్తున్నా. అనికేత్ ఎలాంటి ఉత్తరం వదిలిపెట్టి వెళ్లలేదు. కాని, తన డైరీలో గేయాల రూపంలో రాసుకున్న వాక్యాల్ని చూస్తే వాళ్లిద్దరూ తమ జీవితాల చరమాంకంలో ఒకే రకమైన మానసిక స్థితిని కలిగి ఉన్నారని అర్థమవుతున్నది.

అనికేత్ కూడా సమానత్వం గురించి మాట్లాడేవాడు. ట్రాన్స్ జెండర్ల తన 'సాథీ'ల పట్ల హృదయ పూర్వకమైన సానుకూలతను కలిగి ఉండడమే కాకుండా, వాళ్ల పోరాటాలను సమర్థించాడు కూడా! తన తల్లి దండ్రులను చాలా పట్టించుకునేవాడు. కులం, రిజర్వేషన్లు, దైవం వంటి ప్రశ్నలకు సమాధానాలు వెదకడానికి ప్రయత్నిస్తుండేవాడు. ఐఐటి ప్రవేశ పరీక్షకు సిద్ధమవుతున్నప్పటి నుండే, అక్కడ తానెదుర్కోవలసిన వివక్షా పూరిత మనస్తత్వానికి వ్యతిరేకంగా పోరాడేవాడు.

శక్తివంతులైన శత్రువులతో పోరాటం చేసే క్రమంలో అలిసిపోయిన వ్యక్తులు ఒక రకమైన శూన్యానికి గురవుతారు. అలాంటిదే నా కొడుకు జీవితంలోనూ, రోహిత్ జీవితంలోనూ కనపడింది. తమ కలల్ని సాకారం చేసుకోవాలనుకునే వాళ్లను, అమితంగా ఆలోచించే వాళ్లను, సున్నిత మనస్కులను ఇది భయపెడుతుంది. ఇలాంటి వాళ్లు తమ స్వభావాన్ని బట్టి ఇతరులను నిందించలేరు. అయితే తమ ప్రయాణంలో ముందుకు వెళ్లలేని స్థితి వచ్చినప్పుడు వాళ్లకి అంతా శూన్యంగా తోస్తుంది. అనికేత్ అంతగా ఎందుకు ఆలోచించేవాడో మేమెప్పుడూ అతన్ని నవ్వుతూ, పాడుతూ, మిమిక్రీ చేస్తుండగా చూస్తుండేవాళ్లం. నా కొడుకు నవ్వడం కూడా మర్చిపోయేటట్లుగా ఐఐటిలో ఏముంది? అనికేత్ అయోమయంలో ఉన్నాడని, అతని మరణానంతరం డాక్టర్ మాతో అన్నాడు. అనికేత్‌కి మొదటి నుండీ సైన్స్, గణితం ఇష్టమైన అంశాలు. అలాంటప్పుడు అతను గందరగోళంగా ఎలా తయారవుతాడు?

ఐఐటిలో అనికేత్ శూన్యాన్ని, బయటకు కనపడని అవమానాన్ని అనుభవించే ఉంటాడు. ఇది నేరుగా కాకపోయినా పరోక్షంగానైనా జరిగింది. ప్రతిరోజూ చర్చల సందర్భంగా, కొన్ని సందర్భాల్లో సీనియర్ విద్యార్థులు, కొన్ని సందర్భాల్లో అధ్యాపకులు సలహాల పేర్లతో చేసిన వ్యాఖ్యల వల్ల అతడు అవమానాలు పొందాడు. ఇలాంటి అహంకార పూరితమైన ఆలోచనలు ఐఐటిలోనే కాదు, గొప్పగా చెప్పుకునే ఇతర ఉన్నత విద్యా సంస్థల్లోనూ ఉన్నాయి.

ఇలాంటి సంస్థల్లో, రిజర్వేషన్ల కారణంగా చేరిన విద్యార్థులతో స్నేహం చేసే కొందరు 'నీదీ, నాదీ ఒకే ఆర్థిక నేపథ్యం, అయినా నీకులం కారణంగా నువ్వు ప్రత్యేక సౌకర్యాలు పొందుతున్నావు. రిజర్వేషన్లు తప్పు వంటి మాటలంటుంటారు. అందుకే అనికేత్ కులం మూలాల గురించిన వెతుకులాటను ప్రారంభించాడు. వైదిక మతం దానికి సంబంధించిన జ్ఞానం అంతా నిజమని, శాస్త్రీయ రూపాల్లో విద్యార్థుల మనస్సుల్లోకి నిరంతరం ఎక్కించే ప్రయత్నాలు ఇప్పటికీ ఇలాంటి సంస్థల్లో జరుగుతున్నాయి.

కాని, కుల వివక్ష కారణంగా ఏ విద్యార్థి అయినా సమస్య ఎదుర్కొన్నప్పుడు ఈ సంస్థలు అతడికి ఎలాంటి మద్దతునూ ఇవ్వవు. ఇలాంటి సమస్యల్ని ఎలా ఎదుర్కోవాలో తెలియజెప్పరు సరికదా దాన్ని సమస్యగా కూడా అధికార్లు గుర్తించరు. రిజర్వేషన్ క్యాటగిరీ విద్యార్థి ఎదుర్కోవలసిన వాస్తవం ఇదే అని వాళ్లంటారు.

రిజర్వేషన్ పొందడం నేరంగా చూడబడుతోంది. నువ్వు రిజర్వేషన్‌ను ఉపయోగించుకుంటే ఇతరుల వాదనలనూ, తీర్పులనూ ఎదుర్కోవలసి ఉంటుందనేది సవర్ణుల ఆలోచనా ధోరణి. అనికేత్ అలాంటి ఇతరుల పట్ల సహానుభూతితో వ్యవహరించడం లేదు. అందుకు బదులు వాళ్ల విద్యా సామర్థ్యం తక్కువ స్థాయిదనీ, తల్లి దండ్రుల ఒత్తిడి ఎక్కువగా ఉందనీ, తమ గురించి తాము అతిగా ఊహించుకుంటారనీ, వాళ్లెదుర్కొనే సమస్యకు ఇవీ కారణాలనీ సవర్ణులంటారు. ఇలా అనడం ద్వారా వాస్తవిక సమస్యల్ని పట్టించుకోకుండా ఉండొచ్చని వాళ్ల భావన. అనికేత్ తన గుర్తింపును కోల్పోయాడు. నేనెవర్ని అనే ప్రశ్న వెంటాడింది. ఐఐటికి వచ్చిన తర్వాత అనికేత్ గ్రహాలూ, నక్షత్రాలూ, ఆత్మ – అత్యున్నతాత్మ, ఆధ్యాత్మిక ప్రపంచం వంటి అంశాల గురించి అతడెందుకు పట్టించుకోవాల్సి వచ్చింది?

అతడి సృజనాత్మకత, సకారాత్మకత 'ఆలోచనా పద్ధతి' దరహాసం ఎప్పుడూ ఎలా అదృశ్యమయ్యాయో మాకు తెలియదు. రిజర్వేషన్ సర్టిఫికెట్‌తో అతన్ని ఐఐటికి పంపించడం మేం చేసిన ఏకైక నేరం. అతడు సాధారణ విద్యా సంస్థల్లో చదువుకుని ఉంటే తన మనస్సును బలహీనపరచిన ఇలాంటి సలహాలకూ, సూచనలకూ దూరంగా ఉండేవాడు. సమర్థుడు, సున్నిత మనస్కుడు, ఎప్పుడూ సంతోషంగా ఉండే అనికేత్‌లో అతడు అసమర్థుడు అనే భావనను ఎవరు ప్రవేశపెట్టారు?

# భారత ప్రజా ఉద్యమాలలో మహిళలు

***భారతదేశంలో బ్రిటిష్ పాలనకు ముందూ తరువాతా జరిగిన అన్ని ప్రజా ఉద్యమాలలో మహిళలు నిర్వహించిన పోరాట ఘట్టాలను వివరిస్తున్నారు*** **కవిని ఆలూరి**

**భా**రతదేశం అనేక సామాజిక చారిత్రక ఉద్యమాలకు పట్టుకొమ్మ. భారతదేశ ప్రజలు ఆయా ఉద్యమాలలో ఎనలేని విశేషమైన త్యాగనిరతిని ప్రదర్శించారు. బ్రిటిష్ వారి రాకకు ముందు, తరువాత భారతదేశంలో అనేక ప్రజా ఉద్యమాలు నడిచాయి. ఇక ఆయా ఉద్యమాలలో సాహిత్యకారుల కళాకారుల పాత్ర కీలకమైనదనే చెప్పవచ్చు. అనేకమంది సాహిత్యకారులు, కళాకారులు తమ కళాలను, గళాలను కత్తులుగా మార్చి బ్రిటిష్ సామ్రాజ్యాన్నీ తరువాత వచ్చిన పాలకులను గడగడలాడించారన్నది కాదనలేని సత్యం. అయితే, మార్చి 8 అంతర్జాతీయ శ్రామిక మహిళా దినోత్సవం సందర్భంగా భారతదేశంలో జరిగిన, జరుగుతున్న వివిధ ఉద్యమాలలో మహిళల క్రియాశీలక పాత్రను ఒక్కసారి గుర్తుకు తెచ్చుకోవలసిన అవసరం ఎంతైనా ఉన్నది.

భారతదేశ చరిత్రను పరిశీలిస్తే భారతదేశం వీరుల పురిటిగడ్డ మాత్రమే కాదు, వీర మాతల, వీర వనితల పురిటి గడ్డ కూడా... అయితే అనేక మంది మహిళల వీరోచిత పోరాట ఘటనలు చరిత్రలో ఎక్కడా లిఖించబడలేదు. బ్రిటిష్‌వారు తరువాత వచ్చిన పాలకులు సాహసోపేతంగా పోరాడిన అనేక మంది మహిళలను చిత్రహింసలకు గురిచేశారు, సజీవ దహనాలు చేశారు. ఉరితీశారు, చంపేశారు. అటువంటి ఎన్నో ఘటనలు చరిత్రకెక్కలేదు. అయినప్పటికీ ప్రస్తుత నేపథ్యంలో ఆ వీర వనితలను మరొకసారి స్మరించుకుందాం.

**స్వాతంత్రోద్యమంలో మహిళలు**

బ్రిటిష్‌వారు మన దేశాన్ని రెండు వందల సంవత్సరాలకు పైగా పరిపాలించారన్నది మనందరికి విదితమే. 1857లో జరిగిన ప్రథమ స్వాంతంత్ర్య సంగ్రామంలోనూ అటు తరువాత 19వ శతాబ్దపు స్వాతంత్రోద్యమాలలోను పురుషులతో పాటు అనేకమంది మహిళలు పాల్గొన్నారు. బ్రిటిష్‌వారు వారసులు లేరన్న సాకుతో సంస్థానాలను దురాక్రమించడానికి ప్రయత్నిస్తే బ్రిటిష్ శక్తివంతమైన సేనలను, ఫిరంగి దళాలను మట్టికరిపిస్తూ యుద్ధం చేసిన రాణులు అనేకులు. వాళ్లల్లో కిత్తూరు సంస్థానం కోసం 1924 అక్టోబర్ 23న యుద్ధం చేసిన రాణి చెన్నమ్మ ప్రథమురాలు. 1957లో అవధ్ రాజైన వాజిద్ అలీషా భార్యగా పేరొందిన బేగం హజ్‌రత్ మహల్, ఝాన్సీ లక్ష్మీబాయి, మధ్యప్రదేశ్ రాంగఢ్ ప్రాంతానికి చెందిన రాణి, మహారాజా రంజిత్‌సింగ్ భార్య రాణీ జుందన్ కౌర్, బేగం ఆలియా, తులసీపూర్ రాణి, రాణి తేజోబాయి, తుక్తాయి సుల్తానా, జమానీ బేగం, మహారాణి తపస్విని, పంజాబ్ మహారాణి జిందాంచువద్ తిరుగుబాటు నాయకురాలు రాణి శిరోమణి, ఇంకా అనేకమంది రాణులు బ్రిటిష్‌వారి దురాక్రమణలను సాహసోపేతంగా ప్రతిఘటించారు.

గోర్డన్ అలెగ్జాండ్రా సికిందరాబాగ్ వద్ద కొంతమంది నల్ల స్త్రీలు అడవి పులుల్లా పోరాడి చనిపోయారని పేర్కొన్నది. అలాగే ఫోర్‌బెస్ మిచ్చెల్ ఒక పాతరకపు బరువైన పిస్టల్‌తో సాయుధమై ఉండి రావిచెట్టు మీద కూర్చొని ఒక మహిళ ఆరుగురిని చంపిందని ఆమెను సికెందరాబాగ్ వద్ద కాల్చివేయటం జరిగిందని పేర్కొంది. రస్సల్ రౌతు యూనిఫారములో యుద్ధరంగానికి వెళ్లిన ఢిల్లీ ధాయిగా ప్రసిద్ధినొందినామె గురించి ప్రస్తావిస్తూ ఆమె యుద్ధరంగంలో ఐదుగురితో సమానమని రాసారు. 25 సంవత్సరాల అజిజున్ పురుషుని వేషంలో గుర్రంపై కూర్చొని యుద్ధరంగాన పోరాడింది. ఆమె మంచి వక్త. తన ప్రసంగాలతో ప్రజల్ని ఉత్తేజితుల్ని చేసింది. అంతేకాకుండా గూఢచర్యం, ఆయుధాలను, ఆహారాన్ని సరఫరా చేయటానికి ఒక ప్రత్యేక మహిళా బెటాలియన్‌ను సంఘటితం చేసింది. ఖడ్గ చాలనం, గుర్రపు స్వారీ, తుపాకులను ఉపయోగించడంలో తానే స్వయంగా శిక్షణ నిచ్చేది, గాయపడి శత్రువుకు చిక్కి, లొంగిపోకుండా అమరురాలయ్యింది. అబ్దుల్ రహమాన్ తల్లి బేగం అస్గరి పట్టుబడినపుడు బ్రిటిష్‌వాళ్లు ఆమెను సజీవ దహనం చేశారు. అత్యంత పరాక్రమంతో పోరాడిన హబీబాను, రహీబా బేగంను ఉరి తీశారు. ఈ ఘటనలేవి చరిత్ర కెక్కలేదు.

---

కేంద్ర విద్యా మంత్రిత్వ శాఖ అధికారులకు, షెడ్యూల్డ్ కులాల కమిషన్లకు మేం రాసిన ఉత్తరాలకు సమాధానం లేదు. మా విజ్ఞప్తి మేరకు ముంబై ఐఐటిలో విచారణ కమిటీని నియమించారు గానీ, ఆ సంస్థ పనితీరులో ఎలాంటి మార్పు రాలేదు. విచారణ కమిటీ నివేదికలో ఏముందో మాకిప్పటి వరకూ ఎవరూ చెప్పలేదు. మాకు సమాధానం చెప్పాల్సిన అవసరం లేదని వాళ్లనుకుంటూ ఉండవచ్చు.

మమ్మల్ని మేం ఒంటరి వాళ్లం గా భావించుకున్నాం. అయితే రోహిత్ సంఘటనతో అంశం ప్రాధాన్యతలోకి వచ్చింది. అనికేత్, రోహిత్‌లు ఎదుర్కొన్న పరిస్థితులు భిన్నమైనవి. కాని, వాళ్లను ఘర్షణకు గురిచేసిన కారణం మట్టుకు ఒక్కటే! అంతరంగాలలో దాగి ఉన్న ఈ కుల వ్యవస్థకు వ్యతిరేకంగా మా పిల్లలు ఎప్పటి వరకు పోరాడాలో మాకు తెలియదు. మేం కూడా దానితో పోరాడుతూనే ఉన్నాం.

విద్యార్థులారా! ఆందోళనే మనకు మిగిలిన ఏకైక మార్గం. అచేతన స్థితిలో ఉన్న ఈ వ్యవస్థను చైతన్యవంతం చేసే సామర్థ్యం బహుశా విద్యార్థులకు మాత్రమే ఉంది. రోహిత్ కుటుంబం, దళిత సమాజం అనుభవించిన వేదనలకు కొంతైనా స్వాంతన చేకూరుతుందేమోనని మేము ఎదురుచూస్తున్నాం.

*(అనువాదం : సిఎస్ఆర్ ప్రసాద్)* వీ

ఆదివాసీ రైతాంగ ఉద్యమాలలో కూడా మహిళల పాత్ర మరువలేనిది. చుఅర్ తిరుగుబాటు, బస్తర్ తిరుగుబాట్లు, కోల్ తిరుగుబాట్లు, సంథాల్ తిరుగుబాట్లు, గర్వార్ ఉద్యమాలు, ఉల్గులాన్ బిర్సాముండా తిరుగుబాట్లు, మన్యం తిరుగుబాట్లు, కొమురంభీం తిరుగుబాట్లు, నీలిమందు విప్లవాలలో యుద్ధరంగాన మహిళలు ప్రత్యక్ష పోరాటాన్ని గావించారు.

**సంస్కరణోద్యమంలో మహిళలు**

1900 శతాబ్దంలో వచ్చిన సంస్కరణోద్యమాలన్నీ చట్టబద్ధమైన మార్గాల ద్వారా మహిళ అభ్యున్నతి కోసం వచ్చినవే. సతి, పరదా, దేవదాసి విధానాలు, ఆడపిల్లల భ్రూణ హత్యలు, బాలికల విద్యపై నిషేధం, బాల్య వివాహాలు, బహుభార్యత్వం, కన్యాశుల్కం లాంటి అనేక సాంఘిక దురాచారాలకు వ్యతిరేకంగా ఈ సంస్కరణోద్యమాలు నడిచాయి. ఇస్లాం సంస్కరణోద్యమాలు కూడా నడిచాయి. అయితే, ఇవన్నీ బహిరంగ సభలు నిర్వహించడం, సంతకాల సేకరణ, బ్రిటిష్ ప్రభుత్వంతో సంప్రదింపుల రూపంలోనో జరిగాయి. సంస్కరణోద్యమాలు మహిళల పట్ల, స్త్రీ విద్య పట్ల ప్రజల్లో చైతన్యాన్ని తెచ్చాయి. సామాజికంగా మహిళల స్థితి మెరుగుపడటానికి బాటలు వేశాయి. సంస్కరణోద్యమాలను మొట్టమొదట పురుషులే ప్రారంభించినప్పటికీ, స్త్రీ అభ్యున్నతికి సంబంధించి అనేక రంగాలలో కృషి చేసి మహా ఉద్యమాలకు నడుం బిగించిన మహిళా సాంఘిక సంస్కర్తలు అనేకమంది అటు తరువాత జాతీయ నాయకులైయ్యారు. ఈ ఉద్యమాల ద్వారా మహిళలు అనేక విజయాలను సాధించగలిగారు. సమాజంలో మహిళల సామాజిక రాజకీయ పాత్ర పెంపొందింది. జ్యోతిభా పూలే, సావిత్రిబాయి పూలే వంటివారు కింది కులాల మహిళల సమస్యలను తీసుకున్నారు.

1828లో సతీ ఆచారానికి వ్యతిరేకంగా రాజారామ్మోహన్ రాయి ప్రచారోద్యమాన్ని ప్రారంభించారు. ఈ సమస్యను మొదటగా మిషనరీలు చేపట్టారు. మెమోరాండములు పంపడం ద్వారా ఈ ఉద్యమాన్ని కొనసాగించారు. 1829లో సతీ నిషేధ చట్టం జారీ అయ్యింది. బ్రహ్మసమాజం, ఆర్య సమాజం, బాల్య వివాహాలు, వితంతువుల పునర్ వివాహం లాంటి సమస్యలను మాత్రమే చేపట్టాయి. ఇటువంటి సంస్కరణలు కోరుతూ 1500 మంది మహిళలు ఒక ప్రతినిధిని విక్టోరియా రాణి వద్దకు పంపారు. 1929లో శారదా చట్టం రాజీ అయ్యింది. వితంతు పునర్ వివాహాన్ని చట్టబద్ధం చేసే చట్టాన్ని 1856 జూలైలో ఈశ్వరచంద్ర జారీ చేయించారు. 1881 డిసెంబర్ 11న రాజమండ్రిలో వీరేశలింగం మొదటి వితంతు పునర్ వివాహాన్ని జరిపించారు. పునర్ వివాహ సంఘాన్ని స్థాపించారు. 1879లో వితంతు పునరావాస కేంద్రాన్ని స్థాపించారు. 1848లో బాలికల కోసం సావిత్రీబాయి పూలే ఆమె భర్త జోతీరావుపూలే 'బాలహత్య' ప్రబంధక్ గృహాన్ని' ప్రారంభించారు.

1990 భర్త మరణం తరువాత సత్యశోదక్ సమాజ్ బాధ్యతలను ఆమె స్వీకరించింది. పండిత రమాబాయి 1987లో స్త్రీ విద్యపై తన అభిప్రాయాన్ని కమిషన్ ముందు ఉంచింది. మహిళల కోసం అనేక వైద్యశాలలను ఏర్పాటు చేసింది. వితంతువుల కోసం, నిరాశ్రయులైన మహిళల కోసం శారదా సదన్‌ను స్థాపించింది. ఆమె తన జీవితాన్నంతా సనాతన సమాజానికి వ్యతిరేకంగా పోరాడుతు, నిరాశ్రయులైన మహిళ అభ్యున్నతికే అంకితం చేసింది. 1904లో బొంబాయి మొదటి భారత్ మహిళా పరిషత్‌ను నిర్వహించింది. 25 సంవత్సరాల పాటు ఆమె మహిళల విద్య, చట్టబద్ధ హక్కులు సమాన హోదాకోసం అవిశ్రాంతంగా పనిచేసింది. 1918 నుంచి 1923 వరకు మహిళల ఓటు హక్కు కోసం శ్రమించింది. భారతదేశంలో మొట్టమొదటి నర్స్ సేవాసదన్‌ను ఏర్పరచింది. గుజరాత్ మహిళా విద్యారాణి నీల్‌కంఠే 1914లో అహ్మదాబాద్‌లో ఒక మహిళా మండలిని ఏర్పరిచారు. ఆనందీబాయి జోషి, కాదంబనీ గంగూలీ, కాశిబాయి కనిత్కర్, ముత్తు లక్ష్మీరెడ్డి లాంటి వారే కాకుండా, ఆంధ్రప్రదేశ్‌కు చెందిన ఉన్నవ లక్ష్మీబాయమ్మ భర్తతో కలిసి 1902లో గుంటూరులో ఒక వితంతు గృహాన్ని స్థాపించారు. 1911 నుండి 1942 మధ్యలో సహాయ నిరాకరణోద్యమంలో, శాసనోల్లంఘన ఉద్యమంలో, క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొని ఆరుసార్లు జైలుకి వెళ్లారు. 1923లో శారదా నికేతన్ అనే ఒక ఆశ్రమ పాఠశాలను స్థాపించారు. కందుకూరి రాజ్యలక్ష్మి 1891లో మహిళల కోసం ఒక ప్రార్థణా మందిరాన్ని స్థాపించింది. భండారు అచ్చమాంబ స్త్రీవిద్య, సాహిత్యానికి సంబంధించిన విషయాలలో అత్యంత కీలకమైన పాత్ర పోషించారు. ఆంధ్ర మహిళా చరిత్రను ఆమె 'అబలా సచ్చరిత రత్నమాల'గా రాసింది. 'హిందూ సుందరి', 'చింతామణి' లాంటి పత్రికలలో వ్యాసాలు రాశారు. 1903లో ఆంధ్రదేశమంతా విస్తృతంగా పర్యటించి ఉపన్యాసాలు ఇస్తూ మహిళా సంఘాలను స్థాపించారు. అనేకమంది పేద మహిళలకు ఆశ్రయాన్నిచ్చారు. 1907లో స్త్రీ విద్యాభివృద్ధి సమాజాన్ని స్థాపించారు.

'హిందూ సుందరి', 'సావిత్రి' 'అనసూయ', 'విద్యావతి', 'గృహలక్ష్మి' లాంటి అనేక పత్రికలను మహిళలు నడిపారు. ఆ పత్రికలలో మహిళల సమస్యల గురించి ప్రస్తావించారు. అంతేకాకుండా అఖిల భారత ముస్లిం మహిళల కాన్ఫరెన్స్‌లు నిర్వహించారు. పెరియార్ ఆత్మగౌరవ ఉద్యమాల్లో పాల్గొన్నారు. అంబేద్కర్ దళిత ఉద్యమంలో మహిళల పాత్ర కీలకమైనది. అంబేద్కర్ నాయకత్వంలో వివిధ సభలలో మహిళలు తీర్మానాలను చేశారు.

**కమ్యూనిస్టు ఉద్యమాల్లో మహిళలు**

మహిళల సంపూర్ణ విముక్తి కోసం ఒక శాస్త్రీయమైనటువంటి, గతితార్కిక, చారిత్రక, భౌతికవాద దృక్పథాన్ని పరిష్కారంగా చూపెట్టింది. మొట్టమొదటగా కమ్యూనిస్టులే. సంస్కరణోద్యమాల్లాగా కాకుండా భిన్నమైన పద్ధతిలో రైతాంగ తిరుగుబాట్లలో, మిలిటెంట్ పోరాటాలలో వేలాది మంది మహిళలను చైతన్యపరిచారు. పెద్ద సంఖ్యలో శ్రామిక, రైతాంగ, అట్టడుగు మహిళలను, ఉన్నత మధ్యతరగతి మహిళలను సంఘటితం చేశారు. వేలాది మంది మహిళలకూ, విద్యార్థినులకు సభ్యత్వాలను ఇచ్చారు.

భగత్‌సింగ్, సుఖ్‌దేవ్, రాజ్‌గురులాంటి సాయుధ విప్లవకారుల విడుదల కోసం ఊపందుకున్న ఉద్యమాలలో మహిళల పాత్ర మరువలేనిది. భగవతీచరణ్ భార్య దుర్గాబాబీ లాంటి అనేకమంది మహిళలు అనేక త్యాగాలను చేశారు. సుశీలా దీదీలాంటి యువతులు దేశభక్తి గీతాలను రాసారు. మృణాళినీదేవి, సునీతీదేవి, మాయాదేవి, ప్రేమావతి, లీలాలాంటి అనేకమంది మహిళలు, విప్లవకారులకు ఆశ్రయమివ్వడం, డబ్బులు సేకరించడం లాంట అనేక కార్యక్రమాలను నిర్వహించారు.

1943 అక్టోబర్ 23న సింగపూరులో మహిళా క్యాంపును ప్రారంభించారు. మహిళలకు నర్సింగ్, సమాజసేవ, సాధారణ సంక్షేమ కార్యక్రమాల్లో శిక్షణ ఇచ్చారు, మిలటరీ శిక్షణనూ ఇచ్చారు. బెంగాల్‌లో

జరిగిన మార్చ్ మొదటి ప్రావెషనల్ కాన్ఫరెన్స్‌ను నిర్వహించారు. తరువాత దీనిని అఖిల బెంగాల్ మహిళా ఆత్మరక్షణ సమితిగా పిలిచారు.

గంజి కేంద్రాలు నిర్వహించడం, నిరాశ్రయులైన మహిళలను ఆశ్రయాన్ని, పునరావాసాన్ని కల్పించడం, నారీ సేవా సంఘాలను ఏర్పాటు చేయడం, చేతి వృత్తుల కేంద్రాలను ఏర్పాటు చేయడం. మహిళలు వ్యభిచానికి ఎర కాకుండా చూడడం లాంటి కార్యక్రమాలు చేపట్టారు. మహిళా ఆత్మరక్షణా సమితిని ఏర్పాటు చేశారు. అందులో మహిళలకు ప్రథమ చికిత్సా విధానాన్ని, లాఠీని ఉపయోగించే విధానాన్ని బోధించారు.

1943 చిట్టగాంగ్ నారీ సమితిలో 36 ప్రాథమిక కమిటీలలో 3600 మంది సభ్యులైయ్యారు. అనేక దుష్ప్రచారాలను, భౌతిక దాడులను సైతం లెక్కచేయకుండా కమ్యూనిస్టు మహిళలు 1948లో రాజకీయ ఖైదీల విడుదల ఉద్యమంలో చురుగ్గా పాల్గొన్నారు. లాఠీచార్జ్, బాష్ప వాయుగోళాలు సైతం లెక్కచేయక వేలాదిమంది మహిళలు హక్కులు సాధించాకనే అక్కడి నుండి వెళ్లారు. గోదావరి పరులేకర్ అనే మహిళా కమ్యూనిస్టు నాయకత్వంలో వర్లీ తిరుగుబాటు జరిగింది. 1945 నుండి 1947 వరకు వర్లీ ఆదివాసీలు మహత్తరమైన తిరుగుబాటును చేశారు. మహాసభను నిర్వహించారు. ఆ పోరాటంలో అనేకమంది పురుషులు అరెస్టు అయితే మహిళలే ఎదిరించి నిలబడ్డారు. సభలను నిర్వహించారు. ఊరేగింపులు జరిపారు. 1930లో కేరళలో అంటరానితనానికి వ్యతిరేకంగా మహిళలు పోరాటం చేశారు. తెభాగా ఉద్యమం చరిత్రలో ఒక మహత్తర పోరాటానికి చిహ్నం. తెభాగా ఉద్యమంలో నారీ వాహినిని ఏర్పాటు చేశారు. ప్రత్యేక మహిళా మిలిషియాను ఏర్పాటు చేశారు.

వీరోచిత తెలంగాణ పోరాటం జమీందార్లకు, రజాకర్లకు వ్యతిరేకంగా జరిగింది. పురుషునితో పాటు గ్రామ రక్షణ దళాలలో మహిళలు కూడా శిక్షణ పొందారు. గెరిల్లా పోరాట పద్ధతులను అవలంభించారు. తెలంగాణ పోరాటంలో మహిళలదే ప్రముఖ పాత్ర. తెలంగాణ సాయుధ పోరాటం భూస్వాములకు వ్యతిరేకంగా భూమిలేని పేద, మధ్య, ధనిక రైతాంగం సాగించిన ఐక్యతా పోరాటం, అన్ని వర్గాల మహిళలు ఈ పోరాటంలో పాల్గొని అశేష త్యాగాలను చేశారు. సాయుధులైన మహిళలను రజాకార్లను ప్రతిఘటించి తమను తాము రక్షించుకున్నారు. 1930లో ఏర్పడిన ఆంధ్ర మహిళాసభ సంస్కరణ వాదాన్నీ కలిగివున్న మహిళలకు ఒక వేదికగా నిలిచింది.

**కార్మికవర్గ ఉద్యమాల్లో మహిళలు**

గాంధేయవాది అయిన అనసూయ సోనాబాయి అహ్మదాబాదులోని మిల్లు కార్మికులకోసం రాత్రి బడులను తెరిచారు. 1920 తరువాత కార్మిక వర్గ ఉద్యమాలలో మహిళలకు ప్రత్యేక హక్కులుంటాయని గుర్తించారు. అందులో భారత్ మహిళా సంఘం మొదటిది. 1928లో నేత కార్మికుల సమ్మెలో మహిళలు పికెటింగ్ నిర్వహించారు. బ్రిటిష్ విధానాలకు వ్యతిరేకంగా ట్రేడ్‌యూనియన్ ఉద్యమం రూపొందింది. బీడీ కార్మికుల పోరాటాలలో సైతం మహిళలు పాల్గొన్నారు. 1946లో పోలీసు కాల్పుల్లో 500 కార్మికులు చనిపోతే వారిలో కమలాదాండే అనే కమ్యూనిస్టు నాయకురాలు కూడా ఉన్నారు. అనేక మంది మహిళా ఉద్యమ నాయకురాల్లు మరణించారు. బెంగాల్‌లోని జౌళి మిల్లు కర్మాగారాలను, జాడీ కర్మాగారాలలో వేతనాలను పెంచాలని మహిళలు పికెటింగులు నిర్వహించారు. బొంబాయిలోని టెక్స్‌టైల్ పోరాటాలలో సహితం మహిళలు నాయకత్వం వహించారు. 1947 తరువాత మహిళా కార్మికులు అనేక పోరాటాలలో పాల్గొన్నారు. తేయాకు కార్మికులలో 50శాతం మహిళా కార్మికులే. చత్తీస్‌గఢ్ గనుల శ్రామిక సంఘం 1977లో ఏర్పడింది. ఇందులో సగం మంది మహిళా కార్మికులు. కార్మికవర్గ పోరాటాలలో మహిళలు మిలిటెంట్లుగా పాల్గొన్నప్పటికీ బాధ్యాతాయుత స్థానాల్లో అతికొద్ది మంది మహిళలే ఉన్నారు.

**విప్లవోద్యమంలో మహిళలు**

నక్సల్బరీ పోరాటం చరిత్రాత్మకమైనది. వాద్లే హత్య తరువాత పురుష కార్యకర్తలు అడవుల్లోకి వెళ్లిపోతే, 1967 మే 25న మహిళా కార్యకర్తలు ఒక సమావేశాన్ని నిర్వహించడానికి ప్రయత్నించారు. పోలీసు కాల్పుల్లో ఏడుగురు మహిళలు అక్కడికక్కడే మృతి చెందారు. 1958లో గిరిజన సంఘాలుగా ఆదివాసీలను సంఘటిత పరచటం శ్రీకాకుళ సాయుధ పోరాటానికి నాంది పలికింది. ఈ పోరాటంలో మహిళలు పెద్ద సంఖ్యలో పాల్గొన్నారు. నూతన ప్రజాస్వామిక విప్లవమే లక్ష్యంగా విప్లవోద్యమాలు నడిచాయి. దళారీ బూర్జువా, సామ్రాజ్యవాద శక్తులకు వ్యతిరేకంగా మహిళా విముక్తి కోసం పోరాటాలను జరిపారు. నక్సల్బరీ ఉద్యమం తరువాత వచ్చిన విప్లవ ఉద్యమాలలో మహిళలు చాలా క్రియాశీలంగా పాల్గొన్నారు. అనేక న్యాయపోరాటాలను చేశారు. విప్లవ మహిళా సంఘాలను ఏర్పరచారు. పి.ఓ.డబ్ల్యు, కె.ఎ.ఎం.ఎస్, వి.ఎం.ఎస్., ఎ.వి.ఎం.ఎస్.ల నేతృత్వంలో విప్లవ మహిళా ఉద్యమాల నిర్వహణ జరిగింది. 1980 తరువాత దండకారణ్యంలో క్రాంతికారి ఆదివాసి మహిళా సంఘం ఏర్పడింది. బీడీ ఆకుల ధరలను పెంచాలన్న డిమాండ్‌తో వాళ్ల పోరాటం మొదలయ్యింది. మహిళా అణచివేత ధోరణులకు వ్యతిరేకంగా, పితృస్వామ్య భావజాలానికి వ్యతిరేకంగా పోరాటాలను సాగించారు. మహిళా సంఘాల ప్రచారోద్యమాల ఫలితంగా ఆదివాసీ మహిళల్లో రాజకీయ, సామాజిక చైతన్యం పెరిగింది. విప్లవ సాంస్కృతిక సంఘాలలో మహిళలు చురుగ్గా పాల్గొన్నారు. నారీముక్తి సంఘ్‌ను ఏర్పరచి బాల్య వివాహాలు, వరకట్న వేధింపులు, లైంగిక వేధింపులు, అత్యాచారాలకు వ్యతిరేకంగా పోరాడడమే కాకుండా, స్త్రీల ఆరోగ్య సమస్యలు, సమాన పనికి సమాన వేతనం, మూఢనమ్మకాలను వ్యతిరేకించడం, అనేక అంశాలపై ఆదివాసి మహిళా సంఘాల నాయకత్వంలో పోరాడారు. పురుషులతో సమానంగా తమ త్యాగ నిరతిని చాటుకున్నారు.

**పట్టణ ప్రాంతాలలో**

అధిక ధరలకు వ్యతిరేకంగా, అత్యవసర పరిస్థితికి వ్యతిరేకంగా, అత్యాచారాలకు వ్యతిరేకంగా, వరకట్నానికి వ్యతిరేకంగా, గర్భస్థ శిశు లింగనిర్ధారణ పరీక్షలకు వ్యతిరేకంగా జరిగిన పోరాటాలలో మహిళలే ఉద్యమాన్ని నిర్మించి నడిపించారు. సారా వ్యతిరేక ఉద్యమాలలో విస్తృతంగా ఆందోళనలను చేపట్టారు. చిప్కోలాంటి అనేక పర్యావరణ ఉద్యమాల్లో కూడా పాల్గొన్నారు. మణిపూర్, అస్సాం ఉద్యమాలలో సైతం మహిళలు ఎంతో చురుకుగా పాల్గొన్నారు.

ఈనాటి ఆధునిక మహిళలు అన్ని రంగాలలో రాణించడం వెనక ఎంతోమంది మహిళల ఎనలేని కృషి త్యాగాలు ఉన్నాయి. వారందరిని మరొక్కమారు స్మరించుకుంటూ అంతర్జాతీయ శ్రామిక మహిళా దినోత్సవానికి జేజేలు పలుకుదాం..

*(వి. గార్గి రాసిన 'మహిళలులేని చరిత్ర లేదు' గ్రంథం ఆధారంగా)*

*(రచయిత హిందీ లెక్చరర్)*

వీ

# అరుణాచల్ ప్రదేశ్‌లో రాష్ట్రపతి పాలనా క్రీడ

***అధికారంలో ఉన్న పాలకులు రాజ్యాంగంలోని లొసుగులను తమకు అనుకూలంగా మార్చుకొని రాష్ట్ర ప్రభుత్వాలను రద్దుచేయడం, గవర్నర్లను మార్చడం రాజ్యాంగ స్ఫూర్తికి విరుద్ధమని అంటున్నారు బి. రామకృష్ణ***

ఏప్రిల్ 2014లో ఎన్నికలు జరిగి మే 2014లో అరుణాచల్ ప్రదేశ్‌లో కాగ్రెస్ పార్టీ ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసింది. మొత్తం 60 మంది శాసనసభ్యుల్లో 47 మంది కాంగ్రెస్, 11 బిజెపి, 2 ఇండిపెండెంట్‌లు ఉన్నారు. నాబామ్‌టుకి ముఖ్యమంత్రిగా, ప్రభుత్వం ఏర్పాటైంది. ఇదే సమయంలో కేంద్రంలో మోదీ ప్రధానమంత్రిగా బిజెపి ప్రభుత్వం ఏర్పడింది. ఈ ప్రభుత్వం వివిధ రాష్ట్రాల్లో గవర్నర్లను మార్చింది. తనకు నచ్చిన వారిని వివిధ రాష్ట్రాలకు గవర్నర్లుగా నియమింపజేసింది. నచ్చనివారిని తొలగించింది. అందులో భాగంగానే జూన్ 2016లో అరుణాచల్‌ప్రదేశ్ రాష్ట్ర గవర్నర్‌గా జ్యోతిప్రసాద్ రాజ్‌ఖోవాను నియమించింది. తరువాత కాలంలో కాంగ్రెస్‌లో అంతర్గత ఘర్షణ వల్ల కొంతమంది ఎంఎల్‌ఏలు నాబమ్‌టుకి ముఖ్యమంత్రిత్వానికి వ్యతిరేకంగా మారారు. కలిఖోపుల్(19.01.16న ముఖ్యమంత్రిగా గవర్నర్‌చే ప్రమాణ స్వీకారం చేయించబడ్డాడు) కేంద్రంగా అసమ్మతి వర్గం రూపుదిద్దుకున్నది. దీన్ని అవకాశంగా బిజెపి వాడుకోసాగింది. కాంగ్రెస్ అసమ్మతి నేత కలిఖో? పుల్‌కు మద్దతునిచ్చే దిశలో బిజెపి అడుగులు వేస్తూ వచ్చింది. అరుణాచల్ ప్రదేశ్‌లోని రాజకీయ అస్థిరతను తనకనుకూలంగా మార్చుకుని ఈశాన్య రాష్ట్రాల్లో తన ప్రభావాన్ని, ప్రాబల్యాన్ని పెంచుకునే కృషిలో బిజెపికి ఈ సందర్భం కలిసివచ్చింది. తాము ఆడే రాజకీయ నాటకానికి సులభ మార్గం ఏర్పడింది.

కలిఖోపుల్ నేతృత్వంలో కాంగ్రెస్‌లోని అసమ్మతి వర్గం ముఖ్యమంత్రికి వ్యతిరేకంగా సమీకృతం కావడం సహజంగానే ముఖ్యమంత్రికి నచ్చదు. ఇందులో భాగంగా 14మంది కాంగ్రెస్ అసమ్మతి ఎంఎల్‌ఏలను స్పీకర్ నాబంరేబియా అనర్హులుగా ప్రకటించారు. ఈ అనర్హత రాజ్యాంగంలోని 10వ షెడ్యూల్‌ను అనుసరించి(ఫిరాయింపులు) జరిగిందని స్పీకర్ చెప్పారు.

2015 నవంబర్ 19న నాబమ్ రేబియాను స్పీకర్ పదవి నుంచి తొలగించమని ప్రతిపక్ష నాయకుడు తమియోతాగా మరితర 12 మంది ఎంఎల్‌ఏలు సంతకాలు చేసిన తీర్మానం గవర్నర్‌కు అందిందని దీంతో అసెంబ్లీ సమావేశాన్ని 3.11.2015నాటి గవర్నర్ ఉత్తర్వుల్లో సూచించినట్టుగా 14.01.16 బదులుగా 16.12.15న అంటే నెల ముందుగానే జరపమని 9.12.15న గవర్నర్ సవరణ ఉత్తర్వును జారీ చేశారని సుప్రీంకోర్టుకు కేంద్రం సమర్పించిన అఫిడవిట్‌లో పేర్కొన్నారు. ఒకవేళ ఎవరైనా అలా కోరితే మాత్రం గవర్నర్ చేయొచ్చా? ఇలాంటి నిర్ణయాలు దేన్ని సూచిస్తాయి. ఆ సమావేశంలో స్పీకర్‌ను అనర్హుడిగా ప్రకటించాలని ఆదేశాలివ్వడం ఎందుకు? అసెంబ్లీ సమావేశాన్ని అనుకున్న రోజుకు నెల ముందుగానే 16.12.15న జరపమని మంత్రివర్గాన్ని సంప్రదించకుండానే గవర్నర్ ఆదేశించారు. అసెంబ్లీ సమావేశం అవ్వమనడానికి సంబంధించి రాజ్యంగంలో ఆర్టికల్ 174 ప్రకారం గవర్నర్‌కు అవకాశం ఉన్నది. ఈ ఆర్టికల్‌లో మంత్రివర్గాన్ని సంప్రదించాకే సమావేశపు తేదీలను నిర్ణయించాలనేం లేదు. ఈ విషయం గవర్నర్‌కు బాగా ఉపకరించింది. కానీ కార్యనిర్వహణ అంతా కూడా మంత్రిమండలి సలహాల మేరకు జరగాలనేది సాధారణ నియమం. కాంగ్రెస్ అసమ్మతి ఎంఎల్‌ఏలు, బిజెపి, ఇండిపెండెంట్లతో అధికారంలో ఉన్న ప్రభుత్వాన్ని పడగొట్టడం తరువాత తాననుకున్న వారిచే ప్రభుత్వాన్ని ఏర్పాటు చేయించడం అనేది గవర్నర్ ఉద్దేశ్యంగా ఉండే అవకాశాన్ని సులభంగానే అర్థం చేసుకోవచ్చు. దీన్నంతా పసిగట్టిన ముఖ్యమంత్రి ముందు జాగ్రత్తగా 14 మంది ఎంఎల్‌ఏలను అనర్హులుగా ప్రకటింపజేశారని తెలుసుకోవచ్చు. అనర్హుల జాబితాలో డిప్యూటీ స్పీకర్ కూడా ఉన్నాడు. అసమ్మతి ఎంఎల్‌ఏలు, బిజెపి ఎంఎల్‌ఏలు కలిసి అసెంబ్లీకి వెలుపల వేరేచోట కమ్యూనిటీ హాల్‌లో సమావేశమైనారు. ఈ సమావేశం గవర్నర్ సూచనల మేరకు జరిగిందనే అనుకోవచ్చు. ఈ సమావేశంలో దీనిని అసెంబ్లీ సెషన్ అనొచ్చా, లేదా అనేది వేరే ప్రశ్న. 16.12.15న 14 మంది ఎంఎల్‌ఏల అనర్హతను రద్దుచేస్తూ స్పీకర్ రబియాను తొలగిస్తూ డిప్యూటీ స్పీకర్ ప్రకటించారు.

2016 జనవరి 13న గౌహతి హైకోర్ట్ 14మంది ఎంఎల్‌ఏలను స్పీకర్ రిబియా అనర్హులుగా ప్రకటించడంపై స్టే విధించింది. ఇదంతా జరుగుతున్న క్రమంలో రాష్ట్రంలో రాజ్యాంగ యంత్రాంగం పూర్తిగా పనిచేయనిస్థితిలోకి పోయిందని, గవర్నర్, అతని కుటుంబానికి రక్షణ లేకుండా పోయిందని, ప్రభుత్వ పాలన శాంతిభద్రతలు మొత్తంగా నిస్తేజంగా మారాయని గవర్నర్ కేంద్రానికి వివరించారు. రాజ్యంగ ఆర్టికల్ 167 (బి) ప్రకారం గవర్నర్‌కు అందించవలసిన సమాచారం అందించబడుటలేదని, రాష్ట్రపతి నామిని అయిన గవర్నర్‌ను బహిరంగంగా అవమానించడం గెరావ్ చేయడం వంటివాటిపై ప్రభుత్వం మౌన ప్రేక్షక పాత్రను వహించిందని, ప్రస్తుత గవర్నర్‌కు వ్యతిరేకంగా అతన్ని రీకాల్ చేయమని, రాజీనామా చేయమని, తొలగించమని, ఊరేగింపులు, ప్రదర్శనలను రాష్ట్ర ముఖ్యమంత్రి ప్రోత్సహిస్తున్నారని , రాష్ట్రంలో శాంతిభద్రతలు క్షీణించాయని, యుద్ధం వంటి పరిస్థితి నెలకొందని ఈ ఆందోళనలో రాష్ట్రమంత్రిమండలి ప్రత్యక్షంగా పాల్గొంటున్నదని, ఇదంతా కూడా రాజ్యాంగ యంత్రాంగం బద్దలైనట్లుగా సూచిస్తున్నదని కేంద్ర హోంమంత్రిత్వ శాఖ సుప్రీంకోర్టుకు సమర్పించిన

అఫిడవిట్‌లో పేర్కొన్నది. 34మంది ఎంఎల్ఎలు 28.12.15న రాష్ట్రంలో రాష్ట్రపతి పాలన విధించాలని కోరుతూ గవర్నర్‌కు విన్నవించారని, దీని ప్రతిని గవర్నర్ రాష్ట్రపతికి పంపారని ఆ అఫిడవిట్‌లో తెలిపారు. ఈ విజ్ఞప్తి రాష్ట్రంలోని అస్థిర పరిస్థితిని అలాగే టూకి ప్రభుత్వం కోల్పోయిన మెజార్టీని సూచిస్తున్నదని కేంద్రం వాదిస్తున్నది

గవర్నర్ రాష్ట్రపతికి పంపిన రిపోర్టులో రాజ్‌భవన్ ముందు గోవధ జరిగిందని, దానికి సంబంధించిన ఫోటోలు ఉన్నట్లు చెబుతున్నారు. అది ఆవు కాదని, ఆవు, గేదే వంటి మరో జంతువు మిథున్ అని తెలిసింది. ఇది అరుణాచల్ ప్రదేశ్ రాష్ట్ర జంతువు. అక్కడ దీన్ని వధించొద్దని చట్టాలేవీ లేవు. ఈ రాష్ట్రంలో ఆవు వధపై కూడా నిషేధం లేదు. కేరళ, పశ్చిమబెంగాల్, అరుణాచల్ ప్రదేశ్, మిజోరాం, మేఘాలయ, నాగాలాండ్, త్రిపుర, సిక్కిం రాష్ట్రాల్లో ఆవుతో సహ ఏ పశువదపై నిషేధం లేదు. ఆ రాష్ట్రంలోని ఎన్నో తెగలు చాలా సందర్భాలల్లో మిథున్‌ను బలిస్తుంటాయి. మిథున్ వధ అనేది కూడా రాష్ట్రపతి పాలనకు కారణంగా చెప్పబడుతున్నది. దీని వధ అనేది రాజ్ కోవాకు రాజ్యాంగ యంత్ర నిర్వీర్యంగా తోచింది. సంఘ్ పరివార్ శక్తులు బలంగా ఉన్న ప్రాంతాల్లో అలాగే బిజెపి అధికారంలోకి వచ్చినప్పటినుండి పశు మాంసం తినడంపై అప్రకటిత ఆంక్షలు, నిర్బంధాలు, నిషేధాలు అమలవుతున్నాయి. ఇటీవల ఆవుమాంసం తిన్నాడని అక్లాక్ అనే వ్యక్తి చంపబడ్డాడు. మిథున్ మాంసాన్ని అరుణాచల్ ప్రదేశ్ అంతటా తినడం సాధారణ విషయం. మిథున్‌ను వధించిన ఫోటోలతో పంపించిన రిపోర్టును కలిఖో పుల్ మీడియాకు చూపించాడు. రాష్ట్రపతి పాలన విధింపునకు మిథున్ వధను ఆవును వధించినట్టుగా చిత్రీకరించి లబ్ధిని పొందే ప్రయత్నం జరిగింది.

గవర్నర్‌కు, ఆయన కుటుంబానికి రక్షణ లేదని చెబితే, మిథున్‌ను బలిస్తే, గవర్నర్ చర్యలను వ్యతిరేకిస్తూ నిరసన ప్రదర్శనలు జరిగితే రాజ్యాంగ యంత్రాంగం బద్ధలైనట్లేనా? దాంతో రాష్ట్రపతి పాలనకు సిద్ధపడటమేనా చేయవల్సింది. గవర్నర్ ఒక్కడికే ఇబ్బంది వస్తే అది ఒకవేళ నిజమే అయితే కూడా ఆ విషయాన్ని రాష్ట్రమంతటికి ప్రమాదకరంగా చూడాలా?

అరుణాచల్ ప్రదేశ్‌లో రాష్ట్రపతి పాలన విధించడానికి కారణాలుగా ప్రధానంగా 6 నెలల కాలంలో అసెంబ్లీ సమావేశం ఏర్పాటు కాలేదు అనడం,శాసనసభలో టూకీ ప్రభుత్వానికి తగినంత మద్దతు లేకపోవడం, శాంతిభద్రతలు క్షీణించాయనడంలను చూపెడుతున్నారు.

ఆరు నెలల కాలానికి నెల ముందే అసెంబ్లీని సమావేశపరచాలని గవర్నర్ ఉత్తర్వులివ్వడం గందరగోళానికి కారణమైంది. ఆ ఉత్తర్వులే లేకుంటే అనుకున్నట్లుగానే 14.01.16న అసెంబ్లీ సమావేశం జరిగి ఉండేదే కదా? ఈ లోపు ఈ విషయమంతా కోర్టుల్లో విచారించబడుతున్నది. సభలో మద్దతు లేదనేది సభలోనే తేలుతుంది. కానీ గవర్నరో మరెవరో భావిస్తే తేలేది కాదు. శాంతిభద్రతలు క్షీణించాయని చెప్పడం ఒక సాకుగానే మిగిలిపోయింది. అలా గవర్నర్ గానీ, కేంద్రంగానీ చెప్పిన ఏ కారణాలకి తగిన ఆధారాలు లేవు. రాష్ట్రపతి పాలన అనేది కేంద్ర ప్రభుత్వంలో ఉన్న బిజెపి మైండ్ గేమ్‌గా తన రాజకీయ ప్రాబల్య విస్తరణ కాంక్షగానూ ప్రతిపక్ష పార్టీలను అస్థిర పరచడం, బలహీనపరచడంలో భాగంగా జరిగిందని తెలుసుకోవచ్చు.

సరిగ్గా రాజ్యాంగం అమల్లోకి వచ్చినరోజే అరుణాచల్‌ప్రదేశ్‌లో ఆర్టికల్ 356ను ఉపయోగించి రాష్ట్రపతి పాలన విధించబడింది. ఈ ఆర్టికల్ నేపథ్యం బ్రిటిష్ వలసపాలన మూలాల్లో ఉన్నది. బ్రిటీష్ పాలకుల అడుగులకు మడుగులొత్తని స్థానిక ప్రభుత్వాలను కూల్చడం కోసం ఈ నిబంధన 1935 చట్టంలోని సెక్షన్ 93గా ఉండేది. దాన్ని భారతరాజ్యాంగంలోకి తెచ్చేసందర్భంలో డాక్టర్ అంబేడ్కర్ ఈ ఆర్టికల్ గురించి వివరిస్తూ ఇది ఎప్పటికీ కూడా అమల్లోకి రాకూడదు. ఇది డెడ్ లెటర్‌గా మిగిలిపోతుంది అన్నారు. కానీ ఎన్నడూ అలా అచేతనంగా పడిలేదు. కేంద్రంలో కాంగ్రెస్, జనతా, బిజెపి వంటి ఏ ప్రభుత్వాలు ఉన్నప్పటికీ తమ రాజకీయ అవసరాలకోసం తమకు నచ్చని వైరి ప్రభుత్వాలను అస్థిర పర్చడం, రద్దు చేయడం కోసం 356 ఆర్టికల్‌ను ఎన్నోసార్లు వాడుకున్నారు. అలా 356 ఆర్టికల్ భారత ప్రజాస్వామ్యంలో అంబేడ్కర్ స్ఫూర్తికి భిన్నంగా పనిచేస్తూ వచ్చింది. 1967-77ల మధ్య కాంగ్రెస్ పాలనలో ఉన్నప్పుడు దేశవ్యాప్తంగా ఎన్నో రాష్ట్రాల్లో 39సార్లు రాష్ట్రపతి పాలన విధించారు. జనతా ప్రభుత్వం అధికారంలోకి వచ్చిన తరువాత 1977లో 9 కాంగ్రెస్ పాలిత రాష్ట్రాల్లో రాష్ట్రపతి పాలన విధించబడింది. 1981లో తిరిగి కాంగ్రెస్ అధికారంలోకి వచ్చాక కక్ష్య సాధింపుగా 9 రాష్ట్రాల్లో రాష్ట్రపతి పాలన విధించబడింది. అలా దాదాపుగా రాష్ట్రపతి పాలన విధించబడని రాష్ట్రం లేదంటే అతిశయోక్తికాదు.

గవర్నర్‌కు ఉన్న అధికారాల్లో గవర్నర్ స్వయం వివేచనతో చేసినదా, కాదా అనే ది వివాదస్పదమైతే గవర్నర్ అభిప్రాయాన్నే తుది నిర్ణయంగా పరిగణించాలని ఆర్టికల్ 163(2) చెబుతున్నది. ఇది కేంద్ర ప్రభుత్వంలో ఉన్న పార్టీలకు, వారికి నచ్చని రాష్ట్ర ప్రభుత్వాలను పడగొట్టడానికి గవర్నర్‌ను పావుగా వాడుకొనే అవకాశాన్ని ఇస్తున్నది. కేంద్ర కేబినెట్ సిఫారసుల మేరకే రాష్ట్రపతి గవర్నర్లను నియమిస్తారు. కేంద్ర కేబినెట్ సలహా మేరకు రాష్ట్రాల్లో రాష్ట్రపతి పాలనను విధించడం అలాగే ఎత్తేయడం చేయవచ్చు. కేంద్ర కేబినెట్ సలహామేరకు రాష్ట్రపతి పాలనను ఎత్తివేయవచ్చు. అయితే రాష్ట్రంలోని గవర్నర్ ఆయా రాష్ట్రాల్లో రాజ్యాంగ యంత్రాంగం విచ్ఛిన్నమైందని భావించి రిపోర్ట్ చేయవలసి ఉంటుంది. ఇలా రిపోర్ట్ చేయడమనేది గవర్నర్ స్వీయ వివేచనకు సంబంధించినది. ఈ స్వీయ వివేచనను ఎవరూ ప్రశ్నించవీలులేదని ఆర్టికల్ 163(1) చెబుతున్నది. దీనిని ఆధారం చేసుకుని కేంద్ర ప్రభుత్వాలకు గవర్నర్లను తమకు అనుకూలంగా మలుచుకునే అవసరం ఉంటుంది. అందుకోసమే కేంద్ర మంత్రిమండలి తామనుకున్న వారిని గవర్నర్లుగా నియమించుకుంటుంటారు. నచ్చనివారికి ఉద్వాసన పలుకుతుంటారు.

దేశపరిపాలనా నిర్వహణకొరకు ఒక మంత్రివర్గం ఉండవలెను. రాష్ట్రపతి విధి నిర్వహణ మంత్రివర్గ సహాయ సహకారములను అనుసరించి ఉండవలెను. అయినప్పటికి రాష్ట్రపతి ఉచితమని భావించినచో మంత్రివర్గం సమర్పించిన సలహాను పునరాలోచన చేయమని రాష్ట్రపతి మంత్రివర్గాన్ని కోరవచ్చు. మంత్రివర్గం పునరాలోచనానంతరం సమర్పించే సలహాను రాష్ట్రపతి విధిగా ఆమోదించవలెనని ఆర్టికల్ 74(1) చెబుతున్నది.

ఎస్సార్ బొమ్మై కేసు (1994) తీర్పులో రాష్ట్రపతి పాలనపై ముఖ్యమైన విషయాలు ఉన్నాయి. రాష్ట్రపతి పాలనపై సమీక్ష చేసే అధికారం కోర్టులకు ఉందని ఈ తీర్పు చెప్పింది. ఆర్టికల్ 356 కింద ప్రభుత్వాలను రద్దు చేయుటను పార్లమెంటు రాష్ట్రపతి ప్రకటనను ఆమోదించిన అనంతరం మాత్రమే ఉచితమని సుప్రీంకోర్టు సలహా ఇచ్చింది. ఈ తీర్పులో ముఖ్యమైనవి. 1. రాష్ట్ర శాసనసభను రద్దు చేస్తూ రాష్ట్రపతి చేసిన ప్రకటన న్యాయపరిశీలనకు లోబడి ఉండును 2. రాష్ట్రపతి చేసిన ప్రకటన సహేతుకమైన అంశాలపై ఆధారపడి చేయబడినట్లు నిరూపించు బాధ్యత యూనియన్ ప్రభుత్వంపై ఉన్నది. 3. కోర్టులు ఈ సందర్భంలో సత్యాసత్య నిరూపణాన్వేషణ కోరరాదు. 4. రాష్ట్రపతి ప్రకటనను రద్దు చేసినచో కోర్టుకు తొలగించబడిన మంత్రివర్గాన్ని పునరుద్ధరణ చేయు అధికారం కలదు. 5. సంవిధాన వ్యతిరేక చర్యలలో నిమగ్నమైన ప్రభుత్వమును రాష్ట్రపతి ప్రకటనకు గురిచేయడం అనుచితం కాదు. 6. అధికార సంఖ్యాబలాన్ని కోల్పోయిన మంత్రివర్గంకు సంఖ్యాబలాన్ని శాసనసభలో నిరూపించుకొను అవకాశం సాధ్యమైనంతమేరకు ఇవ్వడం ప్రధానం. రాష్ట్రపతి చేసిన ప్రకటన సంవిధాన ఔచిత్యంతో సంబంధం లేనిదైనట్లు సద్భావనతో చేసిన ప్రకటన కానట్లు నిరూపణ అయితే కోర్టులు అట్టి ప్రకటనను సమర్థించకపోవచ్చు.

రాష్ట్రపతి పాలన విధించిన రెండు నెలల్లో పార్లమెంటు ఉభయసభల్లో దీనిని ఆమోదింపజేసుకోవలసి ఉంటుంది. రాజ్యసభలో బిజెపికి మెజారిటి లేనందున అదెలాగు వీగి పోతుంది. దానికితోడు అనర్హతలపై గౌహతి హైకోర్టు స్టేను అడ్డుకోబోమని సుప్రీంకోర్టు 19.02.16న స్పష్టం చేసింది. అయితే దీనికి సంబంధించిన రిట్ పిటిషన్లను సత్వరమే రెండు వారాల్లోపు పరిష్కరించమని సుప్రీంకోర్టు ఆదేశించింది. అంటే గౌహతి హైకోర్టు నుండి స్పష్టత లేదా తుది తీర్పు వచ్చే వరకు స్పీకర్ విధించిన ఎంఎల్ఎల అనర్హత చెల్లదన్నమాట. రాష్ట్రపతి పాలనను ఎత్తివేస్తూ కేంద్ర కేబినెట్ నిర్ణయం తీసుకుని రాష్ట్రపతికి సిఫారసు చేసింది. ఈ నేపథ్యంలో 19.02.16న సాయంత్రం రాష్ట్రపతి పాలన ఎత్తివేయబడింది. దీన్ని ఆసరాగా తీసుకుని 19.02.16న రాత్రికిరాత్రే గవర్నర్ ఇంట్లోనే కాంగ్రెస్ అసమ్మతి నేత కలిఖో పుల్‌తో గవర్నర్ ముఖ్యమంత్రిగా ప్రమాణ స్వీకారం చేయించేశారు. ఇలా చేయించేబదులు గత మంత్రిమండలిని పునరుద్ధరింపవచ్చుకదా. గత మంత్రిమండలిని కొనసాగిస్తూ అసెంబ్లీ సమావేశాలను కొనసాగించవచ్చు కూడా. ఆ మంత్రి మండలికి అసెంబ్లీలో బలనిరూపణ చేసుకునే అవకాశం ఇచ్చి ఉండవచ్చుకదా. కానీ బిజెపి ఉద్దేశ్యం అదికాదు. బిజెపి కనుసన్నల్లో నడిచే ప్రభుత్వం తద్వారా తన రాజకీయ ప్రాబల్యాన్ని విస్తృత పరుచుకోవడం, ఈశాన్య ప్రాంతాల్లో బలాన్ని పెంచుకోవడం తద్వారా సంఘ్ పరివార్ శక్తులకు మార్గం సులభతరం చేయడం కదా? గవర్నర్ తీసుకున్న ఈ నిర్ణయాన్ని ఎవరూ ప్రశ్నించకూడదని సాక్ష్యాత్తు రాజ్యాంగంలోని ఆర్టికల్ 163(2) సెలవిచ్చి ఉన్నది. దీన్ని బట్టి రాజ్యాంగం ఆదిపత్య శక్తుల చేతుల్లో ఎలా వికృతరూపం తీసుకుంటుందో తెలుస్తున్నది. రాజ్యాంగం దాని స్ఫూర్తితో సక్రమంగా అమలు చేయబడకపోతే తానే స్వయంగా తగలబెడతానని అంబేద్కర్ స్పష్టం చేసిన సంగతి ఈ సందర్భంలో గుర్తుకురాకమానదు.

కొన్నిసార్లు పాలకవర్గ పార్టీల్లోని వైరుధ్యాల వల్ల ప్రజాస్వామ్య డొల్లతనం, రాజ్యాంగ దుర్వినియోగం ఇలా బయటపడుతుంటాయి. కానీ నిజానికి వీరందరూ ఒకతాను గుడ్డలే. అధికారం కోసం ఎన్నికల్లో వైరి వర్గాలుగా ఉన్న వీరు తమ వర్గ ప్రయోజనాలను నెరవేర్చుకునే సందర్భంలో ఫిరాయింపులకు తెగబడతారని ఈ సందర్భం తెలియజేస్తున్నది. ఈ ప్రభుత్వాలు కోర్టులపై, రాజ్యాంగంపై, రాజ్యాంగ స్ఫూర్తిపై నమ్మకం, గౌరవం ఉన్నాయని ప్రకటిస్తాయి. వాటి ప్రకారమే నడుచుకుంటామని చెబుతుంటాయి. ఆర్టికల్ 356 దుర్వినియోగం విషయంలో ఇవన్నీ ఏం చేస్తున్నాయి? ఎస్సార్ బొమ్మై కేసు తీర్పును అనుసరించి సాధ్యమయ్యేంతవరకు గత ప్రభుత్వానికి సంఖ్యాబలాన్ని నిరూపించుకునే అవకాశం ఇవ్వడం ప్రధానం అన్న విషయాన్ని మరిచి గవర్నర్ రాత్రికి రాత్రి తన నివాసంలో అసమ్మతి నేత కలిఖో పుల్ చే ముఖ్యమంత్రిగా ప్రమాణ స్వీకారం చేయించడంలో ఔచిత్యం ఏమిటి. మొత్తంగా ఈ పార్టీలకు రాజ్యాంగమన్నా, ప్రజానుకూల కోర్టు తీర్పులన్నా, రాజ్యంగ నిర్మాత అంబేద్కర్ స్ఫూర్తి అన్నా లెక్కలేదని తెలుస్తున్నది. చట్టాల్లో, రాజ్యాంగంలో ఏవైనా లొసుగులున్నట్లైతే వాటిని అనుకూలంగా మలుచుకోవడం, వీలైనచోటల్లా రాజ్యాంగాన్ని అతిక్రమించడం, రాజ్యాంగ యంత్రాంగాలను తమ గుప్పిట్లో పెట్టుకోవడం, తమ అధికారాన్ని చెలాయించుకోవడం, తమ వర్గ ప్రయోజనాలను నెరవేర్చుకోవడాని సర్వ విధాల ప్రయత్నించడం అందుకోసం అన్ని ప్రజాస్వామిక వ్యవస్థలను సూత్రాలను కాలరాచేయడానికి ఏమాత్రం వెనుకాడకపోవడం జరుగుతున్నది.

ఆధిపత్య శక్తుల అనుకూల చట్టాలు చేయడం, సమాన విద్యను ఉచితంగా ప్రభుత్వం అందించకుండా ప్రైవేటు విద్యను ప్రోత్సహించడం, ఉచిత గుణాత్మక వైద్యాన్ని అందించడంలో శ్రద్ధ చూపకుండా ప్రైవేటు వైద్యాన్ని ప్రోత్సహించడం చూస్తుంటే రాజ్యాంగం ఎంతలా అభాసుపాలవుతుందో తెలుసుకోవచ్చు. ఈ విధానాలు సమాజంలోని అట్టడుగు వర్గాల వారికి, దళితులు, బిసి, ఆదివాసీలకు తీవ్ర హానిని, ద్రోహాన్ని చేస్తున్నాయి. అయినా ఇవన్నీ రాజ్యాంగం ప్రకారమే చలామణి అవుతుంటాయి. వారందరు రాజ్యాంగ బద్దులుగానే గుర్తించబడుతుంటారు. ఇవన్నీ భరించలేని సున్నిత మనస్కులు ఇవి రాజ్యాంగానికి, సమానత్వానికి వ్యతిరేకమైనవని, దేశ సంపదపై ప్రజలందరికి సమానమైన హక్కు ఉండాలని ప్రభుత్వ విధానాలను వ్యతిరేకిస్తే, వాటిని ఎదిరిస్తే, అందుకోసం పోరాడితే, ఆ పోరాటాలు కొన్నిసార్లు సాయుధ రూపాలను తీసుకుంటుంటే వాటిని జాతి వ్యతిరేకమైనవిగా, వారిని దేశద్రోహులుగా చిత్రీకరిస్తుంటారు. జైళ్లలో నిర్బందిస్తుంటారు. భారత రాజ్యాంగ పీఠికలో చెప్పినటువంటి సామాజిక, ఆర్థిక, రాజకీయ న్యాయం, సమానత్వమునకు భారత మెజారిటీ ప్రజలు నోచుకోవడం లేదు. కేవలం కొన్ని ఆధిపత్య వర్గాలు, ధనిక స్వామ్యం, ఫ్యూడల్ పెట్టుబడిదారీ శక్తులు వాటిని అనుభవిస్తున్నాయి. ప్రజాస్వామ్యం అనేది అందరికి చేరువలో లేదు. భావప్రకటనా స్వేచ్ఛ అనేది కొందరికే పరిమితం అవుతున్నది. మరెందరికో అది కట్టడి చేయబడుతున్నది.

*(రచయిత ఉపాధ్యాయులు)* వీ

# కాపుల ఉద్యమం - రిజర్వేషన్లు

***తమ రాజకీయ ఆధిపత్యం కోసం తెస్తున్న రిజర్వేషన్ల ఆందోళనల ద్వారా ఆర్థిక అసమానతల్లో మార్పు రాదని, భూపంపకం ద్వారానే ఆర్థిక, సామాజిక మార్పు సాధ్యమవుతుందని అంటున్నారు* షేక్ కరిముల్లా**

ఆంధ్ర రాష్ట్రంలో రిజర్వేషన్ల చిచ్చు రాజుకుంది. గెలుపే లక్ష్యంగా అలవికాని హామీలిచ్చి అధికారంలోకి వచ్చిన తెలుగుదేశం పార్టీ ఆ పర్యవసానాన్ని ఇప్పుడు ఎదుర్కుంటున్నది. రుణమాఫీ, బెల్టు షాపుల రద్దు, కాపులకు రిజర్వేషన్లు, బాబు వస్తే జాబు అంటూ ఎన్నికలలో టిడిపి చేసిన ప్రచారం గెలుపులో ప్రధాన పాత్ర పోషించాయి. అధికారం చేపట్టాక 20 నెలలై పోయినా వాటిని అమలు చేయలేక చంద్రబాబు ప్రభుత్వం చేతులెత్తేసింది. కాపు రిజర్వేషన్ల ఆందోళన మీద ఇప్పుడు పౌర సమాజంలో చర్చ జరుగుతున్నది. మొత్తం రిజర్వేషన్ల మీద వాడివేడి చర్చకు తెరతీసింది.

ఈ నేపథ్యంలో మరికొన్ని డిమాండ్లు కూడా ఊపందుకుంటున్నాయి. ముస్లింలు కూడా తమకు రిజర్వేషన్లు నాలుగు నుంచి ఎనిమిది శాతం పెంచాలంటూ రాష్ట్రవ్యాప్త ఆందోళనకు సిద్ధమవుతున్నారు. ఎస్సిల వర్గీకరణ చిచ్చుతో పాటు ఆ సామాజిక వర్గం 15 శాతం ఉన్న ఎస్సి రిజర్వేషన్లను మరింత పెంచాలని డిమాండ్ చేస్తోంది. బిసిల్లోని వడ్డెర కులస్థులు తమను ఎస్సిలుగా గుర్తించాలని చాలా కాలంగా పోరాటాలు చేస్తున్నారు. ఉమ్మడి రాష్ట్రంలో బుడగ జంగాలు బిసి కాగా తెలంగాణ ప్రభుత్వం వారిని ఎస్సిలుగా గుర్తించింది. ఆంధ్రప్రదేశ్‌లో మాత్రం బిసిలుగానే చూపుతున్నారని ఈ సామాజిక వర్గం నాయకులు ఆందోళన చెందుతున్నారు. తమను ఆంధ్రాలో కూడా ఎస్సిలుగా గుర్తించాలని బుడగ జంగాలు కోరుతున్నారు. ఇప్పుడు ఆంధ్ర జనాభాలో 20 శాతం పైగా ఉన్న కాపు సామాజిక వర్గాన్ని వెనుకబడిన తరగతుల్లో చేర్చితే తమకు అన్యాయం జరుగుతుందని బిసి కులాల నాయకులు ఆందోళన బాట పట్టారు. ఏ కులాన్నీ బిసి జాబితాలో చేర్చకూడదని రాష్ట్రంలో గతంలో బిసి జాబితాలో ఉన్న 83 కులాలు ప్రస్తుతం 144కు పెరిగాయని రిజర్వేషన్ శాతం యథాతథంగా ఉందని 52 శాతం ఉన్న బిసిలకు ఎన్నో హామీలిచ్చారని వాటి మాటేమిటని ప్రశ్నిస్తూ బిసి జనాభా దామాషా ప్రకారం రిజర్వేషన్ శాతాన్ని పెంచాలని డిమాండ్ చేస్తున్నారు.

ప్రజల మధ్య వైషమ్యం లేకుండా ఆయా సామాజిక వర్గాల జనాభా దామాషా పద్ధతిలో రిజర్వేషన్ విధానాన్ని రూపొందించి అమలు చేయాలని వారు న్యాయంగా కోరుతున్నారు. కాపులను బిసిల్లో చేర్చవద్దంటూ ప్లకార్డులు పట్టుకున్న అఖిల భారత యాదవ మహాసభ నేతలు నినాదాలు చేస్తూ విజయవాడలో జరిగిన బిసి రుణమేళా సభలో చంద్రబాబు ప్రసంగం మొదలు పెట్టిన వెంటనే పైకిలేచి నిరసన తెలిపారు. ఇదిలా ఉండగా, నేటి ప్రపంచీకరణ యుగంలో ప్రభుత్వ రంగం కుదించుకుపోయి, ప్రైవేట్ రంగం విస్తరిస్తున్న వేళ ప్రైవేట్ రంగంలోనూ రిజర్వేషన్లు కల్పించాలనే డిమాండ్ కూడా రిజర్వేషన్ వర్గాల నుండి వస్తూ ఉంది. ఇటీవల రాజస్థాన్‌లో గుజ్జర్లు, హర్యానాలో జాట్‌లు, హర్దిక్ పటేల్ నాయకత్వంలో గుజరాత్‌లో పటేళ్లు రిజర్వేషన్లు కల్పించాలనే డిమాండ్‌తో ఉద్యమించారు. ఇవి రిజర్వేషన్ విధానాన్ని నీరుగార్చే కుట్రలో భాగంగానే జరిగిన ఉద్యమాలు మండల్ కమిషన్ కాలంలో రిజర్వేషన్ వ్యతిరేక ఆందోళనలే జరిగాయి.

నేడు యువత ప్రజల మౌలిక సమస్యల మీద ఉద్యమించకుండా, సామాజిక సమస్యలకు మూలాలను అర్థం చేసుకోకుండా చదువులో, సిలబస్‌లో పసలేకుండా చేస్తూ సామాజిక శాస్త్రాలకు కాలం చెల్లిందని చెపుతూ, ఐటియే అన్నింటికి తారక మంత్రంగా జపం చేస్తూ, యువతను నిర్వీర్యపరుస్తూ పాలక వర్గాలు పబ్బం గడుపుకుంటున్నాయి. సినీ, క్రికెట్ అభిమాన సంఘాలంటూ, మద్యం పారిస్తూ వారు పోరాడకుండా చేస్తున్నారు. కుల, మతాలు, దేవుళ్లు (రామ జన్మభూమి) లాంటి సున్నిత అంశాల వైపు ప్రజల ఆలోచనలను మళ్లిస్తూ, ప్రజలు మౌలిక సమస్యల మీద పోరాడకుండా జాగ్రత్త పడుతున్నారు. ఈ సున్నిత అంశాలపై ప్రజల మధ్య వైరుధ్యాలు, అనైక్యతలు సృష్టిస్తూ ఐక్యతను దెబ్బతీస్తున్నారు. హర్దిక్ పటేల్ రిజర్వేషన్ ఆందోళన ఈ కోవకు చెందినదే. రక్తం బొట్టు చిందించకుండా మనిషి విధ్వంసం కావడం ఈ కాలపు యుద్ధనీతి. రెండవ ప్రపంచ యుద్ధానంతరం సామ్రాజ్యవాదం తన చేతికి మట్టి అంటకుండా మంద్రస్థాయి యుద్ధంలో భాగంగా ప్రగతి ప్రతీఘాతుక ఆందోళనకు పురుడు పోస్తుంటారు.

కుల, మత, ప్రాంతీయ తత్వం లాంటి వాటిని రాజకీయ నిరుద్యోగులు వారి స్వార్థ ప్రయోజనాలకు వాడుకోవడం చరిత్రకు కొత్తేమీ కాదు. తెలంగాణ ప్రజల ప్రత్యేక తెలంగాణ ఆకాంక్షను కెసిఆర్ వాడుకోవడం మనం ఇటీవల చూశాం. ప్రజల మౌలిక సమస్యలు పరిష్కరించని ఈ రిజర్వేషన్ ఆందోళనలను కూడా ఇందులో భాగంగా చూడాలి. ఐనా ఈ సందర్భంగా రిజర్వేషన్ల పునాది, చరిత్రను, తాత్వికతను పరిశీలించడం అవసరం.

**రిజర్వేషన్ల చరిత్ర**

3000 సంవత్సరాలుగా ఈ దేశాన్ని తమ గుప్పిట బిగించిన బ్రాహ్మణీయ భావజాలం నిమ్న వర్గాల శ్రామిక ప్రజానీకాన్ని బానిసల కంటే హీనంగా చూసింది. బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులుగా ప్రజలను విభజించి, వారు చదువుకొని గౌరవంగా జీవించే హక్కును లేకుండా చేసింది. మెడలో ముంత, ముడ్డికి చీపురులు కట్టుకుని వీధుల్లో జంతువుల్లా నడవాలని ఆజ్ఞాపించింది. నిమ్న వర్గాలకు హిందూ దేవాలయాల్లోకి ప్రవేశాన్ని నిరాకరించింది. మను ధర్మశాస్త్రం పేరిట

క్రూరమైన శిక్షా స్మృతులను అమలు చేసింది. చదివినా, విన్నా చెవుల్లో సీసం పోయడం, నాలుకలు తెగ్గోయడం లాంటి పాశవిక చర్యలకు పాల్పడింది. ఈ చర్యల వలన 90 శాతం మంది నిమ్న వర్గాల ప్రజలకు అక్షర జ్ఞానం అందకుండా పోయింది. ఈ దేశంలోని మెజారిటీ శ్రామిక ప్రజలు అత్యంత విషాదకర దయనీయమైన స్థితిలో జీవిస్తున్న ఈ ప్రజలను చూసి చలించిన ఆనాటి సామాజిక విప్లవకారులు ఈ దేశ మూలవాసులకు అండగా నిలబడి, వారి అభివృద్ధికి అనేక ఉద్యమాలు నిర్వహించడం జరిగింది. హిందూ మతంలోని అమానుషమైన అణచివేతలకు వ్యతిరేకంగా బుద్ధుడి నుండి మహాత్మా జ్యోతిరావు పూలే, నారాయణగురు, పెరియార్, సాహు మహారాజ్, బి.ఆర్. అంబేద్కర్ వరకు జరిపిన అనేక ఉద్యమాల ఫలితంగా అణగారిన కులాల ప్రజలు చైతన్యవంతులై సంఘటితంగా ఉద్యమించడం ద్వారా చదువుకునే హక్కు లభించి, 1853లో మెకాలే విద్యా విధానం ప్రవేశం ద్వారా ప్రారంభమైంది. మొదటి సారిగా పూలే 1852లో నిమ్న ప్రజల కోసం ఒక పాఠశాలను ప్రారంభించారు. 1873 'సత్య శోదక్ సమాజ్' ద్వారా అవిరళ కృషి చేసిన గొప్ప మహా పురుషుడు పూలే.

ఈ నేపథ్యంలో 1857 తిరుగుబాటులో అణగారిన వర్గాల ప్రజలు, ముస్లింలు కుల, మతాలకు అతీతంగా పాల్గొని, బ్రిటిష్ పాలకులను గడగడలాడించారు. ఇది గమనించిన బ్రిటిష్ వారు ఈ వర్గాల ప్రజలను శాంత పరచడం కోసం ప్రయత్నాలు మొదలు పెట్టారు. క్రైస్తవ మిషనరీల ద్వారా విద్యను అందించడం ప్రారంభమైంది. 1878లో సర్ సయ్యద్ అహ్మద్‌ఖాన్‌ను బ్రిటిష్ కౌన్సిల్ సభ్యునిగా అందలం ఎక్కించారు. 1886లో ముస్లిం ఎడ్యుకేషనల్ కాన్ఫరెన్స్ నిర్వహించారు. విద్యా, ఉద్యోగ రంగాల్లో ముస్లింలు ప్రాతినిధ్యం పెరగాలని అందుకు ఇంగ్లీష్ విద్యను అభ్యసించాలనీ తీర్మానించారు. ముస్లింలకు ప్రత్యేక నియోజక వర్గాలు కావాలనే రాజకీయ డిమాండ్ కూడా ఈ వర్గం నుంచి వచ్చింది. ఫలితంగా 1909 'మింటో మార్లే' సంస్కరణల ద్వారా ముస్లింలకు ప్రత్యేక నియోజక వర్గాలు లభించాయి. ఆ తర్వాత సిక్కు, క్రైస్తవ మతస్థులు కూడా తమకు ప్రత్యేక నియోజక వర్గాలు కావాలనే డిమాండ్‌ను బ్రిటిష్ ప్రభుత్వం ముందు పెట్టారు. అదే విధంగా తమ జనాభా దామాషా ప్రకారం విద్య, ఉద్యోగాలలో ప్రత్యేక అవకాశాలు, కేటాయింపులు ఉండాలని డిమాండ్‌తో పాటు ఉద్యమించారు.

**సంస్థానాలు – సాహు మహారాజ్ కృషి**

1874 జూలై 16న జన్మించిన కొల్లాపూర్ రాజు సాహు మహారాజ్ పూలే ఆశయాన్ని మరింత ముందుకు తీసుకుని పోయాడు. విద్యా రంగంలో, పరిపాలన రంగంలో బ్రాహ్మణ ఆధిక్యతలను తొలగించాలంటే శూద్ర కులాలను విద్యావంతులను చేయడమొక్కటే పరిష్కారమని భావించిన సాహు మహారాజ్ తన రాజ్యంలో 1901లో జైన్ హాస్టల్, విక్టోరియా హాస్టల్, 1906లో ముస్లిం హాస్టల్, 1921లో సోనాల్ హాస్టల్‌ను ప్రారంభించాడు. తద్వారా 1894లో 2,522 మంది బ్రాహ్మణ విద్యార్థులు, 2088 మంది బ్రాహ్మణేతర విద్యార్థులుండగా, 1922 నాటికి ఆ సంఖ్య 24,027కు పెరగడం జరిగింది. ఈ కాలంలోనే 11 మంది శూద్ర ఉద్యోగుల సంఖ్య 59 వరకు పెరగడం చూస్తే అవకాశాలను కల్పిస్తే శూద్రులు ఎంతగా అందిపుచ్చుకుంటారో తెలియజేస్తుంది. అలాగే ఈ దేశ చరిత్రలోనే తొలిసారిగా కింది కులాలకు ఉద్యోగాలలో 1902లో 50 శాతం అవకాశం కల్పించుతూ బ్రాహ్మణీయ వట వృక్షాన్ని కూకటి వేళ్లతో పెకలించి విప్లవాత్మక మార్పుకు మూల కారకుడయ్యాడు. దీనిపై 'కేసరి' పత్రికలో తిలక్ విమర్శిస్తూ 'ఉద్యోగాలలో బ్రాహ్మణేతరులను నియమించడం ద్వారా ప్రతిభ దెబ్బతింటుందని గగ్గోలు పెట్టాడు. కానీ సాహు మహారాజ్ ఇటువంటి విమర్శలను ఇసుమంత కూడా లెక్క చేయలేదు.

బ్రాహ్మణ వర్గాలు నిమ్న వర్గాల పిల్లలు చదువుకోవడానికి బడికి వెళ్తే మా పొలాల్లో పని చేసేది ఎవరు? అని తమ అహంకారాన్ని చాటారు. కానీ సాహు మహారాజ్ తన ఉదారతను చాటుకుంటూ బ్రాహ్మణేతర కులాల పిల్లలకు ప్రత్యేక హాస్టళ్లను ఏర్పాటు చేసి, అందరికీ విద్యను అందించడానికి అవిరళ కృషి చేశాడు. 1902లో రిజర్వేషన్ చట్టం తెచ్చాడు. 1902 నుంచి 1922 వరకు నిర్దిష్టమైన చర్యలు చేపట్టాడు. దీంతో నిమ్న వర్గాలు అస్పృశ్యులు విద్యా వంతులు కావడంతో బ్రాహ్మణ కులాల్లో కలవరం మొదలైంది. ఈయనకు తోడు 1885లో బరోడా సంస్థానానికి రాజైన గైక్వాడ్ నిమ్న కులాలకు విద్యను అందించడానికి 30 పాఠశాలలు ప్రారంభించాడు. ఈ చర్యలతో తిన్నగా సంస్థానాలలో, బ్రిటిష్ ప్రభుత్వంలో బ్రాహ్మణేతరులు ప్రవేశించారు. సాహు అస్పృశ్యత నిర్మూలనకు కూడా కృషి చేశాడు. అందరూ ఒకే పాఠశాలలో చదువుకోవాలనే 'కామన్ స్కూల్' విధానం ప్రవేశ పెట్టాడు. 1919లో అస్పృశ్యత నేరమని చట్టం చేశాడు. 1920లో వెట్టిచాకిరీ నిర్మూలన చట్టం చేశాడు. ఈ రకంగా ఆనాటి సమాజాన్ని స్పష్టమైన సామాజిక అవగాహనతో రిజర్వేషన్ల ఆవశ్యకతను ప్రపంచానికి చాటి ఎన్ని అడ్డంకులు ఎదురైనా అమలు చేసి చిరస్మరణీయుడైనాడు సాహు. వీరి కృషి మూలంగా 1914, 1916లలో 25 శాతం ఉద్యోగాలను వెనుకబడిన కులాల వారికి రిజర్వు చేశారు.

1927లో వచ్చిన సైమన్ కమిషన్ రిజర్వేషన్ విధానం మీద పరిశీలనకు వచ్చింది. నిమ్న కులాలు తమకు ప్రత్యేక నియోజక వర్గాలను ఏర్పాటు చేయాలని విజ్ఞప్తులు ఇచ్చాయి. అయితే సైమన్ కమిషన్‌లో సభ్యులుగా భారతీయులు ఎవరు లేరనే సాకుతో జాతీయ కాంగ్రెస్ హిందూ మహాసభ (ఆర్ఎస్ఎస్‌కు పూర్వ రూపం) అగ్రవర్ణాలు దీనిని బహిష్కరించి 'సైమన్ గో బ్యాక్' అని నినదించాయి. కానీ తమిళనాడు, ఆంధ్రప్రదేశ్‌లో జస్టిస్ పార్టీ, పెరియార్ రామస్వామి, అంబేద్కర్ ఈ కమిషన్‌కు స్వాగతం పలికారు. కమిషన్‌కు, నిమ్న కులాలకు జరుగుతున్న అన్యాయాన్ని వివరించారు. ఈ విషయాన్ని గ్రహించిన కమిషన్ అణగారిన వర్గాలకు కౌన్సిల్‌లో సరైన ప్రాతినిధ్యం లేదని 1929లో బ్రిటిష్ ప్రభుత్వానికి నివేదించింది. ఈ విషయంపై సమగ్రంగా చర్చించి, నిర్ణయాలు చేయడానికి 1930, 1931, 1932 రౌండ్ టేబుల్ సమావేశాలు జరిగాయి. మత పరమైన ప్రత్యేక నియోజక వర్గాల ఏర్పాటు విషయంలో ఏకాభిప్రాయం కుదరలేదు.

1932లో బ్రిటిష్ ప్రధాని రామ్సే మెక్డోనాల్డ్ భారత శాసన సభలలో మైనారిటీలకు, దళిత జాతులకు రిజర్వేషన్లు ఏర్పాటు చేశాడు. దీనినే 'కమ్యునల్ అవార్డు' అన్నారు. దీని ప్రకారం ముస్లింలకు, నిమ్న కులాల వారికి ప్రత్యేక ఓటర్ల విభాగాలు కూడా ఏర్పాటు చేశారు. దీనిని వ్యతిరేకిస్తూ గాంధీజీ ఎరవాడ జైలులో ఆమరణ నిరాహార దీక్ష ప్రారంభించాడు. 1932 సెప్టెంబర్ 24న అంబేద్కర్ గాంధీజీతో మాట్లాడి ఈ కమ్యునల్ అవార్డును ఉపసంహరించుకుంటున్నట్లు తప్పనిసరై అంబేద్కర్, గాంధీతో ఒప్పందం చేసుకోవాల్సి వచ్చింది. ఇదే పూనా ఒడంబడిక ఈ విధంగా ఇది నీరుకారి పోయింది.

ఇక రిజర్వేషన్ల విషయంలో అంబేద్కర్ కృషి అజరామరం. తాను స్వయంగా అనుభవించిన సామాజిక వివక్షత మునుముందు నిమ్న కులాల ప్రజలకు రాకూడదని అవిరళ కృషి చేశాడు. రిజర్వేషన్ల ఆవశ్యకతను, అవసరాన్ని నొక్కి చెప్పాడు. ఆనాటి అగ్రవర్ణాలను

ఒప్పించాడు. రాజ్యాంగ పరిషత్ సమావేశాలలో విస్తృతమైన చర్చ చేసి, రిజర్వేషన్లకు సామాజిక, సైద్ధాంతిక దృక్పథాన్ని అలవరచి అణగారిన వర్గాలకు రిజర్వేషన్లు అందడానికి కావాల్సిన తాత్విక పునాదిని రాజ్యాంగంలో పొందుపరిచి, బహుజనులు గౌరవంగా బతకాలని కలలు కన్న మహనీయుడు డా. బాబా సాహెబ్ అంబేద్కర్.

**స్వాతంత్ర్యానంతరం రిజర్వేషన్లు**

సామాజిక ఆర్థిక వెనుకబాటు తనాన్ని గుర్తించడానికి కులం, పేదరికం, వృత్తి సామాజిక వివక్షతను ప్రాతిపదికగా తీసుకున్నారు. 1950 నాటికి 139 బిసి కులాలను గుర్తించారు. 1953 జనవరి 29న ఆర్టికల్ 340 ప్రకారం మొదట బిసి కమిషన్‌ను కాకా కాలేల్కర్ చైర్మన్‌గా వేయడంతో బిసి కులాల జనాభా లెక్కింపు జరిగింది. 1955లో కమిషన్ తన నివేదికను సమర్పించింది. రిజర్వేషన్ల అమలు ఏమాత్రం ఇష్టంలేని నాటి నెహ్రూ ప్రభుత్వం కమిషన్ రిపోర్టును కనీసం పార్లమెంటులో చర్చకు పెట్టకుండా బుట్టదాఖలు చేసి, రిజర్వేషన్ల అమలు బాధ్యతను రాష్ట్రాల పరిధిలోకి మారుస్తూ చేతులు దులుపుకుంది. దీనిని బట్టి రిజర్వేషన్ల అమలు కుట్ర ఇక్కడి నుండే ప్రారంభమైంది. 1978లో అధికారంలోకి వచ్చిన మొరార్జీ దేశాయ్ ప్రభుత్వం తాను ఎన్నికలలో హామీ ఇచ్చిన కాకా కాలేల్కర్ కమిషన్ సిఫార్సులు అమలు జరపకుండా 1978లో బీహార్ మాజీ ముఖ్యమంత్రి బిపి మండల్ ఆధ్వర్యంలో 2వ బిసి కమిషన్‌ను నియమించింది. 1980 డిసెంబర్ 31న ఇందిరాగాంధీకి మండల్ నివేదికను సమర్పించారు. ఈమె సైతం తండ్రి బాటలోనే నడిచి కమిషన్ సిఫార్సులు బుట్ట దాఖలు చేసింది. తదుపరి రాజీవ్‌గాంధీ పితరులను అనుసరించాడు తప్ప మండల్ కమిషన్ మొహం చూడలేదు. తదుపరి స్వాతంత్ర్యానంతరం 43 ఏళ్ల తర్వాత మండల కమిషన్ అమలుకు కట్టుబడి ఉన్నానని 1990 ఆగస్టు 7న నేషనల్ ఫ్రంట్ ప్రభుత్వం తరపున నాటి ప్రధాని విపి. సింగ్ ప్రకటించారు. ఇంకేముంది కొంపలంటుకున్నట్లు అగ్రకుల లాబీ భగ్గుమంది. రిజర్వేషన్లు ప్రతిభను దెబ్బతీస్తాయని, మేధావులు వలసపోతారని కోడై కూస్తూ దేశ వ్యాప్త బంద్‌లు, ధర్నాలు, ఆత్మాహుతి యత్నాలలో దేశం అట్టుడికి పోయింది. చిరవకు వి.పి. సింగ్ గద్దెదిగాల్సి వచ్చింది. ఎన్ని కుట్రలు జరిగినా సుప్రీం కోర్టు ఒబిసిలకు 27 శాతం రిజర్వేషన్లను ఖరారు చేయడమయింది.

ఆంధ్రప్రదేశ్‌కు సంబంధించి 1966లో బిసి రిజర్వేషన్ల కొరకు అనంత రామన్ కమిషన్, 1968లో మనోహర్ ప్రసాద్ కమిషన్, 1981లో మురళీధర్ కమిషన్‌లు బిసి రిజర్వేషన్‌లకు అనుకూల నివేదికలు ఇచ్చినా, చిత్తశుద్ధి లేని ప్రభుత్వాలు అమలుకు పూనుకోలేదు. 1986లో ఎన్‌టి. రామారావు మురళీధర్ కమిషన్ సిఫార్సుల మేరకు 25 శాతం నుండి 44 శాతానికి బిసి రిజర్వేషన్లు పెంచుతూ జిఒ జారీ చేయగా రిజర్వేషన్ వ్యతిరేక ఆందోళనలు జరిగాయి. చివరికి హైకోర్టు ఈ జిఒను కొట్టివేసింది. జనాభాలో 50 శాతంగా ఉన్న బిసి ప్రజలకు న్యాయంగా రావలసిన 50 శాతం రిజర్వేషన్లు 69 సంవత్సరాల స్వాతంత్ర్యానంతరం ఇప్పటికీ దక్కలేదు. వారికి రావలసిన మిగతా 25 శాతం రిజర్వేషన్లు అగ్రవర్ణాలే అనుభవిస్తున్నాయి. ఇక కాపులకు రిజర్వేషన్లు 1919 నాటికే తెలగ, బలిజ, నాయుడు, మున్నూరు కాపు, బంటరి, తూర్పుకాపు ఈ తెగలను వెనుకబడిన వారిగా గుర్తించగా ఆంధ్రప్రదేశ్ అవతరణ (1956)తో ఈ సౌకర్యం రద్దయింది. నాటి ముఖ్యమంత్రి నీలం సంజీవరెడ్డి వీరిని బిసి జాబితా నుండి తొలగించారు. తిరిగి 1961లో ఈ తెగలను బిసిలుగా గుర్తించగా మళ్లీ 1966లో బ్రహ్మానందరెడ్డి రద్దు చేశారు. తిరిగి 1994లో కోట్ల విజయభాస్కర్‌రెడ్డి ముఖ్యమంత్రిగా ఉన్న సమయంలో కాపులను బిసిలుగా గుర్తిస్తూ జిఒ 30 ఇచ్చారు. బిసిలు దీనిని హైకోర్టులో సవాలు చేయగా, 1995 ఏప్రిల్ 17న కోర్టు ఓ కమిషన్ వేసి అన్ని విషయాలు సమగ్ర అధ్యయనం చేసి సాధ్యా సాధ్యాల్ని పరిశీలించి రిజర్వేషన్లు కల్పించాలని సూచించింది. అప్పటి నుండి ఈ సమస్య నానుతూనే ఉంది. ఈ మధ్య కాలంలో 1993 – 2003 వరకు పుట్ట స్వామి కమిషన్, 2004 – 2011 వరకు దాల్వ సుబ్రమణ్యం కమిషన్‌లు పనిచేశాయి. చివరకు ఈ కమిషన్‌లు కూడా కాల గమనంలో కలిసిపోయాయి తప్ప ఒరిగింది ఏమీలేదు. చిత్తశుద్ధి లేని అగ్రవర్ణ పాలకులు కాలయాపన తప్ప చేసిందేమీలేదనేది చరిత్ర చెప్పిన వాస్తవం. ఇప్పుడు తాజాగా ఉద్యమిస్తున్న కాపునేత ముద్రగడ 1988 నుంచి కాపులను బిసిలుగా గుర్తించాలని కోరుతున్నారు. 2014 ఎన్నికలలో చంద్రబాబు కాపులను బిసిల జాబితాలో చేరుస్తానని హామీ ఇచ్చారు. అధికారంలోకి వచ్చిన 20 నెలలు అయినా ఎటువంటి చర్యలు తీసుకోకపోవడంతో కాపులు ఉద్యమించారు. అవాంఛనీయ సంఘటనలు జరగడంతో దిగివచ్చిన చంద్రబాబు హడావుడిగా కెఎల్. మంజునాథ్ కమిటీ వేసి, తొమ్మిది నెలల్లో నివేదిక ఇవ్వమని ఆదేశించారు. ఈ కమిటీ కూడా ఏమవుతుందో భవిష్యత్తు చెప్పాలి. ఈ నేపథ్యంలో పౌర సమాజంలో దీనిమీద చర్చ జరుగుతున్న వేళ రిజర్వేషన్లు ఎందుకు? వాటి ఆవశ్యకత ఏమిటి? సామాజిక న్యాయానికి రిజర్వేషన్లే శరణ్యమా? మొత్తంగా పేదల విముక్తి మార్గం ఏమిటి అనే ప్రశ్నలు ఉదయిస్తాయి. ఈ వెలుగులో ఈ సమస్యను పరిశీలిద్దాం.

**రిజర్వేషన్లు ఆవశ్యకత**

తరతరాలుగా విద్యకు, సంపదకు దూరమై సమాజానికి దూరంగా ఉంటూ, నిచ్చెనమెట్ల వ్యవస్థలో కుల వివక్షతతో సామాజిక అణచివేతలకు గురై, అణగారిన కులాల వారికి రిజర్వేషన్ల ద్వారా సమాన హోదా, సమాన అవకాశాలు కల్పించాలని రాజ్యాంగ నిర్మాతల అభిప్రాయం. రాజ్యాంగంలో ప్రజలందరికీ సాంఘిక, ఆర్థిక, రాజకీయ న్యాయాన్ని అందించాలని రాసుకున్నాం. (నిబంధన – 38). అలాగే బలహీన వర్గాల ప్రజల విద్యా సామాజిక అభివృద్ధికి శ్రద్ధ చూపాలని రాసుకున్నాం. (నిబంధన – 46). ఈ రాజ్యాంగ స్ఫూర్తిననుసరించి రిజర్వేషన్లు ఏర్పరచినారు తప్ప బిక్షకాదు. రాజ్యాంగం ప్రకారం ఒక కులాన్ని బిసి జాబితాలో చేర్చాలంటే రెండు ప్రాతిపదికలున్నాయి. (1) ఏదయినా కులానికి దాని జనాభా ప్రకారం విద్య, ఉద్యోగ, రాజకీయ రంగాలలో ప్రాతినిధ్యం లేకపోతే ఆ కులాన్ని బిసి జాబితాలో చేర్చవచ్చుని రాజ్యాంగం నిర్దేశించింది. (2) సామాజిక వివక్షతకు గురవుతున్న కులాలకు రిజర్వేషన్లు కల్పించడం ద్వారా అధికారం ఇచ్చి సామాజిక గౌరవం పెంచాలనేది మరో నిర్దేశం. కాబట్టి ఇవాళ కొత్తగా రిజర్వేషన్లు అడుగుతున్న వర్గాలు తమకు ఈ వెనుకబాటు తనం ఉందో లేదో చూసుకోవాలి. (అర్హత) పై రెండు ప్రాతిపదికలకు భిన్నంగా ఏ కులాన్ని కూడా బిసి జాబితాలో కలపడం రాజ్యాంగ విరుద్ధం. ఒకవేళ రాజకీయ లబ్ధికోసం అర్హతలేని వర్గాలకు రిజర్వేషన్లు ఇచ్చినా, అవి కోర్టుల్లో నిలబడవు.

**రిజర్వేషన్ల అమలు పరిశీలన**

ఇంత వరకు భారతదేశంలో అధికారంలోకి వచ్చిన ప్రభుత్వాలు గానీ, ప్రభుత్వ పాలసీలను, పథకాలను అమలు చేసే ప్రభుత్వాధికారులు గాని రిజర్వేషన్ల వెనుక ఉన్న ఈ సామాజిక, ఆర్థిక, మానవీయ కోణాల్ని

పరిశీలించడం లేదు. ఉదారవాదులైన అగ్రవర్ణాల ప్రజలలో సైతం వ్యతిరేక ధోరణి గూడు కట్టుకుని ఉంది. తరతరాలు బ్రాహ్మణీయ భావజాలం ఈ వ్యవస్థలో నాటుకుపోవడమే ఇందుకు కారణం. అందుకే స్వాతంత్ర్యం వచ్చి 69 ఏళ్లు దాటినా రిజర్వేషన్లు సక్రమంగా అమలు కావడం లేదు. కేంద్ర ప్రభుత్వ సర్వీసుల్లో ఏ వర్గాలు ఎన్ని ఉద్యోగాలు చేస్తున్నారో పరిశీలిస్తే విషయం అర్థమవుతుంది. క్లాస్ - 1 ఉద్యోగాల్లో ఎస్‌సి, ఎస్‌టిలు 6 శాతం, బిసిలు 5శాతం, ఒసిలు 89 శాతం. క్లాస్ - 2 ఉద్యోగాల్లో ఎస్‌సి, ఎస్‌టిలు 18.18 శాతం, బిసిలు 10.63 శాతం, ఒసిలు 74.19 శాతం. క్లాస్-3 ఉద్యోగాలలో ఎస్‌సి, ఎస్‌టిలు 2.33 శాతం, బిసిలు 18.98 శాతం, ఒబిసిలు 78.70 శాతం. మొత్తం మీద ఎస్‌సి, ఎస్‌టిలు 11.9 శాతం, బిసిలు 12.55 శాతం, ఒబిసిలు 75.55 అంటే జనాభాలో 25 శాతంగా ఉన్న ఎస్‌సి, ఎస్‌టిలకు 11.91 శాతం, 50 శాతంగా ఉన్న బిసిలకు 12.55 శాతం ఉద్యోగాలు మాత్రమే ఉండగా జనాభాలో కేవలం 25 శాతం ఉండే అగ్ర కులాలకు 75.55 శాతం ఉద్యోగాలున్నాయి. అదీ ఎస్‌సి, ఎస్‌టి, బిసిలకు ఉన్న ఉద్యోగాలు కూడా ఎక్కువగా 3, 4 తరగతి ఉద్యోగాలు మాత్రమే. దేశవ్యాప్తంగా ఉద్యోగాల భర్తీలో రిజర్వేషన్ల వర్గాలకు (ఎస్‌సి, ఎస్‌టి, బిసిలను) మంచి ర్యాంకులు వచ్చిన వాళ్లకు ఓపెన్ కేటగిరిలోకి రాకుండా కేవలం రిజర్వేషన్ కేటగిరిలోనే పరిమితం చేసే కుట్రలు స్వాతంత్ర్యం వచ్చినప్పటి నుండి జరుగుతూనే ఉన్నాయి.

ఇక రాజకీయ రిజర్వేషన్లు చూస్తే ఎస్‌సి, ఎస్‌టిలకు రాజ్యాంగ బద్ధ రక్షణ ఉంది కానీ, బిసిలకు ప్రధానమైన అసెంబ్లీ, పార్లమెంట్ స్థానాలలో రాజ్యాంగ బద్ధ రక్షణ లేదు. ఫలితంగా వారి ప్రాతినిధ్యం కేవలం నామమాత్రమే. 73, 74 రాజ్యాంగ సవరణల ద్వారా స్థానిక సంస్థలలో మాత్రమే రిజర్వేషన్లు కల్పించబడ్డాయి. కాబట్టి దేశ జనాభాలో 50 శాతానికి పైగా ఉన్న వీరికి చట్ట సభలో ప్రాతినిధ్యం లేకపోవడం అన్యాయం. వాస్తవ పరిస్థితి ఇలా ఉంటే ఉన్న అరకొర రిజర్వేషన్లను నీరుకార్చే రిజర్వేషన్ వ్యతిరేక ఆందోళనలు జరగడం అమానుషం. పై పెచ్చు ప్రతిభ దెబ్బతింటుందని తప్పుడు ప్రచారం చేస్తున్నారు. అసలు ప్రతిభ అంటే ఏమిటి? శ్రమజీవులైన రైతు పంటలు పండించి, పది మందికి అన్నం పెట్టడంలో ప్రతిభ లేదా? కుండలు తయారు చేయడంలో కుమ్మరన్నకు ప్రతిభ లేదా? మురికి బట్టలు ఉతికి ఇస్త్రీ చేసే చాకలి వృత్తిలో, అందంగా వెంట్రుకల్ని కత్తిరించే మంగలన్నకు ప్రతిభ లేదా? రంగు రంగుల వస్త్రాలు, బట్టలు నేసే సాలన్నకు, జంతు చర్మాలను శుద్ధి చేసి చెప్పులు కుట్టే మాదిగన్నకు ప్రతిభ లేదా? వీరి శ్రమైక జీవన సౌందర్యాన్ని ఖరీదు కట్టే షరాబు ఉన్నాడా? వీరంతా వారి వృత్తిని శ్రమను సామాజిక బాధ్యతగా గుర్తించి చేశారు. తరతరాలుగా సమాజ పురోగమనంలో భాగమయ్యారు.

ఇక ప్రతిభావంతులైన అగ్రవర్ణాల వారే ఈ దేశాన్ని ఏ అడ్డూ అదుపు లేకుండా ఇప్పటి వరకు ఏలారు. సహజ సంపద, వనరుల నుండి కూడా ఈ దేశం ఏమాత్రం అభివృద్ధికి నోచుకోకపోవడం, మనకంటే తక్కువ వనరులున్న దేశాలు అభివృద్ధి పథంలో ముందుండడం చూస్తుంటే అది వారి ప్రతిభకో, ప్రతిభా రాహిత్యానికో అద్దం పట్టట్లేదా? మొత్తంగా ఈ దేశాన్ని హోల్‌సేల్‌గా స్వదేశీ, విదేశీ గుత్త కార్పొరేట్ శక్తులకు అప్పనంగా అప్పజెప్పడం, లక్షల సంఖ్యలో రైతులు ఆత్మహత్యలు చేసుకుంటుంటే గుడ్లప్పగించి చూడడం తప్ప ఏమీ చేయలేని వీరి స్థితిని ఏ రకం ప్రతిభ అనాలి? ఇక్కడ పుట్టి ఈ గాలి, ఈ నీరు, ఇక్కడి వనరులు వాడుకుని పైకొచ్చి డాలర్ల వెంపర్లాటలో కన్నతల్లి లాంటి జన్మభూమిని వదిలి యూరప్ దేశాలకు ఊడిగం చేయడానికి వెళ్లిన వీరి ప్రతిభను ఏమనాలి. కాబట్టి ప్రతిభ వాదనలో ఏమాత్రం వాస్తవం లేదు. ఇప్పటికైనా, వాస్తవాలను గుర్తించి రిజర్వేషన్లను సక్రమంగా అమలు చేసే పటిష్ట విధానం రూపొందించాలి. అణగారిన వర్గాలు అభివృద్ధి చెందకుండా ఈ దేశం అభివృద్ధి చెందదు. స్వాతంత్ర్యం వచ్చి ఏడు దశాబ్దాలు గడుస్తున్నా దేశం దాదాపు అన్ని రంగాలలో వెనుకబడి ఉండడానికి ప్రధాన కారణం నిమ్న కులాలు, మైనారిటీ ప్రజలు అభివృద్ధి చెందకపోవడం మూలంగానే అనేది కాదనలేని చేదు వాస్తవం. ఇప్పటికైనా కళ్లు తెరిచి కులాల, తెగల వారీగా జనాభా లెక్కలు సేకరించి వారి వారి జనాభా దామాషా ప్రకారం అగ్రవర్ణాలకు సైతం రిజర్వేషన్లు కేటాయించి రాజ్యాంగంలో చేర్చి పటిష్టంగా అమలు చేసి రాజ్యాంగ స్ఫూర్తి అయిన సామాజిక ఆర్థిక సమానత్వాన్ని సాధించాలి.

**రిజర్వేషన్లే పరిష్కారమా?**

స్వాతంత్ర్యం వచ్చి ఏడు దశాబ్దాలు గడిచినా నిమ్న కులాల జీవితాల్లో వెలుగు రాలేదు. ప్రపంచీకరణ మూలంగా వ్యవసాయం, చేతి వృత్తులు దెబ్బతిన్నాయి. వ్యవసాయ భూములు లేక కనీస అక్షర జ్ఞానం లేక అటు ఆర్థికంగా, ఇటు సాంఘికంగా, విద్యా, ఉద్యోగాల పరంగా, రాజకీయంగా నిమ్న కులాలు వెనుకబడి పోయాయి. ఇదే తరుణంలో బ్రిటిష్ కాలంలో వచ్చిన జమీందారీ, రైత్వారీ చట్టాల వలన ఆంధ్ర ప్రాంతంలో శూద్రకులాలు అయినప్పటికీ కమ్మ, రెడ్డి, వెలమ, కాపు కులాల వారికి వ్యవసాయ భూములపై యాజమాన్య హక్కులేర్పడి వారు ఆర్థికంగా, రాజకీయంగా అభివృద్ధి చెందారు. భూమిలేని కారణంగా అణగారిన కులాలు వెనుకబడి పోయారు. భూ సంస్కరణలు బూటకమని తేలిపోయింది. ఫలితంగా సామాజిక న్యాయం కలగానే మిగిలిపోయింది. భూ పంపిణీ జరగకుండా ఈ దేశంలో ఆర్థిక, సామాజిక సమానత్వం రాదు. వ్యవసాయాధారిత దేశంలో భూమికి సామాజిక న్యాయానికి ఉన్న సంబంధం ఇదే. సామాజిక న్యాయానికి, భూమికి అవినాభావ సంబంధమున్నది. ఎందుకంటే మానవ జాతికి, సమస్త జీవులకు జీవనాధారమైనది భూమి. చరిత్రను పరిశీలిస్తే నిరంతరం పరివర్తనం, మార్పులు, దశలు అన్ని భూమిపై ఆధిపత్యం కోసం జరిగిన పోరాటాలతో పరిణామం చెందినవే. మనిషి జీవన్మరణాలు, సమస్తం భూమి చుట్టూ తిరుగుతూ వస్తున్నాయి. చరిత్రలో విజ్ఞానం, వికాసం, విధ్వంసం, విప్లవం ఏదైనా భూమి కోసమే జరిగాయి. జరుగుతాయి. ఎందుకంటే భూమి అంటే నేల మాత్రమే కాదు. మట్టిలో నుంచి పుట్టిన సమస్త జ్ఞానం. సమిష్టి జీవనం. కళలు, సంస్కృతి, సకల శాస్త్రాల జ్ఞాన సముదాయం మొత్తం జీవనానికి జీవధాతువు.

అనాదిగా భూమిని ఆక్రమించుకోవడం, దోచుకోవడం జరుగుతూ వస్తోంది. ఇలా భూమితోపాటు, భూమిపై బతుకుతున్న మనుషుల్నీ, సంపదనీ ఆక్రమించుకుని రాజ్యాలు ఏర్పడ్డాయి. రాజులు ఏర్పడ్డారు. ఇలా చరిత్రంతా మానవాళి నెత్తుటితో తడిసిపోయింది. ఈవేళ సామ్రాజ్యవాదం పెచ్చరిల్లి రియల్ ఎస్టేట్ పేరుతో భూవ్యాపారం ఆర్థిక వ్యవస్థకు ఆక్సిజన్‌గా మారింది. మనుషుల మధ్య సంబంధాలన్నీ ఆర్థిక భూ సంబంధాలుగా మారిపోయాయి. ఇవాళ ప్రపంచ మార్కెట్‌లో భూమి ప్రధానమైన వస్తువుగా మారిన వేళ సామాజిక న్యాయం ఎండమావే. కాబట్టి భూ పోరాటాలు జరగాలి. ప్రజాస్వామిక వ్యవసాయ విప్లవం లక్ష్యంగా నిమ్న వర్గాల ప్రజలు ఉద్యమించాలి. భూమిని జాతీయం చేయాలి. అందరికీ భూమి పంచాలి. భూమి పంపిణీ జరగకుండా ఈ దేశంలో ఆర్థిక, సామాజిక సమానత్వం జరగదు. సాధ్యంకాదు. కాబోదు.

*(రచయిత ఉపాధ్యాయులు)* వీ

# విధ్వంసాన్ని ఎదిరిస్తున్న మత్స్యకారులు

*సముద్ర తీర ప్రాంతాన్ని పర్యాటక కేంద్రంగా చేయాలనే ప్రభుత్వ నిర్ణయాన్ని మత్స్యకారులు ప్రతిఘటిస్తున్న తీరును వివరిస్తున్నారు* **పి.వి. రమణ**

విశాఖలో ఫిబ్రవరి 4 నుండి 8 వరకూ జరిగిన "అంతర్జాతీయ నావికాదళ సమీక్ష" (ఐ.ఎఫ్.ఆర్) కార్యక్రమానికి వచ్చే విదేశీ, స్వదేశీ అతిథుల కోసం ఫిషింగ్ హార్బర్‌లో విశాఖ పోర్టు 4 కోట్ల రూపాయల ఖర్చుతో ఐదు నక్షత్రాల హోటల్‌ను తలపించేలా ఒక ఆతిథ్య కేంద్రాన్ని నిర్మించింది. ప్రధాన రహదారి నుండి జెట్టీ పైకి దీని కోసం సువిశాలమైన రహదారిగా తీర్చిదిద్ది పాసింజర్ జెట్టీని నిర్మించారు. మొదట ఇది తాత్కాలిక ఆతిథ్య కేంద్రంగా ఉంటుందని, ఐ.ఎఫ్.ఆర్ పూర్తికాగానే తిరిగి పాత పద్ధతిలో మత్స్యకారుల చేపల జెట్టీగా వాడుకోవచ్చని చెప్పారు. కాని, చంద్రబాబు నాయుడు పాసింజర్ జెట్టీని ఫిబ్రవరి 5న ప్రారంభించడానికి వచ్చినప్పుడూ చుట్టూ చూసి ఇంత సుందరంగా ఉంది కదా దీనిని శాశ్వతంగా పాసింజర్ జెట్టీగా మార్చండని మంత్రులకు, అధికారులకు అక్కడికక్కడే ఆదేశాలు ఇచ్చారు. దీనికోసం కాకినాడకు సంబంధించిన సామ్ మెరైన్ కంపెనీని సంప్రదించారు. వాళ్లు ఇప్పటికే కాకినాడలో రెండు నెలల క్రితం నుండి 25 పాసింజర్ బోట్లు, 6 మంచినీటి బార్జ్‌లు తయారుచేస్తున్నారు. ఈ కంపెనీ అమెరికన్ నేవీ భారతదేశంలో నిర్వహించిన అనేక నేవీ కార్యక్రమాలకు సహకారం అందించిన చరిత్ర ఉంది. దీన్ని బట్టి ఇది ముఖ్యమంత్రి ఆకస్మిక నిర్ణయం కాదని, దీని వెనుక పక్కా ప్రణాళిక ఉందని అర్థమౌతుంది.

ఫిబ్రవరి 9న చంద్రబాబు ఢిల్లీలో కేంద్ర నౌకాయాన, ఉపరితల రవాణశాఖ మంత్రి నితిన్ గడ్కరీని కలిసి విశాఖ పోర్టు నిర్మించిన పాసింజర్ జట్టీని నిర్వహించడానికి అనుమతులు కోరిన వెంటనే ఇవ్వడం జరిగింది. ప్రస్తుతం 3 నెలల తాత్కాలికంగా 4 అరవై సీట్ల మోటారు బోట్లను ఉపయోగిస్తారు. తరువాత శాశ్వత నిర్మాణాలు చేపడతారు. ఫిబ్రవరి 11 నుండి సందర్శకులు సముద్రంలో విహరించడానికి ఏర్పాటు చేస్తున్నట్టు చెప్పారు. 9వ తేదీనే గవర్నర్ బంగళాలో మంత్రి గంటా శ్రీనివాసరావు, కలెక్టర్ యువరాజ్, సీనియర్ అధికారులతో సమావేశం నిర్వహించి తక్షణమే జలవిహార యాత్ర ప్రారంభించాలని ఆదేశించారు. పర్యాటక అభివృద్ధి సంస్థకు చెందిన బోట్లను చేపల రేవులోని ప్రయాణికుల జెట్టీ నుండి నడపాలని సూచించారు. నగరానికి వచ్చే పార్యటకులను ఆకట్టుకునేలా జల విహారం ఉండాలని, పర్యాటకుల కోసం స్లిప్‌వే జెట్టీ ప్రాంతంలో అద్దాలతో కూడిన ఎ.సి. స్టార్ రెస్టారెంట్ ఏర్పాటు చేయడానికి కూడా స్టార్ హోటళ్ల యాజమాన్యాలు ముందుకు రావాలని మంత్రి కోరారు. కనీసం జరుగుతున్న విషయాల గురించి ఏమాత్రం చెప్పకుండా, వారి అభిప్రాయం తెలుసుకోకుండా పూర్తి నిర్లక్ష్యంతో మత్స్యకారుల జీవితాలను అల్లకల్లోలం చేసే నిర్ణయాలు తీసుకోవడం రాష్ట్రమంత్రులు, అధికారుల అహంకార ధోరణికి అద్దం పడుతుంది.

జెట్టీ మీదకు వెళ్లే మత్స్యకారులను 10వ తేదీ ఉదయాన్నే పాసింజర్ జెట్టీ గేటు వద్ద పోలీసులు, సి.ఐ.ఎస్.ఎఫ్ సిబ్బంది మన ఇంట్లోకి వెళ్తుంటే మనల్నే ఆపినట్టు, మత్స్యకారులను గేటు దాటి లోపలకి వెళ్లవద్దని, పాస్‌లు ఉంటేనే అనుమతిస్తామని హెచ్చరించడంతో తమ ప్రాంతంలోనే తమను పరాయి దేశస్థులుగా ఆపడాన్ని మత్స్యకారులు తట్టుకోలేకపోయారు. పర్యాటక బోట్ల షికారు కార్యక్రమం ప్రారంభించడానికి మంత్రి గంటా, కలెక్టర్ యువరాజ్ , సంయుక్త కలెక్టర్ నివాస్, పోర్టు అధికారులు ఉదయం 8.30 గంటలకు జెట్టీకి వచ్చారు. అప్పటికే ప్రవేశ ద్వారాల వద్ద పెద్ద సంఖ్యలో మత్స్యకారులు గుమిగూడి మా జీవితాలను నాశనం చేసే పాసింజర్ జెట్టీని రద్దు చేయాలనే నినాదాలతో ఎదుర్కొన్నారు. ప్రారంభోత్సవానికి సిద్ధంగా ఉన్న రెండు పర్యాటక బోట్లను మత్స్యకారులు సముద్రంలోకి తరిమేసారు. మళ్లీ ఇక్కడ కనిపిస్తే పరిస్థితి తీవ్రంగా ఉంటుందని హెచ్చరించారు. వేం అనేక సంవత్సరాలుగా ఈ చేపటల జెట్టీని నమ్ముకుని బతుకుతున్నాం. ఐ.ఎఫ్.ఆర్. కోసం ఈ జెట్టీని ఆధునికీకరించామని, ఇది తాత్కాలికంగానే అని చెప్పి మమ్మల్ని శాశ్వతంగా బయటకు గెంటేసే కార్యక్రమం ఎలా తీసుకుంటారని ప్రశ్నించారు. పరిస్థితుల తీవ్రతను అర్థం చేసుకుని ఇలాంటి పరిస్థితులలో కార్యక్రమం ప్రారంభించక పోవడమే మంచిదని మంత్రి, అధికారులు కార్యక్రమాన్ని వాయిదా వేసి వెనక్కి తిరిగి వెళ్లిపోవలసి వచ్చింది.

ఇప్పటికే ఫిషింగ్ హార్బర్‌లో కొంత భాగం విశాఖ కంటైనర్ టెర్మినల్ (వి.టి.సి) కంపెనీకి అప్పగించి మత్స్యకారులను ఒక మూలకు నెట్టేశారని, మత్స్యకారుల అభివృద్ధే తమ లక్ష్యమని ఎన్నికల కాలంలో హామీలిచ్చిన ముఖ్యమంత్రి నేడు మత్స్యకారుల జీవితాలపైనే దెబ్బతీస్తున్నారని, శ్రీకాకుళం నుండి నెల్లూరు వరకు ఉన్న సముద్రతీర ప్రాంతాన్ని మొత్తంగా సంపన్నులకు, కార్పొరేట్ కంపెనీలకు, స్టార్ హోటళ్లకు, పోర్టులకు, కాలుష్య రసాయన పరిశ్రమలకు కట్టబెట్టడమే దీనికి తార్కాణమని అనేక మంది విమర్శించారు.

ఫిషింగ్ హార్బర్‌లో బోట్లు ప్రత్యక్షంగా 12 వేల మందికి, పరోక్షంగా 20 వేల మందికి బ్రతుకుతెరువును కల్పిస్తున్నాయి. ఐ.ఎఫ్.ఆర్. కోసం బోట్లను వేటకు వెళ్లొద్దని ఆదేశిస్తూ కేవలం 700 మందికి నష్టపరిహారంగా రోజుకు 400 రూపాయలు చెల్లిస్తామని హామీ ఇచ్చారు. గాని నేటికీ అమలు జరగలేదని మత్స్యకారులు అంటున్నారు. ఫిషింగ్ హార్బర్ (చేపల రేవు) 1200 ఎకరాల స్థలంలో, 11 జెట్టీలతో విస్తరించి ఉంది. ఫిషింగ్ హార్బర్‌లో మెకనైజ్‌డ్ బోట్లు 800, తెప్పలు 500, వెసల్స్ 40 వరకూ ఉంటతయి. అటు శ్రీకాకుళం జిల్లా ఇచ్ఛాపురం నుండి, విజయనగరం

జిల్లా, విశాఖ జిల్లా, కాకినాడలలో ఉన్న మత్స్యకారులందరి బోట్లు ఇక్కడే నిలుపుకుంటారు.

హార్బర్‌లో మత్స్యకారులు తమ చేపల బోట్లను పోర్టు ఆధీనంలో ఉన్న స్లిప్‌వే కాంప్లెక్సువద్ద ఉన్న జెట్టీలకు కడతారు. వాటి రిపేర్లు, నిర్వహణ కార్యక్రమాలు అక్కడ నిర్వహించుకుంటారు. ప్రతీ బోటుకు రిపేరు కోసం జెట్టీలో చోటు కోసం కనీసం ఒక నెల కాలం వేచి ఉండాల్సి వస్తుంది. నిజానికి ప్రస్తుతం ఉన్న జెట్టీలు ఏ మాత్రం సరిపోవడం లేదు. ఎప్పటి నుండో అదనపు జెట్టీలు నిర్మించమని ప్రభుత్వాన్ని, పోర్టు అధికారులను కోరుతూనే ఉన్నారు. అదనపు జెట్టీలను ఏర్పాటు చేయకపోగా నేడు ఉన్న జెట్టీనే పర్యాటక అవసరాల కోసం ఉపయోగించడం ఎంతవరకూ న్యాయం అని మత్స్యకారులు ప్రశ్నిస్తున్నారు.

సముద్రంలో మత్స్య ఉత్పత్తులు తీవ్రంగా తగ్గిపోవడంతో గత 4 నెలల నుండి దాదాపు 350 బోట్లు ఫిషింగ్ హార్బర్‌లో ఖాళీగానే పడివుంటున్నాయి. మత్స్య సంపద తగ్గిపోవడానికి ప్రధాన కారణం కంపెనీలు వదులుతున్న విషపూరిత రసాయన కాలుష్యాలేనని మత్స్యకారులు చెబుతున్నారు. శ్రీకాకుళం జిల్లాలో పైడిభీమవరం నుండి పశ్చిమగోదావరి జిల్లా నర్సాపురం వరకూ ఉన్న జలాలన్నీ పారిశ్రామిక విషపూరిత వ్యర్థాలతో పూర్తిగా కాలుష్యమైపోయాయని ఆంధ్రప్రదేశ్ మెకనైజ్డ్ బోట్స్ ఆపరేటర్స్ అసోసియేషన్ ప్రెసిడెంట్ పి.సి. అప్పారావు వివరించారు. చేపలు తగ్గిపోవడమే కాకుండా భారీ సంఖ్యలో డాల్ఫిన్ చేపలు కూడా చనిపోవడం దీనికి రుజువని అన్నారు. నిజానికి ప్రభుత్వం దీన్ని ఒక హెచ్చరికగా తీసుకోవాలన్నారు. ఇది కేవలం విశాఖపట్నం మత్స్యకారుల సమస్యేకాదని, మొత్తం తీరప్రాంతానికి ప్రమాద హెచ్చరికగా గుర్తించాలని డాల్ఫిన్ బోట్ ఆపరేటర్స్ వెల్ఫేర్ అసోసియేషన్ ప్రెసిడెంట్ సి. హెచ్ సత్యనారాయణ చెప్పారు. ప్రతీ బోటు ఓనర్ వేటకు వెళ్లేటప్పుడు దాదాపు 3 లక్షల రూపాయలు ఖర్చుపెడతారు. వేటలో 500 కిలోగ్రాముల చేపలు రొయ్యలు దొరికితే వారికి కొంత లాభం ఉంటుంది. కాని జనవరిలో కనీసం 200 కిలో గ్రాములు కూడా పడలేదని, అమ్మగా వచ్చిన సొమ్ము ఖర్చులకు కూడా సరిపోక అప్పులపాలవడం కూడా జరుగుతుందని చెప్పారు.

హార్బర్ ఇప్పటికే ఇరుకుగా ఉందని ఒక బోటు వెనుక మరొకటి పెట్టుకోవలసి వస్తుందని, దీని వలన బోట్లు పాడైపోతున్నాయని, వేట నుండి వచ్చాక చేపల్ని జెట్టీకి చేర్చడానికి ఇతర బోట్లు పాడైపోతున్నాయని, చేపల్ని జెట్టీకి చేర్చడానికి ఇతర బోట్లు అడ్డుగా ఉండడం వల్ల చాలా ఇబ్బందులు పడవలసి వస్తుందని మత్స్యకారులు వాపోతున్నారు.

జనవరి 28 నుండి ఫిబ్రవరి 8 వరకూ ఐ.ఎఫ్.ఆర్ కార్యక్రమాల కారణంగా వేట నిషేధించడం వల్ల పెదజాలారి పేట, జాలాది, ఎండాడ, వాసవానిపాలెంలకు చెందిన మూడు వేల కుటుంబాలు రాబడి లేక పస్తులుండవలసి వచ్చిందని చెప్పారు.

కోస్టల్ బ్యాటరీ నుండి ఫిషింగ్ హార్బర్ వరకూ వెళ్లే దారిలో ఉన్న ముస్లిం స్మశాన వాటిక, నిరుపేద మత్స్యకారుల గృహాలు ఉన్నాయి. విదేశీ అతిథులకు ఈ పేదరికం కనబడకూడదని వారి ఇళ్ల ముందు రోడ్డు పొడవునా ఇనుపరేకులతో బారికేడ్లు కట్టి వాటికి రంగు రంగు వస్త్రాలను కప్పి పాకలు, పాకల్లో మనుషులు కనబడకుండా చేయడం మొత్తంగా మత్స్యకారులను తీరప్రాంతాల నుండి తరిమేయడానికి రిహార్సల్స్‌గా అర్థం చేసుకోవచ్చు.

20 సంవత్సరాల క్రితం నుండి 26 ఐరన్ వెసల్స్ ఫిషింగ్ హార్బర్ ప్రాంతంలో మునిగిపోయి ఉన్నాయి. ఇవి ప్రస్తుతం మత్స్యకారులకు చాలా ప్రమాదకరంగా తయారయ్యాయి. ఇపుడు ఉపయోగిస్తున్న బోట్లు నీటి అడుగున ఉన్న ఇనుప రేకులకు తగిలి ధ్వంసమైపోతున్నాయి. వీటిని తొలగించమని ఎన్నిసార్లు కోరినా ప్రభుత్వం నేటికీ పరిష్కరించలేదు.

ఫిషింగ్ హార్బర్‌లో నెలల తరబడి 12 ప్రైవేట్ కమర్షియల్ వెసల్స్ కట్టేసి పడి ఉన్నాయి. మత్స్యకారుల బోట్లకే చోటు చాలక నానా ఇబ్బందులు పడుతుంటే, వీటి వలన మరిన్ని ఇబ్బందులను ఎదుర్కోవలసి వస్తుందని, వీటిని అక్కడి నుంచి తొలగించమని కోరుతున్నా అధికారులు పట్టించుకోవడం లేదని చెప్పారు.

ఇప్పటికే ఫిషింగ్ హార్బర్‌లో చాలా స్థలాన్ని విశాఖ కంటైనర్ టెర్మినల్‌కు, మెరైన్ పోలీస్ స్టేషన్‌కు ఇచ్చేశారు. వి.సి.టి. కి స్థలం ఇచ్చినపుడు ఆ సంస్థలో ఉద్యోగాలన్నీ మత్స్యకారులకే ఇస్తామని హామి ఇచ్చారుగాని ఆ హామీలు నేటికీ నెరవేరలేదు.

తీరప్రాంతంలో ఒకప్పుడు ఉప్పు చాలా సులువుగా దొరికేది. నేడు ఉప్పు గల్లీలన్నిటిని తొలగించి పరిశ్రమలు ఏర్పాటు చేయడంతో ఉప్పు దొరకడం గగనమైపోయింది. గతంలో ఉప్పు గల్లీలు పూడి మడక, చీపురుపల్లి, నౌపడ, నెల్లూరు ప్రాంతాలలో పుష్కలంగా దొరికేవి. నేడు గుజరాత్ నుండి తెచ్చుకోవలసి వస్తుంది. గతంలో బస్తా 50 రూపాయలకు దొరికితే నేడు 300 రూపాయలు వరకూ చెల్లించాల్సి వస్తుంది.

టూనా (సుర) చేప అంతర్జాతీయ మార్కెట్‌లో కిలోగ్రాము 2500 రూపాయల వరకూ పలుకుతుంది. కానీ మత్స్యకారులకు సరైన అవకాశాలు లేకపోవడం వలన కేవలం కిలోగ్రాము 100 రూపాయలకే అమ్ముకోవలసి వస్తుంది. చాలా మంది ఇక్కడి నుండి కేరళకు తీసుకువెళ్లి అక్కడి నుండి ఎగుమతి చేస్తున్నారు.

మత్స్యకారుల ఆందోళన అనంతరం వారి ప్రతినిధులతో సమావేశం ఏర్పాటు చేసి మంత్రి గంటా శ్రీనివాసరావు వారి అనుమతి లేకుండా ప్రయాణికుల బోట్లను నడపమని, కానీ మొత్తం జెట్టీ ప్రాంతంలో కేవలం ఒక ఎకరం స్థలంలో మాత్రమే పర్యాటకుల కోసమే పాసింజర్ బోట్లు నడుపుతామని, దీనికి అంగీకరిస్తే వచ్చే ఉపాధి అవకాలన్నీ మత్స్యకారులకే ఇస్తామని హామీ ఇచ్చారు. గతంలో ఇలాంటి వందల హామీల గతి ఏమైందో మత్స్యకారులకు తెలుసు. ముందు ఒక జెట్టీ మాత్రమే ఉపయోగిస్తామని అంటారు. తరువాత అవసరాలు పెరిగాయన్న నెపంతో మిగిలిన జెట్టీలు కూడా ఆక్రమించరన్న నమ్మకం లేదు. పైగా తీరప్రాంతంలో ఇప్పటికే స్టార్ హోటళ్ల కాలుష్యం మత్స్యసంపదను నాశనం చేస్తుంది. అదనంగా పర్యాటక అవసరాలకు వచ్చే నిర్మాణాల వలన మరింత కాలుష్యం పెరుగుతుందే గాని తగ్గదని వారికి తెలుసు.

**గంగవరంలో ఏం జరిగింది?**

గంగవరంలో మత్స్యకారులు సెంటు భూమిలేకుండా కేవలం

సముద్రంలో చేపలుపట్టుకుని బ్రతకుతున్నారు. తెడ్డూ, తెప్ప, రెక్కల కష్టమే వారి ఆస్తి. నీటి మీద అలల్లాగా వారంతా తీరం వెంబడి ఇసుక దిబ్బల మీద గుడిసెలేసుకున్నారు. దిబ్బపాలెం పేరెట్టుకున్నారు. గంగమ్మతల్లి సాక్ష్యంగా మా ఊరు గంగవరం అన్నారు. మొదట 1979లో స్టీల్‌ప్లాంట్ కోసం 28 గ్రామాల్లోని 5,511 కుటుంబాలు గల గంగవరం గ్రామాన్ని దిబ్బపాలెం పక్కకు తరలించారు.

అప్పట్లో వాళ్ల భూములకు, ఇళ్లకు ఇచ్చిన నష్టపరిహారం చాలా తక్కువ. తర్వాత గంగవరం పోర్టుకు ప్రభుత్వం దిబ్బపాలెంతో కలిపి 1800 ఎకరాలు కేటాయించేసింది. ఫలితంగా గంగవరం పోర్టు నిర్మాణంలో దిబ్బపాలెం, గంగవరం మొత్తం (జాలారిపల్లిపాలెం, పెద్దపల్లిపాలెం, చిన్నపల్లిపాలెం) నాలుగు గ్రామాల మత్స్యకార ప్రజల ఉపాధిపోయింది. దిబ్బపాలెం గ్రామమే తుడిచిపెట్టుకుపోయింది.

దిబ్బపాలెంలోని 1600 కుటుంబాల (అన్నికులాల) వాళ్లు ఇళ్లని, ఊరునీ వృత్తులను, ఉపాధినీ కోల్పోయారు. గంగవరంలోని ఐదు వేల కుటుంబాలు జీవనోపాధి పోయి రోడ్డున పడ్డారు. ఎంతో శాంతియుతం గా, చట్టప్రకారం హక్కులడిగిన ఆ ప్రజలకు ప్రభుత్వం ఉద్యోగాలిస్తాం, నష్టపరిహారం చెల్లిస్తాం, పునరావాసం కల్పిస్తామంటూనే మరోపక్క 27 ఏప్రిల్ 2006న తుపాకి పేల్చింది. నూకరాజుని చంపింది. పాశవికంగా లాఠీలతో వందలాది మత్స్యకారులను పిల్లా, పాత, ముసలి ముతకతో సహా అందరినీ గాయాల పాలు చేసింది. హత్యానేరాలు మోపి అక్రమంగా జైల్లో పడేసింది.

నిర్బంధం కుంపట్లో 45 రోజులుంచింది. ఈలోగా గ్రామంలో కొరగానివారినిక ఊడేసింది. పోర్టు యాజమాన్యం విచ్చలవిడిగా డబ్బు వెదజల్లింది. దొంగ అగ్రిమెంట్ చేసింది. ప్రజల మధ్య చిచ్చురేపింది. ప్రజల అవసరాలతో, ఆస్తులతో, ఆమోదంతో సంబంధం లేకుండా ప్రభుత్వం, పోర్టు నిర్ణయించిన ప్యాకేజీని బలవంతంగా కట్టబెట్టింది. కాదంటే బెదిరించింది. మొత్తానికి దిబ్బపాలెం గ్రామాన్ని, సముద్ర తీరాన్ని ఖాళీ చేయించింది.

28 గ్రామాల గంగవరం స్టీల్‌ప్లాంట్ తరిమేస్తే చిన్నాభిన్నమై నాలుగు గ్రామాల గంగవరంగా మిగిలింది. మొత్తం ఐదువేల కుటుంబాలు, 18 వేల జనాభా ఉన్నారు. అంతా వాడబలిజ, జాలారి, పల్లి కులాలవాళ్లే. వీళ్లలో 3500 మంది సంప్రదాయ మత్స్యకారులు. వీళ్లంతా రాత్రీ, పగలూ సముద్రాన్ని చూసుకునేవారు. అదనుచూసి పాటుకెళ్లేవాళ్లు. సముద్రమే జీవనాధారంగా బతికారు. పచ్చి చేపలు, ఎండుచేపలు గంపల కెత్తుకుని మార్కెట్లల్లో, సంతల్లో, ఊరు మీద తిరిగి అమ్మే మహిళలు వెయ్యిమందికి పైగా ఉన్నారు. ఏ కొద్దిమందో కళాసీలుగా స్టీలు ప్లాంట్ కాంట్రాక్ట్ పనుల్లో ఉన్నారు.

చిన్నగూడు తప్ప ఆస్తుల్లేవు. అరకొర సౌకర్యాల తో జీవనం సాగించారు. అనుభవాలిచ్చిన ఆలోచనలతోనే పోర్టు తెచ్చే ముప్పును ఊహించారు. ప్రభుత్వానికి, పోర్టు యాజమాన్యానికి వ్యతిరేకంగా ప్రతిఘటించారు. ప్రాణాన్ని సైతం బలిపెట్టారు. పోర్టు పూర్తయి పోయింది. ప్రభుత్వం, పోర్టు రెండూ ఆ ప్రజల్ని పచ్చిగా మోసం చేశాయి.

**విజయవాడ, నర్సాపురంలో అదే పరిస్థితి**

విజయవాడ, కృష్ణానది ఎగువ ప్రవాహభాగాన అమరావతి, విజయవాడలకు చెందిన మత్స్యకారులు తరతరాల నుండి చేపలు పట్టుకుని జీవిస్తున్నారు. నేడు రాష్ట్ర ప్రభుత్వం భద్రతా చర్యలలో భాగంగా చేపలు పట్టుకోవడం నిషేధించి మత్స్యకారుల కడుపుకొట్టింది. నది ఒడ్డున ముఖ్యమంత్రి నివసిస్తున్న ఇల్లు ఉంది కాబట్టి అక్కడ చేపల వేట వద్దంటున్నారు. ఇంకా పైకి పోతే అక్కడ చేపలు దొరకవు. అలాగే అక్కడ మత్స్యకారులు చిన్నచిన్న బోట్ల మీద ఇసుక రవాణా చేసి బ్రతుకుతున్నారు. కానీ నేడు బోటు ఆపరేటర్స్ అసోసియేషన్ పేరుతో 15 లక్షలు ఖరీదుచేసే పెద్ద బోట్లను రవాణాకు అనుమతి ఇవ్వడంతో చిన్నకారు మత్స్యకారుల బ్రతుకుదెరువు పోయింది. ఇది చాలదన్నట్లు అధికారులు నిరంతరం అనేక ఒత్తిడిలతో తమను అక్కడ నుండి తొలగించాలని చూస్తున్నారని మత్స్యకారులు వాపోతున్నారు.

పశ్చిమగోదావరి జిల్లా నర్సాపురం తీర ప్రాంతంలో ఒ.ఎన్.జి.సి చేపట్టిన తవ్వకాలను ఆ ప్రాంత మత్స్యకారులు అడ్డుకున్నారు. సముద్రంలో కొద్దిరోజులుగా మత్స్యకారులు వేసిన వలలను ముందస్తు సమచారం లేకుండానే ఒ.ఎన్.జి.సి సిబ్బంది కోసేస్తున్నారు. మరో వైపు సర్వే పేరుతో సముద్ర గర్భంలో బ్లాస్టింగు చేస్తున్నారు. దీనితో నర్సాపురం మొగల్తూరు మండలాలలో వందలాది మంది మత్స్యకారులకు ఉపాధి లేకుండా పోయింది.

చేపల వేటకు వెళ్తున్న మత్స్యకారులను ఒ.ఎన్.జి.సి సిబ్బంది అడ్డుకుంటుండంతో ఆగ్రహించిన మత్స్యకారులు ఫిబ్రవరి 17న 40 బోట్లలో 10 కిలోమీటర్లకు పైగా ప్రయాణించి సముద్ర మధ్యకు వెళ్లి అక్కడ సర్వే చేస్తున్న ఒ.ఎన్.జి.సి సిబ్బందిని ముట్టడించారు. చుట్టూ బోట్లను నిలిపివేసి వాటిని కదలకుండా జల్‌రోకో చేశారు. సర్వే వల్ల తమ ఉపాధికి గండి పండుతుందని తర తరాలుగా చేపల వేటే జీవనాధారంగా బతుకుతున్న తమను సముద్రంలోకి వెళ్లవద్దనడం ఎంతవరకూ న్యాయమని నిలదీశారు. చివరకు అధికారులు సమస్యను పరిష్కరిస్తామని హామీ ఇవ్వడంతో మత్స్యకారులు వెనుదిరిగారు.

**తీరప్రాంత విధ్వంసానికి భారీ ప్రణాళికలు..**

భారతదేశ సముద్ర తీరప్రాంతానికి, దాని మీద బ్రతికే కోట్లాది మంది మత్స్యకారుల జీవితాలకు పెను ప్రమాదం ముంచుకొస్తుంది. విశాఖలో జనవరి 10 నుండి 12 వరకు జరిగిన అంతర్జాతీయ పెట్టుబడిదారుల సదస్సులో ప్రధాని మోదీ, ముఖ్యమంత్రి చంద్రబాబులతో పాటు ప్రపంచ దేశాల నాయకులు, కార్పొరేట్ సంస్థలు అందరూ ఏక కంఠంతో భారతదేశానికి తీరప్రాంతం పెద్దసంపద అని, ఇన్నాళ్లు ఇలా వృథాగా వదిలేయడమే పెద్ద తప్పని తేల్చారు. ఈ విషయంలో దీని కోసం మన దేశ పాలకులు ప్రణాళికలు సిద్ధంగానే ఉంచారు. ఇక మీద అత్యంత వేగంగా అభివృద్ధి పేరుతో తీరప్రాంత విధ్వంసం భారీ స్థాయిలో ప్రారంభమౌతుందని వేరే చెప్పనవసరం లేదు. ఇప్పటికే వాతావరణ మార్పులు, భూతాపం కారణంగా సముద్రాలు వేడెక్కడం, సముద్రపు మట్టాలు పెరగడం, తీర ప్రాంతాల కోత లాంటి ప్రమాద పరిస్థితులు ముంచుకొస్తున్నాయి.

దీనికి తోడు పరిశ్రమల విషపూరిత వ్యర్థాలన్నీ సముద్రాలలోనే

కలిపేస్తుండడం వలన తీరప్రాంతం విధ్వంసమవడమే కాకుండా తీరం మీద ఆధారపడి బ్రతికే కోట్లాది మత్స్యకారుల జీవితాలు కూడా బలైపోతున్నాయి.

భారతదేశంలో 7,672 కిలోమీటర్ల సముద్ర తీర ప్రాంతం ఉంది. ఈ ప్రాంతమంతా నీలి విప్లవం పేరుతో "సాగరమాల" ప్రాజెక్టు అమలుకు కేంద్ర ప్రభుత్వం ప్రణాళికలు సిద్ధం చేస్తుంది. ఇందులో భాగంగా సముద్ర తీర ప్రాంతాలలో పెద్ద ఎత్తున పారిశ్రామిక సముదాయాలు, పెట్రోకారిడార్లు, పోర్టులు, పర్యాటకానికి అనుబంధంగా స్టార్ హోటల్సు, రిక్రియేషన్ వ్యవస్థలు నిర్మాణమవుతాయి.

మన రాష్ట్రంలో ఏర్పాటు చేయబోతున్న కోస్టల్ కారిడార్ వైశాల్యం 1,575 చదరపు కిలోమీటర్లు ఉంటుందని అంచనా, అంత భూభాగంలో 'తీరం వెంబడి' క్రమంగా పొలాలు, ఊర్లు ఖాళీ అయిపోతాయి. ఎగుమతి మార్కెట్‌తో ముడిపడిన ఉత్పత్తి చేసే పరిశ్రమలు నెలకొంటాయి. వాటివల్ల వచ్చే ఉద్యోగాలు చాలా తక్కువ, స్థానిక గ్రామీణులు చేయగల ఉద్యోగాలు మరీ తక్కువ. కాలుష్యం మాత్రం భారీగా ఉంటుంది. మందుల పరిశ్రమలు, పెట్రోకెమికల్స్, రసాయన పరిశ్రమలు, థర్మల్ కేంద్రాలు విపరీతంగా కాలుష్యం కలిగిస్తాయి. ఆ కాలుష్యాన్ని 'ట్రీట్' చేసి సముద్ర గర్భంలోకి వదిలిపెట్టడానికి కాలుష్య నియంత్రణ మండలి అనుమతిస్తున్నది. కేంద్ర పర్యావరణ శాఖ కూడా ఆమోదం తెలియజేస్తున్నది. అయితే రసాయన కాలుష్యాన్ని ఎంత 'ట్రీట్' చేసినా నూటికి నూరుశాతం శుభ్రం కాదనేది అందరూ ఎరిగిన సత్యం. కాబట్టి సముద్ర జల కాలుష్యం క్రమంగా పెరుగుతుంది.

రైతులు, రైతు కూలీలతోబాటు, మత్స్యకారులు చాలా నష్టపోతారు. ఒక్క విశాఖపట్నం–కాకినాడ పిసిపిఐఆర్ వల్లనే కాదు, మొత్తంగా మన రాష్ట్ర తూర్పుతీరం వెంబడి నెలకొంటున్న కోస్టల్ కారిడార్ వల్ల ప్రధానంగా నష్టపోయేది మత్స్యకారులు. తీరప్రాంత 'అభివృద్ధి' వల్ల పెరిగే సముద్ర కాలుష్యం, కల్లోలం జలజీవాల పునరుత్పత్తిని సముద్రంలో కలిసే నదులు, ఏర్లలోనూ చేపలవేట చేసుకొని బతుకుతారు. ఇప్పుడు తీర ప్రాంతంలో పెద్దఎత్తున తీవ్ర కాలుష్యకారకాలయిన పరిశ్రమలు, ఓడరేవులు రానున్నాయి.

శ్రీకాకుళం నుండి నెల్లూరు వరకూ ఇంటిగ్రేటెడ్ ఎలివేటెడ్ హైవేను 974 కిలోమీటర్ల పొడవునా 19,200 కోట్ల రూపాయల వ్యయంతో నిర్మించడానికి ఆసియా డెవలప్‌మెంట్ బ్యాంకు ముందుకు వచ్చింది.

ఫిబ్రవరి 16న ముంబై పారిశ్రామిక సదస్సులో పాల్గొన్న చంద్రబాబు "సముద్ర తీర ప్రాంత ఆర్థికమండళ్లను (సి.ఇ.జెడ్) ఏర్పాటు చేసి పెట్టుబడులను ఆకర్షించాలన్నారు. దీని కోసం సరళీకృత విధానాలు అమలు చేయడం, కార్మిక చట్టాలను మార్పు చేయడం, భూసేకరణ, కేటాయింపులు సరళీకృతం చేయడం, పర్యావరణ అనుమతులు వేగవంతం చేయాలన్నారు. ఒకవైపు మత్స్యకారుల జీవితాలను నాశనం చేస్తూనే మరో వైపు విశాఖలో, రాష్ట్ర ప్రభుత్వం అధునాతన చేపల మార్కెట్‌ను 40 స్టాల్స్‌తో, 7.3 కోట్ల రూపాయల వ్యయంతో నిర్మిస్తామని, దీనిలో 4.3 కోట్ల రూపాయల ఖర్చుతో చేపల మార్కెట్‌ను, 2.95 కోట్ల రూపాయల ఖర్చుతో ఫిష్ రెస్టారెంట్‌ను నిర్మిస్తామని ప్రకటించింది.

**తీర ప్రాంతంలో పెరుగుతున్న కోత ప్రమాదం**

1990ల నుండి 2006 వరకూ సేకరించిన సమాచారం ఆధారంగా 'భారత్ తీరప్రాంతాలు'పై 2012లో అటవీ, పర్యావరణ మంత్రిత్వ శాఖ ఒక నివేదిక విడుదల చేసింది. దాని ప్రకారం ఆంధ్రప్రదేశ్‌లో ఉన్న 1,103 కిలోమీటర్ల తీరప్రాంతంలో 418 కిలోమీటర్ల ప్రాంతం కోతకు గురైందనీ, 275 కిలోమీటర్ల ప్రాంతం ఇసుక మేటలు వేసిందని తెలిపారు. విశాఖ జిల్లాలో ఆర్.కె. బీచ్, మంగమర్రి పేట, పూడిమడక, శ్రీకాకుళం జిల్లాలో భావనపాడు, విజయనగరం జిల్లాలో చింతపల్లి, తూర్పుగోదావరి జిల్లాలో ఉప్పాడ, ప్రకాశం జిల్లాలో వాడరేవు. నెల్లూరు జిల్లాలో పులికాట్ సరస్సు కోతకు గురయ్యే తీరప్రాంతాలుగా గుర్తించారు.

నేషనల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఓషనోగ్రఫి (ఎన్ఐఒ), విశాఖపట్నం రీజనల్ సెంటర్ శాస్త్రవేత్తలు వి.ఎస్.ఎన్ మూర్తి తదితరులు తీరప్రాంత కోతపై మాట్లాడుతూ "భారతదేశంలో తీర ప్రాంతాలైన విశాఖపట్నం, ముంబై, కోచ్చి, ఇతర ప్రాంతాలలో సముద్ర మట్టాలు పెరుగుతున్నాయి. ప్రతీ సంవత్సరం 3 మిల్లీమీటర్ల మట్టం పెరుగుతుంది. దీని వలన సముద్రంలో జలాల ఉపరితలంలో కార్బన్‌డైఆక్సైడ్ లాంటి వాయువులతో ఎసిడిఫికేషన్ పెరిగిపోతుంది. దీని వలన సముద్రంలో జీవజాలం ప్రభావితమై తగ్గిపోవడం జరుగుతుంది. తూర్పు తీర ప్రాంతంలో చేపలు, రొయ్యల ఉత్పత్తి పడిపోతుంది. సముద్ర జలాల మట్టం పెరగడంతో తీర ప్రాంతంలో కోత పెరుగుతుంది. కేరళ నుండి పశ్చిమ బెంగాల్ వరకు తీర ప్రాంతంలో దాదాపు 170 ప్రాంతాలు కోతకి గురవుతున్నాయి. గతంలో విశాఖ సముద్రానికి ఒడ్డుకి 250 మీటర్ల ఇసుక ప్రాంతం ఉండేది. అది నేడు కేవలం 60 మీటర్లకి తగ్గిపోయింది. దీనివలన బీచ్‌కోత తీవ్రత మరింత పెరిగింది" అని వివరించారు.

2014 నుండి విశాఖ తీరం నిరంతరంగా సాగుతూనే ఉంది. 2015 జనవరి 2న తీరం కోత ప్రాంతాన్ని సందర్శించిన తెలుగుదేశం మాజీ ఎంపి, గీతం యూనివర్సిటీ అధినేత ఎమ్‌విఎస్ మూర్తి "పోర్టు విస్తరణకు నాలుగు దశాబ్దాల క్రితం నిర్మించిన ఔటర్ హార్బర్‌తోనే విశాఖలో తీరం కోత ప్రారంభమయ్యింది. ఎంతో సుందరమైన బీచ్‌కు ప్రమాదం తెచ్చిన విశాఖ పోర్టు ప్రథమ ముద్దాయి. పోర్టులో వ్యాపారం ద్వారా వేల కోట్ల రూపాయల ఆదాయం సంపాదించుకోవడం కాదు. దానిలో పది శాతం లాభాలను తీర ప్రాంత పరిరక్షణకు వెచ్చించి ఉంటే బాగుండేది. అలాగే ప్రతి సారీ కోత ప్రాంతంలో మట్టి రాళ్లూ పోసి కాంట్రాక్టర్లకు ప్రయోజనం కల్పించడం వల్ల ఎటువంటి ఫలితమూ ఉండదు. ఔటర్ హార్బర్‌కు సంబంధించిన బ్రేక్ వాటర్స్ నిర్మాణాన్ని తొలగించాలని కోరడం చివరకు పాలక పార్టీ నాయకులు కూడా సమస్య తీవ్రతపై మాట్లాడవలసిన పరిస్థితిని గుర్తు చేస్తుంది.

**అభివృద్ధంటే విధ్వంసమేనా?**

ఉత్తరాంధ్ర తీర ప్రాంతమంతా ఫార్మ కంపెనీలతో నిండిపోతోంది. ఇవి పూర్తి గాలిని, భూగర్భ జలాలను, సముద్రపు జలాలను కాలుష్యంతో ముంచెత్తుతున్నాయి. కాలుష్యాన్ని నివారించాల్సిన ప్రభుత్వం కంపెనీ యజమానుల సేవలో మునిగి తేలుతోంది. చివరికి ప్రజలు త్రాగునీటి కోసం కంపెనీల దయాదాక్షిణ్యాలపై ఆధారపడాల్సిన దుస్థితి. భూములు

# జాత్యహంకార జాడ్యం

***భారత సమాజంలో కుల వివక్ష, లింగ వివక్ష ఉన్నట్టే జాతి వివక్ష ఉందనేది బెంగుళూరులో టాంజానియా విద్యార్థినిని వివస్త్రను చేసి హింసించిన జాత్యహంకార ఘటన మరోసారి ముందుకు తెచ్చిందని అంటున్నారు ఎ. నర్సింహారెడ్డి***

బెంగుళూరులో జనవరి 31న ఒక సూడాన్ వ్యక్తి నడుపుతున్న కారు తగిలి ఓ మహిళ అక్కడికక్కడే చనిపోయింది. ఆ యువకుడు పరారీ కావడంతో ఆగ్రహించిన స్థానికులు అతని కారును తగలబెట్టారు. అరగంట తర్వాత ఆ దారిలో ప్రయాణిస్తున్న 21 ఏళ్ల టాంజానియా యువతిపై స్థానికులు దాడి చేసి వీధుల్లో పరుగులు పెట్టించిన ఘటన అత్యంత అమానవీయమైనది. ఆమె ప్రయాణిస్తున్న కారును తగులబెట్టారు. టాంజానియా విద్యార్థినిని స్థానికులు కొట్టి, వివస్త్రను చేసి అమానవీయంగా ప్రవర్తించారు. మానవత్వం మంటగలిసిన ఘోర సంఘటన ఇది. కళ్లెదుటే అమానుషం జరుగుతున్నా అడ్డుకోలేని సభ్యసమాజపు నిష్క్రియాపరత్వమిది. నిన్నటి దాకా దేశవ్యాప్తంగా అసహన విషనాగు కోరలు చాస్తే నేడు జాత్యహంకారం వికృతరూపం దాల్చి భారతదేశపు శాంతి, సహనం, సహజీవన విలువలకు ఈ సంఘటన అంతర్జాతీయంగా మాయని మచ్చ తెచ్చింది.

సూడాన్ జాతీయుడు మితిమీరిన వేగంతో కారు నడిపి 35 ఏళ్ల మహిళ మృతికి కారణమయ్యాడు. ఆ ప్రమాదంతో ఆమెకు ఎటువంటి సంబంధంలేదు. నల్లజాతి యువతి కావడమే ఆమె తప్పిదం.

---

కోల్పోయిన రైతులు ఉపాధి పొందడం లేదు. నైపుణ్యం గల ఉద్యోగాలలో స్థానికులు 5 శాతం కూడా లేరు. సముద్ర జలాల కాలుష్యంతో మత్స్యకారులకు చేపలు పడడం లేదు. మత్స్యకారుల్లో యువకులంతా వలసల్లో బ్రతకాల్సిన దుస్థితి ఏర్పడింది.

బీచ్ డెవలప్‌మెంట్, ప్రాజెక్ట్‌లు, అభివృద్ధి టూరిజం పేరుతో విశాలమైన విశాఖ తీరప్రాంతం నుండి మత్స్యకారులను వెళ్లగొట్టేందుకు ప్రభుత్వం రంగం సిద్ధం చేసింది. అప్పికొండ వద్ద స్టీల్ ప్లాంట్ కాలుష్యాన్ని సముద్రంలోకే వదులుతున్నారు. ఫార్మాసిటీ కాలుష్యాన్ని కూడా సముద్రంలోకే వదులుతున్నారు. అందువల్లనే ఆ ప్రాంతంలో మత్స్య సంపద తగ్గిపోయింది. రెండవ వైపున పర్యాటక రంగం పేరుతో భీమిలి నుండి విశాఖపట్నం వరకు సముద్ర తీరాన్ని ప్రైవేటు సంస్థలకు కారుచౌకగా కట్టబెడుతున్నారు. పెద్ద పెద్ద రిసార్ట్స్‌కు, హోటళ్లకు, సినిమా స్టూడియోలకు, కంప్యూటర్ కాల్ సెంటర్లకు, కేటాయిస్తున్నారు. ఈ ప్రాంతంలోని సంప్రదాయ మత్స్యకారులందరినీ అక్కడి నుండి తరిమేస్తున్నారు. ఇప్పటికే అనేక చోట్ల మత్స్యకారులను సముద్రంలోకి వేటకు వెళ్లనివ్వకుండా అనేక ఆటంకాలు పెడుతున్నారు. తీర ప్రాంత జలాలు కాలుష్యంతో నిండిపోతున్నాయి. ఇంకొకవైపు విశాఖపట్నం-కాకినాడ కారిడార్ పేరిట మొత్తం తీరప్రాంతాన్ని బడా కార్పొరేట్ శక్తులకు ధారదత్తం చేస్తున్నారు. మొత్తం రాష్ట్ర తీరప్రాంతంలోని 65 లక్షల మంది మత్స్యకారుల బ్రతుకుతెరువుపై పెద్ద దాడి జరగబోతుంది.

ఇప్పటికే సముద్రతీరంలో ఇసుక తవ్వకాలను ప్రైవేటు సంస్థలకు అప్పజెప్తున్నారు. ఇసుకలో ఉన్న ఖనిజాలైన కార్ట్జ్, పెల్పర్, మాగ్నటైట్, గార్నెట్, రుటైల్, అణుధార్మిక పదార్థాలైన జిర్కాన్, మోనజైట్, ఇలమనైట్ లను మెరుగుపరిచి విదేశాలకు ఎగుమతి చేసి కోట్ల రూపాయల లాభాలు సంపాదించాలని చూస్తున్నారు. ఇప్పటికే తీరంలో ఫార్మా కంపెనీల కాలుష్యం సముద్ర జీవుల పునరుత్పత్తికి ముప్పు తెచ్చింది. ఇక ఇసుక తవ్వకాల వల్ల ఇది మరింత పెరుగుతుంది. ఖనిజాలతో కూడిన ఇసుక తీరంలో మేటలుగా ఏర్పడి కోతను అడ్డుకుంటాయి. ఇందులో ఉండే పొరాసిటి (ఖాళీభాగం) నీటి ప్రవాహం వల్ల, ఆటుపోటుల వల్ల తీర ప్రాంతం కోతకు గురవకుండా అడ్డుకుంటుంది. అంతేకాక సముద్రంలోని ఉప్పు నీరు, వెలుపల ప్రాంతంలో ఉండే మంచి నీటితో కలవకుండా అడ్డుకట్ట వేస్తుంది.

ఇంత అద్భుతమైన వైవిధ్యం గల సహజ వనరు తీర ప్రాంతాన్ని ఉండే మంచి నీటితో కలవకుండా అడ్డుకట్ట వేస్తుంది. తీర ప్రాంతాలు ఇప్పటికే తీవ్రమైన ప్రమాదాలకు గురౌతున్నాయని, మరిన్ని ప్రమాదాలు తెచ్చిపెట్టే పరిస్థితులు కల్పించవద్దని వెంటనే రక్షణ చర్యలు తీసుకోవాలని అంతర్జాతీయ పర్యావరణ సంస్థలు, శాస్త్రవేత్తలు హెచ్చరిస్తున్నా వాటిని ఏ మాత్రం ఖాతరు చేయకుండా మొత్తం భారత తీరప్రాంతాన్ని లక్షల కోట్ల రూపాయల లాభాలు తెచ్చే బంగారు బాతుగా చూస్తూ దానిని ఒకే సారి మట్టుబెట్టాలని తొందరపడుతున్నారు.

నిరంతర బతుకువేటలో భాగంగా ప్రాణాలకు తెగించి సముద్రంపై వేటకు వెళ్లి, క్షేమంగా తిరిగి వస్తారో రారో కూడా తెలియని ప్రమాద పరస్థితులలో కూడా ఒకవైపు తమ కుటుంబాలను పోషించుకుంటూ మరోవైపు సమాజానికి పోషకాహారాన్ని అందిస్తున్న అన్నదాతల్లాంటి మత్స్యకారులకు అవసరమైన సౌకర్యాలు, భద్రతా చర్యలు కల్పించి, సామాజిక భరోసా కల్పించాల్సిందిపోయి పాలకులు వారి బ్రతుకులమీదే పెద్ద దెబ్బ తీయడానికి పూనుకుంటున్నారు. అభివృద్ధి పేరుతో కొనసాగిస్తున్న ఈ ప్రమాదకరమైన దాడిని ప్రతిఘటిస్తున్న మత్స్యకారులకు మద్దతునివ్వడమే కాకుండా, మన అందరి సామూహిక సహజ సంపద అయిన తీరప్రాంతాన్ని రక్షించుకోవడంలో అందరూ భాగస్వాములవ్వాలి. వీ

*(రచయిత కార్మికోద్యమ నాయకులు)*

బెంగళూరులో బిబిఎ రెండవ సంవత్సరం చదువుతోంది. ఇంత అనాగరికంగా జనం వ్యవహరిస్తున్నా పోలీసులు ప్రేక్షకపాత్ర పోషించారు. నిమ్మకు నీరెత్తినట్లు వ్యవహరించడం దారుణం. ఈ దుశ్శాసన సంతతి దుర్మార్గంపై దేశమంతా గగ్గోలుపెట్టిన తర్వాతే కర్నాటక ప్రభుత్వంలో స్పందన కలిగింది. విదేశాంగ మంత్రి సుష్మాస్వరాజ్, కాంగ్రెస్ ఉపాధ్యక్షుడు రాహుల్‌గాంధీ ఈ అమానుష అకృత్యంపై ప్రశ్నించడంతో ఆ రాష్ట్ర సిఎం సిద్ధరామయ్య నిద్రలేచారు. వీరిద్దరి జోక్యంతో తాపీగా ఆరుగురు పోలీసులను సస్పెండ్ చేశారు.

ఒంటి మీది దుస్తుల్ని సైతం లాగేస్తున్న జనం నుంచి తప్పించుకోవడానికి దగ్గరలో ఆగి ఉన్న సిటీ బస్‌ను ఎక్కడానికి యువతి ప్రయత్నిస్తే అందులోకి సైతం జొరబడి దుండగుల గుంపు దాడిచేసింది. ఆమెను, ఆమెతోపాటు ఆ బస్సు ఎక్కిన యువకుణ్ణి బయటకీడ్చి ఆమెను వివస్త్రను చేశారు. ఆమె కారును తగులబెట్టారు. దేశం కాని దేశంలో వారిని రక్షించగలిగిందెవరు? విజ్ఞత కలిగిన పౌరులు, కర్తవ్య నిర్వహణలో నిమగ్నం కావలసిన పోలీసులు. అందరికందరూ చేష్టలుడిగి ఉండిపోయారు. బెంగళూరు నడిరోడ్డుపై ఇంత దారుణం జరుగుతున్నా ఎవరూ వారించడానికి ప్రయత్నించలేదు. అక్కడికి సమీపంలో ఉన్న పోలీసులు సైతం మౌనసాక్షుల్లా ఉండిపోయారు. ఈ ఉదంతం తర్వాత పోలీస్‌స్టేషన్‌కెళ్లి ఫిర్యాదు ఇవ్వడానికి ఆ యువతి ప్రయత్నిస్తే... ప్రమాదానికి కారణమై పరారీలో ఉన్న యువకుణ్ణి తీసుకొచ్చి అప్పగించమని అక్కడి అధికారి సలహా ఇచ్చాడు. అంతవరకూ కేసు నమోదుచేయడం కుదరదని కరాకండిగా చెప్పాడు. వీరందరిదీ ఆఫ్రికా ఖండం కావడం మినహా ప్రమాదానికి కారణమైన యువకుడికీ, ఈ నలుగురుకీ ఎలాంటి సంబంధం లేదు. వీరందరిదీ టాంజానియా కాగా, ఆ యువకుడు సూడాన్ జాతీయుడు.

యథార్థం సాధారణ పౌరులకు అవగాహన కాలేదంటే అర్థం చేసుకోవచ్చు. పోలీసులు సైతం మూర్ఖంగా ప్రవర్తించడం ఆశ్చర్యం కలిగిస్తుంది. నిజానికి హిందుత్వ పాసిస్టు ధోరణులే సమాజంలో కుల వివక్షను పెంచినట్లు పరాయి దేశస్థుల పట్ల జాతి వివక్షను కూడా పెంచుతున్నాయి. అందువల్లనే ఒక అమానుషాన్ని గుడ్లప్పగించి చూస్తూ ఉండిపోవడం, ఫిర్యాదు చేయడానికెళ్తే వారినే దోషులుగా పరిగణించి మాట్లాడడం తప్పని పోలీసు అధికారికి తోచలేదు.

అంతకన్నా ఘోరమేమంటే... కర్ణాటక హోం మంత్రి పరమేశ్వర దీన్ని ఏదో సాధారణ ఉదంతంలా భావించి మాట్లాడటం. తన శాఖ ఇంత అధ్వాన్నంగా పనిచేస్తున్నందుకు సిగ్గుతో తలదించుకోవాల్సిన కర్ణాటక హోంమంత్రి పరమేశ్వర ఈ దాడిలో జాత్యహంకార జాడలేదని తర్కించడం మరింత వింత గొలుపుతోంది. కేవలం కారు ప్రమాదంలో ఒకరు ప్రాణాలు కోల్పోవడం వల్ల జనం ఆగ్రహించారని ఆయన వాదిస్తున్నారు. ఇదే నగరంలో పది నెలల క్రితం నలుగురు ఆఫ్రికన్లను దారుణంగా కొట్టారు. నిజానికి ఇందులో జాత్యహంకార ముద్ర, ఆడవాళ్లంటే చులకనభావం స్పష్టంగా కనిపిస్తున్నాయి. ఆఫ్రికన్లను హీనంగా చూడడం, మాదకద్రవ్యాలకు బానిసలుగా, అసాంఘిక కార్యకలాపాలకు కారకులుగా అనుమానించడం విశ్వనగరాలుగా చెప్పుకుంటున్న చోట్ల కూడా జరుగుతున్నది.

బెంగుళూరు ఘటన అనంతరం ఈ ఉన్మాదాన్ని ఖండించవలసిన కేంద్ర న్యాయశాఖ మంత్రి స్థానికులను వెనకేసుకురావడం ఆశ్చర్యం కలిగించింది. నగరంలో వీసా పరిమితి తీరిపోయిన తరువాత కూడా వేలాదిమంది ఆఫ్రికన్లు ఇక్కడనే ఉంటూ చట్టాలను ఉల్లంఘిస్తున్నందున అనేక సమస్యలు వస్తున్నాయని ఆయన అసమంజస వాదన. ప్రత్యేక బృందాలతో ఇటువంటి వారిని ఏరివేయాలని డిమాండ్ చేస్తూ జరిగిన దారుణాన్ని ఏమార్చే ప్రయత్నం చేస్తున్నారాయన. ఆఫ్రికన్ల ప్రవర్తనను ఈ సందర్భంగా ముందుకు తెచ్చి, ఒక మూక చేసిన ఈ అమానుష దాడిని వెనకేసుకొచ్చే ప్రయత్నాలు ఎంతగా జరుగుతున్నా, ఈ హీనత్వాన్ని ఎవరూ సమర్థించరు. ఒక తప్పుడు నిర్ధారణతో, అంతకుమించి ఎదుటివారి 'రంగు' కారణంగా, నరనరానా జీర్ణించుకున్న వివక్షతో జరిపిన ఈ దాడి విశ్వనగరంగా చెప్పుకుంటున్న బెంగుళూరు పరువును కావేరిలో కలిపేసింది.

ఐటిలో ముందంజలో ఉన్న బెంగుళూరు నగరానికి సిలికాన్ వ్యాలీ అన్న పేరుంది. ఎంతో ప్రశాంతమైన నగరమన్న ముద్ర ఉంది. కానీ 'భిన్నంగా' కనబడేవాళ్లకు మాత్రం అది ఒక నరకమని అనేక ఉదంతాలు రుజువుచేశాయి. అయిదు మాసాల కిందట ఆస్ట్రేలియా యువకుడు తన కాలిపై హిందూదేవతల పచ్చబొట్టు వేయించుకున్నాడంటూ చిత్రహింసలకు గురిచేయడమేగాక, బలవంతంగా క్షమాపణ చెప్పించారు. ఈశాన్య ప్రాంతం నుంచి చదువుకోవడానికి, ఉద్యోగాలు చేయడానికి వచ్చినవారిపై గతంలో దాడులు జరిగాయి. గత సంవత్సరం అక్టోబర్‌లో కన్నడ భాష మాట్లాడలేదని ఈశాన్య ప్రాంతం నుంచి వచ్చిన ఒక యువకుణ్ణి చావబాదారు. అదే ప్రాంతానికి చెందిన మాజీ పోలీస్ కమిషనర్ సాంగ్లియానా కుమార్తెను 'చైనాకు వెళ్లిపో' అంటూ ఒక సూపర్ మార్కెట్‌లో గేలిచేశారు. ఇద్దరు మణిపూర్ యువతులకు సైతం ఇలాంటి అవమానాలే ఎదురయ్యాయి.

ఢిల్లీలో తరచుగా ఈశాన్య రాష్ట్రాలకు చెందిన స్త్రీ పురుషులు అవమానకర పరిస్థితులను ఎదుర్కొంటూ బిక్కుబిక్కుమని బతుక వలసిన స్థితి ఏర్పడింది. ఈశాన్య రాష్ట్రానికి చెందిన ఒక యువకుడి ముఖాకృతిపై అసభ్యకర, అవమానకర వ్యాఖ్యలు చేయడంతో అతను ఎదురుతిరిగాడు. దీంతో చాలారద్దీగా ఉండే వాణిజ్య ప్రాంతంలోనే దుండగుల గుంపు అతన్ని అతి దారుణంగా హత్య చేసింది. నాలుగేళ్లక్రితం ఈశాన్య ప్రాంతం వారిని దూషిస్తూ ప్రచారంలో కొచ్చిన ఎస్సెమ్మెస్‌లకు జడిసి వేలాదిమంది స్వస్థలాలకు ఆదరాబాదరగా వెళ్లిపోయిన ఉదంతం ఎవరూ ఇంకా మర్చిపోలేదు. ఇటువంటి ఘటనలలో పాల్గొన్న నేరస్తులను నియంత్రించక పోతే ఇలాంటి అరాచకాలు పునరావృతమవుతునే ఉంటాయి.

పౌరుల్లో విచక్షణాజ్ఞానం లోపించినప్పుడు ఉన్మాదం రాజ్యమేలు తుంది. అలాంటి సమయాల్లో ఎవరో ఒకరైనా దృఢంగా వ్యవహరించ గలిగితే, చొరవ ప్రదర్శించి దాడులను అదుపు చేయడానికి ప్రయత్నిస్తే పరిస్థితి కాస్తయినా సర్దుకుంటుంది. కానీ మన నగరాల్లో రాను రాను అలాంటి ధోరణి కరువవుతోంది. ఆ విషయంలో పల్లెటూరి నిరక్షరాస్య శ్రామికులే కాస్త నయం. బెంగుళూరు లాంటి నగరంలో విద్యావంతులైన పౌరుల మానసిక స్థితి మెరుగ్గా ఉంటుందనుకుంటాం. కానీ అలా అనుకోవడం మన అమాయకత్వమే అవుతుంది. ఇవాళ అత్యాధునిక

పరిజ్ఞానం అందుబాటులోకొచ్చింది గనుక పోలీసులకు వెనువెంటనే విషయం తెలియడం పెద్ద కష్టం కాదనుకుంటాం. సకాలంలో వారు వచ్చి పరిస్థితిని అదుపులోకి తెస్తారనుకుంటాం. కానీ జరిగిందంతా అందుకు భిన్నం.

ఇదే ఘటన స్థానికుల మధ్య జరిగివుంటే పోలీసులతో సహా అందరి ప్రవర్తనా ఈ విధంగా ఉండివుండేదా అన్నది మనకు మనం జవాబు చెప్పుకోవలసిన ప్రశ్న. కారును తగులబెట్టి, యువతిని వివస్త్రను చేసి తరుముతూ పైశాచిక ఆనందం పొందుతూ ఆమె మిత్రులను చావగొడుతున్నప్పుడు స్థానికులకు కానిస్టేబుళ్లు చేయూతనివ్వడాన్నీ, రక్షకులే భక్షకులు కావడానికీ బాధితుల రంగు కారణంకాదని ఎవరు అనగలరు? ఫిర్యాదు చేయడానికి పోలీస్ స్టేషన్‌కు వచ్చిన విద్యార్థులకు అవమానం తప్ప న్యాయం దక్కలేదు. ఆఫ్రికన్ విద్యార్థి సంఘాలు ప్రశ్నిస్తూ, రాయబార కార్యాలయాలు రంగంలోకి దిగితే తప్ప ఫిర్యాదు నమోదు కాలేదు. ఇటువంటి దుర్మార్గమైన వైఖరి నిర్లజ్జగా ప్రదర్శించిన పోలీసుల్లో కొందరిని సస్పెండ్ చేయడం సాంకేతికంగా సరైనది కావచ్చు. కానీ, వీరి కారణంగా నగరానికీ, దేశానికీ పోయిన పరువు మాత్రం తిరిగి తేలేనిది.

దేశంలోని వివిధ ప్రాంతాల్లో ఉంటున్న ఆఫ్రికా ప్రజలపై హింసకు పూనుకోవడం, వారిపై అవమానకరమైన వ్యాఖ్యలు చేయడం మనలో గూడు కట్టుకొంటున్న జాతివిద్వేషానికి నిదర్శనం. జాతి వివక్షకు వ్యతిరేకంగా ఏ దేశంలో అయితే గాంధీజీ సత్యాగ్రహ సమరాన్ని ప్రారంభించాడో... ఆయన పుట్టిన గడ్డపై ఆ దేశీయులే నేడు జాతి వివక్షను ఎదుర్కొనాల్సి రావడం శోచనీయం. విదేశాల్లో కొనసాగుతున్న ఈ వివక్ష, విద్వేషాలపై మనం, మన నేతలు తీవ్రస్థాయిలో ఖండనమండనలు చేస్తూనే ఇక్కడ ఆ ఉన్మాదం రెచ్చిపోవడానికి ప్రత్యక్షంగానో, పరోక్షంగానో కారణమవుతున్నామంటే.. ఇంతకంటే ఆత్మవంచన వేరేముంటుంది.

పంజాబ్‌లోని ఒక విశ్వవిద్యాలయంలో చాలా స్వల్ప విషయానికే బురుండీకి చెందిన విద్యార్థిని 2013లో అతి దారుణంగా హత్య చేశారు. దేశ రాజధాని నగరంలో ఆప్ మంత్రి ఒకరు ఆఫ్రికా జాతీయులను ముఖ్యంగా మహిళలను లక్ష్యంగా చేసుకొని వెంటాడి వేధించారు. ఒకనాటి అర్ధరాత్రి మంత్రి స్వయంగా పోలీసులను వెంటేసుకు వెళ్లి ఆఫ్రికన్ మహిళను వ్యభిచరిస్తున్నావంటూ అవమాన పరిచిన ఘటన అత్యంత దారుణమైంది. ఆయన ప్రస్తుతం దానికి తగిన మూల్యం చెల్లిస్తూ తీవ్ర సమస్యల్లో చిక్కుకపోయారు. రంగు ఆధారంగానే కాదు, ముఖాకృతులు భిన్నంగా ఉండే వారిపై కూడా వివక్షత, విద్వేషాలను మనవారు వెళ్లగక్కుతున్నారు.

ఆఫ్రికా నుంచి ఇక్కడికి వలస రావడం ఈనాటిది కాదు.. రెండు వేల సంవత్సరాల క్రితమే ప్రారంభమైంది. భారతీయ సంగీత, నృత్య, వాస్తు, శిల్ప కళలు సంపద్వంతం కావడంలో వారి పాత్ర ఎంతో ఉంది. వారు రాజ్యాధినేతలయ్యారు.. యుద్ధ విజేతలుగా నిలిచారు. మాలిక్ అంబార్ రాజు ఆఫ్రికా నుంచి వచ్చినవాడే. భారతచరిత్రలో ఆఫ్రికన్ల విస్మృత గాథలెన్నో అని చరిత్రకారులు పేర్కొంటున్నారు. ప్రస్తుతం గుజరాత్, కర్ణాటక, హైదరాబాద్, పాకిస్థాన్‌లోని కొన్ని ప్రాంతాల్లో నివసిస్తున్న సిద్దీలు ఆఫ్రికా నుంచి వచ్చి స్థిరపడినవారే. విద్య, వ్యాపారం, ఉపాధి పేరిట ఇటీవల ఆఫ్రికా నుంచి వస్తున్న నల్లజాతీయులను అవమానించడం, అవహేళనకు గురిచేయడం ఆందోళన కలిగిస్తోంది. బెంగుళూరులో టాంజానియా యువతిపై జరిగిన దుర్మార్గంపై ఆ దేశ హైకమిషనర్ వ్యాఖ్యానిస్తూ 'భారతీయులకు మానవత్వం ఉందా?' అని ప్రశ్నించారు. ఈ దేశం నిజంగా 21వ శతాబ్దిలో ఉండాల్సిన విధంగా ఉందా?' అని ఆయన వేలెత్తిచూపారు. ఈ ఘోరంపై మనదేశంలోని ఆఫ్రికా దేశాల రాయబారులు, హైకమిషనర్లు ఉమ్మడిగా ఖండించారు. దోషులను తక్షణమే శిక్షించాలని వారు డిమాండు చేశారు.

జాత్యహంకార వివక్షతతో విదేశీ విద్యార్థులు ఎంతటి అభద్రతాభావంతో ఉన్నారో పలు ఘటనలు తెలియజేస్తున్నాయి. భారత జాతి సిగ్గుతో తలదించుకోవల్సిన ఈ ఘటనపై బిజెపి, కాంగ్రెస్ నేతలు పరస్పరం ఆరోపణలు చేసుకోవడం దురదృష్టకరం.. వారి బాధ్యతా రాహిత్యానికి నిదర్శనం. బాధితురాలికి అండగా నిలవడం, ఈ దుశ్శాసన సంతతి మళ్లీ రెచ్చిపోకుండా, ఇలాంటి దుర్ఘటనలు చోటుచేసుకోకుండా కఠిన చర్యలు చేపట్టాల్సిన సమయంలో రాజకీయ లబ్ధికి పాకులాడడం ఆ పార్టీల బాధ్యతారాహిత్య, నీచ ప్రవృత్తికి ప్రతీక. ఈ నేపథ్యంలో దేశంలో జాత్యహంకారం వేళ్లూనుకోవడం క్షమించరాని నేరంగా పరిగణించి పాలకులు చర్యలు చేపట్టాలి. ఆఫ్రికా నుంచి వచ్చిన, వస్తున్నవారందరికీ ఇటువంటి దుర్ఘటనలు జరగవనే భరోసా కల్పించాల్సిన అవసరం నేడు ఎంతైనా ఉంది. ఆ దిశగా కర్ణాటక రాష్ట్రం, కేంద్ర ప్రభుత్వాలు కృషి చేయాలి.

బెంగుళూరు నగరంలో చదువుకోవడానికి వివిధ దేశాల నుంచి విద్యార్థులు వస్తుంటారు. ప్రస్తుతం అలాంటి విద్యార్థులు 12,000 మంది ఉంటారని అంచనా. అమెరికా, యూరప్‌లతో పోలిస్తే భారత్‌లో తక్కువ ఫీజులతో నాణ్యమైన విద్య లభిస్తుందన్న భావన ఆఫ్రికన్ దేశాల పౌరుల్లో ఉంది. కానీ వారికి ఉండడానికి ఇళ్లు దొరకవు. అడుగడుగునా అవమానాలు, దాడులు ఎదురవుతాయి. మార్కెట్‌కెళ్తే మోసాలు ఎదుర్కొంటున్నారు. ఈ నేపథ్యంలో మన సమాజంలో కుల వివక్ష, లింగ వివక్ష ఉన్నట్టే జాత్యహంకార ధోరణులున్నాయని గుర్తించడం అవసరం. రోగం ఉన్నదని గుర్తిస్తేనే సరైన మందు ఇవ్వడం సాధ్యమవుతుంది.

జరుగుతున్న ఘటనలను నేరస్వభావం గల కొందరు వ్యక్తుల ఆగడాలుగా పరిగణించి, వాటిని శాంతి భద్రతల సమస్యగా మాత్రమే చూడటంవల్లా, ఆ పరిమితుల్లోనే ఆలోచించడంవల్లా అవి పునరావృతమవుతున్నాయి. ఇప్పటికైనా మన ప్రభుత్వాలు మేల్కొనాలి. కారకులపై కఠిన చర్యలుంటాయన్న సందేశం పంపడంతోపాటు, వెనువెంటనే స్పందించేలా ప్రభుత్వ యంత్రాగాన్ని చక్కదిద్దాలి. మన దేశానికి చదువుకోవడానికి వచ్చి, తాము చదువుతున్న విశ్వ విద్యాలయాలతోనూ, ఉంటున్న నగరాలతోనూ మమేకమైన విదేశీయుల పట్ల ఏ రకమైన వివక్షలూ లేని వాతావరణాన్ని కల్పించడం మన బాధ్యత. మన దేశానికి విదేశీ యువకులు రావడానికి బయపడే పరిస్థితి నెలకొందంటే అది దేశానికే తలవంపు.

*(రచయిత రాజనీతి శాస్త్ర పరిశోధకులు, ఉస్మానియా విశ్వవిద్యాయం)* వీ

# బాక్సైట్ వ్యతిరేక ప్రజా ఉద్యమం

***సమష్టి సంపదైన బాక్సైట్‌ను కార్పొరేట్ కంపెనీలకు అప్పగించడాన్ని అడ్డుకుంటున్న ఆదివాసులపై అటవీ చట్టాలను ఉల్లంఘిస్తూ, ప్రభుత్వం తీవ్రమైన హింసకు పాల్పడుతోందని అంటున్నారు* మర్రి కామయ్య**

ప్రజల ఆకాంక్షలను, అభిప్రాయాలను వ్యక్తపరచడానికి వీలు ఉండడం అనేది ప్రజాస్వామిక వ్యవస్థ మౌలిక లక్షణం. అందుకొరకు సభలు, సమావేశాలు వేదికలుగా ఉంటాయి. వాక్‌సభా స్వాతంత్ర్యాలను భారత రాజ్యాంగంలోని 3వ భాగంలో 12 నుంచి 35 వరకు ఉన్న ఆర్టికల్స్ ప్రాథమిక హక్కుల గురించి వివరించాయి. ప్రాథమిక హక్కులకు భంగం కలిగినప్పుడు న్యాయ వ్యవస్థ ద్వారా రక్షణ పొందే వీలుంది. న్యాయస్థానాలు కూడా పౌరుల ప్రాథమిక హక్కుల పరిరక్షణ కోసం ఆదేశాలు జారీ చేసే అవకాశం రాజ్యాంగంలో కల్పించారు.

2014 సాధారణ ఎన్నికల్లో అనేక వాగ్దానాలతో ప్రజల్ని నమ్మించి తెలుగుదేశం పార్టీ అధికారంలోకి వచ్చింది. ఆనాటి నుండి నేటి వరకు ముఖ్యమంత్రి చంద్రబాబు, ఆయన మంత్రివర్గ సహచరులు రాజ్యాంగాన్ని, చట్టాల్ని కాపాడతామని ప్రమాణం చేసిన మరుక్షణం నుండే చట్టాల్ని, రాజ్యాంగాన్ని తుంగలో తొక్కి ఇక్కడి సంపదను బహుళజాతి కంపెనీలకు అప్పజెప్పడం కోసం మూల వాసులైన ఆదివాసులపై ఉక్కుపాదం మోపి అణచివేస్తున్నది.

అభివృద్ధి పేరుతో చంద్రబాబు రాష్ట్రంలోని మైదానాలను, సముద్రాన్ని, సముద్ర తీరాన్ని, గుట్టలు, వాగులు, వంకలు, అడవులు, భూముల్ని కూడా వదలకుండా మల్టీనేషనల్ కంపెనీలకు తెగనమ్ముతున్నారు. అడవిలో విస్తారమైన లక్షల కోట్లు విలువచేసే ఖనిజ సంపదను జిందాల్ అన్‌రాక్, ఎస్సార్, నాల్కో, పోస్కోలకు కట్టబెడుతున్నారు. అటవీ సంపదను తరలించడాన్ని, అడవిలో ఉన్న ఆదివాసులు తీవ్రంగా వ్యతిరేకిస్తున్నారు. వారిని అడవి నుండి తరిమి వేయడానికి పాలకులు ఆపరేషన్ గ్రీన్‌హంట్ పేరుతో ఆదివాసులపై దాడులకు తెగబడుతున్నారు.

రాజ్యాంగంలోని ఐదో షెడ్యూల్ భూమి, అడవి, సహజ వనరులపై ఆదివాసులకు హక్కు, అధికారానికి స్పష్టమైన హామీనిచ్చింది. ఇంకా నిర్దిష్టంగా చెప్పాలంటే 1917 ఏజెన్సీ ఇంటరెస్ట్ ల్యాండ్ ట్రాన్స్‌ఫర్ ఆక్ట్ 1959 ఏపి షెడ్యూల్ ల్యాండ్ ట్రాన్స్‌ఫర్ రెగ్యులేషన్ ఆక్ట్ 1/70 చట్టం, 2006 అటవీ హక్కుల గుర్తింపు చట్టం, 1996 పీసా చట్టం, వడ్డీ వ్యాపార నిషేధ చట్టం, అటవీ వన్యప్రాణి సంరక్షణ చట్టం వంటి చట్టాలను అమలు చేయడానికి ప్రభుత్వం పూనుకోకపోగా, వాటిని నిర్వీర్యపరిచే విధంగా, అంతిమంగా రద్దు చేసే దిశగా పాలకుల విధానాలు ఉంటున్నవి. రాజ్యాంగం పొందుపరిచిన ఆదేశిక సూత్రాల వెలుగులో రాజ్య పాలన జరగాలి. కానీ ఇక్కడ అలా జరగడం లేదు. ప్రపంచ బ్యాంకు అభివృద్ధి నమూనా ఆధారంగా రాజ్య పాలన నడుస్తున్నది. సాధారణంగా ఇలాంటి సందర్భాలలో కోర్టులు జోక్యం చేసుకోవాలి. కానీ న్యాయ వ్యవస్థ చోద్యం చూస్తూ, పాలక వర్గాల ప్రయోజనాలకు అనుగుణంగా వ్యవహరిస్తున్నది. ఎందుచేతనంటే ఈ వ్యవస్థ స్వరూపం పూర్తిగా దోపిడీ వ్యవస్థ. ధనవంతుల, భూస్వాముల వ్యవస్థ. దళారీ నిరంకుశ బూర్జువా వ్యవస్థగా మనలో కొందరికైనా పూర్తిగా తెలుసు. ఇది కొందరికి నచ్చకపోవచ్చు. కానీ రాజ్యాంగం నీడలోనే న్యాయ వ్యవస్థ, చట్టాలు, కోర్టులు కోటీశ్వరుల పక్షపాతి. కాబట్టి ఇప్పుడు ఉనికిలో ఉన్న వ్యవస్థలకు అనుగుణంగానే రాజ్య వ్యవస్థలు మసులుకుంటాయి తప్ప! మరో విధంగా మనజాలదు. కాబట్టే దేశంలో కలవారు మాత్రమే ప్రాథమిక హక్కులను అనుభవిస్తున్నారు. అశేష పీడిత, తాడిత జన బాహుళ్యానికి ప్రాథమిక హక్కులు అర్థరహిత మైనవిగా మిగిలాయి. సమానత్వం సాధించడంలో రాజ్యాంగం ఘోరంగా విఫలమైంది. నిజానికి గతంలో లేనంతగా సంపదలో అసమానతలు పెరిగాయి. ఆకలి చావులు, ఆత్మహత్యలు, నిరుద్యోగం, మూఢ విశ్వాసాలు, పేదరికం వంటి సమస్యలు దేశం నుంచి పారద్రోలాలని రాజ్యాంగ రూపకర్తలు భావించారు. కానీ వారి ఆశలు అడియాసలే అయ్యాయి.

విశాఖ మన్యంలో బాక్సైట్ గనుల తవ్వకాలకు వ్యతిరేకంగా జరుగుతున్న ప్రజా ఉద్యమాన్ని మావోయిస్టు పేరిట ముద్రవేసి ప్రతి పల్లెను, గూడేల్ని నిర్బంధంలోకి నెడుతున్నది చంద్రబాబు ప్రభుత్వం. అభివృద్ధి పేరిట బాక్సైట్ వెలికి తీయడం మూలంగా తమ ఉనికి, మనుగడ ప్రశ్నార్థకంగా మారుతున్న తరుణంలో తమ ఆవేదనను, ఆందోళనను శాంతియుతంగా నిర్వహించుకునే స్వేచ్ఛ కూడా లేదు. గత 2014 ఆగస్టులో జర్రెల పంచాయితీ కేంద్రంలో జరిగిన బాక్సైట్ వ్యతిరేక సదస్సుపై పోలీసులు దాడి చేశారు. అలాగే 2015 సెప్టెంబర్‌లో అఖిలపక్షం ఆధ్వర్యంలో కొయ్యూరు మండల కేంద్రంలో బాక్సైట్ వ్యతిరేక సదస్సుకు కరెంట్ సరఫరా నిలిపివేశారు. బాక్సైట్ ఊసు ఎత్తగానే మైక్ కట్ చేశారు. 2015 నవంబర్‌లో సిపిఐ ఆధ్వర్యంలో ధారకొండలో బాక్సైట్ వ్యతిరేక సభకు వెళ్తున్న ఆ పార్టీ నాయకులను చింతపల్లి మండల కేంద్రంలో అరెస్ట్ చేశారు. ఆందోళన, నిరసనలతో ఎలా వ్యవహరిస్తారన్న దాన్ని బట్టి పాలకులు ఎలాంటి వారో అంచనా వేయవచ్చు. ప్రజలు శాంతియుతంగా నిరసనలు, ఆందోళనలు, ఊరేగింపులు, ధర్నాలు, దీక్షలు చేస్తున్నప్పుడు సంయమనంతో వ్యవహరించడం, అనునయించే ధోరణిని అవలంబించడం పాలకులు చేసే పని. ఉన్న వాతావరణాన్ని మరింత ఉద్రిక్తపర్చకూడదన్నదే దాని వెనుకున్న ఉద్దేశం. అయితే ఏనాడూ సక్రమంగా అధికారంలోకి వచ్చిన చరిత్ర లేని చంద్రబాబు నుంచి అలాంటి సంస్కారాన్ని ఆశించలేం. రెండవది చంద్రబాబు ఈ వ్యవస్థకు, అంటే దోపిడీ వ్యవస్థకు ప్రతినిధి.

ధనవంతుల పక్షపాతి. ప్రపంచ బ్యాంకు అభివృద్ధి నమూనాను అమలు పరచడానికి 'కంకణం' కట్టుకున్న నాయకుడు. ప్రజాస్వామికంగా ప్రజల మనోభావాల్ని వ్యక్తపరిచే వీలు కల్పిస్తాడంటే ఎలా నమ్మగలం? నమ్మడానికున్న పునాది ఏమిటి?

బహుళజాతి కంపెనీల కనుసన్నలలోనే మన్యంలో రాజ్య పాలన సాగుతుందనడంలో అతిశయోక్తి లేదు. ఈ కార్పొరేట్ కంపెనీలు రాజ్య విభాగాలన్నింటిని తమ ప్రభావానికి గురిచేస్తున్నాయి. ఆదివాసి ప్రజల ప్రజాస్వామిక హక్కులను చంద్రబాబు ప్రభుత్వం హరించివేస్తున్నది. రాజ్యాంగం నిర్దేశించిన ప్రకారం ఆదివాసి ప్రాంతాల అభివృద్ధికి ఉద్దేశించిన గిరిజన సలహా మండలి (టిఎసి) ని నియమించకుండా, ఉద్దేశపూర్వకంగా జాప్యం చేస్తుంది. టిఎసిలో సభ్యులుగా ఉండే గిరిజన ఎంఎల్ఎలలో అత్యధికులు వైఎస్ఆర్ కాంగ్రెస్‌కు చెందినవారు కావడమే ప్రధాన కారణం. తమ పార్టీకి చెందిన గిరిజన నేతలకు, నామినేటెడ్ పదవులు కట్టబెట్టి, వారిని దొడ్డి దారిలో టిఎసిలో సభ్యులుగా చేర్పించడానికే ప్రభుత్వం వ్యూహం పన్నుతున్నది. ఎంఎల్ఎల కంటే అధిక సంఖ్యలో నామినేటెడ్ సభ్యులను నియమించాలన్న ప్రభుత్వ పన్నాగం అక్షరాల రాజ్యాంగ స్ఫూర్తికి విరుద్ధం. టిఎసిలో 20 మంది వరకు సభ్యులు ఉండొచ్చని రాజ్యాంగం చెపుతోంది. అందులో ఎంఎల్ఎలు మూడొంతుల మంది ఉండాలని స్పష్టం చేస్తోంది. ప్రస్తుతం రాష్ట్రంలో గిరిజన ఎంఎల్ఎలు ఏడుగురే ఉన్నారు. ఆ ప్రకారం మొత్తం సభ్యులు 10 మందికి మించకూడదు. కానీ చంద్రబాబు ప్రభుత్వం ఈ విషయాన్ని పక్కదారి పట్టిస్తోంది. ఖచ్చితంగా 20 మంది సభ్యులు ఉండాలని రాజ్యాంగంలో లేదు. గరిష్టంగా 20 మంది వరకు ఉండొచ్చన్నదాన్నే ప్రస్తావిస్తూ, తమ పార్టీ (టిడిపి) నేతలు 13 మందిని టిఎసికి నామినేట్ చేయాలని భావిస్తోంది. తద్వారా బాక్సైట్ తవ్వకాలకు అనుకూలంగా టిఎసిలో మెజార్టీ సాధించాలన్నది ప్రభుత్వ పన్నాగం. ఇలా ప్రభుత్వమే చట్టాలను ఉల్లంఘించడం ద్వారా ప్రజలకు ఏం చెప్పదల్చుకున్నారు? ఏ సంకేతాలు పంపదల్చుకున్నారు.

గ్రామ సభల వ్యవస్థ ద్వారా ఆదివాసులను సంప్రదించే ప్రక్రియను పూర్తిగా నిర్లక్ష్యం చేస్తున్నారు. తమ నిరంకుశ విధానాలను అప్రజాస్వామికంగా మూల వాసులపై రుద్దుతున్నారు. పీసా చట్టం – 1996 క్షేత్ర స్థాయిలో అమలు కావడం లేదు. చట్ట ప్రకారం ఏర్పాటైన గ్రామ సభల కమిటీలకు అవగాహన కల్పించి, వారిని అభివృద్ధి కార్యక్రమాల్లో భాగస్వాములను చేయడంలో ప్రభుత్వం విఫలమైంది. మరోవైపు క్షేత్రస్థాయి నుండి మొదలుకొని మండల స్థాయిలో జరుగుతున్న వివిధ పథకాల అమలు, పర్యవేక్షణ, లబ్ధిదారుల ఎంపిక, రుణాల మంజూరు వంటి విషయాల్లో అధికారాలు కల్పిస్తూ, 'జన్మభూమి కమిటీ'లను ప్రభుత్వం నియమించింది. ఇదీ పీసా చట్టాన్ని నిర్వీర్యపరిచే చర్యే. ఇందులో ఎలాంటి సందేహం లేదు. చట్టాలను అతిక్రమించి ప్రవర్తించే వారికి ఇతరులను చట్టాలను గౌరవించమని చెప్పే అర్హత ఎక్కడిది. నిజానికి ఆదివాసి ప్రాంతాల్లో ఈ వ్యవస్థలు ఆదర్శవంతంగా ఉంటూ ఆదివాసుల నమ్మకాన్ని చూరగొనడం ద్వారా ఒక మేరకు ప్రజాస్వామ్యానికి గుర్తింపు తేవచ్చు. తేవాలి కూడా. అయితే అది అత్యాశగా మిగిలి పోకుంటే బాగుండేది. భారత రాజ్యాంగ నియమం ప్రకారం 5వ షెడ్యూల్డ్ ఆదివాసి ప్రాంతంలోని అభివృద్ధి నమూనా, జీవన విధాన స్థితిగతులపై ప్రతి సంవత్సరం రాష్ట్ర గవర్నర్, భారత రాష్ట్రపతికి నివేదిక పంపాలి. కానీ అసలు రాజ్యాంగంలో నాపై ఈ బాధ్యత నియమం ఉందా? అని తెలిసో తెలియదో అనే పరిస్థితిలో ఉంది మన రాష్ట్ర గవర్నర్ తీరు. అటువంటి తరుణంలో ఆదివాసుల స్థితిగతుల వైపు తొంగిచూస్తే ఇంకా 50 సంవత్సరాలైతే ఆదివాసులను మ్యూజియంలో పెట్టి చూసుకునే పరిస్థితులకి అనివార్యంగా నెట్టబడుతాం.

బాక్సైట్ ఖనిజ సంపదను కొల్లగొట్టడమే లక్ష్యంగా చంద్రబాబు ప్రభుత్వం వ్యవహరిస్తోంది. అందులో బాగంగానే మైనింగ్ కోసం ఎపిఎండిసికి భూములు బదలాయిస్తూ ఇచ్చినదే జిఒ 97, అంటే ఎపిఎండిసి మైనింగ్ చేసుకోవచ్చుట. అయితే 97 జిఒకు వ్యతిరేకంగా మన్యం ఒక్కసారి భగ్గుమనడంతో, జిఒను తాత్కాలికంగా నిలిపివేస్తున్నట్లుగా ప్రకటించక తప్పలేదు. కానీ వాస్తవంగా జరిగిందేమిటంటే 2008లో జారీ చేసిన జిఒ 222 (ప్రతాపరెడ్డికి బాక్సైట్ సరఫరాకు వీలుకల్పించే జిఒ)ను రద్దు చేస్తున్నట్లు చంద్రబాబు ప్రకటిస్తున్నారు. అన్‌రాక్ కంపెనీకి అమ్ముడుపోయిన తెలుగుదేశం ప్రభుత్వం అబద్దపు శ్వేతపత్రాలను విడుదల చేయడం, బాక్సైట్‌పై గిరిజన ప్రజాభిప్రాయం సేకరిస్తామని కొత్త నాటకం ప్రారంభించడం ప్రజలను మోసగించడానికే. ఎందుకంటే అన్‌రాక్ కంపెనీ ఇప్పటికే రు. 5,300 కోట్లతో పరిశ్రమ ఏర్పాటు చేసినట్లు ప్రభుత్వమే శ్వేతపత్రంలో అంగీకరించిన నేపథ్యంలో కోర్టులో కూడా ఆ సంస్థకు అనుకూలంగానే తీర్పు వస్తుందని స్పష్టం చేస్తున్నారు. ఈ విషయం చంద్రబాబుకు స్పష్టంగా తెలిసినప్పటికీ, ఉద్దేశపూర్వకంగానే జిఒ – 97ను రద్దు చేయకుండా వ్యూహాత్మకంగా వ్యవహరిస్తున్నారు. తాను జిఒ రద్దు చేసినా కోర్టు అనుమతించిందని తప్పించుకునే వ్యూహంలో భాగంగానే చంద్రబాబు కేవలం జిఒ – 222 మాత్రమే రద్దు చేశారు. గతంలో ఎస్సి వర్గీకరణ విషయంలోనూ చంద్రబాబు ఇలానే కోర్టు మాటున దాక్కున్నారు. మైనింగ్ లీజులు, ఖనిజ తవ్వకాలకు గ్రీన్ సిగ్నల్ ఇస్తూ భూమి బదలాయింపు జిఒ 97 రద్దు చేయకుండా ఒప్పందాలు మాత్రమే రద్దు చేస్తున్నట్లు ప్రకటించారంటే లోపాయికారీ ప్రయత్నాలున్నట్లు స్పష్టమవుతున్నది. అందుకే బాక్సైట్ వ్యతిరేకోద్యమాన్ని పోలీసు బలంతో అణచివేసేందుకు ప్రభుత్వం బరితెగించింది. బాక్సైట్ తవ్వకాల వ్యవహారంలో ముఖ్యమంత్రి చంద్రబాబు వైఖరిని విమర్శిస్తూ, గిరిజనుల హక్కుల గురించి, వాటినెలా ప్రభుత్వం హరిస్తుందో వివరిస్తూ, డిసెంబర్ 10న చింతపల్లిలో జరిగిన బహిరంగ సభలో పాడేరు ఎంఎల్ఎ గిడ్డి ఈశ్వరీ ప్రసంగించారు. ముఖ్యమంత్రిపై విమర్శలు చేసినందుకు ఈశ్వరీపై ఏకంగా దేశ ద్రోహం కింద కేసు పెట్టారు. ఓ వ్యక్తి రాజ్యాన్ని నడుపుతున్నంత మాత్రాన ఆ వ్యక్తే రాజ్యం కాదు. అలానే రాజ్యాన్ని ఎలుతున్నారనీ వారు చెప్పిందే వేదమని, వాటిని శిరసావహించి పాటించాలనడం నియంతృత్వమే అవుతుంది.

2015 డిసెంబర్ 10న విశాఖ, విజయనగరం, కోరాపుట్ జిల్లాల సరిహద్దు (ట్రై జంక్షన్) గన్నెల అటవీ ప్రాంతంలో మావోయిస్టులకు పోలీసులకు మధ్య ఎదురు కాల్పులు జరిగాయి. ఈ సందర్భంగా ఆంధ్ర – ఒడిస్సా సరిహద్దుల్లో ఉన్న గ్రామాలపై ప్రత్యేక పోలీసు బలగాలు మూకుమ్మడిగా దాడులకు తెగబడ్డారు. సుమారుగా 25 మంది ఆదివాసులను చితకబాదారు. ఒక మహిళను కిడ్నాప్ చేసి రోజంతా తమ వద్దనే పెట్టుకున్నారు. వీరి ఆకృత్యాలకు భయపడి యువతీ, యువకులు గ్రామలను వదిలిపెట్టి, తమ బందువుల ఇండ్లకు

పారిపోతున్నారు. 2015 డిసెంబర్ 29న కోరాపుట్ జిల్లా పొట్టంగి బ్లాక్ పరిధిలోని పెదపాడు గ్రామంపై 60 మంది బిఎస్ఎఫ్ బలగాలు దాడి చేసి నగదు, బంగారం, వెండి ఆభరణాలు దోచుకున్నారు. ఆదివాసుల సంప్రదాయక ఆయుధాలు, నాటు తుపాకులు స్వాధీనం చేసుకున్నారు. ఈ ప్రాంతంపై రాజ్యం ఇంతగా విరుచుకుపడడానికి అనేక కారణాలు ఉన్నాయి. ముఖ్యంగా ఈ మూడు జిల్లాల (విశాఖ, విజయనగరం, కోరాపుట్) సరిహద్దు ప్రాంతం. దీన్నే గొల్లూరిలోయగా కూడా పిలుస్తారు. ఇక్కడ అపారమైన ఖనిజ నిక్షేపాలున్నాయి. బాక్సైట్, ఇనుము, గ్రానైట్, నాపరాయి, సున్నపురాయి, కాల్సైట్, అభ్రకం మొదలైన ఖనిజాలు ఉన్నాయి. కోరాపుట్ జిల్లా పొట్టంగి బ్లాక్ పరిధిలోని హంపవల్లి గ్రామ సమీపంలో భిర్లా పెర్యూలెస్ కంపెనీ గ్రానైట్ తవ్వకాలు చేపట్టి, కోట్లాది రూపాయల విలువచేసే సంపదను తరలించుకుపోయింది. ఇదే ప్రాంతంలో చికపరు గ్రామ సమీపంలో ఒడిఎండిసి ఆధ్వర్యంలో గ్రానైట్ తవ్వకాలు జరిపింది. ప్రస్తుతం ఈ ప్రాంతంలో 'తోచల్' కంపెనీ నాపరాయి, సున్నపురాయిని వెలికితీసి, ఇక్కడే సిమెంట్ ఉత్పత్తి చేసి, బయట ప్రాంతాలకు తరలించుకు పోతున్నది. సిమెంట్ ఫ్యాక్టరీ మూలంగా వాతావరణ కాలుష్య నివారణకై, కార్మికుల మౌలిక సమస్యలపైన కార్మికులు, ప్రజలు గత కొంత కాలంగా ఉద్యమిస్తున్నారు. కొన్ని సమస్యల్ని పరిష్కరించుకుంటున్నారు. ఈ ప్రాంతంలో అన్ని రకాల గనులు కలుపుకొని ఒక 36 వరకు ఉంటుంది. వాటిని ఇప్పటికే వివిధ కంపెనీలతో ఒడిస్సా, ఆంధ్ర రాష్ట్రాల ప్రభుత్వాలు ఎంఒయులను కుదుర్చుకున్నాయి. దీనికి పొరుగునున్న విశాఖ జిల్లా అరకులోయ మండలం రక్తకండి, చిట్టంగొంది, మాలిడొంగోర్, బాగ్డొంగోర్ (డొంగోర్ అంటే ఒడియా భాషలో కొండ – పర్వతం) ప్రాంతాల్లో బాక్సైట్ నిక్షేపాలు ఉన్నాయి. ఇప్పటికే చంద్రబాబు ప్రభుత్వం బాక్సైట్ తవ్వకాలకు అనుమతివ్వడంతో, వీటికి వ్యతిరేకంగా ఉద్యమం ఊపందుకుంది. ఈ ప్రాంతంలో కూడా సుమారు ఆరు మాసాలుగా బాక్సైట్ వ్యతిరేక పోరాటం నడుస్తోంది. అదే విధంగా విజయనగరం జిల్లా పాచిపెంట మండలం మోదుగ పంచాయితీ పరిధిలోని బంగారుగుడ్డి, కాట్రగుడ్డి తదితర గ్రామాల సమీపంలో ఇనుము గనుల తవ్వకాలకు సన్నాహకాలు చేస్తోంది అందుకే ఈ ప్రాంతం ఇరు రాష్ట్ర (ఒడిస్సా – ఆంధ్ర) ప్రభుత్వాలకు కీలకంగా మారింది.

రెండు రాష్ట్రాలకు చెందిన సుమారు 13 పంచాయితీలు ఉన్నాయి. 50 వేలకు పైగా ఆదివాసులు జీవనం సాగిస్తున్నారు. నేడు ఈ ప్రాంతంపై కూడా ప్రపంచ బ్యాంకు అభివృద్ధి నమూనాను అమలు చేయడానికి ఇరు రాష్ట్రాల ప్రభుత్వాలు పావులు కదుపుతున్నాయి. దీంట్లో భాగంగా జిందాల్, భిర్లా, పోస్కా, తోచల్, నాల్కో వంటి కంపెనీలు గనుల తవ్వకం కోసం సమాయత్తమవుతున్నాయి. ఈ నేపథ్యంలో ఇక్కడి ఆదివాసులు చైతన్యమై సంఘటితంగా పోరాడుతున్నారు. జల్, జంగల్, జమీన్‌పై ఆదివాసులకే హక్కు అనీ ఎలుగెత్తి నినదిస్తున్నారు. వీరి ఆందోళనను, ఆవేదనను అణచిపెట్టడంలో భాగంగానే 2014లో కోరాపుట్ జిల్లా పొట్టంగి బ్లాకు గొల్లూరి పంచాయితీ పరిధిలోని 'మునగాలవలస' గ్రామం వద్ద దుంబ్రి (సంజీవ్), శ్యాం (స్వామి) లను ప్రత్యేక పోలీసు బలగాలు హత్య చేశారు. అదే విధంగా 2015 ఆగస్టులో ఇదే ప్రాంతంలోని 'వలపరు' గ్రామ పెద్దను అరెస్ట్ చేసి, మావోయిస్టులను హతమార్చే కుట్రలో భాగం కమ్మని తీవ్ర చిత్రహింసలకు గురి చేశారు. మరికొంత మందిని టార్గెట్ చేస్తూ, దాడులు చేయడానికి సిద్ధమవుతున్నారు. ఈ పరంపరలో భాగంగానే 2015 డిసెంబర్ 10న జరిగిన ఎదురు కాల్పులు కూడా, ఆ తదుపరి గ్రామాలపై జరుగుతున్న దాడులను చెప్పుకోవచ్చు. భవిష్యత్‌లో మరింత క్రూరంగా రాజ్యం ఉండబోతుంది.

అసలెందుకు ఆదివాసులే అభివృద్ధి ముసుగులో విధ్వంసం అవ్వాలి. రాష్ట్రాల అభివృద్ధిని ఆదివాసులెన్నడూ వ్యతిరేకించరు. కానీ అస్థిత్వానికి పెనుముప్పు వాటిల్లే విధ్వంసకర అభివృద్ధిని ఎలా సమర్ధిస్తారు. ఈ మూడు జిల్లాల సరిహద్దు ప్రాంతం (గొల్లూరిలోయ) మొత్తంగా 5వ షెడ్యూల్డ్‌లోని ఆదివాసీ ప్రాంతం. దానిని కార్పొరేట్ సంస్థల పరం చేసి, ఇక్కడ ఉన్న సంపదనంతా తవ్వి, స్థానిక ఆదివాసులను, సాంస్కృతిక జీవన విధాన వ్యవస్థలను ధ్వంసం చేస్తాననడం ఏ రాజ్యాంగ విలువలకు నిదర్శనం. ఇక్కడ ప్రజలను ఇంతటి తీవ్ర విధ్వంసకర విస్థాపనకు గురి చేసి, పెట్టుబడిదారులకు, సామ్రాజ్య వాదులకు సకల సౌకర్యాలతో కూడిన గనుల ట్రై జంక్షన్‌గా 'గొల్లూరిలోయను' మార్చబోతున్నారు. ప్రజల కొరకు, ప్రజల చేత ఎన్నుకోబడినామని చెప్పుకుంటున్న పాలక వర్గాలు ప్రజల సంక్షేమం కొరకు పట్టించుకోకపోయినా, ఎన్నికల హామీలు నెరవేర్చకపోయినా ఫర్వాలేదు. కానీ మట్టికి – మనిషికి, అడవికి – ఆదివాసికి, భూమికి – బువ్వకు ఉన్న సంబంధాన్ని తుంచకూడదు. ఆదివాసులను భిక్షగాళ్లను చేసి అడవిలో మైనింగ్ మాఫియాకు అనుమతినివ్వడం ప్రజా ద్రోహం.

మన్యంలో రాజ్యం మనకు పోలీసుల రూపంలోనే కనిపిస్తుంది. రాజ్యానికి అనేక కోరలు ఉన్నాయి. వాటిల్లో చట్ట సభలు (పార్లమెంట్ – అసెంబ్లీ) కోర్టులు, చట్టాలు, పోలీసు వ్యవస్థ, కార్యనిర్వాహక వ్యవస్థ (కలెక్టరు ఇతర ఉన్నత స్థాయి అధికారులు) ముఖ్యమైనవి. ఈ వ్యవస్థలన్నీ ప్రజలను దోపిడీ పీడనలకు గురి చేస్తూ, దళారీ నిరంకుశ బూర్జువా, భూస్వామ్య వర్గాలకు సేవ చేసేవే. అందుకే ఈ వ్యవస్థలన్నీ దళారీ నిరంకుశ బూర్జువా, భూస్వామ్య వర్గాలకు కోరల్లా పని చేస్తుంటాయి. అయితే వాటిల్లో పోలీసు వ్యవస్థ ప్రధానమైన కోరలా పనిచేస్తుంటుంది. ప్రజలు ఎక్కడైతే చైతన్య వంతులై దోపిడీ పీడనలకు వ్యతిరేకంగా తమ హక్కుల కోసం పోరాడుతుంటారో, రాజ్యం అక్కడ ప్రధానంగా పోలీసు వ్యవస్థను ప్రయోగిస్తుంది. మిగిలిన వ్యవస్థలు నామమాత్రం అవుతాయి. ప్రజలను మోసం చేసేందుకు, అణచిపెట్టి ఉంచేందుకు పోలీసు వ్యవస్థ అనేక అవతారాలు ఎత్తుతుంది. న్యాయ వ్యవస్థ మొదలు కార్య నిర్వాహక వ్యవస్థ, చట్ట సభల వరకు అన్ని వ్యవస్థలను సమన్వయిస్తూ, నాయకత్వ పాత్ర నిర్వహిస్తూ అన్ని పనులు తానై నిర్వహిస్తూ ఉంటుంది. ప్రస్తుతం విశాఖ మన్యంలో ఇదే పరిస్థితి నెలకొని ఉంది. మనకు ఇక్కడ పోలీసు వ్యవస్థ మినహా మిగిలిన వ్యవస్థలు ఏవీ కనిపించడం లేదు. ఉన్నా అవి నామమాత్రంగానే ఉన్నాయి. ఇవి ఏ రూపంలో ఉన్నా వాటన్నింటి ముఖ్య కర్తవ్యం ఇక్కడి ప్రజల ప్రజాస్వామిక ఉద్యమాన్ని అణచివేసి, ఇక్కడి సహజ వనరులను లూఠీ చేసుకోవడానికి మార్గం సుగమం చేయడమే వీరి ఏకైక కర్తవ్యం. అందుకే తెల్ల దొరల పాలనను మన్యం నుండి తరిమికొట్టడానికి చేపట్టిన 'మన్యం పితూరీ' వలె, చంద్రబాబు ప్రభుత్వం చేపట్టిన ప్రపంచ బ్యాంకు అభివృద్ధి నమూనాకు వ్యతిరేకంగా మన్యంలోని ప్రజాస్వామిక శక్తులు ఏకం కావాలి. జల్, జంగల్ జమీన్ ఇజ్జత్‌లకై పోరాడాలి.

వీ

*(రచయిత రాజనీతి శాస్త్ర విద్యార్థి)*

# బస్తర్‌లో 'సాక్ష్యాలు లేని యుద్ధం'

***బస్తర్‌లో ఆదివాసుల మీద, మావోయిస్టుల మీద తలపెట్టిన దాడికి సాక్ష్యాలు, నిరసనలు లేకుండా చేయడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయని అంటున్నారు శ్రీకుమార్ కొడియత్***

శ్రీలంక ప్రభుత్వానికి లిబరేషన్ టైగర్స్ ఆఫ్ తమిళ్ ఈలం (ఎల్‌టిటిఇ)కి మధ్య యుద్ధంలో చివరి దశ అయిన నాలుగో దశలో శ్రీలంక ప్రభుత్వం వైపు నుంచి పద్ధతి ప్రకారం ఒక ప్రయత్నం జరిగింది. ఆ యుద్ధాన్ని బైటివారెవరికీ కనబడకుండా లోలోపల జరపడమే ఆ ప్రయత్నం. మానవతావాద సంస్థలనూ, అంతర్జాతీయ సంస్థలనూ, ప్రచార సాధనాల విలేఖరులనూ, మానవహక్కుల కార్యకర్తలనూ ఒకరి తర్వాత ఒకరిగా బైటికి వెళ్లిపొమ్మని ఆదేశించారు. లేదా యుద్ధక్షేత్రం నుంచి వారిని తరిమేశారు. అయినా మొండిగా ఉండిపోయిన కార్యకర్తలనూ విలేఖరులనూ భద్రతాళాలు మాయం చేశాయి. లేదా నిర్బంధించాయి. వాళ్లు దాన్ని సాక్ష్యాలు లేని యుద్ధం అని పిలిచారు. పలక మీద ఏమీ కనబడకుండా తుడిచెయ్యడానికి సాయుధ బలగాలకు పూర్తి అధికారం ఇచ్చారు.

ఆ పనిని చాలా సమర్థంగా చేశారు గాని ఆ ప్రాంతంలో జరిగిన చిత్రహింసల గురించీ, అత్యాచారాల గురించీ, హత్యాకాండ గురించీ, చివరికి మృతదేహాల పట్ల జరిగిన అవమానాల గురించీ ఎన్నో వీడియోలూ చిత్రాలూ ఆ తర్వాత బయటపడ్డాయి. ఎల్.టి.టి.ఇకి సైన్యానికీ జరిగిన చివరి యుద్ధంలో శ్రీలంక ఉత్తరాదిన ఉన్న ముల్లైతీవు జిల్లాలో ఇరవై వేల కన్న ఎక్కువ మంది చనిపోయారు. మరొక ఇరవై వేల మంది తీవ్రంగా గాయపడ్డారు. ఆ నెత్తుటి మరకలు అంతర్జాతీయ సమాజం మనసు మీద ఇంకా మిగిలే ఉన్నాయి. మరొకపక్క ఆ గాయాలను మాన్పడానికీ, పునర్నిర్మాణం సాగించడానికీ తనకు నిబద్ధత ఉందని ప్రపంచానికి చూపుకోవడానికి శ్రీలంక ప్రభుత్వం ప్రయత్నాలు చేస్తూనే ఉంది.

సైనిక బలగాలు తమ చర్యలు సాగిస్తున్నప్పుడు ప్రధాన అవరోధాలుగా కనబడే మానవహక్కుల కార్యకర్తలతో, స్వతంత్ర జర్నలిస్టులతో ఎలా వ్యవహరించాలనేదానికి ప్రపంచవ్యాప్తంగానే ఒక ఉదాహరణగా నిలిచింది శ్రీలంక. ఆకలిగొన్న పౌరుల మీద, నిరసన తెలుపుతున్న విద్యార్థుల మీద, సాయుధ తిరుగుబాటుదారుల మీద ప్రభావశీలమైన సైనిక చర్యలు జరిపేటప్పుడు అనుసరించదగిన నమూనాగా నిలిచింది ఈ సాక్ష్యాలు లేని యుద్ధం.

మధ్య భారత రాష్ట్రమైన చత్తీస్‌గడ్‌లో జరుగుతున్న పరిణామాలను ఈ నేపథ్యంలోనే విశ్లేషించవలసి ఉంది. ఆ ప్రాంతం దాదాపు 40 శాతం అటవీ భూభాగంతో, దోపిడీకి అవకాశం ఇచ్చే రెండు అంశాలతో ఉంది. అవి ఒకటి ఖనిజ వనరులు, రెండు ఆదివాసి జనాభా, ఈ ప్రాంతంలో నివసిస్తున్న ఆదివాసి జనాభా దేశం మొత్తంలోనే అత్యంత నిరుపేద స్థితిలో ఉన్నారు. అందువల్ల వారు కట్టుబానిసల కోసం వెతికేవారికీ, వడ్డీ వ్యాపారులకూ అతి సులభమైన లక్ష్యాలుగా మారిపోయారు. ఇక భూమి విషయానికి వస్తే, అది గని యజమానులకు స్వర్గమే అనాలి. బొగ్గు నుంచి వజ్రాల దాకా అక్కడ లేనిది లేదు. గనుల తవ్వకాలు సాఫీగా సాగడానికి చట్టాలను తుంగలో తొక్కడానికైనా, సుప్రీం కోర్టు ఆదేశాలను కూడా బేఖాతరు చేయడానికైనా సిద్ధంగా ఉన్న సానుకూల రాష్ట్ర ప్రభుత్వం ఉంటే ఇక కావలసినదేమిటి? అయినా కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు కోరుకున్నట్టుగా ఖనిజ తవ్వకాలు నిరాటంకంగా ముందుకు సాగడం లేదు.

అందుకు కారణం రాజ్యం తన ప్రామాణిక అసమాన అభివృద్ధి విధానాల ఫలితంగానూ, గనుల లీజు ద్వారా లెక్కాపత్రం లేని లాభాలు పోగువేసే ఆదుర్దాతోనూ తయారు చేసిన ఒక జీవి. ఆ జీవి పేరు వామపక్ష తీవ్రవాదం. మరో పేరు నక్సలైట్లు. ప్రభుత్వం అమలు చేసిన అణచివేత విధానాల వల్ల బలపడిన నక్సలైట్లు దేశం ఎదుర్కొంటున్న ప్రధాన సవాల్‌గా మారారు. చివరికి మధ్య భారతంలోని కొన్ని ప్రాంతాలలో రెడ్ కారిడార్ అనేది ఏర్పడడానికి కారణమయ్యారు.

ఈలోగా గని యజమానుల కంపెనీలు వేచిచూస్తూ ఉండిపోయాయి. వాళ్లు కుదుర్చుకున్న ఒప్పందాలు ఆగిపోయాయి. స్థానిక రాజకీయ నాయకుల నుంచి ప్రధాన రాజకీయ పార్టీల ఎన్నికల నిధుల దాకా చేరవలసిన కోట్లాది రూపాయలు నిలిచిపోయాయి. ఒక ప్రభుత్వం తర్వాత మరొక ప్రభుత్వం ఎప్పటికప్పుడు నక్సలైట్లను ఎదుర్కోవడానికి కొత్త, కొంగొత్త పథకాలు రచించాయి. చివరికి రాజ్యమే ప్రోత్సహించిన ప్రైవేటు సైనిక బలగాలను కూడా తయారు చేశాయి. ఈ పథకాలన్నీ మహా మానవతా విషాదాలెన్నిటికో దారితీశాయి. రాజ్యం ప్రోత్సాహంతో ఏర్పడిన సల్వాజుడుం అనే ప్రైవేటు సైన్యం విచ్చలవిడిగా అత్యాచారాలు చేసింది. హత్యలు చేసింది. బీభత్సం సృష్టించింది. చివరికి 2011లో సుప్రీం కోర్టు దాన్ని చట్టవ్యతిరేకమైనదిగా ప్రకటించింది.

ఈ ప్రాంతపు వ్యవహారాలు మానవ హక్కుల సంస్థల, జర్నలిస్టుల దృష్టిని ఆకర్షించడంతో ఈ సంఘర్షణా క్షేత్రం నానాటికి మరింత సజీవంగా మారింది. చాలా మంది ఆదివాసులు హఠాత్తుగా మాయమైపోతున్నారనీ, కొన్నాళ్ల తర్వాత వారి మృతదేహాలు ఎక్కడో ఒకచోట కనబడుతున్నాయనీ, వారికి తక్షణమే నక్సలైట్లుగా గుర్తింపు దొరుకుతున్నదనీ, సాయుధ బృందాలపై పోలీసులు సాధించిన విజయాలను ప్రకటించడానికి పత్రికా సమావేశాలు ఏర్పాటవుతున్నాయనీ, ఆ తర్వాత ఆ పత్రికా సమావేశాలను ఆయా గ్రామాల

ఆదివాసులు ఖండిస్తున్నారనీ, నిరాయుధులైన తమ తోటి గ్రామస్థులను పట్టుకుపోయి చంపేశారని తెలియజేస్తున్నారనీ, విచ్చలవిడి అత్యాచారాలూ, ఊళ్లకు ఊళ్లు తగులబెట్టడాలూ జరుగుతున్నాయనీ వార్తలు వస్తున్నాయి. రాజ్యానికి ఉన్న సమస్యలు సరిపోనట్టుగా ఒక కొత్త సమస్య వచ్చి పడింది.

ఎప్పుడో ఆదివాసి హక్కుల బృందాలు ఒత్తిడి చేస్తే అంత ప్రమాదకరం కాని ఒక చట్టాన్ని, 2006 అటవీ హక్కుల చట్టం అనేదాన్ని, ప్రభుత్వమే రూపొందించింది. ఆ చట్టం అటవీ భూముల మీద, ఆ భూముల యాజమాన్యం మీద ఆదివాసులకు హక్కునిచ్చింది. ఖనిజ వనరులతో సంపన్నమైన మధ్యభారత అరణ్యాలను గనుల కంపెనీలకు అప్పగించడానికి ఈ చట్టమే పెద్ద ఆటంకం అవుతుందని ప్రభుత్వం ఎప్పుడూ ఊహించలేదు.

ఈలోగా దేశంలో రాజకీయ వాతావరణం మరింతగా మితవాదం వైపు మొగ్గింది. తగినంత దేశభక్తి లేదనే కారణంతో భారత పౌరుల స్వేచ్ఛనూ, శారీరక సమగ్రతనూ నిర్ధారించే పరిస్థితి వచ్చింది. ఇక పాత వ్యూహాలను సమీక్షించడం మొదలయ్యింది. సైనిక చర్యలలో మృదుత్వం, నెమ్మదితనం ఏ ఫలితాలనూ సాధించడం లేదు. అందువల్ల ఇక సాక్ష్యాలు లేని యుద్ధం చేపట్టవలసిన తరుణం ఆసన్నమైంది. మానవహక్కుల పట్ల దిగ్భ్రాంతికరమన ఏవగింపు చరిత్ర ఉన్న పోలీసు అధికారులను ఏరి కోరి రాష్ట్రమంతటా నియమించడం మొదలయింది.

ఇప్పటకే ఆదివాసి స్త్రీల మీద అత్యాచారాలు చేశాడనీ, ఆదివాసులను కాల్చి చంపి ఎన్‌కౌంటర్ కథలు అల్లాడనీ ఆరోపణలున్న ఎస్ఆర్‌పి కల్లూరి అనే సీనియర్ పోలీసు అధికారిని బస్తర్ ప్రాంతానికి బాధ్యుడుగా నియమించారు. ఏ ప్రైవేటు సైనిక విభాగాలను తయారు చేయడం, సాయుధం చేయడం చట్టవ్యతిరేకమైన పనులని సుప్రీంకోర్టు ప్రకటించిందో, అవే కిరాయి ముఠాల సంస్థలను మళ్లీ ఒకసారి మానవహక్కుల కార్యకర్తల మీదికీ, సంస్థల మీదికీ ప్రయోగించాలనే ఆలోచన మొదలయింది. ఇప్పుడు వినబడుతున్న కొత్త నినాదాలు భారత్ మాతాకీ జై, దేశద్రోహులారా, దేశం వదిలివెళ్లండి.

అత్యున్నత వేతనాల ఉద్యోగాలను వదిలి, కేవలం ఆదివాసి ఖైదీలకు న్యాయసహాయం అందించాలనే కోరికతో వచ్చిన యువ న్యాయవాదుల బృందాన్ని బెదిరించారు. వేధించారు. చివరికి వారికి ఇల్లు అద్దెకు ఇచ్చిన వ్యక్తిని బెదిరించి, ఇల్లు ఖాళీ చేయించేలా చూశారు. వారి కృషిలో సుదీర్ఘకాలంగా జోక్యం చేసుకుంటూ వచ్చిన స్థానిక బార్ అసోసియేషన్ వారి మీద నిషేధం ప్రకటించడంతో ఈ వేధింపులు ప్రారంభమయ్యాయి. ఇప్పుడిక కిరాయి మూకలు వారిని లక్ష్యంగా చేసుకుని దాడులు చేస్తున్నాయి. చివరికి వారిని ఈ ప్రాంతం నుంచి వెళ్లగొట్టడంలో విజయం సాధించాయి. మీరు ఇది చదువుతున్న సమయానికి శాలిన గేరా, ఈశా ఖండేల్వాల్ అనే ఆ న్యాయవాదులు, వారి మద్దతుదారులు జగ్దల్‌పూర్ నుంచి 400 కి.మీ దూరంలో బిలాస్‌పూర్‌లో నిస్సహాయంగా వేచిచూస్తున్నారు.

అలాగే స్క్రోల్ డాట్ ఇన్ అనే వెబ్ సైట్‌కు విలేఖరిగా పనిచేస్తూ, ఆదివాసుల మీద, సాగుతున్న సంఘర్షణ మీద, ఈ ప్రాంతంలో జరుగుతున్న విస్థాపన మీద వార్తలు రాస్తున్న మాలిని సుబ్రహ్మణ్యం ఇంటి మీద దాడి జరిగింది. ఆమె ఇంట్లో పనిచేసే వ్యక్తిని పోలీసులు నిర్బంధంలోకి తీసుకున్నారు. ఎన్నో గంటల పాటు ఆ పనిమనిషి మీద ఒత్తిడి తెచ్చి, మాలిని నక్సలైట్ అని ప్రకటన ఇప్పించారు. మాలినికి ఇల్లు అద్దెకు ఇచ్చిన యజమానిని బెదిరించి ఇల్లు ఖాళీ చేయించేలా చేశారు. ఆమె చిట్టచివరికి ఫిబ్రవరి 19న జగ్దల్ పూర్ వదిలి వెళ్లిపోవలసి వచ్చింది. మానవహక్కుల ఉల్లంఘనల మీద పరిశోధన చేస్తున్న స్వతంత్ర పరిశోధకురాలు బేలా భాటియాను ప్రభుత్వ ప్రేరేపిత కిరాయి మూకలు బెదిరించాయి. ఆమె ఇంటి యజమానిని కూడా పోలీసు స్టేషన్‌కు పిలిపించి బెదిరించారు. ఇటువంటి వేధింపులు అందుకున్న సుదీర్ఘమైన జాబితాలో ఈ పేర్లు చిట్టచివరి కొన్ని మాత్రమే. జర్నలిస్టులను తరిమివేయడం, నిర్బంధించడం చాలా కాలం కిందనే మొదలయింది.

తాజాగా ఆదివాసి నాయకురాలు సోని సోరి మీద బస్తర్‌లోని కోడెనార్ దగ్గర దాడి జరిగింది. ముగ్గురు దుండగులు ఆమె ముఖం మీద ఏదో రసాయనం చల్లగా ముఖమంతా కాలిపోయింది. గాయాలతో, నొప్పితో ఆమె ప్రస్తుతం ఢిల్లీలో చికిత్స పొందుతోంది.

మరొకవైపు కొద్ది గంటల ముందే చత్తీస్‌గఢ్‌తో సహా మధ్య బారతంలో ఎన్నో చోట్లకు వచ్చిన ప్రధాని నరేంద్ర మోడీ, తన ప్రభుత్వాన్ని అప్రతిష్ట పాలు చేయడానికి ప్రభుత్వేతర స్వచ్ఛంద సంస్థలు ప్రయత్నిస్తున్నాయని అన్నాడు. బస్తర్ నుంచి వస్తున్న వార్తలన్నీ వ్యవస్థ వ్యతిరేక ఏకపక్ష అబద్ధ ప్రచారాలు మాత్రమేనని జిల్లా కలెక్టర్ ప్రజలను హెచ్చరించాడు. అంటే అర్థం రేపు సాక్ష్యాలు లేని యుద్ధం మధ్యనుంచి ఏవైనా వార్తలు, వీడియోలు బయటపడితే వాటిని అబద్ధ ప్రచారంగా చూడాలన్న మాట. పాలకులు అంత భయపడవలసిన అవసరమేమీ లేదు. వాళ్లు చెప్పకపోయినా, మధ్య భారత రాష్ట్రాలలోని అడవులలో జరుగుతున్న వ్యవహారాలు ప్రధాన స్రవంతి భారత వార్తా పత్రికల పతాక శీర్షికలకు ఎక్కవు, వార్తా ఛానళ్ల దృష్టిని ఆకర్షించవు. భద్రతా బలగాలకు సంబంధించినంతవరకు బస్తర్‌లో వారికి దాదాపుగా ఏ ఆటంకాలూ లేవు. కొద్దిమంది ప్రముఖ పౌరుల రూపంలో, తిరుగుబాటుదార్ల రూపంలో ఉన్న ఆటంకాలను తొలగించవలసిన సమయమిదే. రంగస్థలం సిద్ధమయింది. సమయం ఆసన్నమయింది. ఇక భద్రతా బలగాలు ఎటువంటి సాక్ష్యాలూ లేకుండా తమ బీభత్సాన్ని ప్రారంభించవచ్చు.

*(http://www.countercurrents.org)*

*(రచయిత స్వతంత్ర మానవ హక్కుల పరిశోధకులు)* వీ

***రచయితలకు సూచన :*** *తక్షణ, సమకాలీన అంశాలపై రచనలు చేసి ఆ సంచికలోనే రావాలనుకొనే రచయితలు 20వ తేదీ లోగా పంపగలిగితేనే మరుసటి నెల సంచిక కోసం పరిశీలించడం సాధ్యమవుతుంది. ఆ తరువాత వచ్చిన రచన, అంశం ఎంత ముఖ్యమైనదైనా పరిశీలించడం, ముద్రణకు సిద్ధం చేయడం అసాధ్యమవుతుంది. రచయితలు గుర్తించగలరు. – సం.*

# డా. కాశీం పై కుట్రకేసు

*తెలంగాణ సాధన కోసం కృషిచేసిన కాశీం పై కుట్రకేసు పెట్టడమంటే, తెలంగాణ పేరు చెప్పుకొని అధికారంలోకి వచ్చిన పాలకులు గత పాలకుల విధానాలనే అనుసరించడమని అంటున్నారు* **రాజేంద్రబాబు అర్విణి**

**డా.** కాశీం కష్టజీవులకు ఇరివైపులా ఉండి మాట్లాడే కవి. ఉద్యమ కవిత్వం ఆయన ఊపిరి. అనర్గళ వక్తృత్వం ఆయన శ్వాస. తడబడు నడకలతో అడుగులేస్తున్న కొత్తరాష్ట్రం తెలంగాణకు దార్శినికతతో 'నడుస్తున్న తెలంగాణ' అన్నదీపం చేతబూని బాట సవరిస్తున్న మార్గదర్శి. ఆయనొక ప్రొఫెసర్. విద్యారంగంలో ఉన్నతమయిన, గౌరవనీయమయిన స్థానాన్ని అలంకరించిన వాడు. తెలుగు సాహిత్యంలో పరిశోధనచేసే డాక్టరేట్ విద్యార్థులకు మార్గదర్శకత్వం చెయ్యడానికి యుజిసిచే గుర్తించబడ్డ అధ్యాపకుల్లో ఆయనా ఒకడు. సమాజం ఆయన్ను ఒక విలక్షణమయిన పండితునిగా గుర్తించింది. ఆర్థికంగా, సామాజికంగా అట్టడుగు స్థాయినుంచి శ్రమతో అన్ని అవరోధాలు అధిగమించి చిన్నవయసులోనే అభ్యుదయ సమాజపు చూపుగా ఎదిగినవాడు.

ఆయనపై రాజద్రోహ నేరారోపణ. చట్ట వ్యతిరేక చర్యలకు ఉపక్రమిస్తున్నాడని, నేరపూరితమయిన కుట్రచేసి ప్రజాస్వామ్యబద్ధంగా ఎన్నికయిన భారత ప్రభుత్వాన్ని కూలదోయడానికి యుద్ధ సన్నాహం చేస్తున్నాడని నిందారోపణ. ఇంతకూ ఆయన చేతిలో ఉన్నది పోలీసులు చెపుతున్న దానిప్రకారమే ఏకె 47 రైఫిల్ కాదు. శక్తివంతమయిన గ్రెనేడ్ అసలేలేదు. పది మందిని తుత్తినియలు చేసే ఫవర్‌పుల్ బాంబుకాదు. మిస్సైల్ మాటేలేదు. ఆయన ఆత్మాహుతి దళంలో సభ్యుడు కూడా కాదు. మరి, ఆయన చేతిలో ఉన్నది 'నడుస్తున్న తెలంగాణ' పత్రిక. అక్షరమే ఆయుధంగా ధరించినవాడు. ఆయన నాలుకపై కదలాడే పదాలు బుల్లెట్లయి అంతరాంతరాలలోకి దూసుకపోయి ప్రభుత్వాన్ని కూలదోస్తాయట! ఆహా! శుష్క వాగ్దానాలనే ఇసుకతో నిర్మించబడ్డ ప్రభుత్వమా! అయిష్టంగానయినా నీవొక సత్యాన్ని వొప్పుకున్నావు. తుపాకులు ధరించిన వెయ్యిమంది సైనికులకన్న ఒక్క సిరాచుక్క శక్తివంతమయినదని. రెండువేల మంది చందా దారులు గల 'నడుస్తున్న తెలంగాణ' మాసపత్రిక, నెలకొకసారి వెలుగుచూసే కరదీపిక ఆయన చేతిలో ఉన్న విల్లంబులు.

ప్రత్యేక రాష్ట్రం కోసం సుదీర్ఘంగా జరిగిన తెలంగాణ పోరాటంలో ప్రస్తుత ప్రభుత్వాధినేతతో సహా పలువురు మంత్రులు (హోం మంత్రి కూడా), శాసనసభ్యులు, ఇప్పటి కుట్ర దారుడు డా. కాశీంకు సహ ఉద్యమకారులు. సామ్రాజ్యవాద కాంక్ష కలిగిన ఆంధ్రప్రాంత పాలకుల కుట్రలకు వ్యతిరేకంగా గళమెత్తినవాళ్లే. కుట్రకేసులు, ఎన్‌కౌంటర్లులేని తెలంగాణను ఆవిష్కరించాలని శపథం పూనినవాళ్లే. ఉద్యమ కాలంలో విరసం నేత వరవరరావు కుట్రకేసులో ఇరికించబడి చంచల్‌గూడ జైల్లో బందీగా ఉన్నప్పుడు ఇప్పటి తెలంగాణ ముఖ్యమంత్రి అప్పుడు జైలుకు వెళ్లి ఆయనను కలిసి కవులపై, మేధావులపై కేసులు బనాయించడాన్ని నిరసించినవాడే! మరి, అంతలోనే ఎంతమార్పు. 'ఎవరనుకొన్నారు ఇట్లవునని...'' అని 1969లో కాళోజీ సందేహం వ్యక్తపరిచాడు. విశాలాంధ్రలో తెలంగాణకు ఏమీ ఇక్కట్లు ఉండవని 1956లో ఆయన భావించి ఉండవచ్చు. విశాలాంధ్రలో ప్రజారాజ్యం వెల్లివిరుస్తుందని పుచ్చలపల్లి సుందరయ్య మనలను కలలుకనమన్నాడు. విశాలాంధ్రలో ప్రజారాజ్యం సంగతి పుచ్చలపల్లివారికే తెలుసు, దోపిడీ రాజ్యం ఎన్‌కౌంటర్ల రాజ్యం మాత్రం కొనసాగింది. ప్రజల రాజ్యం అటుంచండి, కనీస ప్రజాస్వామ్య విలువలకే తావులేకుండా పోయింది. సుందరయ్య కనమన్నకలలు విఫలం కావడానికి, కాళోజీ భ్రమలు తొలగిపోవడానికి ఒక పుష్కరకాలం పట్టింది.మరిఇప్పుడు. దశాబ్దాల పోరాటం తర్వాత తెలంగాణ స్వరాష్ట్రం సిద్ధించింది. ఉద్యమ సమయంలో అందరూ భుజం భుజం కలిపి రోడ్డెక్కారు. వంటలూ, వార్పులూచేశారు. సాగరహారం నిర్మించారు. సకల జనులచే సమ్మెచేయించారు. వారి వర్గ మూలాలను పక్కనపెట్టి రోడ్లమీద కలిసిపోయి కవాతు చేశారు. ప్రత్యేక రాష్ట్రం ఏర్పడిన తర్వాత ఉద్యమ పార్టీకే పట్టంకట్టారు. 'అప్పుడే ఇట్లవునని ఎవరనుకున్నారు...' అని విస్తుపోయే పరిస్థితినేటిది.

అయితే, రాజ్య స్వభావం ఇంతే అని సర్దుకుపోవాలా? ఉస్మానియా యూనివర్సిటీ పరిధిలోని నిజాం కళాశాలలో రోజూ పాఠాలు చెప్పుకుంటూ, పిలిచిన చోటికల్లా వెళ్లి సమాజంలోని అవకతవకలను విప్పిచెపుతూ, క్రమం తప్పకుండా ఓ తెలంగాణ పత్రికను గత ఆరేండ్లుగా నడుపుతున్న డా. కాశీం పరారీలో ఉన్నట్టు చూపించారు కాబట్టి ఏం కాదులే అని ధైర్యంగా ఉండాలా?

అది రాజ్య స్వభావమే కావచ్చు. భయపెట్టడానికి, కాలేజీలో పాఠం చెప్పడం తప్ప ఇంకేమీ చెయ్యవద్దని, ప్రభుత్వం తప్పులు ఎన్నేపని అసలు చెయ్యవద్దని హెచ్చరికగా నేరపూరిత కుట్ర, రాజద్రోహ నేరం ఆరోపించి ఉండవచ్చు. డా. కాశీం పై నేరనిరూపణ చెయ్యడానికి సరి అయిన ఆధారాలు ఏమీ పోలీసుల వద్ద ఇప్పుడు ఉండకపోవచ్చు. ఇంతకు ముందు ఎన్నోకుట్ర కేసులు వీగిపోయాయి కాబట్టి ఈకేసు కూడా వీగిపోతుందని ధైర్యంగా ఉండాలా! కాదుకాదు. అసలు అలాంటి అప్రజాస్వామిక చట్టాలు ఇంకా ఎందుకు ఉన్నాయని ప్రశ్నించాల్సిన సమయం ఆసన్నమయింది.

దేశం వలస రాజ్యంగా ఉన్నప్పుడు నూటా యాభై సంవత్సరాల క్రితం 1860లో శాసనం చేయబడ్డ భారత శిక్షాస్మృతి సామ్రాజ్యవాదుల నుండి రాజకీయ స్వాతంత్రం సిద్దించిన తర్వాత కూడా అలానే

# రక్షణలేని వలస కార్మికులు

***అభివృద్ధి పేరుతో పాలకులు తెస్తున్న తలకిందుల విధానాల వల్ల ప్రజలు వలస కూలీలుగా మారి వారి జీవితాలకే రక్షణ లేకుండా పోతోందని అంటున్నారు బాలసాని రాజయ్య***

పొట్ట చేతపట్టుకుని రాష్ట్రం కాని రాష్ట్రాల నుండి తెలంగాణ రాష్ట్రానికి వచ్చి ఇటుక బట్టీల్లో, రైస్ మిల్లులలో రెక్కలు ముక్కలు చేసుకుంటున్న వలసజీవులు రక్షణ లేక నానా అవస్థలు పడుతున్నారు.

ఇటుక బట్టి యజమానులు ఒడిశా కార్మికులను ఒప్పందాల పేరుతో కట్టు బానిసలు చేసుకుంటూ వాళ్ల బతుకులతో ఆటలాడుకుంటున్నారు. యజమానులు వారికి కడుపు నిండా తిండి పెట్టకుండా వారి శ్రమను దోచుకోవడమే కాకుండా వారిపై భౌతికంగా, మానసికంగా దాడులు చేస్తున్నారు. కార్మికుల ప్రాణాలను సైతం బలిగొన్న సంఘటనలు కరీంనగర్ జిల్లాలోని పెద్దపల్లిలో ఉన్నాయి. యజమానులు వారి శ్రమను దోచుకుంటూ, లైంగికంగా వేధిస్తూ, ప్రాణాలను తీస్తున్నప్పటికీ మాముళ్ల మత్తులో అధికారులు పేలవంగా విచారణలు చేపడుతున్నారు. ఎన్ని చట్టాలున్నా యజమానులకు మాత్రం చుట్టాలుగా మారి ఇటుక బట్టి కార్మికుల పాలిట శాపంగా తయారవుతున్నాయి.

పంటలు పండక, కూలి పనులు కూడా దొరకని కారణంగా ఒడిశా రాష్ట్రంలోని బలంగిరి, నువ్వపాడ, బర్గడ్ జిల్లాల నుంచి పెద్దసంఖ్యలో ఇటుక బట్టీలలో పనిచేసేందుకు తెలంగాణ రాష్ట్రానికి వస్తున్నారు. గత 30 సంవత్సరాల నుంచి ఒడిశా కార్మికులు ఒప్పందం కింద ఇటుక బట్టిల పని చేసేందుకు వస్తున్నారు. అక్టోబర్ నుండి జూలై మాసం వరకు ఇటుక బట్టీల్లో పనిచేస్తారు. ఇలా బట్టీల్లో పని కోసం ఒక వ్యక్తికి 10 వేల రూపాయల నుండి రు. 20 వేల వరకు అడ్వాన్స్ కింద సర్దార్‌లకు చెల్లిస్తారు. కుటుంబంలో ఇద్దరిని పంపించాలంటే సర్ధార్లు ఐదువేల రూపాయలు కమీషన్ తీసుకుంటారు. అనంతరం కార్మికులను తెలంగాణలోని కరీంనగర్, రంగారెడ్డి, లాంటి జిల్లాలకు తరలిస్తారు.

కరీంనగర్ జిల్లాలో 200 ఇటుక బట్టీలు ఉంటే ఒక పెద్దపల్లిలోనే 23 బట్టీలు ఉన్నాయి. బట్టీలో పనిచేస్తున్న కార్మికులకు బట్టి యజమాని తెలుపుతున్న వివరాల ప్రకారం ఒక వెయ్యి ఇటుకలకు రు. 350లు ఇస్తారు. వెయ్యి ఇటుక కటింగ్ చేస్తే ఒక కుటుంబానికి వారంలో వెయ్యి రూపాయలు ఇస్తారు. మట్టి కలిపి వెయ్యి ఇటుకలు అందిస్తే రు. 180లు ఇస్తారు. బట్టీలో వెయ్యి ఇటుకలు పేర్చడం, కాల్చడం చేస్తే లేబర్లకు రు. 150 ఇటుక యజమానులు చెల్లిస్తారు. పెద్దపల్లి ప్రాంతంలో కాల్చిన లైట్ వైట్ ఇటుకను రు. 10500లు, బరువు ఇటుకలకు రు. 6000లకు యజమానులు అమ్ముకుంటున్నారు.

అయితే బట్టీలలో యజమానులు కోడికూత నుంచి మొదలుకొని మధ్యాహ్నం భోజన సమయం మినహాయిస్తే రాత్రి 9 గంటల వరకు నిరంతరాయంగా ఒడిశా కార్మికులతో పని చేయించుకుంటున్నారు. రోజుకు దాదాపు 20 గంటలు కార్మికులతో వెట్టిచాకిరి చేయించుకుంటున్నారు. అలాగే బట్టీల నుంచి కార్మికులు పారిపోకుండా యజమానులు గట్టి ఏర్పాట్లు చేస్తారు. ఈ ఏర్పాట్లు వారి ప్రాణాలను సైతం బలిగొన్నాయి. 2013లో ఇటుక బట్టీల చుట్టూ కార్మికులు పారిపోకుండా కరెంట్‌తో కంచె ఏర్పాటు చేశారు. బట్టి పక్కనే మొక్కజొన్న చేను ఉండడంతో ఓ తండ్రి, కొడుకు కంకుల కోసం వెళ్లి కరెంట్ షాక్‌కు గురై చనిపోయారు. మరో రాత్రి ఇటుక యజమానులు రెండు శవాలను రాఘవాపూర్ గుట్టలపై పాతిపెట్టారు. ఈ విషయంపై ఆయా కుటుంబీకులు భయంతో మౌనంగా ఉండిపోయారు. మీడియాకు

---

చెక్కుచెదరకుండా కొనసాగాలా? ఇలాంటి వలసవాద చట్టాలు 'స్వతంత్ర' దేశంలో ప్రజాస్వామ్య ప్రియులకు వ్యతిరేకంగా పోలీసులకు, ప్రభుత్వాలకు అందివచ్చే ఆయుధాలుగా ఇంకా ఉండాలా? ఈ సమస్యపై ప్రజా ఉద్యమం రావాలసిన అవసరం లేదా?

ఈ సందర్భంగా మొట్ట మొదటిసారి రాజ్యాంగ సవరణ జరిగినప్పుడు, ఆనాటి ప్రధాన మంత్రి జవహర్‌లాల్ నెహ్రూ వెలిబుచ్చిన అభిప్రాయం మనం గుర్తుచేసుకోవాలి. రాజద్రోహ నేరారోపణే ప్రాథమికంగా రాజ్యాంగ వ్యతిరేకమయినదని విష్పష్టంగా చెప్పాడు నెహ్రూ. పార్లమెంట్లో ఆయన ప్రసంగిస్తూ 'నాకు సంభంధించినంతవరకు, భారత రాజ్యాంగంలోని అధికరణం124-ఏ (రాజద్రోహ నేరానికి సంభంధించినది-డా. కాశీంపై మోపిన సెక్షన్లలో ఇది కూడా ఉంది) చాలా అభ్యంతరకరమయినది, నిందార్హమయినది. ఆచరణరీత్యా, చారిత్రికంగాను దీనికి ఏచట్టంలోనూ స్థానం ఉండకూడదు. దీన్ని మనం ఎంతత్వరగా వదిలించుకుంటే అంతమంచిది.' ప్రధానమంత్రి పార్లమెంట్లో ఈమాట చెప్పి 65 సంవత్సరాలు అయ్యింది. అయినా, భారతరాజ్యాంగంలో రాజద్రోహ అధికరణం ఇంకా ప్రథమస్థానం ఆక్రమించే ఉంది. 'నినాదాల వలనగాని, ఉపన్యాసాల వలనగాని రాజద్రోహనేరం నిరూపించలేము. అవి రాజ్యానికి వ్యతిరేక చర్యలుగా రూపొందితేతప్ప' అని సుప్రీంకోర్టు పలు వ్యాఖ్యాలలో వ్యాఖ్యానించింది. డా. కాశీం పై మోపిన కుట్ర, రాజద్రోహం ఆరోపణలకు వ్యతిరేకంగా మాత్రమే కాదు, ఈపరిస్థితికి అవకాశం కల్పిస్తున్న రాజ్యాంగంలోని అధికరణలను పూర్తిగా రాజ్యాంగం నుండి తొలగించమని, రాజ్యాంగాన్ని ప్రజాస్వామీకరించమని పోరాడాల్సిన అవసరం ప్రజాస్వామిక వాదుల ముందు ఉంది.

*(రచయిత రిటైర్డ్ ప్రిన్సిపాల్)*

వీ

తెలియడంతో ప్రశ్నించిన కలాలను, గొంతులను ఖరీదుగట్టి ఇటుక బట్టీల యజమానులు కొనుగోలు చేశారు. అలాగే 2015 మార్చ్ 15న పని భారం ఎక్కువై పారిపోయిన లభోపాత్ర, కమల్‌కాంత్ గేహర్ అనే ఇద్దరు యువకులు బసంత్ నగర్ పోలీస్ స్టేషన్ పరిధిలోని అందుగులపల్లి వద్ద అనుమానస్పద స్థితిలో కాలువలో మృతిచెంది కనిపించారు. అయితే వారు రైతుల చేన్లకు అమర్చిన కరెంటు తీగలు తగిలి చనిపోయినట్లు పోలీస్ రికార్డుల్లో నమోదైంది. అలాగే రాఘవపూర్ వెంకటేశ్వర్లు బట్టీలో యజమాని అధిక జ్వరంతో ఆయాసంతో ఉన్న సూకంత్ అనే అమ్మాయిని పని చేయాలని కొట్టడంతో కిందపడి ఆమె చనిపోయింది. కిందపడిన ఆ అమ్మాయి చనిపోయిందని డాక్టర్లు నిర్ధారించడంతో యజమాని ఆమె శవానికి పోస్టుమార్టం నిర్వహించి, బట్టీలోనే పూడ్చి చేతులు దులుపుకున్నాడు. అలాగే శ్యాం అరు ఇటుక బట్టీలో పనిచేస్తున్న జితేంద్ర అనే కార్మికుని భార్య సూర్జవ్‌బాగ్‌ని పనిచేయాలని యజమాని, అతని సూపర్‌వైజరు కొట్టి, హింసలకు గురిచేశారు. గర్భిణీ అని చూడకుండా తీవ్ర హింసలకు గురిచేసి చేతిని విరిచేశారు. దీంతో తట్టుకోలేక ఆమె చనిపోయింది.

సూర్జవ్‌బాగ్ చనిపోయి 45 రోజులు గడవకముందే వెంకటేశ్వర్‌రావు ఇటుక బట్టీలో పనిచేసే సహదేవ్ మంజీ అనే ట్రాక్టర్ డ్రైవర్‌ను పనిచేయడం లేదని కొట్టడంతో కింద పడ్డాడు. ఇది గమనించిన తోటి కార్మికులు యజమానిని నిలదీయడంతో మరో ఇద్దరు వ్యక్తులను బట్టలు చిరిగే వరకు కొట్టారు. బట్టిల్లో భయ భ్రాంతులకు గురైన కార్మికులు పెద్దపల్లి లేబర్ ఆఫీస్‌కు బట్టీ నుండి వారి కుటుంబాలతో రోడ్డెక్కారు. సంక్రాంతి సెలవు అయినందున పోలీసులు తర్వాత రండి అని నచ్చజెప్పే ప్రయత్నం చేసినా నమ్మకంలేని కార్మికులు పెద్దపల్లి నుండి కరీంనగర్ కలెక్టరేట్ వరకు కాలి నడకన చేరుకుని పౌరహక్కుల నాయకుల అండతో జిల్లా కలెక్టర్‌కు తమ గోడును చెప్పుకున్నారు.

గత 30 ఏళ్లుగా కార్మికులకు కనీస సౌకర్యాలు కల్పించకుండా, వారికి సరైన ఆవాసాలను కల్పించకుండా కేవలం పని చేయాలని మాత్రమే ఒత్తిడి చేస్తూ వేధిస్తున్నారు. ఇటుక బట్టిలలో కార్మికులు ఉండేందుకు కనీసం సౌకర్యాలు లేకపోవడంతో నానా అవస్థలు పడుతున్నారు. మహిళా కార్మికులకు స్నానాలు చేసేందుకు సైతం ఎలాంటి గదులు లేకపోవడంతో బహిరంగంగానే అన్ని చేసుకోవాల్సిన పరిస్థితి. స్నానాలు చేయాలంటే పక్కనున్న చెరువులను, కుంటలను ఆశ్రయించాల్సిందే. పొద్దస్తమానం పనిచేస్తున్న ఒడిశా కార్మికులకు కడుపు నిండా తిన్న రోజులు లేకపోవడం వారి దయనీయ స్థితికి అద్దం పడుతుంది. పని భారం, అనారోగ్యం, ఆర్థిక ఇబ్బందులు, యజమానుల వేధింపులు, తక్కువ కూలీ, ఆకలితో అలమటించి బాధలను భరించలేక చెప్పా పెట్టకుండా పారిపోతున్న కార్మికులను రైల్వే స్టేషన్లలో, బస్టాండ్లలో పట్టుకొన్ని కొట్టి చంపుతున్నారు. మహిళలు గర్భం దాల్చకుండా మాత్రలు ఇస్తూ పని చేయించుకుంటున్నారు. కార్మికుల కోసం ప్రభుత్వాలు ఎన్నో చట్టాలు రూపొందిస్తున్నప్పటికి ఇటుక బట్టీల యజమానుల ముందు అవి అమలుకు నోచుకోవడం లేదు. కార్మికుల శ్రమను దోచుకుంటున్న యజమానులు కోట్లకు పడగలెత్తుతూ కార్మికుల పట్ల కనీస మానవత్వాన్ని మరిచి ప్రవర్తిస్తున్నారు. కార్మికుల పట్ల జరుగుతున్న దాడులను కళ్లారా చూస్తున్న అధికార యంత్రాంగం, పాలకులు మాటలకే పరిమితమవుతూ, చూసి చూడనట్లుగా వ్యవహరిస్తూ యజమానుల మాముళ్లకు కక్కుర్తిపడి కార్మికుల జీవితాలతో చెలగాటమాడుతున్నారు. హక్కులకు భంగం కలిగితే చట్టం ద్వారా సాధించుకోవాలనే నీతి సూత్రాలు ఒడిశా కార్మికుల జీవితాలను బాగుచేయడం లేదు.

కార్మిక శాఖ అధికారులు బట్టీలలో జరుగుతున్న అక్రమాలు, అన్యాయాలు, బట్టి యజమానుల దాడులు కళ్లకు కట్టినట్లుగా కనిపిస్తున్నప్పటికి పరిశీలన, విచారణ జరిపి మూన్నాళ్ల ముచ్చటగానే మారుస్తున్నారే తప్ప, కార్మికుల బానిస జీవితాలకు మాత్రం విముక్తి కలిగించడం లేదు. అలాగే ఇటుక బట్టీలలో వెయ్యి ఇటుకలు తయారు చేసే కార్మికునికి రు. 442, మోయడం, పేర్చడం లాంటి పనులు చేసే కార్మికునికి రు. 262 చెల్లించాల్సి ఉండగా కేవలం రు. 100లోపే చెల్లిస్తున్నారు.

తెలంగాణ రాష్ట్రంలో ఇటుక బట్టీల యజమానుల వేధింపులు, దాడులకు ఎన్నో ప్రాణాలు గాలిలో కలుస్తున్నా, ఇప్పటి వరకు ఏ ఒక్క కేసు నమోదైనా, శిక్షపడ్డ సంఘటనలు లేకపోవడం సిగ్గుచేటు. ఇటుక యజమానులపై కేసు దాఖలు చేయకపోవడం బాధాకరం. రాష్ట్రం ఏదైనా కార్మిక హక్కులకు భంగం కలిగితే కఠిన చర్యలు తీసుకునే హక్కు అక్కడి ప్రభుత్వాలకు ఉంటుంది. ఇతర వలస కార్మికులను కట్టు బానిసలు చేసుకుంటున్న ఇటుక యజమానుల అక్రమాలపై ఇప్పటికైనా రాష్ట్ర ప్రభుత్వం తక్షణమే చర్యలు తీసుకోవాలి, ఇటుక బట్టీలలో పనిచేస్తున్న ఒడిశా కార్మికుల పట్ల దృష్టి సారించి, చేసిన కూలీ వేతనం బ్యాంక్ ద్వారా అందజేసేందుకు చర్యలు చేపట్టాలి. వారి ప్రాణాలకు రక్షణ ఇవ్వడంతో పాటు కనీస వసతులు కల్పించేలా చర్యలు తీసుకోవాల్సిన బాధ్యత ప్రభుత్వం పై ఉంది.

*(రచయిత జర్నలిస్టు)* వీ

**రాబోయే సంచికలలో...**

- **సెక్యులరిస్టులు మౌనంగా లేరు - అనిసెట్టి శంకర్**
- **ఆర్థిక సంస్కరణలు-వ్యవసాయ సంక్షోభం - మచ్చ శ్రద్ధానందం**
- **డిజిటల్ ఇండియా - ఎస్.ఎన్. శాంతి రేఖ**
- **గురజాడ రాత ప్రతుల ప్రస్థానం - పి.సి.సి. జోషి**

# విప్లవ కెరటం భగత్‌సింగ్‌కు విస్మరణా?

**భగత్‌సింగ్ అమరత్వ దినం మార్చ్ 23 సందర్భంగా బ్రిటిష్ వలసవాద వ్యతిరేక ప్రజా ఉద్యమంలో భగత్‌సింగ్ పాత్రను వివరిస్తున్నారు బైరెడ్డి సతీష్**

మనిషికి అత్యంత సహజమైన భావ వ్యక్తీకరణ హక్కును బహిరంగంగా వినియోగించుకుంటున్నందుకు దేశ ద్రోహుల ముద్రలను ముఖాల మీద ముద్రిస్తున్న కాలం. ఆధిపత్యాన్ని, పీడనలను, దోపిడిని ప్రశ్నించి స్వేచ్ఛగానాన్ని ఆలాపిస్తున్నందుకు రాజ్యద్రోహం కేసును మెడకు బిగిస్తున్న రాజ్యం. పాచిపోయిన పాత వ్యవస్థల్ని ప్రశ్నించకూడదని, లోపరహితమైన వ్యవస్థ ఒకటి నిర్మితమై ఉన్నదని ఏ అసమానతలు, అంతరాలు, వివక్షలు లేవని అటువంటి స్థితిని అస్తవ్యస్థం చేస్తున్నారని, పరాయి శక్తులకు కొమ్ము కాస్తున్నారని వీర దేశ భక్తులు గగ్గోలు పెడతారు. జాతులు విముక్తిని కోరుకోకూడదని, శతాబ్దాల కుల పదఘట్టనల కింద నలిగినా కూడా కులాన్ని కూల్చే ప్రయత్నం చేయొద్దని, అగ్రకుల ఆధిపత్యాన్ని, మత అసహనాన్ని భరించి జీవించడమే 'ప్రజాస్వామ్యం' అని త్రిశూళ దారులైన పాలక 'మను'లు 'అఖండ భారత్' వీరులు స్వాతంత్ర్య పోరాట నాయకుల్ని, దేశ ఐక్యతను సాధించారంటూ ఉక్కు మనుషుల్ని పదేపదే ముందు పెడుతూ ప్రచారం చేస్తున్నారు. హిందూ రాజ్యానికి ఉపయోగపడే వారందరినీ మహా పురుషులుగా చూపెట్టి వారిదే అసలు సిసలైన భావజాలమని అంతిమంగా అనుసరణీయమైనదనే భావనను బలంగా ముందుకు పెడుతున్నది. దానికి భిన్నమైన సైద్ధాంతికత, ఆచరణ ఉన్న త్యాగధనులను విస్మరణకు గురి చేసే చర్యలకు ప్రస్తుత పాలక ప్రభుత్వం దాని సైద్ధాంతిక మాతృక సంస్థలు పాల్పడుతున్నాయి. వారికి సంబంధించిన చరిత్రను కాని, భావజాల అంశాల్ని కాని ప్రజల్లో పెద్ద ఎత్తున ప్రచారం కాకుండా జాగ్రత్త పడుతూ వీలయితే వారికి చెందిన వాస్తవాలకు కూడా వక్రీకరించే ప్రయత్నం చేస్తున్నాయి. అలాంటి ప్రజా వీరుల్లో భగత్‌సింగ్‌దే మొదటి స్థానం. ఈ మధ్య కాలంలో సామాజిక మాధ్యమాల్లో, వాట్సప్‌లల్లో భగత్‌సింగ్‌కు సంబంధించిన ఒక అంశం విపరీతంగా ప్రచారంలోకి వచ్చింది. అదీ మార్చ్ 23న ఆయన ఉరి కొయ్యల మీద ఊగిన రోజుకు సంబంధించిన చారిత్రక సత్యానికి చెందింది. ప్రపంచమంతా ఫిబ్రవరి 14న ప్రేమికుల రోజుగా (ఎన్ని భిన్నాభిప్రాయాలు ఉన్నప్పటికి) జరుపుకునే అంశాన్ని అది విదేశీ సంస్కృతి అని (విదేశీ పెట్టుబడులు వచ్చినప్పుడు విదేశీ సంస్కృతి రాకుండా ఎలా ఉంటుంది?) ఆ రోజు భగత్‌సింగ్‌ను ఉరితీసిన రోజు అని విస్తృతంగా ప్రచారం చేశారు. చరిత్రలో నమోదైన ఒక వాస్తవాన్ని వక్రీకరించిన వాళ్లు అదే కాలంలో భగత్‌సింగ్ విప్లవ పోరాటాన్ని, భావజాల సంఘర్షణను, స్వాతంత్ర్యం అంటే కేవలం అధికార మార్పిడే కాదని, అది ప్రతి మనిషిని సకల పీడనల, దోపిడీల నుండి విముక్తం చేసి మనుషులందరు స్వేచ్ఛా, సమానత్వాలను పొందే మరో సమాజ ఆవిర్భావమే అంతిమ లక్ష్యంగా ఉండాలనే ప్రత్యామ్నాయ రాజకీయాలకు ప్రతీక అనే విషయానికి ఎక్కడా ప్రాముఖ్యత ఇవ్వరు. స్వాతంత్ర్య సంగ్రామ కాలంలో, ఆ తరువాత కాలంలోను భగత్‌సింగ్ ప్రత్యామ్నాయ రాజకీయ భావజాలాన్ని, కార్యచరణను అన్ని పాలక వర్గాలు మరుగుపరుస్తూనే ఉన్నాయి. నిజానికి అగ్రకుల బ్రాహ్మణీయ, ధనిక స్వామ్య నాయకత్వంతో కొనసాగిన పోరాటం భగత్‌సింగ్‌ను నిర్లక్ష్యపరచడమే కాకుండా ఆ రాజకీయాలు ప్రజల చెంతకు చేరకుండా అడ్డుకున్నది. పోరాట క్రమంలోనే సమాంతరంగా, ప్రత్యామ్నాయంగా ఎదుగుతుండడమే కాకుండా బ్రిటిష్ పాలన తదనంతరం కూడా భారతదేశ స్వయం పాలనలో ప్రజా రాజకీయాలకు చోటు ఇవ్వకూడదనే ఉద్దేశ పూర్వకంగానే భగత్‌సింగ్ ఉరిని తప్పించే అవకాశాలున్నా ప్రయత్నించలేదని గాంధీ – ఇర్విన్ ఒడంబడికనే చెబుతున్నది.

ఒక సాధారణ సాంప్రదాయ సిక్కు కుటుంబంలో పుట్టినా, బాల్యంలోనే గాంధీజీ అహింసాయుత పోరాట పంథాను ఆయన్ని ప్రభావితం చేసినప్పటికినీ సామ్రాజ్యవాదులకు వ్యతిరేకంగా గదర్ వీరులు సాగించిన సాహస కృత్యాలు, లాహోర్ జైల్లో ఉరికంబమెక్కిన కర్తార్ సింగ్ అమరత్వం, 1919 జలియన్ వాలాబాగ్ పోరాట ప్రజలు విధించిన నెత్తుటి మట్టి, చౌరీ చౌరా హింసాత్మక ఘటన సాకుతో ఉవ్వెత్తున ఎగిసిపడుతున్న సహాయ నిరాకరణోద్యమ జ్వాలను గాంధీజీ నిలిపివేయడం భగత్‌సింగ్ ఆలోచనల్ని మలుపు తిప్పినాయి. ఆయుధాలతో ప్రజా ఉద్యమాలను, ఆకాంక్షలను అణచివేయ చూస్తున్న ఆంగ్లేయ ప్రభుత్వంపై సాయుధ సమర నినాదాన్నిచ్చేలా ప్రేరేపించాయి. ఇది పూర్తిగా ఒక చెంప కొడితే మరో చెంప చూపమనే గాంధీ సైద్ధాంతానికి ఒక చెంప కొడితే కొట్టిన వాడి చెంప చెల్లు మనిపించాలనే ప్రత్యామ్నాయ రాజకీయ ఆచరణ బలంగా ముందుకు వచ్చింది. కేవలం అధికార మార్పిడి లక్ష్యంగా గాంధీజీ నాయకత్వంలో జాతీయ కాంగ్రెస్ పనిచేస్తే భగత్‌సింగ్ నాయకత్వం వహించిన నౌజవాన్ భారత్ సభ గాంధేయ పద్ధతికి భిన్నమైన విప్లవ లక్ష్యం కలిగినదని తన లక్ష్య ప్రకటన ద్వారా పేర్కొన్నది. భారతదేశంలో కార్మిక, కర్షక రాజ్య స్థాపన కుల, మత, జాతి, వర్ణ మూఢనమ్మకాలకు వ్యతిరేకంగా పోరాటం. మనిషిని మనిషి దోపిడి చేసే వ్యవస్థను అంతమొందించడం, సామ్రాజ్య వాదానికి వ్యతిరేకంగా పోరాటం కొనసాగించడం మార్క్స్, లెనిన్, ట్రాట్స్కీ వంటి వాళ్ల రచనల అధ్యయనంతో దేవుడి, మత భ్రమలు తొలిగిపోవడమే కాకుండా ఊహ జనిత భావాల నుండి శాస్త్రీయ సోషలిజం వైపు అడుగులు వేశాడు. వ్యక్తిగత హింస, ఉద్రేక చర్యల వల్ల ప్రయోజనం లేదని విప్లవ పరిజ్ఞానం విప్లవ పార్టీ నిర్మాణం కార్యక్రమంపై మరింత అవగాహనను పెంచుకుని తన కార్యచరణకు పదును పెట్టాడు.

1924లో కాన్పూర్‌లో స్థాపించబడిన హిందూస్థాన్ రిపబ్లిక్ అసోసియేషన్ జాతీయ పార్టీగా ఏర్పడింది. భగత్‌సింగ్ నౌజవాన్ భారత్ సభ, అనుశీలన్, యుగంధర్ వంటి సంస్థలు దీనిలో విలీనమయినాయి. గాంధీజీ అహింసా సిద్ధాంత మార్గంపై అవిశ్వాసాన్ని ప్రకటించాయి. విప్లవం ధ్యేయంగా సమసమాజం లక్ష్యంగా సాయుధ పోరాటం సాగించాలని ఎచ్ఆర్ఏ నిర్ణయించింది. గాంధీ మార్గాన్ని తిరస్కరిస్తూనే

స్వరాజ్య సాధనకు ఉత్తమ మార్గంపై. స్వరాజ్య భావన అంటే ఏమిటి? అది ఎవరి కోసం అని సైద్ధాంతిక చర్చలను తొలిసారిగా తీవ్రంగా వెలుగులోకి తీసుకువచ్చింది. విప్లవకారులను హింసావాదులుగా విమర్శిస్తున్న గాంధీ శిబిరంపై తీవ్రమైన సైద్ధాంతిక ప్రతిదాడినే కొనసాగించారు. జలియన్ వాలాబాగ్‌తో పాటు అనేక చోట్ల చెలరేగిన హింస, మారణహోమానికి కారకులు ఎవరని గాంధీజీని నిలదీశారు. విప్లవకారులను దేశ ద్రోహులని చిత్రించే పద్ధతుల్ని గర్హించడమే కాకుండా, విగ్రహాన్ని ప్రభోదించే గాంధీజీ విప్లవకారుల విమర్శను ఎందుకు భరించలేకపోతున్నారనీ ఘాటు విమర్శను కూడా చేశారు.

1928లో హిందూస్థాన్ రిపబ్లిక్ అసోసియేషన్ కార్యదర్శిగా భగత్‌సింగ్ ఎన్నిక కావడంతో షోషలిస్టు రాజ్యస్థాపన ధ్యేయంగా హిందూస్థాన్ సోషలిస్టు రిపబ్లిక్ అసోసియేషన్‌గా మార్చాలన్న భగత్‌సింగ్ సూచనలను ఆమోదించడమే కాకుండా ఆర్మీని కూడా ఏర్పరచి చంద్రశేఖర్ ఆజాద్‌ను నాయకుడిగా నియమించింది. సైమన్ కమిషన్ గోబ్యాక్ అనే సామ్రాజ్యవాద వ్యతిరేక నినాదాల నిరసన నేపథ్యంలో లాలా లజపతిరాయ్ చనిపోయారు. దీనికి ప్రతీకారంగా భగత్‌సింగ్, ఆజాద్, రాజ్‌గురులు పోలీస్ ఆఫీసర్ సాండర్స్‌ను చంపివేయడం జరిగింది. గమనించాల్సిన అంశమేంటంటే లాలా లజపతిరాయ్ హిందుత్వవాది, భగత్‌సింగ్ హేతువాది, కమ్యూనిస్టు విప్లవకారుడు లాలా లజపతిరాయ్ చేత రష్యన్ ఏజెంట్ అనిపించుకున్నప్పటికి ఒక ఉమ్మడి శత్రువుని మట్టుబెట్టడంలో భగత్‌సింగ్‌కు అవేవి అడ్డు రాలేవు. కానీ గాంధీజీ మాత్రం భగత్‌సింగ్ ఉరి తప్పించడంకై ఎందుకు ప్రయత్నించలేదన్న ప్రశ్నకు నేను జాతీయ కాంగ్రెస్ రాజకీయాలకు ప్రతినిధిని, భగత్‌సింగ్ అవివాద శిబిరానికి ప్రతినిధి అని తన వర్గ స్వభావాన్ని బయట పెట్టుకున్నాడు. గాంధీజీ ఈ అధికార బదిలీ పోరాటాన్నే చూసే కావచ్చు భగత్‌సింగ్ తన తల్లికి రాసిన ఉత్తరంలో 'ఏదో ఒక రోజు దేశం స్వాతంత్ర్యాన్ని పొందుతుంది. కాని నా భయమంతా తెల్ల దొరలు ఖాళీ చేసే కుర్చీల్లో నల్ల దొరలు జొరబడ్తారనే' అని అన్నాడు. ఆ భయమే ఆయన్ని విప్లవ మార్గం వైపు నడిపించింది. తన మిత్రుడు రాం శరణ్‌దాస్ 'ది డ్రీంలాండ్' పేరుతో ముద్రించాలనుకున్న కావ్య సంపుటికి ఉపోద్ఘాతం రాయమన్నప్పుడు దానికి స్పందనగా 'విప్లవం' అంటే కేవలం ప్రజల తిరుగుబాటు లేక రక్త పాతంతో కూడిన పోరాటం కాదని స్పష్టం చేయవలసి ఉన్నది. ఈనాడున్న పాలనా పద్ధతిని సంపూర్ణంగా ధ్వంసం చేసి దాని స్థానంలో నూతన పునాదులపై క్రమబద్ధమైన సమాజ పునర్నిర్మాణమే విప్లవానికి ముఖ్య లక్షణం అన్నాడు. యుద్ధాలు, రక్తపాతం ఎల్లప్పుడూ ఉండేవి కాదని వర్గరహిత సమాజమేర్పడిన తర్వాత యుద్ధాల ప్రసక్తే ఉండబోదని, యుద్ధాలకు అర్థాలే మారిపోయి, మారణాయుధాలు మ్యూజీయం గ్యాలరీలలో ప్రేక్షకులకు కనిపిస్తాయన్నాడు. కారణం యుద్ధాలకు కారణభూతమైన పరస్పరం సంఘర్షించుకునే శక్తులుండవన్నాడు. విభేదించడానికి స్వప్రయోనాలు స్వార్థపరత్వం ఉండవని భగత్‌సింగ్ అవగాహన. కాని ఒక వ్యవస్థ నుండి మరో వ్యవస్థకు జరిగే పరివర్తనా దశలో యుద్ధం కొంతకాలం అనివార్య మంటాడు. 1929 మే 7న ఢిల్లీ కోర్టులో బాంబు కేసు విచారణ సందర్భంగా తమ మీద ఉన్న హింసావాదుడు అనే వదనను తిప్పి కొట్టేందుకు కోర్టును రాజకీయ ప్రచార వేదికగా చేయాలనే సంకల్పంతో తన విప్లవ సిద్ధాంతంపై మరింత వివరణ ఇచ్చాడు.

'ఒకరిద్దరు వ్యక్తులను హత్యచేయడం ద్వారా రాజ్యాధికారం మారదన్నాడు. విప్లవం అంటే రక్తపాతం కాదు. వ్యక్తిగత హింసకాదు. లేక బాంబు పిస్తోలు కాదు. విప్లవమంటే ఈనాటి వ్యవస్థను, దాన్ని కాపాడే శాసనాలను, వాటి ఆధారంగా జరిపే అక్రమాలను అరికట్టడం సంపద సృష్టించే శ్రామికుని రక్తం పీల్చి వేయబడుతుందీనాడు. అతని ప్రాథమిక హక్కులు హరించబడుతున్నాయి. పంటలు పండించే రైతు సకుటుంబంగా ఆకలితో అల్లాడుతున్నాడు. బట్టలు నేసి బజారులో గుట్టలుగా వేసే చేనేత కార్మికుల వంటి మీద బట్టకరువైపోయింది. పెద్ద పెద్ద భవనాలను నిర్మించే కార్మికులు మురికి వాడల్లో మగ్గుతునా' రన్నాడు. ఒక దేశం మరొక దేశాన్ని, ఒక మనిషి మరొక మనిషిని దోచే పద్ధతి పోయేదాకా, పెట్టుబడిదారీ విధానం అంతమయ్యే దాకా మానవుల పాట్లు తప్పదన్నాడు. జరుగుతున్న వినాశనం పోదన్నాడు. సమస్యలన్నింటికి పరిష్కారం చూపేది విప్లవం ఒక్కటే అన్నాడు. ఆ విప్లవం ద్వారా కార్మిక రాజ్యం ఏర్పడి పెట్టుబడిదారీ వర్గ దోపిడీ నుండి, యుద్ధాల మారణ హోమం నుండి, ప్రపంచ మానవాళిని విముక్తి చేసి, సమసమాజాన్ని స్థాపించడమే తమ సిద్ధాంతమన్నాడు.

భగత్‌సింగ్‌కు కోర్టు, జైలు అన్నీ ఉద్యమ క్షేత్రాలే అయినాయి. రాజకీయ ఖైదీల హక్కుల కోసం జైలులోనే నిరాహార దీక్షను ఒక పోరాట రూపంగా ఎంచుకున్నాడు. ఆ క్రమంలోనే 63 రోజుల నిరాహార దీక్ష చేసి జితిన్‌దాస్ అమరుడయ్యాడు. గాయత్రి మంత్రాన్ని జపించిన వాడు, ఆర్య సమాజ ప్రభావంలోంచి వచ్చిన భగత్‌సింగ్ పరిశీలన, అధ్యయనంతో నాస్తికుడయ్యాడు. 'మానవ మలమీనత, విజ్ఞాన లోపమే దైవత్వానికి కారణ'మనేవాడు భగత్‌సింగ్. అందరు నమ్మేది కాదన్నా, ఒక హీరోగా, గొప్ప వ్యక్తిగా పేరొందిన వ్యక్తి తప్పును విమర్శిస్తే అతనికి పేరుంది మచ్చలేని వ్యక్తి కాబట్టి విమర్శించిన నన్నే అహంభావి అంటారు. దీనికి కారణం వారి మానసిక వికాస లోపమే. విమర్శ, స్వతంత్ర్య ఆలోచనా లక్షణం ప్రతి విప్లవకారుడికి ఉండవలసిన విడదీయరాని రెండు ప్రధాన లక్షణాలు. మహాత్ముడు గొప్పవాడు కాబట్టి అతన్ని ఎవరూ విమర్శించరాదు. ఎందుకంటే అతడు ఉన్నతుడు. రాజకీయాల్లో, మత విషయాల్లో, ఆర్థిక రంగంలో, నీతి సూత్రాల్లో అతడు చెప్పేదే వేదం. నీవు నమ్మినా, నమ్మకపోయినా 'అవును' అది నిజం అనాలి. ఈ మానసిక ధోరణి ప్రగతికి ప్రతి బంధకం. అభివృద్ధి నిరోధానికి మార్గం అవుతుంది. మన పూర్వికులు కొన్ని నమ్మకాలు ఏర్పర్చుకున్నారు. సర్వశక్తి సంపన్నుడు, సర్వాంతర్యామి అయిన దేవుడొకరున్నారని నమ్ముతున్నారు. దానికి భిన్నంగా మాట్లాడిన, దేవుడనేవారెవరు లేరని ధైర్యంగా చెప్పినా, అతను మత భ్రష్టుడు, ధర్మాన్ని వీడిన వాడన్న ముద్ర వేస్తారు. అహంభావివనో, భగవంతుడు శపిస్తాడనో భయపెడుతారు. వ్యర్థమైన ఈ విషయంపై సమయం వృథా చేసేకంటే మొత్తం విషయాన్నే పరిశీలించాలి. హేతువాద దృక్పథంతో ప్రతి మనిషి బలహీనతలను అధిగమించాలి. వాస్తవిక పరిశీలనా దృష్టి ఉండాలని, ఆధారంలేని చోట వేదాంతం ఉంటుందని భగత్‌సింగ్ అభిప్రాయపడ్డాడు. ప్రకృతి మాత్రమే యథార్థమని ఆ ప్రకృతిని మత అవసరాలకు అనుగుణంగా పరిమితులకు లోబడి మార్చుకోవాలన్నాడు.

ఇంతటి విప్లవ దార్శనికత ఉన్న భగత్‌సింగ్‌ను ప్రజలకు ఎలా పరిచయం చేస్తున్నారు? కేవలం ఒక స్వాతంత్ర్య పోరాట యోధుడని, మొక్కుబడిగా జయంతి, వర్ధంతి సభల్లో ఆయన తాత్విక, ప్రత్యామ్నాయ రాజకీయ సైద్ధాంతిక విషయాలను పక్కన పెట్టి యాంత్రికంగా స్మరించుకుంటున్నారు. పాలక వర్గాల ఎజెండాకు పనికివచ్చే వారిని మహా పురుషులుగా చూపెడుతున్నారు. దేశంలో ఇవాళ మత అసహనం, భావ వ్యక్తీకరణ స్వేచ్ఛపై దాడులు, హేతువాద ఉద్యమ కారుల హత్యలు, పాలక వర్గాలు, వారి అనుబంధ విచ్ఛిన్నకర శక్తులు చేసినటువంటివే.

# ఆర్థిక పరిస్థితి అంతా బాగానే ఉందట!

***వ్యవసాయం, పరిశ్రమ, సేవారంగాలు తీవ్ర సంక్షోభంలో పడి, అస్తవ్యస్తంగా ఉన్న దేశ ఆర్థిక వ్యవస్థను గాడిలో పెట్టాల్సిన ఆవశ్యకతను ప్రభుత్వం గుర్తించాలని అంటున్నారు* వి. హనుమంతరావు**

ప్రపంచ దేశాలన్నీ ఆర్థిక దుస్థితిలో కొట్టు మిట్టాడుతుంటే మనదేశ ఆర్థిక మంత్రి 'ఆందోళన పడాల్సిన పరిణామాలేవీ లేవు' అని ప్రకటించడం పిల్లి కళ్లు మూసుకుని పాలు తాగుతూ తననెవ్వరూ చూడడంలేదనే సామెతను గుర్తు చేస్తుంది. దేశంలో వరుసగా రెండు సంవత్సరాలు పంటలు దెబ్బతిని ఆదాయాలు తగ్గడం, ఫలితంగా వారి కొనుగోలు శక్తి పడిపోవడం కారణంగా, పారిశ్రామికోత్పత్తులకు ఇటు రైతాంగం నుంచి, అటు మధ్య తరగతి ప్రజల నుంచి డిమాండ్ తగ్గి మార్కెట్ మందగించడం, ఆ కారణంగా పరిశ్రమలు 70 శాతం మేరకే తమ కర్మాగారాలను పనిచేయిస్తుండడం, ప్రపంచ మార్కెట్ల నుంచి మనం తయారు చేసే వస్తువులకు డిమాండ్ తగ్గి, ఎగుమతులు 13 నెలలుగా పడిపోతూ రావడం, ధరల పెరుగుదల ప్రజలను వెంటాడుతుండడం, ఈ పరిణామాలన్నింటి మూలంగా మనదేశ జిడిపి లక్ష్యాన్ని చేరుకోలేని పరిస్థితి, ద్రవ్యలోటు లక్ష్యాన్ని చేరుకోగలమా అని ఆర్థిక మంత్రి జుట్టు పీక్కోవడం, ప్రభుత్వ రంగ పరిశ్రమల్లో షేర్లు అమ్మి డబ్బు కొరత తీర్చుకుందామంటే కొనేవాళ్లు ముందుకు రాకపోవడం, ఈ సంస్థల్లో షేర్లు అమ్మి నిధులు సమకూర్చుకోవడమే సిగ్గు పడాల్సిన ఆలోచన. ప్రభుత్వం నిర్ణయం అయితే చేసింది. కాని కొనేవారే కరువవుతున్నారు. అనుకున్నంత నిధులు సమకూర్చలేదు. ప్రభుత్వ రంగ సంస్థల్లో షేర్లు అమ్మకానికి పెట్టగా కొనేవారే కరువయ్యారు.

ఈ పరిస్థితుల నేపథ్యంలో మనం పెట్టుబడులు పెడితే మనమూ మునిగిపోతామేమోనని, మేక్ ఇన్ ఇండియా అని ప్రధాని ఎంత గీ పెట్టి అరిచినా, దేశ దేశాలు తిరిగి అర్థించినా ఎవరూ ముందుకు రాకపోవడం (ఆంధ్ర, తెలంగాణ రాష్ట్రాల్లో విదేశీ పారిశ్రామిక వేత్తలు తమ పరిశ్రమలు పెడతామని ఎంఒయుల అంటే సూత్ర ప్రాయంగా పరిశ్రమలు మీమీ రాష్ట్రాల్లో నిర్మిస్తామని వాగ్దానం చేయడం మాత్రమే) రెండేళ్ల నుంచి కాదు కాదు, అంతకు ముందు కాంగ్రెస్ పాలన కాలం నుంచి అత్యంత ప్రమాదకర ధోరణిలో బ్యాంకుల్లో మొండి బాకీలు పెరిగిపోవడం, ఈ ధోరణులు చూసి దేశంలో మిలియనీర్లు, బిలియనీర్లు పెట్టుబడులు పెట్టడానికి ముందుకు రాకపోవడం – ఇవన్నీ కొన్ని ఆందోళన పడాల్సిన పరిణామాలు కావా ఆర్థిక మంత్రిగారు? ఈ దుస్థితి నుంచి ప్రజల దృష్టిని మరల్చడానికే కావాలనే మత సంఘర్షణలు సృష్టిస్తున్నారా ప్రధానిగారు? ఇదీ 2016 – 17 బడ్జెట్ నేపథ్యం. బడ్జెట్ అంటే ద్రవ్య సంబంధమైన విషయాలు, లెక్కలు, డొక్కులు చాలా ఉంటాయి. వాటి జోలికి పోలేదు. పోతే ఇంకా ఎన్ని రంకులు బయటపడతాయో!

ఇలాంటి పరిస్థితుల్లో డబ్బు విషయంలో ఎంత జాగ్రత్తగా వ్యవహరించాలి. ధరల పెరుగుదలతో మన మధ్య తరగతి ప్రజలు డబ్బును ఎంత జాగ్రత్తగానో ఖర్చు చేస్తారు. కాని మన ప్రభుత్వం బ్యాంకుల మొండి బాకీలు వసూలు చేయలేక రు. 1.14 లక్షల కోట్ల రుణాలను మాఫీ చేసింది. దిగుమతి చేసుకొని చమురు ధరలు పాతాళంలోకి పడ్డాయి. మనం 20 శాతం మేరకు చమురు ధరలు పడిపోవడం వల్ల కొన్ని బిలియన్ల డాలర్ల మేరకు ఖర్చు తగ్గుతుంది. ఇలా మిగిలిన అయిన ధనాన్ని రైతుల రుణమాఫీ చేయవచ్చు కదా. కాంగ్రెస్ పాలనలో ఇటువంటి అవకాశం లభించకపోయినా దేశ వ్యాపితంగా రైతుల రుణమాఫీ చేసిందే, మన ప్రధానికి ఎందుకు తట్టలేదో. అదే జరిగి ఉంటే కళ్లుమూసుకుని జనం బిజెపికి ఒటువేసే వారు కదా. అలాగే గత ఆరేళ్లుగా ప్రోత్సహకాల పేరుతో (ఇది పరోక్ష సబ్సిడీ అని బడ్జెట్ పుస్తకాల్లో ఉంది) 30 లక్షల కోట్ల రూపాయలు కార్పొరేట్లకు దోచిపెట్టాయి కాంగ్రెస్, బిజెపి ప్రభుత్వాలు. స్టాక్ మార్కెట్లు నేల చూపు చూస్తున్నా, దేశంలోని బిలియనీర్లు వారి ఆస్తులని పెంచుకున్నారని బిజినెస్ పత్రికలు ప్రకటించాయి. పేద, ధనిక వర్గాల మధ్య అంతరం రాను రాను పెరిగిపోతున్నాయని అంతర్జాతీయ ఆర్థిక పరిశోధనా సంస్థలు ఆందోళన వ్యక్తం చేస్తుంటే, మన ప్రభుత్వం ఈ అంతరం ఇంకా ఇంకా

| | అమ్మకం ధర | వసూలైన మొత్తం (కోట్లలో) |
|---|---|---|
| 2014–15 | 58425 | 26353 |
| 2015–16 | 69500 | 30000 |
| 2016–17 | 50000 | – |

దేశ ప్రజలందరి సమిష్టి సంపద అయిన సహజ వనరులను అధికారంలోకి వచ్చిన పార్టీలన్ని ప్రైవేట్ వ్యక్తులకు, సంస్థలకు అప్పగించి, ప్రజల బ్రతుకులను వారి దయాదాక్షిణ్యాలకు వదిలి వేస్తున్నారు. ఉపాధి లేని వృద్ధి ఒకవైపు, మరోవైపు ప్రైవేట్ ఆస్తులు పోగుపడేలా వ్యవహరించి ప్రభుత్వ రంగ సంస్థలన్నింటిని దివాళ తీయిస్తున్నారు. ప్రభుత్వ రంగ సంస్థలైన బ్యాంకుల నుండి వేలాది కోట్లు అప్పులు తీసుకుని ఎగ్గొడుతూ దర్జాగా పారిశ్రామిక వేత్తలు తిరుగుతుంటే నోటికి మెతుకులందిస్తున్న రైతులు వ్యవస్థాగత మద్దతులేక బలవన్మరణాలతో ఒరిగిపోతున్నారు. యజ్ఞాలు, యాగాల పేరుతో ప్రజల శ్రమ శక్తికి విలువ లేకుండా, మూఢనమ్మకాల ఊభిలోకి నెట్టివేసే చర్యలకు పాలక వర్గాలే పాల్పడుతున్నాయి. అడవి బిడ్డలకు నిలువ నీడ లేకుండా, జీవించే హక్కుల్ని కాలరాస్తూ ఖనిజ నిక్షేపాలను బడా సంస్థలకు అప్పగించేదానికి వ్యతిరేకంగా ఉద్యమిస్తున్న ఆదివాసులపై గ్రీన్‌హంట్ పేరుతో విచ్చలవిడి హింసను ప్రయోగించి, వారిని భీతావహుల్ని చేస్తున్నది రాజ్యం. ఈ నేపథ్యంలోనే ఉత్పత్తి శక్తులు ఎదగాలన్నా, శాస్త్రీయ దృష్టి అలవడాలన్నా కుల, మత బందనాల నుండి అశేష ప్రజానికం విముక్తం కావాలన్న భగత్‌సింగ్ చూపిన మార్గం మినహా మరోదారి లేదు.

*(రచయిత ఆంగ్ల ఉపన్యాసకులు)* వీ

పెరిగేలా ప్రవర్తిస్తుంది. పాలనా ఖర్చు తగ్గిస్తే ద్రవ్యలోటు ఆ మేరకు తగ్గుతుందని రిజర్వు బ్యాంకు దగ్గరి నుంచి అనేక కమిటీలు, ఆర్థిక పరిశోధనా సంస్థలు చెవినిల్లు కట్టుకుని ఘోషిస్తున్నా, ఆ ఖర్చులు మరింతగా పెరుగుతున్నాయి. తనకు తోచదు, చెపితే వినదు అని దీన్నే అంటారు.

దేశ ఆర్థిక పరిస్థితిని వ్యవసాయం, పరిశ్రమలు, సేవలు అనే మూడు రంగాల కోణం నుంచి అంచనా వేస్తారు. మొదటి రెండు రంగాలు ఉత్పాదక రంగాలైతే మూడో రంగం ఉత్పత్తి చేయదు. కాని జిడిపి లెక్కల్లో మూడో రంగమే అత్యధిక శాతాన్ని చూపిస్తుంది. ప్రజలందరికీ తిండి పెట్టే రంగం ఆఖరు అంతస్తులో ఉంది. కారణంగా వ్యవసాయం నుంచి రైతాంగం మెల్లమెల్లగా నిష్క్రమిస్తున్నారు. ఇటు రైతు, అటు వ్యవసాయ కూలీ పట్టణాలకు, నగరాలకు, ఇతర రాష్ట్రాలకు వలస పోతున్నారు. చిన్న, సన్నకారు రైతులకు భూమి ఇంత బువ్వ పెట్టడం లేదు. అతనికి గిట్టుబాటు ధర లభించడం లేదు. వ్యవసాయ ఇన్‌పుట్ ధరలు అతనికి అందుబాటులో ఉండడం లేదు. వారి వలసలతో గ్రామాలు కళా హీనంగా తయారవుతున్నాయి. నీరు లేనిదే వ్యవసాయం లేదు. ఆ నీటికే కరువు ఏర్పడింది. భూగర్భ జలాలు ఇంకిపోతున్నాయి. అయితే కరువు, లేకపోతే వరదలు, తుఫాన్లు, మధ్య దళారుల ఉచ్చు బిగిస్తుంది. పంట చేతికి వచ్చిన వెంటనే అమ్ముకుంటేనే అమ్ముకుందామనుకుంటే మార్కెట్ కమిటీలు సహకరించడం లేదు. లేదా మధ్య దళారుల నుంచి అప్పు తీసుకుంటే, పంట చేతికి వస్తుండగానే తానిచ్చిన రుణానికి బదులుగా పంటను తోలుకొని పోతారు. మిగిలితే సంవత్సరం పొడుగునా దానితోనే సరిపెట్టుకోవాలి. మరో వ్యాపకం చేతకాదు కాబట్టి ఆ సెంటు, కుంటా భూమినే నమ్ముకొంటున్నారు. రైతు దయనీయ పరిస్థితి గురించి ఇదొక విహంగా వీక్షణమే.

సంపన్న రైతు విషయానికి వస్తే జమీందారీ విధానం రద్దు అనంతరం, భూ సంస్కరణలు ప్రవేశపెట్టి అలాంటి రైతులకు కొమ్ముకాసే ప్రభుత్వం ఆ సంస్కరణలను అస్తవ్యస్తంగా నడిపించిన ఫలితంగా రికార్డుల్లో అతని మిగులు భూమి తీసుకున్నట్టుంది కాని, వాస్తవంలో మొత్తం భూమి ప్రత్యక్షంగా, పరోక్షంగా అతని చేతుల్లోనే ఉంటుంది. ఈ వర్గం వ్యవసాయంలో సంపాదన అంతా పరిశ్రమల్లో పెడుతున్నారు. లేదా అనుత్పాదక రంగాల్లో పెడుతున్నారు. ఈ నేపథ్యంలో రైతు రుణాల బారినపడి, తిరిగి చెల్లించలేక ఆత్మహత్యలు చేసుకుంటున్నాడు. లేదా పట్టణాలకు, నగరాలకు వలస పోతున్నాడు. ప్రభుత్వ సహాయం అందుకోవడానికి ముందు వరుసలో ఉండే రైతే అందరికి తిండి పెడతాడు. తాను పస్తులుంటాడు. ఇదంతా అప్పుడు కాంగ్రెస్, ఇప్పుడు బిజెపికి తెలియని విషయం కాదు. అయిన పెద్దపీట వేసేది పరిశ్రమలకే. ఈ ప్రాధాన్యతలు మారాలని ఆర్థిక శాస్త్రవేత్తలెంత చెప్పినా, ప్రభుత్వం మొగ్గు పరిశ్రమలవైపే. వ్యవసాయాభివృద్ధికి మొదటి స్థానం ఇచ్చిన నాడే మనదేశంలో కూడా చైనాలోలాగా ఎకరానికి ఆరు టన్నులు పండించగలుగుతాడు. మధ్య దళారులను తొలగించిన నాడే రైతు కొనుగోలు శక్తి పెరుగుతుంది. పారిశ్రామికోత్పత్తులను కొనుగోలు చేయగలుగుతాడు. పరిశ్రమలు పుంజుకుంటాయి. ఉత్పత్తి ఖర్చు తగ్గించుకుంటే ప్రపంచ మార్కెట్‌లో మనం పోటీని తట్టుకోగలుగుతాం.

**బడ్జెట్**

హైదరాబాద్, జెఎన్‌యు సంఘటనలపై ప్రభుత్వ ధోరణి చూస్తుంటే, బడ్జెట్ చర్చలు పక్కదారి పట్టే సూచనలు కనిపిస్తున్నాయి. ఇదివరలో ఒకసారి వాజ్‌పేయి ప్రధానిగా ఉన్నప్పుడు బడ్జెట్‌పై అసలు చర్చ జరగకుండా ఆఖరు రోజున, ఆఖరు నిమిషంలో మమ అనాల్సి వచ్చింది. ఇప్పుడు కూడా ఆ పరిస్థితే పునరావృతమయ్యే సూచనలు కనిపిస్తున్నాయి. ప్రభుత్వానికి వస్తు సేవల పన్ను బిల్లు ఎలాగైనా ఈ సమావేశంలో రాజ్య సభలో ఆమోదం పొందాలని ఉంది. రెండు సార్లు ప్రధాన ప్రతిపక్షంతో చర్చలు ఫలించలేదు. వేడివేడిగా ఉన్న ఈ వాతావరణంలో, ప్రభుత్వం ఒక మెట్టు దిగితే తప్ప, ఆమోదం పొందే సూచనలు లేవు. ఆ తర్వాత జిడిపిపై ముఖ్యమైన చర్చ జరగాలి. జిడిపిని లెక్కించడంలో ప్రభుత్వం ఒక కొత్త పద్ధతి అవలంబించడంతో, స్వయానా రిజర్వు బ్యాంకే ఈ పద్ధతిపై భిన్నాభిప్రాయం వ్యక్తం చేయడంతో ఈ విషయం కూడా బడ్జెట్ ప్రవేశ పెట్టగలిగితే చాలా లోతైన చర్చ జరిగే అవకాశం ఉంది. పారిశ్రామిక రంగం, వ్యవసాయం, చిన్న పరిశ్రమలు, ఎగుమతులపై ప్రభుత్వాన్ని ప్రతిపక్షం నిలదీసే అవకాశం ఉంది. మౌలిక సౌకర్యాలు కొరుకుడుపడని సమస్యగానే ఉంది. 2004 – 08 మధ్య ఆర్థిక పరిస్థితి మెరుపులు మెరిసినప్పుడే 2004 – 2012 మధ్య కాలంలో ఉద్యోగావకాశాలు సంవత్సరానికి 15 మిలియన్లుంటాయనుకోగా, సాధించింది 7 మిలియన్లే. ఈ నేపథ్యంలో చూస్తే ఆర్థిక పరిస్థితి నేల చూపు చూస్తున్నప్పుడు ఉద్యోగిత ఎంత సొంపుగా ఉంటుందో ఊహించుకోవచ్చు. పే కమిషన్ సిఫార్సుల అమలు, మౌలిక సౌకర్యాల కోసం పెట్టాల్సిన ఖర్చు, బ్యాంకులకు ఎట్టి పరిస్థితుల్లోనైనా సరే, పెట్టుబడులు పెడతామనే ప్రకటన (కార్పొరేట్ మొండి బాకీలు చెల్లించకపోవడం వల్ల, బ్యాంకుల్లో పెట్టుబడులు తగ్గడంతో కార్పొరేట్ల మీద చర్య తీసుకోకుండా ప్రభుత్వమే వారి బదులుగా చెల్లిస్తుందా?) బడ్జెట్ అంటే పన్నుపోటు షరామామూలే. కాని, ఈసారి బడ్జెట్‌కు ముందే వేరే రకమైన పోటు పొడిచింది. ముసలి వారు చిన్న మొత్తాల పొదుపు ఖాతల్లో దాచుకుని ముందు జాగ్రత్త పడతారు. అలా దాచుకున్న మొత్తం మీద వడ్డీ సంపాదించుకుంటారు. కాని ఇప్పుడు ఆ వడ్డీ రేటును తగ్గించారు. ప్రస్తుత ప్రధాని అధికారం పీఠం అధిష్టించగానే గుడ్ గవర్నెన్స్ నా లక్ష్యం అన్నారు. కాని ఆదాయపు పన్ను డైరెక్టర్ జనరల్ ప్రకారం పన్ను చెల్లించని ఆదాయం 2011 – 2014 మధ్య కాలంలో అలాంటి సొమ్ము 15.5 సార్లు అంటే రు. 5.9 కోట్ల నుంచి రు. 90.3 వేల కోట్లకు చేరింది. (2011 – 2014) ఇది కాంగ్రెస్ పాలనలోనే జరిగింది. ప్రధాని ఈ సొమ్మును పెంచారా, తగ్గించారా?

జన్‌ధన్ పథకం ప్రవేశపెట్టి బ్యాంకు ఖాతాదారులకు ఏదో పెద్ద సహాయం చేయనున్నట్లు ప్రకటించారు. ప్రతీ ఒక్కరినీ బ్యాంకుల్లో ఖాతాదారులుగా చేరమన్నారు. చేరారు. కాని 36.49 శాతం ఖాతాల్లో ఒక్క రూపాయి కూడా జమకాలేదు. బ్యాంకుల్లో 2.72 లక్షల కోట్లు మొండి బాకీ పద్దులుండగా 2011 నుంచి ఇప్పటి వరకు బ్యాంకులన్నీ కలిసి 25 లక్షల కోట్ల రుణాలను మాఫీ చేశాయి. కాంగ్రెస్ పాలన నాటి నుంచి ప్రస్తుత పాలనలో కూడా పన్నులు పెంచడమే కాక, సెస్‌లు, సర్ ఛార్జీలు వసూలు చేస్తున్నారంటే పన్నులైతే రాష్ట్రాలతో పంచుకోవాలి. సెస్‌లు, సర్ ఛార్జీలు పంచుకోరు. కేంద్రమే భోంచేస్తుంది. ఫలానా కార్యక్రమం కోసం ఇవి విధిస్తున్నామంటారు. ఆ కార్యక్రమం కోసం వసూలు చేశారో లేదో తెలియదు. కార్పొరేట్లకు రుణాలిచ్చి, తిరిగి చెల్లించకపోతే, చెవులు పిండివసూలు చేస్తే, ఆ మొత్తాన్ని మౌలిక సౌకర్యాలకు వినియోగించండి. బ్యాంకులకు ప్రభుత్వమే చెల్లించాలి. ఎందుకంటే ఆ బ్యాంకులు ప్రభుత్వానివే.

ఇలా అనేక ప్రశ్నలున్నాయి. రేపు ప్రవేశ పెట్టబోయే 2016 – 17 బడ్జెట్‌లో ఈ విషయాల గురించి ఆర్థిక మంత్రి అరుణ్ జైట్లీ ఏం చెబుతారో చూద్దాం.

*(రచయిత వీక్షణం వ్యవస్థాపక సంపాదకులు)* వీ

సంస్మరణ

# అరవింద ఘోష్ ఆలోచనల అంతరార్థం

*అధ్యాత్మిక వాదిగా మారిన విప్లవకారుడు అరవింద ఘోష్ ఆలోచనల పర్యవసానం ఏమిటో వివరిస్తున్నారు* **సత్యం**

వివిధ దిన పత్రికలలో ఆయన వాదనలు వివరిస్తూ వ్యాసాలుగా ప్రచురితమైనాయి. ఒక దిన పత్రికలో అరవింద ఘోష్ వాదనలను, ఆచరణను చక్కగా చెప్పారు. ఆ వ్యాసం చదివిన తరువాత సమాధానం రాయాలనిపించింది. ఎందుకంటే నేను ఇంటర్మీడియట్ చదివే రోజుల్లో డిగ్రీ మొదటి సంవత్సరంలో కూడా అరబింద పుస్తకాలు చదివాను. డిగ్రీలో తత్వశాస్త్రంలో ప్రధాన విషయాలలో (సబ్జెక్టులలో) ఒకటి. అరవింద ఘోష్ పుస్తకాలలో 'పరిణామం అంటే విస్తరణ' అనే ఒక వాక్యాన్ని జాగ్రత్తగా రాసి పెట్టుకున్నాను కూడా. అప్పట్లో ఆయనంటే చాలా గౌరవంగా ఉండేవాణ్ని. ఆ తరువాత నేను విప్లవోద్యమ నిర్మాణంలో నిమగ్నమయిపోయాను. శివసాగర్‌తో అరవిందుడి వాదనల గురించి కొంత చర్చ జరిగింది. సమాజ పరిణామాన్ని అవగతం చేసుకోలేక టెర్రరిస్టుగా జీవితం ప్రారంభమై ఆధ్యాత్మికత వైపు మరలిన ఆయన గురించి రెండు వాక్యాలు సృజనలో రాశాడని అనుకుంటాను. అయితే ఆ రెండు వాక్యాలు కాదు, కొంత వివరించాల్సి ఉంది అని అప్పుడే అనిపించింది.

అరవిందుని వాదనను చెపుతూ ఇలా రాశారు. 'పదార్థం నుంచి జరిగిన పరిణామంలో మానవుడు ఇంకా మధ్యంతర స్థితిలోనే ఉన్నాడు. దివ్య చైతన్య ఆవిర్భావంతో ఈ స్థితి నుంచి దైవం వైపుగా పయనించగలడు. అసమగ్రంగా ఉన్న భౌతిక, ప్రామాణిక మానసిక స్వభావాలలో పరివర్తన జరగాలి. అప్పుడే దివ్య చైతన్యం భూమి మీద అవతరించి భూమి మానవ జీవితాన్ని స్వర్గతుల్యం చేస్తుంది.'

ఇదీ అరవిందుడి వాదన, ఇక ఆచరణ గురించి ఆ దిన పత్రికలో ఇలా రాశారు. 'అరవిందుల పూర్ణయోగ, హఠయోగ, రాజయోగ, కర్మ, జ్ఞాన, భక్తి యోగాలన్నీ మనుషులను ఈ మార్గంలో ప్రయాణించేలా చేస్తాయి.'

ఈ ఆచరణ భూమి మీద దివ్య చైతన్యం అవతరించేలా చేస్తుందని అరవిందుని అభిప్రాయం. ఈ వాదన సమాజ పరిణామాన్ని అవగతం చేసుకోలేని వైఫల్యమనేది స్పష్టం. మనుషులందరినీ పై మార్గంలో ప్రయాణించమని చెప్పడమంటే, సామాజిక ఉత్పత్తిని, వర్గ పోరాటాన్ని, శాస్త్రీయ పరిశోధనలను బహిష్కరించి సన్యాసులుగా మారమని చెప్పడమే. ఈనాటి అనార్థాలకు, మానవ జీవితపు అష్ట కష్టాలకు వేళ్ల సామాజిక భౌతిక పునాదిలో ఉన్నాయి. ఈ వాస్తవాన్ని గ్రహించలేక సన్యాసం ఆవిర్భవించింది. గ్రహించని, చేతగాని బలహీనతతో ఈనాటి వెన్నెముకలేని రివిజనిజం రూపుదిద్దుకుంది. బానిస సమాజపు చివర్లో, ఫ్యూడల్ సమాజం ప్రారంభంలో ఈజిప్టు అనుకుంటాను సగానికి పైగా జనాభా సన్యాసం స్వీకరించి సముద్రపు ఒడ్డున చేరుకున్నారని చిన్నప్పుడు ఒక పుస్తకంలో చదివినట్లు జ్ఞాపకం. ఇది వ్యక్తివాద పర్యవసానం. అయితే అరవిందుడి వాదనను పూర్తిగా కొట్టివేయలేం. 'పదార్థం నుంచి జరిగిన పరిణామంలో మానవుడు ఇంకా మధ్యంతర స్థితిలోనే ఉన్నాడనే'ది వాస్తవం. వానరుడి నుండి మనిషి పరిణామం చెందాడని డార్విన్ తన సుప్రసిద్ధ 'ఆరిజన్ ఆఫ్ స్పిసీస్' పుస్తకంలో ప్రతిపాదించాడు. ఈ ప్రతిపాదనను అందరూ ఒప్పుకున్నారు. దీనిపై ఎవరికీ విభేదమేమీ లేదు. స్కూళ్లల్లో కూడా ఈ విషయాన్ని బోధిస్తారు. ఇది సైన్స్, జీవశాస్త్రం. అయితే వానరుడి నుంచి మనిషి వచ్చినా తత్వశాస్త్ర రీత్యా మానవుడి ప్రాదుర్భావం ఇంకా జరగలేదు. భౌతిక సూత్రాలకు పదార్థం ప్రామాణికం అయితే మానవుడు చైతన్యానికి ప్రతీక. ప్రకృతి మానవుడి ద్వారా తన గురించి తాను ఆలోచిస్తుంది. మనకున్న ఐదు ఇంద్రియాల ద్వారా ప్రకృతి దృగ్గోచరమవుతుంది. ప్రపంచాన్ని పునఃసృష్టి చేసే చైతన్యం మానవుడికి ఉంది. అయితే ఆ మానవుడి ప్రాదుర్భావం ఇంకా జరగలేదు. ప్రకృతిపై ఆధిపత్యం వహించడమంటే ఏమిటి? ప్రకృతి సూత్రాలను అవగతం చేసుకోవడం, సమాజ పరిణామ సూత్రాలను అవగాహన చేసుకోవడం, చైతన్యానికి (జ్ఞానానికి) సంబంధించిన సూత్రాలను అర్థం చేసుకోవడం, ఇలా అవగతం చేసుకోవడమే కాదు, సమాజాన్ని మార్చడానికి ప్రయత్నించడం, సామాజిక మార్పుతో పాటు తనను తాను మార్చుకోవడం. మార్చడం ద్వారానే ఇప్పటి వరకు మనం అన్నింటిని గురించి తెలుసుకుంటున్నాం. తత్వశాస్త్రంలో ప్రధాన ప్రశ్న పదార్థమా? చైతన్యమా? ఏది ప్రధానమైనదనేది. భౌతికవాదం పదార్థమే ప్రధానమైనదని చెపుతుంది. అది సరియైనదనే మానవ జీవితమే రుజువు చేస్తోంది. అయితే చైతన్యం పదార్థ పరిణామ దిశల్ని గుడ్డిగా కాకుండా తన ప్రయోజనాలకు అనుగుణమైన రీతిలో ప్రభావితం చేసే స్థితికి వచ్చింది. ఒక్కొక్కసారి అదే ప్రధానమైన రీతిలో ముందుకు వస్తోంది. ఈ సమాజాన్ని పెట్టుబడిదారీ వ్యవస్థ వరకు సమాజ భౌతిక సూత్రం శాసించాయి. ఇక నుంచి చైతన్యం ఆధిక్యతా స్థానంలోకి చేరుకుంటుంది. తత్వశాస్త్ర అవగాహనలో ప్రకృతిపై మానవుడి ఆధిపత్యం సాధ్యమే. అయితే సామాజిక పరిణామ క్రమంలో 'ఉనికి కోసం పోరాటం' సమాజం కుటుంబ శకలాలుగా విడిపోయి ఉండి, వ్యక్తి పోరాటం, వ్యక్తి బాధ్యత సమాజానికి లేకపోవడం – ఇలా జంతువుల రాజ్యానికి సంబంధించిన సూత్రాలు ఇంకా అమలవుతూనే ఉన్నాయి. దేశాలలో సంపన్న దేశాలు, కుటుంబాలలో సంపన్న కుటుంబాల ఆధిపత్యాన్ని నిర్మూలించబడితే గానీ, అంటే వేళ్ల మీద లెక్కబెట్టే దేశాలు, దేశాలలో వేళ్ల మీద లెక్కబెట్టే కుటుంబాల ఆధిపత్యం పోవాలి. యావత్తు ఉత్పత్తి సాధనాలు సమాజపరం కావాలి. స్వార్థం తదితర అనర్థాలకు భౌతిక పునాది అయిన

# దావోస్ (డబ్ల్యుఇఎఫ్) సంపన్నుల సదస్సు

***వెనుకబడిన దేశాల మధ్య వైరుధ్యాలను సృష్టిస్తూ, వాటి సకల వనరులను కొల్లగొడుతూ, తీవ్ర అసమానతలకు కారణమవుతున్న కొద్ది మంది సంపన్నుల సమాలోచన వేదికే దావోస్ అంటున్నారు* సంతోష్**

జర్మన్ ఆర్థికవేత్త క్లౌస్‌ష్వాబ్ స్థాపించిన ప్రపంచ అగ్ర పారిశ్రామిక వేత్తల, ఆర్థిక వేత్తల సదస్సు క్రమం తప్పకుండా ఏటా జరుగుతుంది. ఈ సదస్సులో దేశ నాయకులు, అపర కుబేరులు ప్రపంచ ఆర్థిక వ్యవస్థ తీరు తెన్నులపై చర్చిస్తుంటారు. ఈ సంవత్సరం 46వ సమావేశంగా జనవరి 20 నుండి 23 తేదీల్లో దావోస్‌లో జరిగింది. ప్రపంచ ఆర్థిక వేదిక సదస్సులో (డబ్ల్యుఇఎఫ్) ప్రధానాంశంగా నాలుగవ పారిశ్రామిక విప్లవం గురించి, అనుబంధ అంశాలుగా యూరఫ్ శరణార్థుల సమస్య, ప్రపంచ పర్యావరణం, చైనా ఆర్థిక మందగమనం, తీవ్రవాదుల సమస్య, ఆర్థిక అసమానతలపై చర్చలు జరిగాయి. స్విట్జర్లాండ్‌లోని శీతాకాల క్రీడల ప్రాంతానికి పేరుగాంచిన 11 వేల జనాభా గల దావోస్ ప్రపంచ ధనవంతుల కలయికకు వేదికగా మారింది.

ఈ సమావేశాల్లో ప్రపంచంలోని 40 దేశాల అగ్రనాయకత్వాలు హాజరయ్యారు. వారిలో డేవిడ్ కామరూన్, కెనడా ప్రధానమంత్రి ట్రుడెన్, మెక్సికో నుంచి నీటో, ఇరాక్ ప్రధానమంత్రి హైదార్, గ్రీకు ప్రధానమంత్రి అలెక్సిస్, అమెరికా విదేశాంగ మంత్రి జాన్ కెర్రీ, ఐఎంఎఫ్ ఎండి క్రిస్టిన్ లాంగ్, వరల్డ్ బ్యాంకు ప్రెసిడెంట్ జిమ్ యాంగ్ కిన్‌లు హాజరయ్యాయి. వీరితో పాటు ప్రపంచ నలుమూలల నుంచి 500 కోట్ల డాలర్లకు పైగా టర్నోవర్ చేస్తున్న పారిశ్రామిక సంస్థల సిఇఓలు, 1000 మందికి పైగా హాజరయ్యారు. వీరికి తోడు స్కాలర్స్, సంగీత విద్వాంసులు, సినిమా నటులు లియోనార్డ్ డి కాప్రియో వంటి వారు హాజరయ్యారు. భారతదేశం నుంచి అరుణ్ జైట్లీ సారథ్యంలో ఆర్‌బిఐ గవర్నర్ రఘురామ్ రాజన్, ఇంధనమంత్రి గోయల్, వ్యాపార వాణిజ్యమంత్రి నిర్మలా సీతారామన్, జయంత్ సిన్హా, ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడుతో పాటు దేశ పారిశ్రామిక దిగ్గజాలైన ముఖేష్ అనిల్ అంబానీలు, సైరస్ మిస్త్రీ, ఆనంద్ మహీంద్రా, రాహుల్ బజాజ్, అజీమ్ ప్రేమ్‌జీ, ఆదీ గోద్రెజ్, చందా కొచ్చర్, ఉదయ్ కోటక్, హరి ఎస్ భాటియా, నరేష్ గోయల్, మిట్టల్ వంటి వారు100

దావోస్ సదస్సు (డబ్ల్యు.ఇ.ఎఫ్) ఫీజులు

| | డాలర్లు | రూపాయలు |
|---|---|---|
| గాలా డిన్నర్ ఒక్కరికి | 1000 | 66000 |
| సదస్సు ప్రవేశ రుసుం | 9000 | 1254000 |
| ఒక కాన్ఫరెన్స్ హాజరు రుసుం | 31500 | 2079000 |
| ప్రాథమిక సభ్యత్వం | 52000 | 3432000 |
| వ్యూహాత్మక భాగస్వామ్య రుసుం | 590000 | 38940000 |
| సభ్యత్వ రుసుం | 600000 | 39600000 |

బూర్జువా స్వంత ఆస్తి విచ్ఛిత్తి లేదా రద్దు కావడంతోనే జంతువుల రాజ్యం నుండి మానవుడి రాజ్యంలోకి ప్రవేశించగలం. వివరంగా చెప్పాలంటే 'సాంప్రదాయిక ఆస్తి సంబంధాలతో అత్యంత మౌలికంగా తెగదెంపులు చేసుకోవడం, సాంప్రదాయిక భావాలతో అత్యంత మౌలికంగా తెగదెంపులు' చేసుకోవడంతోనే మానవుడి ప్రాదుర్భావం జరుగుతుంది. కోట్లాది మంది ప్రజలకు నరకాన్ని చవి చూపిస్తున్న సమాజాన్ని శాసిస్తున్న ఆర్థిక చెత్త నియమాలు పోయి తత్వశాస్త్రం ఆధిపత్యంలోకి వస్తుంది. 'వర్గాలు, వర్గ విభేదాలు గల ఈ సమాజానికి బదులు మనకొక నూతన సదస్సు లభిస్తుంది. ప్రతి ఒక్కరూ స్వేచ్ఛగా అభివృద్ధి చెందినప్పుడే అందరూ స్వేచ్ఛగా అభివృద్ధి చెందగల సదస్సు అది' ఆ సమాజాన్ని సమ సమాజమని గానీ మరే పేరుతో పిలిచినప్పటికీ ప్రకృతిపై ఆధిపత్యం వహించే మానవుడి రాజ్యమది. వివేకానందుడి పుస్తకాలలో ఒక వాక్యం బాగా నచ్చింది. 'ఆకలి బాధలతో ఉన్న వారికి అద్వైతం చెప్పకూడద'ని ఆ వాక్యం. అలాగే దారిద్ర్యంతో అలమటిస్తున్న కోట్లాది మంది ప్రజలకు అరవిందుని ఆచరణ, లేదా శంకరుడి అద్వైతం, మాయావాదం, మధ్వాచార్యుడి ద్వైతం, రామానుజుడి విశిష్ట ద్వైతం, నింబార్కుడి ద్వైతా ద్వైతం చెబితే ఏం జరుగుతుంది. అవన్నీ అవాస్తవాలే. ఈ భావవాద తాత్విక ధోరణులన్నీ 'జ్ఞానమనే వృక్షానికి పూసిన నిర్బంధ కుసుమాలే.' ఆచరణకు పనికిరానివి. ఈ వ్యవస్థలో ఉత్పత్తి, పంపకం ఎలా జరుగుతోంది. ఉత్పత్తి సామాజికంగా జరిగినా పంపకం మాత్రం అవసరాన్ని బట్టి గాక కొనుగోలు శక్తిని బట్టి జరుగుతోంది. ఈ విధానం పోయి అవసరాన్ని బట్టి పంపకం జరిగే వ్యవస్థ రావాలి. ఉత్పత్తి సంబంధాల్ని మారిస్తే గానీ ఈ లక్ష్యాన్ని చేరుకోలేం. ఇది సమ సమాజానికి సంబంధించిన రెండవ లక్షణం, అత్యంత ముఖ్యమైన లక్షణం కూడా.

ఒకసారి నాతో మాట్లాడుతూ వర్గాలు ఎందుకు ఆవిర్భవించాయి? వర్గ పోరాటం ఎందుకు వచ్చింది? అని సీతారామయ్య ఒక ప్రశ్న అడిగాడు. గతితార్కిక భౌతికవాదం అనే 'అత్యంత సమగ్రమైన, గంభీరమైన సిద్ధాంతం' లేదా ఆలోచనా విధానం ఆవిష్కరించబడింది. ఆ ఆలోచనా విధానాన్ని అనుసరించడానికా? అని ఆయనే సమాధానం చెప్పుకున్నాడు. చరిత్రలో వర్గాలు ఏర్పడి వర్గ పోరాటం ఎందుకు వచ్చింది! గతితార్కిక భౌతికవాదాన్ని అనుసరించడానికే కాదు, మానవుడి ప్రాదుర్భావానికి దారి చూపే మార్గాన్ని ఆవిష్కరించడానికి కూడా అని ఇప్పుడు సమాధానం చెప్పుకోవాలి.

*(రచయిత చరిత్ర విద్యార్థి)* వీ

మందికి పైగా ఈ ప్రతినిధి వర్గంలో ఉన్నారు.

ఇవాళ ప్రపంచం ఎదుర్కొంటున్న కీలక సమస్యలకు కారణాలు పెట్టుబడిదారీ ఆర్థిక విధానాల్లోనూ, కార్పొరేట్ల లాభాపేక్షలోనూ, అనుచితంగా పర్యావరణాన్ని విధ్వంసం చేస్తున్న విధానాల్లోనూ ఉందని అనేక నివేదికలు, ప్రముఖులు పేర్కొనడం జరిగింది. అయినా ఇవేమీ ప్రపంచ సంపన్నుల హృదయాలను కదిలించినట్లు లేదు. దావోస్‌లో ప్రపంచ ఆర్థిక వేదికను ఉద్దేశించి పోప్ ఫ్రాన్సిస్ చేసిన ప్రసంగం ఈ సదస్సులో పాల్గొన్న రెండున్నర వేల మంది అపర కుబేరుల చెవికెక్కినట్లు లేదు. 1990వ దశకం నుండి జి-7, ప్రపంచ బ్యాంక్, ఐఎంఎఫ్, డబ్ల్యుటిఓ సంస్థలతో పాటు ప్రపంచ ఆర్థిక వేదిక మీద ఉద్యమకారులు విమర్శలు కురిపిస్తూనే ఉన్నారు. నిరసన ప్రదర్శనలు క్రమం తప్పకుండా జరుగుతూనే ఉన్నాయి. ఇటీవలి కాలంలో కొన్ని వర్గాలు అసలు ఈ వేదిక సాధిస్తున్న ప్రయోజనమేమిలేదని, దీని సమావేశాలు, సదస్సుల నిర్వహణ వృథా అని కూడ విమర్శిస్తున్నారు.

పెరిగిపోతున్న అపర కుబేరుల సంఖ్యనూ, పోగేస్తున్న ఆస్తులను, దోపిడీ మార్గాల అన్వేషణలను కార్పొరేట్లు ఎంతో తన్మయంగా తెలుసుకొని తరించి పోతున్న కాలమిది. సంపదలో వైపరీత్యాలు, విపరీతంగా పెరిగిపోతున్న ఆర్థిక అసమానతలు ఏమాత్రం ఒంటికి పట్టని, గుండెలు పిండేయని రాతి హృదయాలు అపర కుబేరులవి. అందుకే అత్యాధునిక సాంకేతిక విజ్ఞానంతో కూడిన నాలుగో పారిశ్రామిక విప్లవానికి సమాలోచనలు జరిపారు. దీనితో అత్యాధునిక సాంకేతిక విజ్ఞాన పారిశ్రామిక, ఇతర ఉత్పత్తులు స్వయం చాలిత యంత్రాలకు (రోబోటిక్స్) బదిలీ కావడంతో ఉద్యోగాల్లో పెద్దఎత్తున కోతపడి నిరుద్యోగ సమస్య మరింత వికృతరూపం దాల్చనుంది. సదస్సుకు రెండు రోజుల ముందు ఆక్స్‌ఫామ్ ఛారిటీ విడుదల చేసిన నివేదిక గత ఐదు సంవత్సరాల కాలంలో చోటు చేసుకున్న సంపద వైపరీత్యాన్ని తెలియజేసింది. ప్రపంచ సంపదలో సగానికి సగం 62 మంది అపరకుబేరుల దగ్గర పోగుబడి వుందంటూ ఆక్స్‌ఫామ్ ఛారిటీ విడుదలచేసిన నివేదిక ఏమాత్రం ఆశ్చర్యం కలిగించదు.

సదస్సులో ప్రసంగించిన ఐఎంఎఫ్ అధిపతి క్రిస్టిన్ లాగార్డె ప్రపంచ ఆర్థిక అభివృద్ధికి పలు ఆటంకాలు ఎదురవవచ్చనీ, వృద్ధిరేటు నామ మాత్రం గానే ఉండవచ్చని పేర్కొన్నారు. భారత రిజర్వ్ బ్యాంకు గవర్నర్ మాట్లాడుతూ భారత్‌లో సంస్కరణలు కొనసాగుతున్నా వాటి స్థాయి అస్తవ్యస్థంగా ఉందన్నారు. సరైన దిశలో చర్యలు తక్కువగా, అపసవ్య దిశలో చర్యలు ఎక్కువగా కొనసాగుతున్నాయన్నారు. దావోస్ సదస్సు ప్రపంచం మొత్తానికి ప్రాతినిథ్యం వహించడంలేదనీ, నలభైవేల కోట్ల రూపాయలకు పైబడిన విలువున్న సేజ్ కంపెనీ అధినేత స్టీఫెన్ కెల్లీ ఈ సదస్సును బహిష్కరిస్తున్నట్టు ప్రకటించాడు. భారీ వ్యాపారాలున్న కొందరు వృద్ధులకు మాత్రమే ఇక్కడ చోటు దక్కిందని ఆయన ఆగ్రహం వ్యక్తం చేశాడు ఆర్థికశాస్త్ర 'నోబెల్' గ్రహీత రాబర్ట్ జె. షిల్లర్. "నాలుగో పారిశ్రామిక విప్లవం మానవ సమాజాన్ని అతలాకుతలం చేశాక తీరిగ్గా నివారణ చర్యలు తీసుకోవడం- ఇల్లు తగలబడిపోతుంటే అగ్నిప్రమాద బీమా కొనుగోలు చేయడంలా ఉంటుందని" ఎద్దేవా చేశారు. తక్షణమే భవిష్యత్ కార్యాచరణకు ఉపక్రమించాలని దావోస్ సభలో ఆయన పిలుపిచ్చారు.

ఇప్పటి వరకు సంభవించిన మూడు పారిశ్రామిక విప్లవాలు ప్రజల ఆర్థిక స్థితిగతులను సమూలంగా మార్చి సామాజిక, ఆర్థిక, రాజకీయ రంగాల్లో విస్తృత మార్పులు తీసుకొచ్చాయి. మొదటి పారిశ్రామిక విప్లవం (1750) ఆవిరి యంత్రాన్ని, యంత్రచోదిత రవాణాను, ఉత్పత్తిని ప్రవేశపెట్టింది. రెండో పారిశ్రామిక విప్లవం (1910) విద్యుచ్ఛక్తిని, కర్మాగారాల్లో భారీ స్థాయి ఉత్పత్తిని, మౌలిక వసతుల విస్తరణను తీసుకొచ్చింది. మూడో పారిశ్రామిక విప్లవం (1970) ఎలక్ట్రానిక్స్, సమాచార సాంకేతిక పరిజ్ఞానం (ఐటి) ఆధారిత సాంకేతికత (టెక్నాలజీ)ను డిజిటలీకరించింది. ఇకపై అంతకన్నా ఆధునికమైన టెక్నాలజీలు నాలుగో పారిశ్రామిక విప్లవానికి చోదకశక్తిగా నిలవనున్నాయి. రొబోటిక్స్, స్వయం చాలిత వ్యవస్థలు (ఆటోమేషన్) మానవుడి మెదడు, నాడీ వ్యవస్థలపై పరిశోధన (బ్రెయిన్ సైన్స్), కృత్రిమ మేధస్సు (ఆర్టిఫీషియల్ ఇంటిలిజెన్స్) ఇంటర్నెట్ ఆఫ్ థింగ్స్ (ఐఓటి), బిగ్ డేటా, నానో, బయో టెక్నాలజీలు, త్రిమితీయ (త్రీడీ) ముద్రణ, జన్యు శాస్త్రాలు కలగలసి నాలుగో పారిశ్రామిక విప్లవం (2020) వైతాళికత్వం వహించనున్నాయి. ఈ విప్లవం పెట్టుబడిదారులకు అద్భుత అవకాశాలను కల్పించి పరిశ్రమల్లో ఉత్పాదకత విజృంభణకు దారితీస్తుంది.

దావోస్ సదస్సు ఇతివృత్తం 'మాస్టరింగ్ ద ఫోర్త్ ఇండస్ట్రియల్ రివల్యూషన్' పైన పోప్ ఫ్రాన్సిస్ ప్రసంగిస్తూ 'పేదవాడి ఆర్తనాదాలు చెవికెక్కించుకోవాలని హితవు చెప్పారు. అపర కుబేరులు, బడా వాణిజ్య సంస్థలు, ధనిక సమాజాలు పేదరికం సృష్టిలో తమ పాత్రను అంగీకరించక తప్పదన్నారు. డిజిటల్ టెక్నాలజీ, ఆర్టిఫిషియల్ ఇంటలిజెన్స్, రోబోటిక్స్, మానవ రహిత వాహనాలు వంటి సాంకేతిక విప్లవాలతో మనుషుల స్థానంలో ఆత్మలేని యంత్రాలను ప్రవేశపెట్టడం వల్ల మానవ జాతికి ముప్పు వాటిల్లనుందని హెచ్చరించారు'. అతికొద్ది మంది వ్యక్తుల వద్ద సంపద పోగయ్యే ప్రక్రియ రోజు రోజుకూ వేగవంత మవుతున్న వైనాన్ని వివరించారు. పోప్ అపర కుబేరుల్లో పరివర్తన తేగలననుకున్నారో ఏమో, పేదల కొరకు కాసిన్ని కన్నీళ్లు కార్చమన్నారు. కుబేరులకు వాస్తవాలను బోధిస్తే, పరిపూర్ణమైన మనుషులుగా మారిపోయి, సమిష్టి బాధ్యత గుర్తెరిగి తోటి మానవుల జీవితాలను ఆనందమయం చేయడానికి పూనుకుంటారని పోప్ ఆశ. పోప్ మాటలు అపర కుబేరులకు నవ్వు తెప్పిస్తాయేమో కాని, పాషాన హృదయాలు మాత్రం కరగవన్నది జగద్విదితం. ఈ కుబేరులు తమకు అనుకూలంగా చట్ట విరుద్ధమైన, నీతి బాహ్యమైన, పారదర్శకత లేని వ్యవస్థలను ఉద్దేశపూర్వకంగా రూపొందిస్తూ సంపదను పోగేసుకునే క్రమాన్ని వేగవంతం చేస్తుంటే అసమానతలు పెరుగకుండా ఎలా ఉంటాయి?

పోప్ ప్రసంగం ప్రవర్తన మార్చుకోమని హితవు చెబితే, ప్రస్తుత ఆర్థికనమూనా ఉద్దేశపూర్వకంగా రూపొందించిన అసమానతల చట్రం అంటూ అంతర్జాతీయ కార్మిక సంఘాల సమాఖ్య ప్రధాన కార్యదర్శి ఇదే వేదికనుద్దేశించి చేసిన ప్రసంగం వారిని దునుమాడింది. అభివృద్ధి పేరుతో కొద్దిమంది కుబేరుల కోసం పచ్చని భూమిని ఎడారిగా మార్చేయ వద్దని పోప్ ప్రస్తావిస్తే, భూతాపానికి, పర్యావరణ వినాశనానికి ప్రధాన కారకులు కార్పొరేట్లేనని సామ్రాజ్యవాద ప్రపంచీకరణ అభివృద్ధి నమూనా వ్యతిరేకులు, పర్యావరణ వేత్తలు అభిప్రాయపడ్డారు. ప్రఖ్యాత హాలీవుడ్

సినీనటుడు దావోస్ సదస్సులో ఉపన్యసిస్తూ "పర్యావరణ వినాశక ప్రధానకారకులు చమురు, సహజసంపద, బొగ్గుగనులను దురాశతో దోచుకునేది కార్పొరేట్ సంస్థలేనని" తీవ్ర స్వరంతో అన్నారు. నాలుగు గోడల మధ్య ప్రత్యేక ప్రైవేటు గాలాస్‌తో, డిన్నర్లతో శతకోటీశ్వర్లు వ్యక్తిగతంగా ప్రపంచంలో సృష్టించబడిన ఆర్థిక అసమానతలు చూసి సంతృప్తి చెందుతూ దీన్నే సాధించిన విజయంగా భావిస్తూ. ఈ అసమానతలు మరింత పెంచటానికి ప్రణాళికలు రూపొందించ బడుతున్నాయని వరల్డ్ సోషలిస్ట్ వెబ్‌సైట్ పేర్కొంది.

నాలుగో పారిశ్రామిక విప్లవ ఆవిర్భావం గురించి ప్రపంచ ఆర్థికవేదిక వ్యవస్థాపకుడు, జర్మన్ ఆర్థికవేత్త క్లౌస్ ష్వాబ్ చేసిన సూత్రీకరణ ఈ సదస్సుకు ప్రధాన ఇతివృత్తమైంది. ఇంతకుముందు వచ్చిన మూడు పారిశ్రామిక విప్లవాలు కొత్త ఉద్యోగాలను సృష్టించాయే తప్ప, ఉన్న ఉద్యోగాలను ఊడబెరకలేదు. కానీ, నాలుగో పారిశ్రామిక విప్లవం-2020 నాటికి ప్రపంచంలోని 15 అభివృద్ధి చెందిన దేశాల్లో 71లక్షల ఉద్యోగాలకు మంగళం పాడి, 21లక్షల కొత్త ఉద్యోగాలను సృష్టిస్తుంది. అంటే, నికరంగా అర కోటి ఉద్యోగాలు కనుమరుగవుతాయి. 'ఉద్యోగాల భవిష్యత్తు' అనే శీర్షికతో డబ్ల్యుఇఎఫ్‌కు సమర్పించిన అవగాహనపత్రం ఈ భవిష్యత్ చిత్రాన్ని ఆవిష్కరించింది. మానవులు అలవాటుగా చేసుకుపోయే పనులను యంత్రాలు మరింత సమర్థంగా చేస్తాయి. కాబట్టి కార్యాలయ సిబ్బంది, పారిశ్రామిక కార్మిక పర్యవేక్షణ ఉద్యోగాలతో పాటు గనుల తవ్వకం, భవన నిర్మాణం తదితర రంగాల్లో త్వరలో అరకోటి ఉద్యోగాలు అదృశ్యమైపోతాయని ఈ పత్రం లెక్కగట్టింది.

నాల్గవ పారిశ్రామిక విప్లవం ఫలితంగా పరిశ్రమలతో పాటు కార్మికుల స్థితిగతులనూ అధునాతన సాంకేతికత తలకిందులు చేస్తోంది. ఒక్క అమెరికాలోనే 45 శాతం అల్ప నైపుణ్య ఉద్యోగాలను స్వయంచాలిత వ్యవస్థలకు అప్పగించవచ్చని మెకిన్సే సంస్థ తేల్చింది. దీనివల్ల స్థానభ్రంశం చెందే ఉద్యోగులకు ఏడాదికి రెండులక్షల కోట్ల డాలర్ల జీతభత్యాల నష్టం, ఆ మేరకు నిర్వాహకులకు మిగులు సిద్ధిస్తాయి. టెక్నాలజీతో ఉత్పాదకత ఇబ్బడిముబ్బడిగా పెరగడం వల్ల విజయవంతమైన స్టార్టప్‌లు, వాటికి పెట్టుబడులు సమకూర్చే వెంచర్ పెట్టుబడిదారులు, ఫైనాన్స్, స్టాక్ మార్కెట్ నిపుణులు అనూహ్య ప్రతిఫలాలు పొందుతారు. బడా కంపెనీల సిఇఓలు కనీవినీ ఎరుగని పారితోషికాలు కళ్లజూస్తారు. మరోవైపు దిగువస్థాయి ఉద్యోగాలు హుష్ కాకి అవుతాయి. ఆదాయ అసమానతలు విపరీతంగా పెరగనున్నాయి. వ్యక్తుల మధ్యనే కాదు, దేశాల మధ్యనా అసమానతల అఖాతం విస్తరించనుంది. అందుకే భవిష్యత్తులో అధిక పెట్టుబడులు, ఉన్నత నైపుణ్యాలదే రాజ్యమని కార్ల్ ష్వాబ్ ఉద్ఘాటించారు. ఈ పోటీలో పేదదేశాల, సామాన్యుల పరిస్థితి ఏమిటనే ప్రశ్న అందర్నీ తొలుస్తోంది.

నైపుణ్యం లేని సిబ్బంది జీవితాలను ప్రశ్నార్థకం చేస్తుందని నిపుణులు హెచ్చరిస్తున్నారు. నాలుగవ ప్రపంచ పారిశ్రామిక విప్లవం గురించి హెచ్చరిస్తూ స్విస్ బ్యాంకు యుబిఎస్, తన నివేదికలో "ఈ సదస్సులో దృష్టిసారించబోయే రోబోటిక్స్, ఆర్టిఫిషియల్ ఇంటెలిజెన్స్ పరికరాలు, సమాజంలోని ధనికులను మరింత ధనికులుగా చేసేవిగా, ప్రపంచ అసమానతలను మరింత పెంచేందుకు దోహదం చేస్తాయని" పేర్కొంది. గడిచిన మూడు పారిశ్రామిక విప్లవాలైన ఆవిరియంత్రాలు, విద్యుచ్ఛక్తి, ఎలక్ట్రానిక్స్, వలస,నయా వలసవాద పాలనలకు దోహదపడ్డాయి. ప్రస్తుత రోబోటిక్స్, కృత్రిమ ఇంటిలిజెన్స్ చౌక శ్రమశక్తికి పోటీనిచ్చి మరింత దోపిడీ చేయడం ద్వారా ప్రపంచ సమాజం ఆర్థిక అసమానతలతో సతమతమవుతుందని హెచ్చరించింది. అదే సమయంలో స్విస్ బ్యాంకు ప్రపంచ దేశాధిపతులను ఈ సాంకేతిక అభివృద్ధిని ధనార్జన దృష్టితో కాకుండా, పేదరిక నిర్మూలన దృష్టితో పరిశీలించాలని సూచించడం గమనార్హం.

ఇప్పటికే అమెరికా వంటి సంపన్న దేశాల్లో ఉద్ధృతమైన ఆటోమేషన్ వర్ధమాన దేశాలకు నష్టదాయకంగా పరిణమిస్తున్నది. ఇటీవలి వరకు అమెరికా నుంచి ఫ్యాక్టరీ ఉద్యోగాలు చైనా, మెక్సికో వంటి దేశాలకు, ఐటి ఉద్యోగాలు భారత్‌కు తరలివచ్చాయి. ఆటోమేషన్, బిగ్ డేటా, ఐఓటి, త్రీడీ ముద్రణ వంటి అధునాతన టెక్నాలజీలు ఇకమీదట ఈ పొరుగు సేవలకు స్వస్తి పలికి, పరిశ్రమలు అమెరికాకు తిరిగి వెళ్లడానికి ప్రేరకంగా పనిచేస్తాయి. ముమ్ముందు కమ్యూనికేషన్ ఇంటర్నెట్, పునరుత్పాదక ఇంధన నియంత్రణ ఇంటర్నెట్, జీపిఎస్ చోదిత డ్రైవర్ రహిత రవాణా ఇంటర్నెట్ కలగలిసి సృష్టించే 'సూపర్ ఇంటర్నెట్' ఈ తరలింపును మరింత వేగవంతం చేస్తుంది. దీనికి ఇంటర్నెట్ ఆఫ్ థింగ్స్ (ఐఓటి) వేదికగా నిలుస్తుంది. నాలుగో పారిశ్రామిక విప్లవంలో ప్రతి యంత్రం, ప్రతి పరికరంలో అమర్చే సెన్సర్లు వినియోగదారులతోనే కాదు, తమలో తామూ సంభాషించుకుంటాయి. ఇప్పటికే 1400 కోట్ల సెన్సర్లు గిడ్డంగుల్లో, సమాచార ప్రసార వ్యవస్థల్లో, రోడ్లు, విద్యుత్, ఫ్యాక్టరీలు, ఇళ్లు, దుకాణాలు, కార్యాలయాలు, వాహనాల్లో అమర్చి ఉన్నాయి.

ప్రపంచ ఆర్థికవేదిక సదస్సుకు రెండు రోజుల ముందు ఆక్స్‌ఫామ్ ఛారిటీ విడుదల చేసిన నివేదిక గత ఐదేళ్ల కాలంలో సంభవించిన ఒక పెను మార్పును విస్పష్టంగా తెలియచెప్పింది. 2010లో ప్రపంచ జనాభాలో సగం మంది సంపదకు సమానమైంది 388మంది కుబేరుల దగ్గరుంటే, ఇప్పుడది కేవలం 62 మంది కుబేరుల చెంతకు చేరింది. ఒక బస్సులో పట్టే వీరి ఆస్తి ఐదేళ్ల కాలంలో సగం కన్నా ఎక్కువ పెరిగితే, ప్రపంచ జనాభాలోని సగం మంది నిరుపేదల ఆస్తి ఇదే కాలంలో 41శాతం పడిపోయింది. మరొకవైపు పేదల జనాభా 40 కోట్లు పెరిగింది. 'ఏన్ ఎకానమీ ఫర్ ద వన్‌పర్సెంట్' (ఒక్కశాతం మంది ఆర్థిక వ్యవస్థ) శీర్షికతో విడుదలైన ఈ నివేదిక అతికొద్దిమంది వ్యక్తుల వద్ద సంపద పోగయ్యే ప్రక్రియ ఎప్పటికప్పుడు వేగవంతమవుతున్న వైనాన్ని, పన్నులను ఎగవేయడం కోసం సంపన్నులు 514 లక్షలకోట్ల సంపదను (నల్లధనాన్ని) బ్యాంకుల్లో దాచిన వాస్తవాన్ని బట్టబయలు చేసింది. ప్రపంచ జనాభాలో ఒకశాతం దగ్గరున్న సంపద మిగతా 99శాతం సంపదకన్నా ఎక్కువని తేల్చి చెప్పింది. గత వందేళ్ల కాలంలో ఈ స్థాయిలో అసమానతలు ఎన్నడూ లేవని నివేదిక స్పష్టం చేసింది.

టాక్స్ హెవెన్స్‌గా పేరొందిన దేశాల్లోని కార్పొరేట్ సంస్థలు, ఆ దేశాల్లోని బ్యాంకులు, అందుబాటులోకి వచ్చిన ఆధునిక సాంకేతిక పరిజ్ఞానంతో ఎవరికీ చిక్కకుండా, చట్టాలకు దొరక్కుండా లావాదేవీలు నెరపడానికి సహకరిస్తున్నాయి. కేవలం యాభై బ్యాంకులు అత్యధికశాతం సంపదను కాపాడుతూ, ప్రభుత్వాల విధాన నిర్ణయాలను కూడా ప్రభావితం చేస్తున్న విషయాన్ని నివేదిక వివరించింది. అలాగే, బహుళజాతి కంపెనీలు ఆయాదేశాల్లోని ప్రజాప్రతినిధులకు భారీగా లంచాలు ముట్టచెబుతూ ప్రభుత్వాల నిర్ణయాలను నిర్దేశిస్తున్నాయి. బీమా

కంపెనీలు, ఫైనాన్స్ కంపెనీలు, విత్తన కంపెనీలు ఇత్యాదివి తమ మార్కెట్లను విస్తరించడానికీ, విధానాలను నియంత్రించడానికీ ఎటువంటి అడ్డుతోవలు ఎంచుకుంటున్నాయో నివేదిక స్పష్టంగా వివరించింది.

బహుళజాతి సంస్థలు ఎగ్గొడుతున్న పన్ను కారణంగా అభివృద్ధి చెందుతున్న దేశాలు ప్రతి ఏటా వంద బిలియన్ డాలర్లు నష్టపోతుంటే, ప్రపంచవ్యాప్తంగా పెరిగిన సంపదలో అత్యంత నిరుపేదలకు అందుతున్నది కేవలం ఒకశాతమే. యజమానుల లాభాలు పెరుగుతున్నాయి కానీ, కార్మికుల వాస్తవిక వేతనం పడిపోతున్నది. కార్పొరేట్ సంస్థలు చేస్తున్న వాతావరణ కాలుష్య మార్పులకు సులభంగా బలయ్యేప్రాంతాల్లో నిరుపేదలు నివసిస్తున్నారు. ఈ మార్పులకు కారణమవుతున్న ఉద్గారాల విడుదలలో వారి పాపం మాత్రం నామమాత్రమే. ఏతావాతా, 'ఏన్ ఎకానమీ ఫర్ ద వన్‌పర్సెంట్' నివేదిక ఈ ప్రపంచంలో కేవలం ఒకశాతం వ్యక్తులు మిగతా ప్రపంచాన్ని ఎలా శాసిస్తున్నదీ వివరించింది. రాజకీయాధికారాన్ని ప్రభావితం చేసి, చట్టవిరుద్ధమైన, నీతిబాహ్యమైన, పారదర్శకతలేని, అవినీతిమయమైన విధానాలకు వీలుకల్పించే వ్యవస్థలను తయారుచేయడం ద్వారా వీరంతా సంపదను పోగేసుకొనే ప్రక్రియను మరింత వేగవంతం చేసుకుంటూ పోతుండగా, అధికులు అత్యంత వేగంగా నిరుపేదలవుతున్న తీరును విశ్లేషించింది.

రెండు దశాబ్దాలకు పైగా అమెరికా, పశ్చిమ యూరప్ దేశాలు సాగించిన 13 యుద్ధాలపై చేసిన వ్యయం 65 లక్షల కోట్ల రూపాయలు. ఫలితంగా మధ్యప్రాచ్య దేశాలలో లక్షలాది మంది మరణించారు. మరోవైపు మధ్యప్రాచ్య దేశాల నుండి యూరప్ దేశాలకు శరణార్థుల సమస్య పెను సవాలుగా మారింది. జర్మనీలో చౌక శ్రమశక్తికోసం అనుమతించిన 10లక్షల శరణార్థుల సమస్య ఛాన్సలర్ మెర్కెల్ అధికార పీఠాన్ని కుదిపేస్తోంది. ఈ కారణంగా మెర్కెల్ దావోస్ సదస్సుకు హాజరుకాలేదు. యుద్ధాలు సాగించిన అమెరికా, యూరప్‌దేశాలు ప్రస్తుతం శరణార్థుల సమస్యతోనూ ఐసిస్ ఉగ్రవాదంతోనూ తమ ముప్పును తామే కొనితెచ్చుకుంటున్న పరిస్థితులు ఏర్పడుతున్నాయి. అందువలన ప్రపంచ శాంతి కొరకు సార్వభౌమత్వ దేశాలలో సామ్రాజ్యవాద దేశాల జోక్యం ఉండకూడదని పలువురు డిమాండ్ చేశారు.

ఆర్థిక సంక్షోభానికి, పర్యావరణ వినాశనానికి, వలసలు పెరగడానికి కారణాలు సామ్రాజ్యవాద ప్రపంచీకరణ అభివృద్ధి నమూనాలో, సార్వభౌమ్య దేశాల అంతర్గత విషయాల్లో జోక్యం చేసుకొనే దురాక్రమణ యుద్ధాలలో ఉన్నాయి. ప్రపంచీకరణ అభివృద్ధి నమూన ఉపాధిరహిత, అభివృద్ధి రహిత, నిర్దయతో కూడి వున్నందున పేదరికం, అసమానతలు, నిరుద్యోగం గతంలో ఎన్నడూ లేనంతగా పెరుగుతున్నట్లు, అంక్టాడ్ అధ్యయనం, ఐరాస ప్రపంచ ఆర్థిక అధ్యయనాలు వంటివి తెలుపుతున్నాయి. ప్రపంచ ద్రవ్య పెట్టుబడిదారుల మితిమీరిన లాభాపేక్ష ప్రస్తుత దుస్థితికి కారణం. పెట్టుబడిదారీ ఆర్థిక వ్యవస్థలో క్రమం తప్పకుండా 10 సంవత్సరాలకు ఒకసారి ఆర్థికమాంద్యం సంభవించడం, కార్పొరేట్ స్టాక్ మార్కెట్ల నష్టాలను ప్రజలపై రుద్దడం పరిపాటి అయింది. ప్రస్తుత ప్రపంచం ఎదుర్కొంటున్న చమురు, ముడిసరుకుల సంక్షోభాలు, స్టాక్, బాండ్ల పతనాల కారణంగా ప్రపంచ వ్యాపితంగా ముఖ్యంగా అమెరికా, యూరప్ దేశాల్లో యువత ఉద్యోగాలను కోల్పోతూ కంపెనీలు లే ఆఫ్‌లు ప్రకటిస్తున్నాయి.

ప్రపంచంలో ఇవాళ సంపన్న దేశాల నుండి బయటి దేశాల్లోకి పెట్టుబడులు ప్రవహించే స్థితి లేదు. ఈ తరుణంలో స్థానిక సమస్యలను పట్టించుకోకుండా విదేశీ యాత్రల ద్వారా కేంద్రంలో మోడీ గానీ, తెలుగు రాష్ట్రాల నేతలు గానీ కోట్లాది రూపాయలు ఖర్చు చేసి ఎన్ని డాలర్ల పెట్టుబడులు తెచ్చారో తెలియదు కాని వారి ప్రయాణ ఖర్చులు మాత్రం లక్షల కోట్లల్లో ఉంది.ప్రపంచ ఆర్థిక వేదిక నిర్వహించిన 'వ్యాపార అనుకూల వాతావరణం' అనే అంశం మీద ఎపి ముఖ్యమంత్రి చంద్రబాబు ప్రసంగిస్తూ అత్యున్నత పది గమ్యస్థానాల్లో ఒకటిగా ఆంధ్రప్రదేశ్ రాష్ట్రాన్ని తీర్చిదిద్దడానికి చేయూత నివ్వాలన్నారు. చంద్రబాబు దావోస్‌లో మెకెన్లీ గ్లోబల్ సంస్థ సి.ఇ.ఓతోనూ, వైద్యపరికరాల ఉత్పత్తి సంస్థ మెడ్ ట్రానిక్ అధ్యక్షున్ని కోరాడు. డబ్ల్యుఇఎఫ్ ఎపిలో తమ కార్యాలయం నెలకొల్పడానికి సమ్మతించింది.

దావోస్ నుండి తిరిగి వచ్చిన చంద్రబాబు ఇకమీదట ప్రపంచనెట్‌వర్క్ ద్వారా వ్యవసాయ ఉత్పత్తులను మార్కెటింగ్ చేయతలపెట్టినట్లు విలేకరుల సమావేశంలో తెలిపారు. విదేశాల్లో రైతులకు ఇస్తున్న సబ్సిడీలు, ప్రోత్సాహకాలతో వస్తున్న పంటల దిగుబడులను తట్టుకుని, సబ్సిడీలులేని భారతదేశ రైతాంగం విదేశీమార్కెట్ పోటీలో నిలవగలదా..? ఒకవైపు దేశంలో, రాష్ట్రంలో వ్యవసాయాన్ని సంక్షోభంలోకి నెట్టిన ఫలితంగా రైతులు ఆత్మహత్యలు చేసుకుంటున్నారు. మరోవైపు పరిశ్రమలు మూతపడుతూ నిరుద్యోగ సమస్య ఎదురవుతుంటే కార్పొరేట్ సంస్థలకు రెడ్‌కార్పెట్ పరచి ఆటోమేషన్ ఉత్పత్తి ప్రక్రియలను ప్రారంభించటానికి ప్రోత్సహించడం ద్వారా లాభాలు విదేశీ కార్పొరేట్ సంస్థలకుపోతూ, దేశంలో నిరుద్యోగం, ఆర్థిక అసమానతలు తీవ్రమవుతుండటం వాస్తవంకాదా..? అభివృద్ధి పేరుతో కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు ప్రపంచ ద్రవ్య పెట్టుబడి సేవలో తరించిపోతున్నాయి. ఫలితంగా ఆర్థిక అంతరాలు, పర్యావరణ విధ్వంసం జరుగుతోంది. సుస్థిర ఆర్థికాభివృద్ధికి ఎగుమతులు, విదేశీ పెట్టుబడులపై ఆధారపడే అభివృద్ధికాకుండా దేశీయ పెట్టుబడులు దేశీయ మార్కెట్‌పై ఆధారపడే ఆర్థిక వ్యవస్థ వైపు దృష్టి సారించాలి. పాలకులు ప్రజల కొనుగోలు శక్తి పెంచకుండా విదేశీ పెట్టుబడులపై ఆధారపడి వృద్ధిరేటు సాధిస్తామంటున్నారు. స్వావలంబన, స్వయం సమృద్ధికి పెద్దపీట వేసి, దేశీయ మార్కెట్‌ను విస్తృతపరచి ప్రజల కొనుగోలు శక్తిని పెంచగల అభివృద్ధి వ్యూహాలు మాత్రమే సంక్షోభాలను అధిగమించే శక్తినిస్తాయి. లేదంటే రాబోయే దృశ్యం మరో మాంద్యానిదే అవుతుంది.

ఇవాళ అమెరికా సహా ప్రతి దేశంలోనూ ఇదే పరిస్థితి వేళ్లూనుకుంది. సామ్రాజ్యవాద ప్రపంచీకరణ ద్రవ్య ఆర్థిక విధానాలు సుస్థిర ప్రపంచ ఆర్థిక వ్యవస్థకు ప్రమాదకరం. ఈ నేపథ్యంలో ధనిక, పేదల మధ్య వ్యత్యాసం విశాలమవుతుండడం, వర్గ వైషమ్యాలు తీవ్రతరమవుతుండటంతో ప్రపంచ దేశాల్లోని ప్రజలు భారీ సంఖ్యలో పోరాటాలు చేస్తున్నారు. ప్రస్తుతం కొనసాగుతున్న ఆర్థిక సంక్షోభం యాదృచ్ఛికమైనది కాదు. పెట్టుబడిదారీ వ్యవస్థ అంతర్గత సూత్రాలలో బలంగా వేళ్లూనుకుని ఉన్న సర్వ వ్యాపిత ప్రభావం చూపే సంక్షోభం. ఈ సంక్షోభానికి వ్యతిరేకంగా పోరాటాలు ఉధృతం చేయడం ద్వారా పెట్టుబడిదారీ విధానానికి ప్రత్యామ్నాయంగా ప్రజానుకూల ఆర్థిక విధానాన్ని నిర్మించుకోవడమొక్కటే సరైన ఏకైక పరిష్కారం. వీ

*(రచయిత ఉపాధ్యాయులు)*

# ఫాసిస్టు మతమా? ప్రజాస్వామ్యమతమా?

***కుల అంతరాలను పెంచిపోషిస్తున్న బ్రాహ్మణీయ హిందూ ఫాసిస్టు మతానికి ప్రత్యామ్నాయం గా ప్రజాస్వామిక భావాలుండే బౌద్ధ మతాన్ని బహుజనులు ఆచరించాలని అంటున్నారు*** **డా. పట్టా వెంకటేశ్వర్లు**

బహుజన ప్రవక్తలైన పూలే, అంబేద్కరుల దృక్పథంలో, హిందూ మతం అనేది ఒక మతం కాదు. అది కుల దొంతరల ఒక ప్రత్యేక సమాజం. ఈ కుల దొంతరలను కాపాడడానికే హిందూ దేవుళ్లు సృష్టించబడ్డారనీ, అందువల్లనే వారి చేతుల్లో ఆయుధాలు ఉన్నాయనీ, అంతేకాక కింది కులాలు తిరుగుబాటు చెయ్యకుండా విద్యను, సంపదను, ఆయుధాలను అందకుండా చేశారనీ, వారి మనసుల్ని పరాయీకరించడం కోసమే స్మృతులు, పురాణాలు రాసారనీ, ఈ విధంగా తరతరాలుగా సాంఘిక, ఆర్థిక, రాజకీయ బానిసత్వాన్ని హిందూ మతం నూరిపోసిందనీ, అందుకని దీని నుండి బయట పడనిదే బహుజన విముక్తి సాధ్యపడదనే బోధనలను వారు చేశారు. ఇందులో భాగంగానే అంబేద్కర్ 'రాముని, కృష్ణుని రహస్యాలు', 'కుల నిర్మూలన', పూలే 'గులాంగిరి' లాంటి గ్రంథాల ద్వారా హిందూ మత బండారాన్ని బహిరంగపరిచారు. ఇటీవల కంచె ఐలయ్య లాంటి మేధావులు కూడా హిందూ మతం ఒక మతం కాదనీ, అది ఆధ్యాత్మిక ఫాసిజమనే వాదాల్ని చాలా బలంగా వినిపిస్తున్నారు. ఈ విధంగా చార్వాకులు మొదలుకొని బుద్ధుడు, పూలే, అంబేద్కర్, నేటి ఐలయ్య వరకు హిందూ మతంపై విమర్శని కొనసాగిస్తూనే ఉన్నారు. కాని అదే స్థాయిలో బహుజనులు హిందూమత మూఢ విశ్వాసాల్ని అనుసరిస్తూనే ఉన్నారు. ఇదొక వైపరీత్యం. ఇందుకు కారణం హిందూ మతానికి ప్రత్యామ్నాయంగా ఎలాంటి మతాన్ని అనుసరించాలనే దాని మీద ఒక స్పష్టత లేకపోవటమే. దీనికి అంబేద్కర్ బౌద్ధాన్ని ఒక ప్రత్యామ్నాయంగా చూపించినప్పటికీ, నేటికి ఏదో కొద్ది మంది దళితులు బౌద్ధం, క్రైస్తవం స్వీకరించినా, మెజారిటీ మంది హిందువులుగానే ఉన్న స్థితి ఉంది. నూతన వర్గంగా ఎదుగుతున్న దళిత విద్యావంతులు, ఉద్యోగులు, రాజకీయ కార్యకర్తలు నయా బ్రహ్మణిష్టుగా హిందూ మతాన్ని అనుసరిస్తూనే ఉన్నారు. ఇక శూద్ర కులాలలో ఈ చర్చే లేకపోగా, హిందుత్వానికి సాయుధ సైనికులుగా మారుతున్న స్థితి ఉంది. ఇది బహుజన మేధావులకి ఒక సవాలుగా మారింది. ఈ పరిణామం అభ్యుదయవాదులందరికీ ఆందోళన కలిగిస్తున్నది.

అయితే ప్రస్తుత సామాజిక స్థితిలో మతాన్ని అనుసరించటమా? లేదా మతాన్ని నిర్మూలించడమా? అనే విషయంలో అభ్యుదయవాదుల్లో భిన్నాభిప్రాయాలు ఉన్నాయి. కమ్యూనిస్టు లేదా హేతువాదులకైతే అసలు మతమే అవసరం లేదనే అంటారు. అలాగే అంబేద్కరిస్టులలో కొందరు ఒక దశ వరకు మతం అవసరమనే వారు ఉన్నారు. ఈ విషయంలో ప్రపంచ అనుభవాలు ఏం చెబుతున్నాయనే దాన్ని పరిశీలించినపుడు, నేటికి కమ్యూనిస్టు దేశాల్లో విప్లవాలు విజయవంతమైన తరువాత కూడా మతం నిర్మూలించబడకపోగా కొనసాగుతూనే ఉంది. చైనా, ఇతర కమ్యూనిస్టు దేశాల్లో దీన్ని చూస్తూనే ఉన్నాం. అభివృద్ధి చెందిన దేశాల్లోనే ఇలాంటి పరిస్థితి ఉన్నపుడు ఇంకా ఫ్యూడల్ మత అవశేషాలు బలంగా ఉన్న మనలాంటి దేశంలో మతం అవసరం లేదనే వాదన అర్థరహితమవుతుంది. కాబట్టే ప్రస్తుత సామాజిక దశకు అంబేద్కర్ ప్రతిపాదించిన మతం ఆవశ్యకత కనబడుతుంది. ఆయన ఏమంటాడంటే, ప్రస్తుత సమాజానికి మతం అనేది అవసరంగా ఉంటుందనీ, అయితే ఆ మతం స్వేచ్ఛ, సమానత్వం, సౌభ్రాతృత్వం వంటి లక్షణాలతో ఉండాలంటాడు. సరిగ్గా ఇలాంటి ప్రతిపాదననే మార్క్స్ ముందటి భౌతికవాది ఫ్యూర్‌బా కూడా చేస్తాడు. ఆయన దృష్టిలో 'మానవ సమాజానికి తప్పకుండా ఒక మతం అనేది కావాలి. అది లోపరహితంగా ఉండాలి. అందులో మానవుల మధ్య సంబంధాలన్నీ సుఖశాంతులతో కొనసాగే విధంగా అవసరమైన నీతి నియమాలు ఉండాలి". అంటే ప్రేమ, స్నేహం, నీతి, నియమాలతో మానవులు జీవించాలంటాడు. మార్క్స్ కూడ మతం మత్తు మందు అంటూనే, అది పేదవాడి నిట్టూర్పు అని కూడా అంటాడు. ఈ నిట్టూర్పు కోసమో లేదా ఇతర ప్రయోజనాల కోసమో దేవాలయాల్లో, పుష్కరాల్లో, ఛండీయాగాల్లో, బాబా యోగా క్యాంపుల దగ్గర జనాలు పడిగాపులు కాస్తున్నారు. అందువల్లనే ఆధ్యాత్మికత అనేది పెద్ద వ్యాపారరంగంగా వర్ధిల్లుతున్నది. కాబట్టే దేశీయ పెట్టుబడిదారులైన రామోజీరావు లాంటి వారు ఈ రంగంలో ప్రవేశించబోతున్నారు. ఇప్పటికే మీడియా ఈ రంగంలోకి చొరబడి పెద్ద ఎత్తున లాభాలు గడిస్తున్నది. బాబాలు ప్రత్యేక సామ్రాజ్యాలను నిర్మించుకుంటున్నారు. బహుశ విదేశీ ప్రత్యక్ష పెట్టుబడులు కూడా ఈ రంగంలోకి వచ్చే అవకాశాలు కనబడుతున్నాయి.

మరి జనాల్ని ఇలా హిందూ మత కుల విశ్వాసులకు వదిలి వెయ్యాల్సిందేనా? లేదా అంబేద్కర్, ఫ్యూర్‌బా లాంటి వారు ప్రతిపాదించిన మత మార్గం వైపు వారిని నడిపించాలా? అనేది ఒక సమస్యగా ముందుకు వస్తున్నది. ప్రస్తుత స్థితిలో రెండవ దానిని ఎంచుకోవడమే సరైంది అవుతుంది. ఇక మతం ఎందుకు మార్చుకోవాలనేదానికి చాలా కారణాలున్నాయి. ఇంతకు ముందే పేర్కొన్నట్లు హిందూ మతం సాంఘిక కుల అసమానతలను బోధిస్తున్నది. ఇది అభివృద్ధి, ఆధునికతను అడ్డుగా ఉండటమేకాక, సామాజిక మార్పును నిరోధిస్తున్నది. బహుజనులు ఐక్యం కాకుండా వారి మధ్య అనైక్యతను వారి నరనరాల్లో ఎక్కిస్తున్నది. దళితులను చంపమని శూద్ర కులాలను ఉసిగొల్పుతున్నది. పవిత్రమైన ఆవు మాంసం తినే వారిని చంపాలని నేటికి సన్యాసులతో కూడా

చెప్పిస్తున్నది. ఇక చరిత్రలోకి చూస్తే, శూద్ర రాజులైన రావణ బ్రహ్మ, బలి చక్రవర్తి లాంటి పరాక్రమవంతులు, యజ్ఞ సంస్కృతినీ, బ్రాహ్మణాధిపత్యాన్ని వ్యతిరేకించారనే నెపంతో అనేక కుట్రల, కుతంత్రాలతో విష్ణుమూర్తి అవతారాల ద్వారా వారిని చంపించింది. హిందూ పురాణ సాహిత్యం నుండి ఇలాంటి ఉదాహరణలు ఎన్నైనా తీసుకోవచ్చు. ఇలాంటి వాస్తవాలన్నింటినీ మరుగున పరిచి వారిని అజ్ఞానంలో ఉంచడం కోసమే హిందుత్వ వాదుల కోటి దీపోత్సవం, పుష్కరాలు, చండీయాగాలు చేస్తున్నారు. ఇలాంటి కుట్రల్ని గ్రహించిన అంబేద్కర్ హిందూ మతం నుండి బహుజనులు బయటపకుండా వారి విముక్తి సాధ్యపడదనీ, నేను హిందువుగా పుట్టినా హిందువుగా మరణించనని బౌద్ధ మతాన్ని స్వీకరించి బహుజనులకు ఒక దారిని చూపించాడు. కానీ బహుజనులు దీన్ని సీరియస్‌గా తీసుకోవడంలేదు. అందుకనే ఇక్కడ బహుజన ప్రవక్త గురించి, వారి బోధన గురించి మరోసారి స్థూలంగా పరిశీలించాల్సి వస్తున్నది. ఇందులో మొదటి ప్రవక్త బుద్ధుడు. ఈయన వైదిక యజ్ఞ సంస్కృతి, హింసకు వ్యతిరేకంగా శాంతి, సహజీవనాన్ని, మానవత్వాన్ని, సమానత్వాన్ని ప్రతిపాదిస్తూ, తన బోధనలు కొనసాగించాడు. అందుకోసం రాజ్యాన్ని, భార్యా బిడ్డల్ని వదులుకొని సర్వసంగ పరిత్యాగిగా మారిపోయాడు. ఈవిధంగా హిందూమతం బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులు వంటి దోపిడీ కులాలు హితాన్ని కోరుతున్నదానికి భిన్నంగా, బుద్ధుడు శ్రామిక బహుజన వర్గాల హితాన్ని కోరుతాడు. ఇక్కడ నుండే "బహుజన హితయా, బహుజన సుఖాయా" అనే సూత్రాన్ని వెలుగులోకి తెచ్చాడు. ఇది గొప్ప సాంఘిక విప్లవానికి నాంది పలికింది.

ఈ విప్లవానికి వ్యతిరేకంగా బ్రాహ్మణ రాజైన పుశ్యమిత్ర శ్రుంగుడి నాయకత్వంలో ప్రతీఘాత విప్లవం జరిగింది. ఈ ప్రతీఘాత విప్లవంలో భాగంగానే రామాయణ, మహాభారతాలు పుట్టుకొచ్చాయి. వీటిలో వర్ణధర్మ రక్షణ పేరు మీద వేదాలు చదివాడని శంభూకున్ని రాముడు చంపడం, గుణకర్మ లక్షణాలను బట్టే కులాలను సృష్టించినానని శ్రీకృష్ణునితో చెప్పించటం కనబడుతుంది. ఈ స్థితి ఆది శంకరాచార్య వరకు అప్రతిహతంగా కొనసాగింది. దీనికి వ్యతిరేకంగా పూలే, దశావతారాలు దేవుని అవతరాలు కావని అంటాడు. అవి ఈ దేశ మూలవాసులపై వివిధ దశల్లో, వివిధ రూపాల్లో జరిపిన ఆర్యుల దండయాత్రలని, ఆ అవతారాల వెనుక దాగిన కుట్రల్ని "గులాంగిరి" ద్వారా బహిర్గతం చేస్తాడు. బహుజనులు హిందూ మత బానిసత్వంలో ఉండిపోవడానికి కారణం వారికి చదువు లేకపోవడమేనని గ్రహించి తన భార్యకు చదువు నేర్పించి, మొదటి మహిళా ఉపాధ్యాయురాలిగా మారుస్తాడు. ఈ విధంగా పూలే తన భార్యని సంఘ సంస్కర్తగా మారుస్తాడు. ఇక మూడో ప్రవక్త అంబేద్కర్. ఈయన అతిశూద్ర వర్గమైన అంటరాని కులంలో నుంచి వచ్చాడు. అంటరానివారనే వర్గం ప్రపంచంలో ఎక్కడ లేదు. ఇది హిందూ మత వికృత సృష్టి. గాంధీ వీరిని హరిజనులు (దేవుని బిడ్డలు) అనే పేరు పెడితే, హిందువులు మాత్రం అంటరానివారిపై దాడులు, హత్యలు నేటికీ చేస్తూనే ఉన్నారు. ఇలాంటి అన్యాయాలకు వ్యతిరేకంగా అవతరించిన అంబేద్కర్ చిన్ననాటి నుండే అవమానాలను భరిస్తూ, అధిగమిస్తూ, ఉన్నత విద్యను అభ్యసిస్తూ, తన జాతిపై జరుగుతున్న వివక్షపై ప్రజాస్వామ్యబద్ధంగా తిరుగుబాటు చేస్తూ, విముక్తి ఎలా సాధించగలమో నిరూపిస్తూ, అందుకు కావాల్సిన రాజకీయ, ఆర్థిక కార్యాచరణను 'కుల నిర్మూలన', 'భారత రాజ్యాంగం', 'రిపబ్లికన్ పార్టీ మ్యానిఫెస్టో' ద్వారా విముక్తికి దారులు చూపాడు. ఆఖరికి సమానత్వం ప్రాతిపదిక గల బౌద్ధాన్ని స్వీకరించి బుద్ధుని ఆధునిక అవతారంగా నిలిచాడు. ఈ విధంగా బుద్ధుడు, పూలే, అంబేద్కర్ బహుజన హితాన్ని, విముక్తిని కోరుకున్న ప్రవక్తలు. ఇక వారిలో ఉన్న ఉమ్మడి లక్షణాలను పరిశీలిస్తే, వైదిక విధ్వంస యజ్ఞ సంస్కృతిని వ్యతిరేకించడంతో పాటు, అసమాన కుల వ్యవస్థను వ్యతిరేకించడం. అలాగే అందరికీ సమాన హక్కులు కావాలని కోరుకోవటం. అందుకోసం ఆయుధాలు ధరించకుండా ప్రజాస్వామిక పద్ధతిలో పనిచేయడం. నిజంగా ఇలాంటి ఉదాత్త లక్షణాలు ఉన్నవారే దేవుళ్లు అవుతారు. ఇవే బహుజన ప్రవక్త విశిష్టతలు.

నేటి సామాజిక మార్పుకు ఈ ప్రవక్త బోధనలు, మార్గాలు చాలా అవసరం. అంతేకానీ దోపిడీ రక్షణ కోసం దేవుళ్లుగా సృష్టించబడిన వారు బ్రాహ్మణుల రక్షణ కోసం బహుజనుల్ని చంపేవారిని దేవుళ్లుగా కొలవడం అంటే బహుజనులు తమ నెత్తిన తామే మట్టి పోసుకోవటం అవుతుంది. కాబట్టే తమ విముక్తి ప్రధాతలయిన బుద్ధుడు, పూలే, అంబేద్కర్ మార్గాన్ని బహుజనులు అనుసరించాలి. ఈ బహుజనుల మతంలో బుద్ధున్ని 'దమ్మ సూత్రాలు', పూలే 'గులాంగిరి' అంబేద్కర్ 'రాముని కృష్ణుని రహస్యాలు', 'కుల నిర్మూలన' వంటి గ్రంథాలలోని అంశాలు బోధించబడాలి. అందుకోసం కుల పాటింపు లేని ఉమ్మడి బోధనల ప్రాంగణాల నిర్మాణం జరగాలి. ప్రత్యామ్నాయ సంస్కృతిని ఇక్కడి నుండే నిర్మించుకోవాలి. ఇలాంటి ప్రజాస్వామిక మత విధానం బహుజన విముక్తికి, అభ్యుదయానికి, మార్పుకు సంకేతంగా ఉంటుందని వేరే చెప్పనవసరం లేదు. ఇటీవల లాటిన్ అమెరికన్ దేశాల్లో క్రైస్తవం ఇలాంటి అభ్యుదయకరమైన ఉద్యమ పాత్రను పోషిస్తున్నది. ఈ దేశాల్లో నూతన వామపక్ష ప్రభుత్వాలు ఏర్పాటుకావటం వెనక క్రైస్తవ ఉద్యమ ప్రభావం ఉంది. ప్రస్తుత పోప్ సెయింట్ ప్రావిన్స్ ప్రజల సమాన హక్కుల కోసం పనిచేస్తున్న మత ఉద్యమాల నుంచే వచ్చాడు. శ్రీ నారాయణ గురు మతాన్ని సామాజిక మార్పుకు సాధనంగా ఉపయోగించి కేరళలోని కింది కులాల్లో విద్యా వ్యాప్తికి, మానవాభివృద్ధికి పునాది వేసిన అనుభవం ఉండనే ఉంది. కాబట్టి బుద్ధుడు, పూలే, అంబేద్కర్ ప్రవక్తలు బోధించిన ప్రజాస్వామిక మతాన్ని బహుజనులు అవలంభించి తమ విముక్తికి బాటలు వేసుకోవాల్సి ఉంది.

*(రచయిత సామాజిక న్యాయ ప్రచార వేదిక కన్వీనర్)* వీ

***పాఠకులు ఫిర్యాదులు, సమాచారం కోసం కార్యాలయానికి పనిదినాల్లో ఉదయం 10:30 నుండి సాయంత్రం 6.00 గంటలలోగా స్వయంగా లేదా ఫోన్ ద్వారా సంప్రదించవచ్చు. మిగతా సమయాల్లో ఫోన్ చేస్తే అది ఫ్యాక్స్‌లోకి వెళ్లి మీకు జవాబు రాదు. అప్పుడు మీరు ఫోన్ ఎత్తికూడా మాట్లడదంలేదని అనుకునే అవకాశం ఉంది. ఇది గమనించగలరు.***

# భావ విప్లవకారుడు బంకుపల్లి మల్లయ్య శాస్త్రి

**- విద్యాభూషణ్**

'ఇతిహాసపు చీకటి కోణం
అట్టడుగున పడి కన్పించని
కథలన్నీ కావాలిప్పుడు
దాచేస్తే దాగని సత్యం'

అని అన్నాడు మహాకవి శ్రీశ్రీ... ఆ మహాకవి ఇలా పేర్కొన్నది మల్లయ్య శాస్త్రి జీవన కాలంలోనే అయినా, ఆ దాగని సత్యాన్ని వెలికి తీసింది ఇలీవలనే. ఆ వెలికితీసిన సాహసికుడు మిత్రుడు ముత్యం. ఆయన తీసినందువల్లనే ఈ రెండు వాక్యాలు రాసే అవకాశం కలిగింది నాకు. కీర్తి శేషులు మల్లయ్య శాస్త్రి తిరుగాడిన ఉత్తరాంధ్ర ప్రాంతానికి చెందిన వాడనే అయినా, ముత్యం తెలియజెప్పేంత వరకూ ఆయన గురించి తెలియదు నాకు. నాకే కాదు ఆ ప్రాంతీయుల్లో చాలా మందికి మల్లయ్య శాస్త్రి చరిత్ర తెలీదు అతిశయోక్తి ఎంతమాత్రమూ కాదు. తెలంగాణ ప్రాంతీయుడైన ముత్యం మరుగున పడిపోయిన ఈ ఇతిహాసాన్ని వెలికితీశాడు. మరో వీరేశలింగం వంటి మహత్తర సంఘ సంస్కర్త మల్లయ్య శాస్త్రి కృషిని ఓ దృశ్యంగా, 'స్వాతంత్రోద్యమ కాలపు సంస్కర్త బంకుపల్లి మల్లయ్య శాస్త్రి జీవన దృశ్యం' పేరిట ఇదంతా ఎందుకు? దీని ప్రయోజనం ఏంటని ప్రశ్నించుకుంటే, సామాజిక మార్పును కోరుకోవడం ఎంత అభిలషణీయమో, ఆ మార్పు కోసం కృషి చేసిన మహనీయుల చరిత్రలను తెలుసుకోవడం సైతం అంతే అవసరం. ఆనాటి వారి కృషి, నిబద్ధత, అంకిత భావం వంటి విషయాలతో పాటు, వారి అనుభవాలు మనల్ని మనం అంచనా వేసుకునేందుకు, మన ఆచరణా లోపాలను సరిదిద్దుకోవడం కోసం దోహదపడగలవని నా నమ్మకం. ఇక మల్లయ్య శాస్త్రి జీవిత ఘట్టాలను తడిమితే...

మల్లయ్య శాస్త్రి 1876 – 1946 కాలానికి చెందినవారు. సత్స సంప్రదాయాన్ని పుణికి పుచ్చుకున్న కుటుంబం నుంచి వచ్చిన వారైనప్పటికీ, వారి దైనందిన సంప్రదాయాల్లో సైతం సంస్కరణలను కొరుకున్న వ్యక్తి. ఛాందస కుటుంబ వ్యవస్థ ఆయనకు మూలమైనప్పటికీ, ఆయనలో స్వతః సిద్ధంగా ఉన్న 'మానవతా వాదం' ఇందుకు పురిగొల్పింది. లక్ష్య సాధన కోసం ఆయన అయన అలవర్చుకున్న నిబద్ధత, ఆయనలో హేతువాదాన్ని అంకురింప చేసింది. ఆయన జీవిత అనుభవాలతో అది మరింతగా పదునెక్కింది.

సనాతన సంప్రదాయ చట్రంలో సంస్కృత వ్యాకరణ శాస్త్రాలను చదువుకుని, అలంకార శాస్త్రం, మంత్ర శాస్త్రం, జ్యోతిష్య శాస్త్రాలను అధ్యయనం చేశారు. వీటితో పాటే వారి సమకాలికులైన గిడుగు రామ్మూర్తి దగ్గర ఆంగ్లాన్ని అభ్యసించారు. గిడుగువారి శిష్యరికంలోనే వ్యవహారిక భాషోద్యమానికి అనుకూలురయ్యారు. ఇదే కాలంలో విజయనగర పండితులు కూరెళ్ల సూర్యనారాయణ శాస్త్రి దగ్గర తర్క శాస్త్రాన్ని అభ్యసించారు. పర్లాకిమిడి సంస్థాన సంగీత విద్వాంశుల వద్ద సంగీతం నేర్చుకున్నారు. అక్కడితో ఆగిపోకుండా సంస్కృతాంధ్ర నాటకాల్లో నటించారు. పలు నృత్య రూపకాలను రూపొందించారు. అనేక యక్షగానాలను, హరికథలను రచించి ప్రదర్శించారు. భాషా శాస్త్ర అధ్యాపకులుగా పనిచేశారు. ఇవన్నీ ఆయన ప్రతిభలైతే, సామాజిక రుగ్మతల పట్ల ఆయన స్పందన వారి చైతన్యాన్ని వ్యక్తం చేస్తుంది. సామాజిక రుగ్మతలను హేతువాద దృష్టితో పరిశీలించి, సమస్య మూలాల్లోకి వెళ్లి పరిష్కారాన్ని శోధించి మార్గదర్శకులైనారు ఆచరణ రిత్యా. భాషా శాస్త్రాలను హేతువాదిగా 'పునర్విమర్శ' చేసి సంస్కరణలను ప్రతిపాదించారు. కరుడు గట్టిన సనాతన కులంలో పుట్టినప్పటికీ, మానవతావాదిగా కులనిర్మూలనకై పాటుపడ్డారు. పలువురు అన్య కులస్థులను ఇంట్లో ఉంచుకుని విద్యాదానం చేశారు. తద్వారా 'అస్పృశ్యత'ను ఆమడ దూరం తరిమికొట్టారు. ఇమ్మిడి ముమ్మిడిగా బాల్య వివాహాలకు నెలవైన నాటి కాలంలో బాల్య వివాహాలను వ్యతిరేకించారు. బాల్య వివాహాలను వ్యతిరేకిస్తూ, తన భావనలను తనకే పరిమితి చేసుకోకుండా, వివిధ ప్రాంతాల్లో ఉపన్యాసాలిస్తూ ప్రచారం చేశారు. తన ఇంట్లోనే వారి అమ్మాయికి వితంతు వివాహాన్ని జరిపించి మార్గదర్శకంగా నిలిచారు. వారి పెద్దబ్బాయి వివాహానంతరం స్వాతంత్రోద్యమంలో పాల్గొని జైలు పాలైన కాలంలో వ్యక్తురాలైన కోడలికి పునర్వివాహం జరిపించిన ధీరోదాత్తుడు మల్లయ్య శాస్త్రి. ఎందుకంటే? అబ్బాయి జైలు నుంచి ఎప్పుడొస్తాడో తెలీదు. వచ్చినా మళ్లీ అరెస్టు కాడన్న నమ్మకం లేదు. ఈ కారణంగా కోడలిని ఇంట్లో పెట్టుకుని పనిపాట్లకు వినియోగించుకోవడం లసమంజసం అని భావించే, శ్రీమంతురాలైన వారి కోడలికి పునర్వివాహం ఆటంకం కాలేదు ఆనాడు కూడా! ఈ ప్రవాసనం అంతా స్వాతంత్రోద్యమ కాలం నాటిదే. అప్పటికే ఈ వితంతు వివాహం తొలి దశకు కందుకూరి వీరేశలింగం ప్రారంభించి ఉన్నారు. అంటే స్వాతంత్రోద్యమ కాలానికి ముందుగానే అన్నమాట. స్వాతంత్రోద్యమ కాలంలో మల్లయ్య శాస్త్రి చేపట్టిన వితంతు వివాహ ఉద్యమం పలు కుల సంఘాల మద్దతును సైతం పొందగలిగింది. ఇక్కడ ప్రధానంగా మనం గమనించాల్సింది, వీరేశలింగం నేతృత్వంలో స్వాతంత్రోద్యమ ముందు నాటి నుంచీ, తదనంతర స్వాతంత్రోద్యమంలోనూ మల్లయ్య శాస్త్రి 'నిబద్ధత'తో కృషి చేసిన వైనం.

నాటి స్వాతంత్రోద్యమ కాలంలో సంస్కర్తల్లో ఉన్నవ లక్ష్మీనారాయణ మరో అగ్ర గణ్యులు. వీరి ఆచరణకు దీటుగా, వర్గాలకు అతీతంగా సర్వజన సమానత్వం కోసం పరితపించిన వ్యక్తిగా మల్లయ్య శాస్త్రి నిలిచారు. బ్రాహ్మణ్యాన్ని – సనాతనాన్ని, కాలానుగుణంగా 'మానవత'కు పట్టం గట్టి ప్రజాస్వామ్య యుతంగా ఆచరించారు. ఒక్కడ మనం గమనించాల్సింది, సనాతనాన్నే నమ్ముతూ, ఆచరనలో ఆధునికతను అన్వయించిన తీరును.

భాషా శాస్త్రవేత్తగా, మహోపన్యాసకుడిగా, జమిందారీ మర్యాద – మన్ననలను అనుభవిస్తూ, సుఖ జీవనానికి అలవాటుపడ్డప్పటికీ, 1930వ సంవత్సరంలో పెద్ద కొడుకు సూర్యనారాయణ శాస్త్రి జాతీయ నిరసనోద్యమంలో పాల్గొని అరెస్టు, జైలుపాలయినప్పటికీ ఆయన కొడుకును తప్పు పట్టలే. పర్లాకిమిడి జమీందారువారి భిన్న రాజకీయాల్లో

వీరున్నందువల్ల, వారి ఆగ్రహానికి గురై ఉన్న పళంగా పట్టణ బహిష్కరణకు బలైనప్పటికీ, ధైర్యాన్ని కోల్పోని 'స్థిత ప్రజ్ఞుడు' మల్లయ్య శాస్త్రి. ఆదర్శాన్ని తనవరకే పరిమితం చేసుకోక, కుటుంబ సభ్యులందరికీ ఆపాదించి ప్రోత్సహించిన ధీరోదాత్తుడాయన.

గిడుగు నేతృత్వంలో వ్యవహారిక భాషోద్యమానికి కట్టుబడి, ఆచరణలో ఆయన రచనలన్నింటినీ, వివాహతత్వం (సిద్ధాంత వ్యాసం) అస్పృశ్యత, జాతి వ్యవస్థ వంటి రచనల్లోనే కాకుండా కడకు వేదాల అనువాదాల్లోనూ వ్యవహారిక భాషనే ప్రయోగించిన కార్యశీలి మల్లయ్య శాస్త్రి. వీటిలో 'వివాహతత్వం' (సిద్ధాంత వ్యాసం) ప్రముఖమైంది. అనాది ఇతిహాసాల నుంచి వివాహ వ్యవస్థ పునాదులను పెకలించి, స్త్రీకి వ్యక్తురాలైన అనంతరం జరిగేదే 'వివాహం' అని సోదాహరణంగా సూత్రీకరించిన రచన ఇది. విమర్శకుల మన్ననలను సైతం పొందింది.

ఈ సంస్కరణోద్యమ భావాలకతీతంగా ఆయనో స్త్రీవాది. కరుడు గట్టిన నాటి పురుషాధిఖ్యత రోజుల్లోనే ఆయన, కుటుంబ యజమాని అంటే కుటుంబ పెద్దనే కాదు, కుటుంబ ప్రధాన సేవకుడు అని చెపుతూ ఆచరించారు. భార్యా కూతురు – కోడళ్లను ఆత్మీయంగా ఆధరించారు. కలవారి కుటుంబం నుంచి వచ్చిన భార్య వెంకట రత్నమ్మను, సనాతనం మాటున ఇంటికే పరిమితం చేయలేదాయన. ఆమెకూ స్వాతంత్రోద్యమం పట్ల మక్కువను పెంచారు. కాంగ్రెస్ మహిళా విభాగ సమావేశాల్లో, ప్రచారాల్లో పాల్గొనేలా ప్రోత్సహించారు. కుమార్తె కృష్ణవేణికి వితంతు వివాహం చేయించడమే కాకుండా, గిడుగు వారి వద్ద ఆంగ్లాన్ని నేర్చుకునే వెసులుబాటునూ కల్పించారు. పంచకావ్యాలను అధ్యయనం చేయించారు. ఆమెకు సంగీతాన్ని నేర్పించారు. వీణావాదంలో ఆమె సిద్ధహస్తురాలు. ఆమె, అన్న సూర్యనారాయణ శాస్త్రితో కలిసి వీణావాదనకు దిగితే, ఇరుగు – పొరుగులందరికీ వినోదాన్ని పంచేదట. వెంకటరత్నం గారు విస్తృతంగా పుస్తకాలను చదువుతుండేవారు. పుస్తకాలను చదవడమేకాదు, రచనా వ్యాసంగంలోనూ పాలు పంచుకున్నారామే. సంగ్రహ రామాయణం, జానకీ విజయం స్త్రీల వ్రత రత్నహారం, దమయంతీ స్వయంవరం, వచన భాగవతం అనే రచనలనూ చేశారు. అవన్నీ ప్రచురితమయ్యాయి కూడా.

నాటి రోజుల్లోనే మల్లయ్య శాస్త్రి సంపాదనను తీసుకొొచ్చి వెంకటరత్నం చేతికిచ్చి, 'ఏం చేసుకుంటావో నీ ఇష్టం' అని, ఆ సంగతి మరిచిపోయేవారు. ఇంటి నిర్వాహణా బాధ్యతంతా ఆమెదే. వారి సంతానం ఏడుగురైతే, ఇంట్లో ఉండి చదువుకుంటున్న శిష్యులు మరో నలుగురు. ఇంటి నిండా పరివారమే పూటకు పదిహేను – ఇరవై విస్తళ్లు. ఎవరికీ ఏ లోటు రాకుండా నిర్వహించేవారు వెంకటరత్నమ్మ.

వెంకటరత్నమ్మ – మల్లయ్య శాస్త్రి అన్యోన్న దంపతులు. ఇంటా – బైటా ఒకటే మాట వారిరువురిది. ఇద్దరూ కూతుళ్లను నెత్తిన పెట్టుకుంటే కొడుకులను భుజాల మీద మోశారట. చివరకు మల్లయ్య శాస్త్రి కాశీయాత్రకు వెళ్లేందుకు అవకాశం వచ్చినప్పుడు ఆయనెంత వద్దన్నా వినకుండా, వెంకటరత్నమ్మ వెన్నంటి వెళ్లారు. ఆ కాశీయాత్ర తిరుగు ప్రయాణంలోనే (1946 సెప్టెంబర్) మార్గ మధ్యమంలో ఖరగ్‌పూర్‌లో మల్లయ్య శాస్త్రి అస్తమించడం అత్యంత విషాదం. ఇలా ఆయన సుఖంలోనూ, సంతోషంలోనూ, చివరి క్షణాల్లోనూ వెన్నంటి పాలుపంచుకున్న అసలైన అర్ధాంగిగా వెంకటరత్నం నిలిచారన్నది అక్షర సత్యం.

ఇంతటి నిబద్ధతాయుతుని గాథను, చరిత్ర, ఓ చీకటి కోణంలో మరుగున పడేస్తే, పరిశోధక మిత్రుడు ముత్యం దాన్నీ విధంగా వెలుగులోకి తీసుకురావడం ముదావహం... సామాజిక మార్పుకై 'ఆచరణ' ఏ విధంగా కొలమానం అన్న నేటి సందిగ్ధ కాలంలో ఈ తరహా ఆచరణాత్మక కావ్యాలు – చరిత్రలు అవసరం – అనివార్యం. ఎందుకంటే ఇవన్నీ దాచేస్తే దాగేవి కావు! ఏమైనా ఓ మహోన్నతుని చరిత్రను మనకందించిన మిత్రుడు ముత్యం కృషికి అభినందనలు!!

*(రచయిత పాత్రికేయులు)*

వీ

*(... 4వ పేజీ తరువాయి)*

*విచారమూ లేదు. కేవలం ఖాళీ తనం నిండి ఉంది. నా గురించేమీ పట్టని నిర్వికార స్థితి. అదే చాలా బాధాకరం అందుకే ఈ పని చేస్తున్నాను. నా కోసం కన్నీళ్లు కార్చకండి. జీవించడం కన్నా మరణించడంలోనే నా సంతోషం ఉందని అర్థం చేసుకోండి అంటాడు? 5) చివరిగా నా ఈ ఆత్మహత్యకు ఎవరూ కారణం కాదు. ఈ పని చేయమని నన్నెవరూ పురికొల్పలేదు. ఇది నా నిర్ణయం. నేనే బాధ్యుణ్ణి. నేను వెళ్లిపోయాక నా స్నేహితుల్ని గానీ, శత్రువుల్ని గానీ ఇబ్బంది పెట్టవద్దు అంటాడు. ఆఖరి సమయంలో వాడే ఈ మాటలు ఇది ఖర్మ సిద్ధాంతులు వాడే విరక్తి పూర్వక భావవాద గుణాలకు సంబంధించిన మాటలు. ఈ ఆఖరి లేఖలో తన శత్రువుల్ని కూడా ఇబ్బంది పెట్టవద్దనడం క్రైస్తవ మత భావాలకి దగ్గరవి. దీని వలన అతని కోరికకి భిన్నంగా ఉద్యమిస్తున్నారనీ అతని మరణానికి ఇతరుల్ని కారణంగా చూపడం, కేవలం రభసకోసమో, రాజకీయంకోసమో, స్వప్రయోజనాలకోసమో గొడవ చేస్తున్నారనీ, సంఘ్‌పరివార శక్తులు దుష్ప్రచారానికి దిగేందుకు వీలుకల్పించాయి ఈ రాతలు. సరే అంత మాత్రాన వ్యవస్థ దుర్మార్గాన్ని కప్పిపుచ్చలేదు కానీ, అటువంటి రాత మత భావనలు గల వ్యక్తులు రాసినట్టుగా కనిపిస్తాయి గానీ ఒక విజ్ఞాన శాస్త్ర విద్యార్థి రాసినట్లుండవు. అలా ఉండకపోవడానికి కారణం రోహిత్‌కి మార్క్సిజం సిద్ధాంతంపై అవగాహన లేకపోవడమూ–కేవలం అంబేద్కరిజంపై మాత్రమే అవగాహన కలిగి ఉండడం దానికి తోడు బహుశా క్రైస్తవంతో కూడా సాన్నిహిత్యం ఉండడం వలన కావచ్చునేమో? కానీ, అతనికి సైన్స్‌తోనే గాక, మార్క్సిజంతో కూడా అవగాహన ఉంటే ఇలా మనకి దూరం అవకపోయేవాడేమో? ననే బాధతోనే రాస్తున్నాను తప్ప అన్యథా కాదు. మార్క్సిజం తెలిసిన వారు ఒకింత ఇలా ఆత్మహత్యకి లోబడరు. వారు పోరాటానికీ పరిష్కారానికీ ఆలోచించి ప్రాణం పట్లా జీవితం పట్లా ఈ సామాజిక దుర్లక్షణాల పట్లా ఒక ప్రత్యేక ఆలోచనా శక్తితో కడవరకూ దీనితో పోరాడడానికి ఓడిపోతే ఆ పోరాటంలో మరణించడానికే సిద్ధపడతాడేగానీ ఇలా బలవన్మరణానికి పాల్పడరనీ కమ్యూనిస్టు అమరవీరులు మనకు సాక్షులుగా ఉన్నారన్నది నా అభిప్రాయం. దౌర్భాగ్యులూ, మనవాధులూ, మూఢులూ, మతోన్మాదుల కుటిలత్వానికి బలైపోయిన రోహిత్‌ని దోషిని చెయ్యాలని కాదు నా అభిప్రాయం. ఏ సిద్ధాంతం ఏమి బోధించినా మార్క్సిజం మాత్రం శత్రువుతో పోరాడి సమరంలో మరణించుగానీ నీకుగా నువ్వు ప్రాణాలు తీసుకొమ్మనే బలహీన భావాల్ని ప్రేరేపించదు. ఇతర సిద్ధాంతాలు అలా ప్రేరేపిస్తాయనే ఆరోపణ కాదు. మార్క్సిస్టైపుడూ యూధనేషియా సౌకర్యం కల్పించమనీ, సోడియం అజైడ్ ఇప్పించమనీ నీచుల్ని కోరి తను చావడు. వారికి మరింత సంతోషాన్నీ సౌకర్యాన్నీ తనే కోరి కల్పించే అనౌచిత్యానికి దిగడు అన్నదే నా ఆవేదన*

**– బి.ఎ. నారాయణరావు,**

విశాఖపట్నం

వీ



భారత ప్రభుత్వ సమాచార
ప్రసారాల మంత్రిత్వ శాఖ




## మంచి ప్రమాణాలు గల విద్య
- స్వచ్ఛ విద్యాలయ – 4.2 లక్షల కొత్త పాఠశాలలకు మరుగుదొడ్ల నిర్మాణం
- నేషనల్ స్కాలర్‌షిప్ పోర్టల్ – 95 లక్షల దరఖాస్తుల స్వీకారం
- స్వయం–ఐఐటీలు, ఐఐఎంలు అభివృద్ధి చేసిన ఉచిత ఆన్‌లైన్ కోర్సుల జాతీయ వేదిక

## కార్యసాధకమైన నైపుణ్యాలు
- ప్రధాన మంత్రి కౌశల్ వికాస్ యోజన – ఫలితాలు సాధించదగిన నైపుణ్యాలు లభించేటట్లు శిక్షణ ఇవ్వడం
- దీన్ దయాళ్ ఉపాధ్యాయ్ గ్రామీణ్ కౌశల్య యోజన – 1.75 లక్షల పల్లె ప్రాంతాల పేదలకు ఎటువంటి ఖర్చు లేకుండా శిక్షణ ఇచ్చారు
- అకడమిక్ ఈక్విలెన్స్ టు ఒకేషనల్ ఎడ్యుకేషన్

## ఆర్థిక సాధికారిత
- 20 కోట్ల బ్యాంకు ఖాతాల ప్రారంభం, వాటిలో రు. 30,600 కోట్ల డిపాజిట్లు–ప్రధాన మంత్రి జన్‌ధన్ యోజన
- పదిలమైన భవిష్యత్‌కోసం 12.5 కోట్ల భీమా, పింఛన్ పథకాలు–ప్రధాన మంత్రి సురక్ష భీమా యోజన, ప్రధాన మంత్రి జీవన్‌జ్యోతి భీమా యోజన, అటల్ పెన్షన్ యోజన
- 2.2 కోట్లకు పైగా చిన్న ఔత్సాహిక పారిశ్రామిక వేత్తలకు రు. 85,000 కోట్లకు పైగా బ్యాంకు రుణాలు–ముద్ర

## రైతుల శ్రేయస్సు
- ఇంతకుముందు ఎన్నడూ లేనంత తక్కువ ప్రీమియం రేటుకు ప్రభుత్వం నుంచి పూర్తి రక్షణ ఇచ్చే అతి పెద్ద పంట బీమా సాయం పథకం – ప్రధాన మంత్రి ఫసల్ బీమా యోజన
- సేద్యపు నీటి ప్రాజెక్టులు, వాటర్‌షెడ్ డెవలప్‌మెంట్, సూక్ష్మ సేద్యం – ప్రధాన మంత్రి కృషి సించాయీ యోజన
- సాయిల్ హెల్త్ కార్డులు, కిసాన్ టివి, యూరియాకు వేప పూత, నేషనల్ అగ్రికల్చర్ మార్కెట్, పరంపరాగత్ కృషి వికాస్ యోజన, బ్లూ రివెల్యూషన్, రాష్ట్రీయ గోకుల్ మిషన్ వంటి అనేక ఇతర కార్యక్రమాలు

## గరిష్ట స్థాయి పాలన
- బొగ్గు బ్లాకుల వేలం పాటల ద్వారా రు. 3.35 లక్షల కోట్లు, టెలికాం వేలం పాటల ద్వారా రు. 1.09 లక్షల కోట్లు
- పౌరులకు వారి సొంత దస్తావేజుల తనిఖీకి స్వయం ధ్రువీకరణ అధికారం, దీంతోపాటు సీనియర్ సిటిజన్‌లకు పింఛన్ కోసం డిజిటల్ సర్టిఫికెట్లు (జీవన్ ప్రమాణ్)
- పనికిరాని చట్టాల రద్దు –125 చట్టాల రద్దు, తుది పరిశీలనలో మరో 1000 చట్టాల రద్దు
- ప్రపంచంలో కెల్లా అతిపెద్ద ప్రత్యక్ష ప్రయోజనం బదలాయింపు పథకం, ఎల్‌పిజి సబ్సిడీని వినియోగదారు బ్యాంకు ఖాతాలో నేరుగా జమచేయడం ద్వారా అన్ని రకాల లీకేజీలకు తాళం–పహల్
- బిపిఎల్ కుటుంబాలకు ఎటువంటి ఖర్చు లేకుండా 50 లక్షల కొత్త ఎల్‌పిజి కనెక్షన్లు, స్వచ్ఛందంగా వదులుకున్న 65 లక్షల మంది వినియోగదారులు – గివ్ బ్యాక్, గివ్ ఇట్ అప్

## సమగ్రమైన ఆరోగ్య సంరక్షణ
- జన్ ఔషధీ స్కీమ్ – ఒక సంవత్సరంలో 3,000 షాపులలో తక్కువ ఖర్చు, నాణ్యతతో కూడిన, జనెరిక్ మందులు
- మిషన్ ఇంద్ర ధనుష్ – 7 రకాల వ్యాధులు సోకకుండా 34 లక్షల మంది పిల్లలకు టీకాలు
- కాయకల్ప్ (ప్రభుత్వ ఆసుపత్రులలో శుభ్రత ఉద్యమం), స్వచ్ఛ భారత్

## పటిష్టమైన మౌలిక సదుపాయాల వ్యవస్థ
- 2019 కల్లా 300 గ్రామీణ సముదాయాల అభివృద్ధి – శ్యామ ప్రసాద్ ముఖర్జీ రూర్బన్ మిషన్
- 2014–15 లో 36,000 కిమీ రహదారుల నిర్మాణం – ప్రధాన మంత్రి గ్రామ్ సడక్ యోజన
- గ్రామీణ, పట్టణ ప్రాంతాలలో రోజూ 24 గంటలపాటు విద్యుత్ సరఫరాకు ఉద్దేశించిన రు. 1.09 లక్షల కోట్ల విలువైన పథకాలు
- స్మార్ట్ సిటీలు, అర్బన్ ట్రాన్స్‌ఫార్మేషన్ కోసం రు. 98,000 కోట్లతో కార్యక్రమాలు
- డిజిటల్ ఇండియా కార్యక్రమం కింద డిజిటల్ మౌలిక సదుపాయాల కల్పన కోసం 1.13 లక్షల కోట్లు

## ఉత్తేజపూరితమైన ఆర్థిక వ్యవస్థ
- ప్రపంచంలో అత్యంత వేగంగా వర్ధిల్లుతున్న భారీ ఆర్థిక వ్యవస్థ, ప్రపంచం చూపంతా దీనిపైనే
- మేక్ ఇన్ ఇండియా, ఈజ్ ఆఫ్ డూయింగ్ బిజినెస్, అటల్ ఇన్నోవేషన్ వంటి బహుళ కార్యక్రమాల అమలు ద్వారా అందరికీ ఉద్యోగం దిశగా పయనం
- ఇబ్బందులకు తావు ఇవ్వని నియంత్రణ విధానం, స్వయం ధ్రువీకరణ, సులభ నిష్క్రమణ, ఆదాయపు పన్ను, మూలధన లాభాల పన్ను నుంచి మినహాయింపు, పరపతి హామీ నిధి వంటి వేరు వేరు పథకాల ద్వారా స్టార్టప్‌లకు అనువైన వాతావరణం స్థాపన – స్టార్టప్ ఇండియా

## సబ్ కా వికాస్
- గ్రామీణ పేదల జీవనాధారం పెంపుదల లక్ష్యంగా దీన్ దయాళ్ అంత్యోదయ యోజన
- గిరిజన వర్గాల సమగ్ర అభివృద్ధికి వన్ బంధు కళ్యాణ్ యోజన
- సరికొత్త ప్రత్యేక పరపతి, వెంచర్ కేపిటల్ పథకాల ద్వారా దళిత ఔత్సాహిక పారిశ్రామిక వేత్తల అందుబాటులోకి ఆర్థిక సాయం
- అల్ప సంఖ్యాక వర్గాల నైపుణ్య అభివృద్ధి కార్యక్రమాలు–నయా మంజిల్, యుఎస్‌టిటిఎడి, ఎంఎఎన్ఎఎస్
- బేటీ బచావో బేటీ పఢావో (ఆడ పిల్ల పై పూర్తి శ్రద్ధ), సుకన్య సమృద్ధి యోజన (రు. 2,900 కోట్ల విలువైన అధిక వడ్డీ ఇచ్చే 80 లక్షల ఖాతాలు)
- ఇపిఎస్ కింద రు. 1,000 కనీస పింఛన్ వంటి కార్యక్రమాల ద్వారా శ్రమను గౌరవించడం, పోర్టబిలిటీ కోసం యూనివర్సల్ అకౌంట్ నెంబర్ – శ్రమయేవ్ జయతే



పురోగతిలో కొత్త అధ్యాయం



Interact with PM — NARENDRA MODI Prime Minister of India — www.pmindia.gov.in
Connect with PM — /narendramodi
News, Views & More — www.narendramodi.in
Share Ideas — mygov — www.mygov.in

22201/13/0067/1516

Advt

చర్చ

# రోహిత్ లేఖలు ఒక అవగాహన

- పి. రామకృష్ణ

ఫిబ్రవరి వీక్షణంలో 'రోహిత్ జీవితమూ, మరణమూ, సమాజానికి పాఠాలు' అన్న వ్యాసం ఇంతవరకూ రోహిత్ ఆత్మహత్యపై వచ్చిన వ్యాసాలన్నిటికన్న బావుందనిపించింది. ప్రతి ఆత్మహత్యకూ సామాజిక కారణాలతో ఆ వ్యక్తులకున్న సంబంధాలను బట్టీ, వాటిపట్ల ఆ వ్యక్తుల ప్రతిస్పందనలను బట్టీ మరికొన్ని అటోఇటో చేరే కారణాలూ ఉంటాయి. ఆ విషయాలన్నిటినీ ప్రస్తావించే ప్రత్యేక వ్యాసంగా వేణుగోపాల్ వ్యాసం పై నా ప్రతిస్పందనకే పరిమితమవుతాను.

రోహిత్ ఆత్మహత్యకు నెల రోజుల ముందు వైస్ ఛాన్సలర్‌కు రాసిన లేఖనూ, ఆత్మహత్య చేసుకునే ముందు రాసిన లేఖనూ పూర్తిగా ప్రచురించి మంచి పని చేశారు. అందువల్ల రోహిత్‌లో కలుగుతూ వచ్చిన పరిణామాలు అర్థం చేసుకోగలిగిన అవకాశం దొరికింది. అంటే రోహిత్ తన అనుభవాల కారణంగా ఏర్పడుతూ వచ్చిన నిర్ణయాలను మార్చుకుంటూ వచ్చాడనికాదు. అందులో మార్పులేదు. నెల రోజుల ముందు రాసిన లేఖలో తను సూచించిన దాన్ని...తోనే అమలు చేశాడు. 'నా వంటి విద్యార్థులకు యూథనేషియా సౌకర్యం కల్పించండి' అంటూ వైస్ ఛాన్సలర్‌ను కోరిన తన కోరికను తనే తీర్చుకున్నాడు. అది, రోహిత్ రోహిత్ కావడం వల్ల జరిగిందీ అంటే చాలావరకూ అది వ్యక్తిగత కారణాల వల్ల జరిగిందే. తనవంటి విద్యార్థులకూ, తనకు ఉండిన భేదం అది. అది మంచిదా, కాదా అన్న చర్చ వేరే, అది మనం జరిపే చర్చ మాత్రమే అవుతుంది.

ఆ చర్చలో రోహిత్‌కు సంబంధం లేదు. లేదా, చర్చను దాటిన నిర్ణయమై ఉంటుంది. 'జీవించడం కన్నా మరణించడంలోనే నా సంతోషంవుందని అర్థం చేసుకోండి' అంటే, ఏమని అర్థం చేసుకోవాలే? సహజంగానైతే, మరణించడంకన్నా, జీవించడంలోనే అనేటువంటిదైనా సంతోషం ఉండాలి. అలా లేదంటే, తలకిందులుగా ఉన్న సమాజంలో ఉన్నందువల్లే రోహిత్‌కు అలా కనిపించో, అనిపించో ఉండాలి. రోహిత్ అలాంటి విపరీత నిర్ణయానికి రావడానికి కారకురాలు ఈ వికృ సమాజమే. 'రోహిత్ మరణం విషాదకరమే అయినా అది వృథా కాలేదు. మన సమాజపు అవ్యవస్థను ఎత్తి చూపింది. సంఘపరివార్ దుర్మార్గాన్ని, అమానుషత్వాన్ని ఎత్తి చూపింది' అన్నారు వేణుగోపాల్. నిజానికి, మనం గ్రహించమలసినట్టు గ్రహిస్తే, ఏ సంఘటన వృథాకాదు. సంఘపరివార్ దుర్మార్గాన్ని ఎత్తిచూపే సంఘటనలు ఎన్నోఉన్నాయి. ఇంకెన్నో ఉండబోతాయి. దానికంటే, ఆ దుర్మార్గాలను అడ్డుకోవడానికి మనదగ్గరున్న మార్గాలేమిటి అన్న ఆలోచనే అవసరం.

వేణుగోపాల్ వ్యాసంలో ఆ ఆలోచనా ఉంది. అది ఇదిగో ఇలా...'రోహిత్ హత్యకు ముద్దాయిలుగా కాకపోయినా, ఆ విషాదాన్ని మౌనంగా ఆమోదించిన నేరాన్ని ప్రగతిశీల శక్తులు చేశాయనే అనాలి. మరణానంతరం వెలులవెత్తుతున్న స్పందన అంతకు మందునుంచీ ఉండవలసింది' అంతకు ముందునుంచీ ఉండవలసిన స్పందన లేకపోవడానికి కారణాలేమిటో ఆయన చెప్పలేదు. ప్రగతిశీల శక్తులకు అర్థం కొంత నైరూప్యంగా ఉన్నా ఉనికిలో ఉన్న అర్థతోనే చూద్దాం. ఆ ప్రగతిశీల శక్తులకు జరుగుతన్న దుర్మార్గాలను అడ్డుకునే శక్తి ఎందుకులేకపోయిందో, రోహిత్ తన ఆఖరి లేఖలో చెప్పాడని నేను అనుకుంటున్నాను. ఆ చివరి లేఖలో పదకొండు పంక్తుల్ని రోహిత్ కొట్టివేసి, తనేవాటిని కొట్టివేసినట్టు సంతకంచేసి చెప్పాడని వీక్షణంలో తెలియజేసింది. ఆ కొట్టివేసిన పంక్తుల్ని 'మరణానంతర వివాదంలో తవ్వితీసి ప్రచారంలో పెట్టారు' అని కూడా ఉంది. వేణుగోపాల్ వీక్షణం సంపాదకులు కనుక ఎవరు చెప్పినా ఒకటే. ఆ మాటల అర్థమేమిటి? రోమిత్ స్వయంగా కొట్టివేసిన పంక్తుల్ని తవ్వితీసి ప్రచారంలో పెట్టడంలో ఉన్న ఉద్దేశం ఆ సంస్థల్ని చెడుగా చూపాలన్నదే అవడం. రోహిత్ ఆ పంక్తుల్ని ఎందుకు కొట్టివేశాడో, కొట్టివేసిన వాటిని తవ్వితీసి ఎందుకు ఎవరు ప్రచారంలో పెట్టారో తెలీదు కానీ, ఆ కొట్టివేసిన పంక్తులే కొట్టి వేయడానికి వీల్లేని వాస్తవాలను చెప్పాయన్నది నా అభిప్రాయం. ప్రగతిశీల శక్తులలో అంతకుముందు నుంచీ (రోహిత్ మరణానికి ముందు నుంచీ) ఉండవలసిన స్పందన ఎందుకు లేకపోయిందో తన ఆఖరి లేఖలో రోహితే చెప్పాడు. ఆ భాగం ఇదిగో ఇదీ...

'ఎఎస్ఏ, ఎస్ఎఫ్ఐ ఏ సంస్థ అయినా అన్ని సంస్థలూ కూడ తమకోసం తాము ఉనికిలో ఉంటాయి. ఒక వ్యక్తి ప్రయోజనాలూ, ఈ సంస్థల ప్రయోజనాలూ ఎక్కువసార్లు సరిపడవు. సరిహద్దుల లోపలే అధికారం సంపాదించడం, ప్రముఖులు అవడం, ముఖ్యమైన వారుగా గుర్తింపు పొందడం. వ్యవస్థను మార్చబోతున్నామని ఆలోచించడం చాలా తరచుగా మనం మన చర్యలను అతిగా అంచనావేస్తాం. పైకి కనపడే లక్షణాలలో సంతృప్తిపడతాం'

ప్రగతిశీల శక్తులున్న ఏ సంస్థలయినా, సంఘమైనా ఈ పరిస్థితికి భిన్నంగా ఉందా? ఇద్దరు ముగ్గురు ప్రముఖులతో నడుస్తున్నవే కదా! ఆ ఇద్దరు ముగ్గురు వృద్ధులై ఓపికలేని స్థాయికొచ్చినప్పుడు, ఆ స్థానంలో ఇంకో ఇద్దరు ముగ్గురు వచ్చి వాళ్లూ ప్రముఖులు కావడమే కదా! వేదికల మీద కనిపించిన ఉత్సాహం చూసి అది మన ఉద్యమ ఫలితమేనని అతిగా అంచనా వేసుకోవడంలేదా? అన్ని సంఘాలు ఏదైనా దారుణం జరిగినప్పుడు చూపే తక్షణ స్పందన అంతా తమకోసం తాము ఉనికిలో ఉండాలన్న ఉద్దేశంతోనే కదా?

రోహిత్ మరణానంతరం వెల్లువెత్తుతున్న స్పందన అంతకుముందు నుంచే ఉండకపోవడానికి ఆ పరిస్థితి కారణమనుకుంటున్నాను. ప్రగతిశీల శక్తులు అటువంటి నేరం చేశాయన్నందుకూ, ప్రగతిశీలురుగా కనబడేవారిలో కూడా ఎదోమూలన కుల ద్వేషం ఉంటోందన్నందుకూ నేను ఆ వ్యాసం బావుందనుకుంటున్నది. ప్రగతి శీలురుగా కనబడేవారిలో కూడా ఎక్కడో కుల వివక్ష బావన పోవడం వల్లనే రోహిత్ వంటివారి మరణాన్ని ఆపలేకపోతున్నామంటే, అంత క్రియాశీలతతో పనిచేయలేక పోతున్నామంటే తప్పవుతుందా? అది. కొద్దిగానో గొప్పగానో క్రియాశీలం గా ఉన్నవారి మీద కూడా ఆరోపణలు చెయ్యడమూ, అవమానించడమూ అవుతుందా? సమాజం నేర్చుకోవలసిన పాఠంగానూ ఆత్మపరిశీలనలో చేర్చుకోవలసిన భాగంగానూ ఉండాలన్నదే ఉద్దేశం. వీ

చర్చ

# మాతృ భాషకి మరణ శాసనం!

- రాణి శివశంకర శర్మ

'ఆత్మకీ శరీరానికీ దూరం పెరిగిపోయింది' (రోహిత్) మాతృ భాష అటువంటి స్థితిలో కాదు. అసలు భాష అనేది ఎలా సాధ్యం? భాషనం ఎలా సాధ్యం?

మాతృ భాష దినోత్సవం వైభవంగా జరుపుకొంటున్న తరుణంలో తాత్వికుడూ, సున్నిత మనస్కుడూ, మహాకవిగా ఎదగగలిగిన ప్రతిభగల విద్యార్థి రోహిత్ ఆత్మహత్య చేసుకుని చనిపోయాడు. సూసైడ్ నోట్ రూపంలో కొన్ని ప్రశ్నల్ని మిగిల్చి పోయాడు. (హైదరాబాద్ సెంట్రల్ యూనివర్శిటీ విద్యార్థి రోహిత్.)

ఆ ప్రశ్నలు భగవద్గీతలో అర్జునుడు వేసిన ప్రశ్నలకన్నా సూటివైనవి. 'కసరి బుసగొట్టు నాతని గాలిసోక నాల్గు పడగల హైందవ నాగరాజు' అని గర్జించిన జాషువాకి ఆనాటి బ్రాహ్మణులు పాదానికి గండ పెండేరం తొడిగి తమ పాపం కడిగేసుకోవడానికి ప్రయత్నించారు. అందుకే ఇంత కాలం అమ్మనుడి బతికి బట్టకట్టింది.

కాని రోహిత్ లాంటి ప్రతిభావంతుడు చనిపోయాడని నయా బ్రాహ్మణులు ఆలోచించడం లేదు. అతడి కులం గురించి ఆరాతీస్తున్నారు. అందుకే రోహిత్ రాయనే రాశాడు. 'మనిషి విలువ అనేది ఓటుగా, నంబరుగా, వస్తువుగా, తక్షణ ఐడెంటిటీగా కుదించబడింది' (రోహిత్)

ఓటు ఓటుతో మాట్లాడగలదా? నెంబర్ నెంబర్‌తో మాట్లాడగలదా? వస్తువు వస్తువుతో మాట్లాడగలదా? మనం మనిషి అస్తిత్వాన్ని ఇంతగా దిగజార్చి ఘనీభవింపజేసి భాషని ఎలా నిలుపుకోగలం? పూర్తి వ్యాపారాత్మకమైపోతున్న విద్యలో అమ్మని కాని నుడిని కాని ఎలా వెతకగలం? అక్కడ మనకి దొకేవి శవాలే. కదిలేవీ, కదలనివీ అంతే తేడా.

ఐతే రోహిత్ ఇప్పటికే ఆత్మహత్య చేసుకున్న ఎందరో విద్యార్థుల గొంతుల్ని ఏకం చేసి ప్రశ్నల్ని సంధించిపోయాడు. ఆ ప్రశ్నల నుంచి దూరంగా పారిపోవడానికి బెల్లెట్ ట్రైన్ ఎక్కినా, అవి అంతకంటే వేగంగా దూసుకుపోయి దేశ రాజధానిని కూడా కదిలిస్తున్నాయి.

బెల్లెట్ ట్రైన్లు పరిగెత్తడం, ఆకాశ కుసుమాలు పూయించడం ఇలాంటి అభివృద్ధి గందరగోళంలో మనం కోల్పోయినదేమిటో రోహిత్ చెపనే చెప్పాడు.

'నేను జ్ఞానాన్నీ, నక్షత్రాలనీ, ప్రకృతినీ గాఢంగా ప్రేమించాను.' ప్రకృతికి పూర్తిగా దూరమైపోయారని తెలియక, మనుషుల్ని అనవసరంగా ప్రేమించాను' (రోహిత్)

ప్రకృతికి దూరమవడం అంటే మాతృ భాషకి దూరమవడమే. అసలు మనిషి మనిషితో కాదు. ప్రకృతితో జరిపిన సంవాదం ద్వారా భాష అభివృద్ధి చేందింది. రకరకాల వృత్తుల ద్వారా మనిషి ప్రకృతితో మాట్లాడుతూ వచ్చాడు. శ్రమ నుంచి మాటా పాటా పుట్టాయి. పురాణాలూ, దేవతలూ పుట్టారు.

కాని ఇప్పుడు మనిషికి ప్రకృతీ భాషా కూడా కేవలం తాత్కాలిక అవసరాలు మాత్రమే. అందుకే భాష కమ్యూనిషన్ స్కిల్‌గా వ్యవహరించబడుతోంది, దిగజార్చబడుతోంది. ఎంత మేధావి కాకపోతే, ఎంత హృదయ స్పందన కలవాడు కకాపోతే ప్రకృతితో మనిషికి బొడ్డు బంధం తెగిపోవడం గురించి ఇంతగా బాధపడ్తాడు రోహిత్. నిజానికి ఈ విద్యార్థి దగ్గర వీసీలూ, ఆచార్యులూ, రాజకీయ నాయకులూ జీవన పాఠాలు నేర్చుకోవాలి. భాష, భాషణం అలవరచుకోవాలి. ప్రకృతితో మనిషికి గల విడదీయరాని బంధం ఇతడి చివరి లేఖలో స్పష్టంగా కనపడుతుంది. మనుషులు, భాష కూడా యాంత్రీకరించబడుతున్న కాలంలో స్తబ్ధ జీవితంపై ఎక్కు పెట్టిన ఆగ్నేయాస్త్రం ఈ లేఖ.

ఫేస్‌బుక్, ఇంటర్నెట్ వాడకం పెరిగితే దేశం అభివృద్ధి చెందుతుందని పాలక వర్గాలు భావిస్తున్నాయి. వీటి వాడకం పెరిగాక పిల్లలు తప్పుల్లేకుండా రాయలేకపోతున్నారని, వర్ణక్రమం తప్పుల తడక అని, ఉచ్చారణ ఘోరమని క్వీన్ ఇంగ్లీష్ సొసైటీ, లండన్ బ్రాంచ్ అధ్యక్షుడు ఆచార్య బెర్నాల్డ్ లాంబ్ ఆవేదన వ్యక్తం చేశారు. ఈ కృత్రిమ ఆధునికత దెబ్బకి 7000 ప్రపంచ భాషల్లో 3000 ఇప్పటికే అంతరించి పోయాయి. (తెలుగే మన కంటి వెలుగు – ఎబికె ప్రసాద్)

చన పాలకులు రోహిత్ మరణం పట్ల చూపుతున్న ధోరణికి భాషా సాహిత్యాల మరణం కూడా కారణం కావచ్చు. పాతకాలం రాజకీయ నాయకులు భాషా సాహిత్యాలు, తత్వశాస్త్రం, చరిత్రలలో ప్రవేశం కలవారు, గొప్ప వక్తలు. నేటి రాజకీయ నాయకులు మతోద్రేకాన్ని రెచ్చగొట్టడం తప్ప మరేమీ తెలియని వారు.

దళిత కవి పైడి తెరేస్‌బాబు 'హిందూ మహా సముద్రం' అని ఒక కవిత రాశాడు. 'సముద్రంలో కలిసిపోవడం కన్న సిగ్గుచేటైన విషయం లేదు' అన్నాడు కవి ఇక్బాల్. మనం మన ప్రత్యేకతల్ని కోల్పోయి పాశ్చాత్య నాగరికతనూ, ఇంగ్లీష్ భాషలోనూ కరిగిపోతున్నాం. సామెతలూ, పొడుపు కథలూ, మాండలిక భాషా వైవిధ్యం అన్నీ కోల్పోతున్నాం. ప్రకృతిలో వైవిధ్యం ఎక్కువ. దాన్ని ఆధునిక వ్యవసాయం, ఆధునిక యంత్ర నాగరికత, ఆధునిక విద్య, ఆధునిక భాషా ప్రణాళిక దూరం చేస్తున్నాయి. ప్రకృతిని వికృతం చేస్తున్నాయి. రోహిత్ చివరి వేదనలో ఇది ముఖ్యం. హిందూ వాదులు 'స్వదేశీ' మంత్రం జపిస్తూనే, విదేశీ దాస్యంలోకి అందరి కంటే ఎక్కువగా కూరుకుపోయారు. ఇంక వారికి స్థానికత ఎక్కడిది? మాతృ భాషాభిమానం ఎక్కడిది.

మాతృ భాషాభిమానం ఉండాలంటే, ప్రజల జీవిత విధానాల్నీ, వాళ్ల వృత్తుల్నీ, వాళ్ల ఆహారపు అలవాట్లలోని వైవిధ్యాన్నీ గుర్తెరగాలి. అది హిందూ వాదుల కెక్కడిది? అందుకే సంస్కృతాన్నో, హిందీనో, ఇంగ్లిస్‌నో పట్టుకొన్ని వేళ్లాడతారు వాళ్లు. అగ్రకులాల వాళ్లు వలస పాలనా కాలం నుంచి ఇంగ్లిష్ భాషని అభ్యసిస్తూ క్రమేపీ మాతృభాషకి దూరమయ్యారు. ఈనాడు దళితులే తెలుగు కవిత్వానికీ, అమ్మనుడికీ ప్రాణం పోస్తున్నారు. దళిత కవి పైడి తెరేస్‌బాబు అమ్మ నాన్నలు మమ్మీ డాడీలుగా

మారిపోవడాన్ని గుర్తించి తీవ్ర వేదన చెందాడు. (నేనూ నా వింతలమారి ప్రపంచం) దళిత కవి మద్దూరి నగేష్‌బాబు అంటాడు. 'మీమీ నాలుకలు తెగ్గోసి విదేశీ ద్రోణునికి దక్షిణగా ఇచ్చేసి, దయచేసి మీరంతా మీమీ నాలుకలు లేని గొంతులు కలిపి ఒక యుఎస్ఎ అంతర్జాతీయ గీతం ఆలపించండి.' మద్దూరి నగేష్ చనిపోయి ఏ లోకంలో ఉన్నాడో నాకు తెలీదు. ఈ వాక్యాలు ఈనాటి మన భావ దాస్యానికి, భాషా దాస్యానికి అద్దం పడుతాయి. ఇప్పుడు కాల్ సెంటర్‌లలో మనం పేర్లు కూడా మార్చేసుకోవాల్సి వస్తోంది. రోహిత్ చనిపోతూ చనిపోతూ మనం ప్రాణం లేని అంకెలుగా మిగిలిపోయామనీ, సరుకులుగా మారిపోయామనీ అన్నదందుకే. నేను నగేష్‌బాబుతో గొంతు కలిపి 'అమెరికాకి వలస పోతున్న అగ్రహారమా మాడిపో' అని శాపం పెట్టింది అందుకే (ఊరూ వాడా సంకర కవిత)

ఆంగ్ల అగ్రహారాన్నే మేమూ ఫాలో అవుతామని కంచ ఐలయ్య లాంటి కొందరు బహుజన మేధావులు అనవచ్చుకాని, దళిత బహుజన కవులు విదేశీ ద్రోణున్ని అనుసరించేందుకు సిద్ధంగా లేరు. ఎందుకంటే ప్రకృతికీ, సహజత్వానికి దగ్గరగా ఉన్నది వాళ్లే. (గోరటి వెంటకన్న పాటలు మంది ఉదహరణ)

మనస్తత్వవేత్త 'యూంగ్' మనిషిలో కలెక్టివ్ అన్ కాన్సియస్‌నెస్ ఉంటుందంటాడు. మనవ జాతికి సంబంధించిన, విశ్వానికి సంబంధించిన ప్రాచీన స్మృతులన్నీ దానిలో నిక్షిప్తమై ఉంటాయి అంటాడు. శిశివు చత్ర నిద్రలో ప్రాచీన స్మృతులుచే చప్పుడు శ్రీశ్రీ.

ఈ ప్రాచీన స్మృతులన్నీ ప్రతీకలూ, సామెతలూ, నానుడులూ, జాతీయాలూ, కథలూ, పాటలూ వీటన్నింటి ద్వారా అమ్మనుడి రూపంలో మనిషికి అందుతాయి. తల్లి పాల లాంటిది అమ్మనుడి. అది లోపిస్తే అనారోగ్యమే. ఇతర భాషల్ని, సాహిత్యాల్ని కూడా దాని ద్వారా మాత్రమే అలవరచూకోగలం. అందుకే ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయ బృందం మాతృ భాషలో విద్యని అభ్యసించినవారే గణితంలో రాణిస్తున్నారని నిర్ధారించింది. (ఈనాడు – 2016 జనవరి 17).

గణితం అంటే వట్టి అంకెలు కాదు. ఆ అంకెల వెనుక గొప్ప వ్యూహాశక్తి అవసరం. ఉహాశక్తిని భాష మాత్రమే పెంచగలదు. భాష అంటే మాతృ భాసే. అక్కడే నీ ప్రాచీన స్మృతులు ఉన్నాయి. ఈ స్మృతులని నేటి ఆధునికత చెదరగొడుతుంది. విశ్వంతో, ప్రకృతితో, మానవజాతి పరంపరతో సంబంధాన్ని తెంచేస్తోంది. నేటి కృత్రిమ నాగరికత. ఫలితం హృదయంలో శూన్యం. ఈ శూన్యం మానసిక రుగ్మతకీ, ఒంటరితనానికీ, మరణానికీ చిరునామా. 'నా బాల్యపు ఒంటరితనం నుంచి నేను ఎప్పటికీ కోలుకోలేదు. నేను మృత్యువుకి చేరువవుతున్న ఈ క్షణంలో కూడా ఏమీ బాధపడడం లేదు. లోలోపల ఖాళీగా ఉన్నానంతే' (రోహిత్). ఇటువంటి ఖాళీతనం ఎందువల్ల ఏర్పడింది? ఈ అనుభూతిలేని తనం, ఈ మానసిక స్తబ్ధతకి మూలాలు ఎక్కడివి?

ఆధునిక నాగరికతలోనే ఆ మూలాలు ఉన్నాయి. మనిషి శ్రమ సరుకుగా మారడంలో ఉన్నాయి. మనిషి ప్రమేయం లేని శ్రమ విభజనలోనూ అతడి ఇష్టా నిష్టాలతో సంబంధం లేని పని సంస్కృతిలోనూ ఉన్నాయి. ఈ క్రమంలో మనిషి తనకి తానే పరాయిగా మారిపోన్నాడు అంటాడు కార్ల్ మార్క్స్.

స్మృతుల్ని శిథిలం చేస్తోంది నేటి నాగరికత. అది భాషా విచ్ఛిత్తికి దారితీస్తోంది. దీనిని భాష పరాయీకరణ అనవచ్చు. ఇది ఊహాశక్తిని జిజ్ఞసని చంపేస్తుంది. విద్యని యాంత్రిక చేయడం ద్వారా, మనిషిని సరుకు స్థాయికి దిగజారుస్తుంది. ఆంతరంగికంగా డొల్లతనాన్ని పెంచుతుంది. మనకి బలమైన మాతృ భాషానుబంధం ఉన్నప్పుడు ఇతర భాషలతోనూ సులభంగా సంబంధం ఏర్పర్చుకుంటాం. ఒక్కొక్క భాషకి ఒక్కో విధమైన సంస్కృతి ఉంటుంది. దానికనుగుణంగా మన పలుకుబడి ఉంటుంది. టిఎస్ ఇలియట్ 'వేస్ట్ ల్యాండ్'ని ఇలా అనువదిస్తాడు బైరాగి. 'ప్రపంచం ఇలాగే ఇలాగే ముగుస్తుంది. ఢణేల్మని కాదయ్యా, కిర్రుమని మూల్గుతూ.' ఢణేల్మని, కిర్రుమని అనే పదాలు తెలుగు ధ్వని అనుకరణలు మాత్రమే. దీంతో ఇంగ్లిష్ కవితా వాక్యాలు పూర్తి అచ్చ తెలుగు వాక్యాలుగా మారిపోయాయి.

అమ్మనుడిలో ఇమడని పదాలు ఎటువంటి అనుభూతినీ ఇవ్వకుండా మాతృ ప్రాయంగా మిగిలిపోతాయి. ఇందుకు ఉదాహరణ శ్రీశ్రీ కవితలోని 'సమిధ' అనే పదాన్ని 'పీస్ ఆఫ్ వుడ్' అని అనువదించారు వెల్చేరు నారాయణరావు. 'సమిధ' అనే పదంలోని యజ్ఞ సంబంధ సంస్కృతిని ఈ అనువాదం ప్రతిఫలించలేదని విమర్శ ఉచితమనదే కదా! (తమ్మినేని యదుకుల భూషణ్) అందుకే విశ్వనాథ సత్యమూర్తి అంటారు.

భాషలన్నియూ ఒకటి కాదు. ఏ భాషకాభాషయే. తలుపు, కుక్క కన్ను ఇట్టి శబ్దములు దైనందినమైన చర్యకు ఉపయోగపడు వస్తువులు మొదలైన వానినే చెపుతాయి. అది పెద్ద భాష కాదు. సంఘం, మతం, రాజకీయ విషయములు మొదలైన మానవ జీవితం లోతును తెలియజేమనో భావములు చెప్పునది నిజమైన భాష. కొన్ని శబ్దములు, కొన్ని వాక్యములు విస్పష్టములగా జాతుల భిన్న స్వరూపమును గోచరింపజేయును. (వేయి పడగలు).

ఇందుకు ఉదాహరణ చెపుతాడు. అతి విషాదకరమైన కథని చెప్పినప్పుడు కూడా కథ నచ్చితే ఇంగ్లిష్‌లో 'బ్యూటిఫుల్' అంటారు. కాని తెలుగులో ఎటువంటి పరిస్థితులోనూ అలా అనరు. 'అయ్యో పాపం' అంటారు. దృక్పథాలలో తేడా వల్ల విశ్వాసభేదం వల్ల వ్యక్తీకరణలో వైవిధ్యం సంభవిస్తుంది. దేవుడు అనే పదం పాశ్చాత్యులకీ మనకీ భిన్న అర్థాలని ఇస్తుందంటారు విశ్వనాథం.

ఆధునిక జీవిత విధానంతో పాటు భాషలలో ఉండే వైవిధ్యం నశించి ఏకరూపత మొదలైంది. ఇది వూహా శక్తిని కుంటుపరిచింది. దానితో విశాల దృక్పథం కరువైంది. వైవిధ్యం కరువవడంతో అందరినీ ఒకే నామవాచకంలోకి ఇమిడ్చేయాలన్న ఫాసిస్టు భావన పెరుగుతూ వచ్చింది. అందుకు 'హిందూ' అనేపదం అక్కరకు వచ్చింది. నిజానికి ప్రముఖ సంస్కృత పండితులు రాణి శ్రీనివాస శాస్త్రీగారు హిందే శబ్దం భారతీయం కాదంటూ 1986లోనే గ్రంథం రాశారు ప్రమాణాలు చూపారు. ఇప్పుడు స్థానికం కాని భాషే, స్థానికంగా మూలాలు లేని భాషా సంస్కృతులే. ప్రాచీన స్మృతల మైమరపే ఆధునిక నాగరికతకి అవసరం. ఇటువంటి కృత్రిమ ప్రపంచాన్నే నిరసిస్తూ వెళ్లిపోయాడు రోహిత్.

*'నేను ఈ దట్టమైన చీకటి నీడల నుంచి నక్షత్రాల వైపు ఎగిరిపోతాను' – రోహిత్*

వీ

### కాశీం పై కేసు భావ స్వేచ్ఛపై దాడే

విరసం కార్యవర్గ సభ్యుడు కాశీం పై కుట్ర, రాజద్రోహ నేరం కేసును వెనక్కి తీసుకోవాలని, అప్రజాస్వామిక ఉపా చట్టాన్ని రద్దు చేయాలని కోరుతూ హైదరాబాద్‌లోని సుందరయ్య విజ్ఞాన కేంద్రంలో జనవరి 29న విరసం ఆధ్వర్యంలో రౌండ్ టేబుల్ సమావేశం జరిగింది. ఈ సమావేశంలో కవి శివారెడ్డి మాట్లాడుతూ ఒక అధ్యాపకుడిపై కుట్ర కేసు నమోదు చేయడాన్ని ఖండిస్తున్నట్లు తెలిపారు. ముదిగంటి సుజాతరెడ్డి కాశీం పై కుట్రకేసు పెట్టడం అన్యాయం, అక్రమం అన్నారు. ఆంధ్రజ్యోతి సంపాదకులు కె. శ్రీనివాస్ మాట్లాడుతూ కాశీం వంటి విధి నిర్వహణలో పట్టుదలగా ఉండే వ్యక్తిపై కేసు పెట్టడం అందరికీ హెచ్చరిక వంటిదేనన్నారు. విసరం సభ్యులు వరవరరావు కాశీం టిఆర్ఎస్ కంటే ముందు నుంచే తెలంగాణ ఉద్యమంలో పనిచేస్తూ ప్రజలను చైతన్యపర్చారన్నారు. ఒక యాక్సిడెంట్ కేసును కుట్రకేసుగా మల్చడంలోనే కుట్ర దాగి ఉందన్నారు. ఈ సమావేశంలో వివిధ పత్రికల సంపాదకులు, కవులు, రచయితలు హాజరైనారు.

### కాపు గర్జన హింసాత్మకం

తూర్పుగోదావరి జిల్లా తునిలో జనవరి 31న చేపట్టిన కాపు ఐక్య గర్జన సభ హింసాత్మకంగా మారింది. కాపులను బిసిల్లో చేర్చాలని మాజీ మంత్రి ముద్రగడ్డ పద్మనాభం నాయకత్వంలో సభ జరిగింది. ఆ సభలోనే రైలు, రాస్తారోకోకు పిలుపునిచ్చారు. దీంతో సభకు వచ్చిన లక్షల ప్రజలు రైలు పట్టాలపై బైటాయించారు. ముద్రగడ్డ రాస్తారోకో చేశారు. ఆందోళనకారులు రత్నాచల్ ఎక్స్‌ప్రెస్‌లో 14 బోగీలకు నిప్పుపెట్టారు. 8 పోలీసు జీపులను తగులబెట్టారు. తుని రూరల్ పోలీస్ స్టేషన్‌కు నిప్పుపెట్టారు. ముద్రగడ్డ చలో తునికి ఇచ్చిన పిలుపులో భాగంగా ఉత్తరాంధ్ర, రాయలసీమ, గోదావరి జిల్లాల నుంచి సుమారు నాలుగు లక్షల మంది కాపు సామాజిక వర్గం వారు తునికి వచ్చారు.

### న్యాయస్థానంలో వెలివాడ

కరీంనగర్ జిల్లా కోర్టులో ఫిబ్రవరి 11న చుండూరు ఘటన పై తీర్పుచెప్పిన జస్టిస్ నరసింహారెడ్డి అంబేద్కర్ 125వ జయంతి సందర్భంగా మాట్లాడారు. ఈ సందర్భంలో దళిత న్యాయవాదులు బూడిద మల్లేశం, జనగామ నర్సింగు, కట్టెకోళ లక్ష్మణ్, నిశాని రామచంద్రంలు లేచి సార్... చుండూరు ఘటనలో అందరూ నిర్దోషులుగా తీర్పునిచ్చారు. మరి దోషులెవరు? చుండూరు ఘటనలో చనిపోయిన దళితుల శవాల సాక్షిగా దోషులెవరో చెప్పండని ప్రశ్నిస్తే ఈ నలుగురు న్యాయవాదులను బార్ అసోసియేషన్ ఎలాంటి నోటీసులు లేకుండా ఏడాది పాటు సస్పెండ్ చేసింది.

### జర్నలిస్టు అరుణ్‌సాగర్ మృతి

సీనియర్ జర్నలిస్టు, ప్రముఖ కవి అరుణ్‌సాగర్(49) ఫిబ్రవరి 12న మృతిచెందారు. ఆయన కొద్ది కాలంగా ఊపిరితిత్తులు, శ్వాసకోశ వ్యాధితో బాధపడుతూ అమీర్‌పేట్‌లోని ప్రైమ్ ఆస్పత్రిలో చికిత్సపొందుతూ మృతిచెందారు. ఆయన ఖమ్మం జిల్లా భద్రాచలంలో 1967 జనవరి 2న జన్మించారు. ఆంధ్రా యూనివర్సిటీలో ఎంఏ చేశారు. ఆయన జర్నలిస్టుగానే కాక మంచి కవిగా, రచయితగా పేరు తెచ్చుకున్నారు. ప్రస్తుతం ఆయన టివి5 సిఇఓగా పనిచేస్తున్నారు.

### తెలంగాణ విద్యావంతుల వేదిక సభలు

తెలంగాణ విద్యావంతుల వేదిక ఆధ్వర్యంలో రంగారెడ్డి జిల్లా అనంతగిరిలో ఫిబ్రవరి 13, 14 తేదీల్లో 'అనంతగిరి అవలోకనం' సదస్సు నిర్వహించారు. పోరాడి సాధించుకున్న తెలంగాణాని ప్రజాస్వామిక తెలంగాణగా ముందుకు తీసుకెళ్లేందుకు ప్రజల భాగస్వామ్యంతో మరో ఉద్యమానికి సిద్ధం కావాలని ప్రొ. కోదండరామ్ అన్నారు. ప్రజలందరికి సమాన అవకాశాలు అందేలా పోరాడాలని అన్నారు. మల్లేపల్లి లక్ష్మయ్య రాష్ట్రాన్ని రైతు ఆత్మహత్యలు లేని తెలంగాణగా, ప్రగతి తెలంగాణగా, అభివృద్ధి ప్రజాస్వామ్య తెలంగాణగా చూడాలన్నదే వేదిక ప్రయత్నమన్నారు. వేదిక రాష్ట్ర అధ్యక్షుడు గురజాల రవీందర్ తెలంగాణ ఉద్యమ ప్రస్థానంలో మరో ఉదయం కోసం వేదిక సన్నద్ధమైందన్నారు.

### ప్రజాస్వామ్య రచయిత్రుల వేదిక సభలు

ప్రజాస్వామిక రచయిత్రుల వేదిక మూడవ మహాసభలు ఫిబ్రవరి 13,14 తేదీల్లో హైదరాబాద్‌లోని ఉస్మానియా యూనివర్సిటీలోని ఆంధ్ర మహిళా సభ క్యాంపస్‌లో జరిగాయి. ఇండియన్ కౌన్సిల్ ఆఫ్ సోషల్ సైన్స్ సంస్థ సహకారంతో 'సహన, అసహన భావాలు–చారిత్రక, సామాజిక, సాంస్కృతిక పరిణామాలు–ప్రభావాలు' అనే అంశంపై జాతీయ సదస్సు నిర్వహించారు. సామాజిక రాజకీయ మానవ సబంధాలలో సహనం పాత్ర, దాన్ని చారిత్రక కోణం నుంచి ఆలోచించడం, ఇలాంటి వాతావరణంలో ప్రజాస్వామిక విలువలను అభివృద్ధిచేసే మార్గాల అన్వేషణకు ఈ సదస్సు ఒక సందర్భమయిందని పలువురు వక్తలు అభిప్రాయపడ్డారు.

### జర్నలిస్టుల పై దాడులను వ్యతిరేకిస్తూ నిరసన

వరంగల్ జిల్లా సమ్మక్క సారలమ్మ జాతరలో సీనియర్ పాత్రికేయులు పాశం యాదగిరిపై దాడికి పాల్పడ్డ ఐపిఎస్ అధికారిని సస్పెండ్ చేసి విచారణ జరిపించాలని జర్నలిస్టు సంఘాలు కోరాయి. ప్రెస్‌క్లబ్ ఆఫ్ హైదరాబాద్ ఆధ్వర్యంలో జర్నలిస్టులపై దాడికి నిరసనగా సమావేశం నిర్వహించి, ప్రెస్‌క్లబ్ వద్ద ర్యాలీ నిర్వహించారు. ఫిబ్రవరి 18న ఢిల్లీలోని పాటియాలా కోర్టులో జర్నలిస్టులపై దాడి చేసిన న్యాయవాదులను వెంటనే అరెస్ట్ చేసి శిక్షించాలని తెలంగాణ యూనియన్ ఆఫ్ వర్కింగ్ జర్నలిస్ట్ నేతలు ప్రభుత్వాన్ని డిమాండ్ చేశారు. జర్నలిస్టులపై దాడికి నిరసనగా తెలంగాణ యూనియన్ ఆఫ్ వర్కింగ్ జర్నలిస్టు, ఫోరం ఫర్ సోషల్ చేంజ్ నేతలు ఫిబ్రవరి 18న లోయర్ ట్యాంక్ బండ్‌లోని అంబేద్కర్ విగ్రహం వద్ద నిరసన వ్యక్తం చేశారు.

### మరసం 29వ మహాసభలు

మరసం 29వ మహాసభలు సిద్దిపెట పబ్లిక్ సర్వెంట్ హోంలో ఫిబ్రవరి 21న జరిగాయి. ఈ సభలో మరసం వ్యవస్థాపక అధ్యక్షులు డాక్టర్ నందిని సిధారెడ్డి, ప్రొ. కాత్యాయని విద్మహేలు 'వట్టికోట–తెలంగాణ–పూర్తి కావాల్సిన కల' అనే అంశంపై ప్రసంగించారు. మరసం అధ్యక్షులు దేశపతి శ్రీనివాస్ వట్టికోట ఆళ్వారుస్వామి జీవితం నుండి తెలంగాణ జీవితాన్ని చూడాలన్నారు. శివారెడ్డి ఏ రాజకీయ స్పృహలేని తరం మనముందు సాక్షాత్కారం అవుతోందని ఆందోళన వ్యక్తం చేశారు. విద్యార్థి సంఘాలకు ఎన్నికలు నిర్వహిస్తేనే రాజకీయ స్పృహ కలుగుతుందని, లేదంటే ఎంత ఉన్నత చదువులు చదివినా, ఉద్యోగాలు పొందినా ఆత్మహత్యలకు పాల్పడుతున్నారని 30 ఏళ్ల క్రితం ఇలాంటివి ఉండేవా? అని ప్రశ్నించారు. ఈ సందర్భంగా 43 మంది కవులు, రచయితలు రాసిన మెతుకు పుస్తకాన్ని ఆవిష్కరించారు.

### దివీస్‌ను వ్యతిరేకిస్తున్న ప్రజలు

విశాఖ జిల్లా సమీపంలోని తగరపువలస ప్రాంతంలో ఉన్న దివీస్ ఫార్మా కంపెనీ విస్తరణను వ్యతిరేకిస్తూ చిప్పాడ, సిటీ నగర్ గ్రామ ప్రజలు ఆందోళన చేస్తున్నారు. ఇప్పటికే ఈ ప్రాంతాలు కాలుష్యంతో నిండి ఉన్నాయని, ఈ సంస్థ విస్తరణకు గ్రామాలను బలవంతంగా ఖాళీ చేయించడానికి ప్రభుత్వం పూనుకుంటోంది. ఈ నిర్ణయాన్ని వ్యతిరేకిస్తూ సిపిఎం ఆధ్వర్యంలో ఫిబ్రవరి 22న ఛలో కలెక్టరేట్‌కు పిలుపునిచ్చారు. పోలీసులు ముందుగానే నాయకులను అరెస్ట్ చేశారు. దీంతో ఆగ్రహించిన ప్రజలు ర్యాలీగా కలెక్టరేట్‌కు చేరుకుని తమ జీవితాలను నాశనం చేస్తున్న దివీస్‌పై చర్యలు తీసుకోవాలని కోరారు. వీ

### అత్యాచారం కేసులో దోషులకు ఉరి

పశ్చిమ్‌బంగలో సామూహిక అత్యాచారం, హత్య కేసులో ముగ్గురు దోషులకు ప్రత్యేక న్యాయస్థానం ఉరిశిక్ష విధించింది. పశ్చిమబంగ రాష్ట్రంలోని కందునిలో 21 ఏళ్ల విద్యార్థినిపై అత్యాచారానికి పాల్పడిన అమీనుల్ అలీ, సైఫుల్ అలీ, అన్సార్ అలీలకు మరణ శిక్ష విధిస్తూ అదనపు సెషన్స్ న్యాయమూర్తి సంచిత సర్కార్ జనవరి 30న తీర్పు వెలువరించారు. మరో ముగ్గురు దోషులైన ఇమానుల్ ఇస్లాం, అమీనుల్ ఇస్లాం, భోలా నాస్కర్‌లకు యావజ్జీవ కారాగార శిక్షను విధించారు. తగిన సాక్ష్యాలు లేకపోవడంతో మరో ఇద్దరు నిందితులు రఫీకుల్ ఇస్లాం, నూర్ అలీలకు విముక్తి కల్పించారు. కేసు విచారణలో ఉన్నప్పుడే మరో నిందితుడు గోపాల్ నాస్కర్ మృతి చెందిన సంగతి తెలిసిందే. 2013 జూన్ 7న బాధితురాలు పరీక్షలు రాసేందుకు కళాశాలకు వెళ్లి, కందునిలోని తన ఇంటికి తిరిగివస్తున్న సమయంలో దోషులు దారుణానికి ఒడిగట్టారు.

### ముగ్గురు మావోయిస్టులు మృతి

చత్తీస్‌గఢ్‌లోని బస్తర్ డివిజన్‌లో భద్రతాదళాలతో జనవరి 30న జరిగిన ఎదురుకాల్పుల్లో ముగ్గురు మావోయిస్టులు మృతి చెందారు. అందులో ఇద్దరు మహిళలున్నారు. పోలంపల్లి పోలీస్‌స్టేషన్ పరిధిలోని అటవీప్రాంతంలో పోలీసులు గాలిస్తుండగా మావోయిస్టులు తారసపడడంతో ఇరువర్గాల మధ్య కాల్పులు జరిగాయన్నారు. ఈ సంఘటనలో వంజం శాంతి, వంజం పొజ్జె అనే ఇద్దరు మహిళా నక్సలైట్లు చనిపోయినట్టు పోలీసు ఉన్నతాధికారి ఎస్ఆర్‌పి కల్లూరి తెలిపారు. అవాపల్లి పోలీస్‌స్టేషన్ పరిధిలో అదే రోజు జరిగిన మరో ఘటనలో రామ్సు అనే మావోయిస్టు మరణించాడు.

### హత్య కేసులో 11 మందికి మరణ శిక్ష

ప్రభుత్వ భూమిని ఆక్రమించేందుకు మహిళను హత్యచేసిన కేసులో తృణమూల్ కాంగ్రెస్ నేతతో పాటు 11 మంది పశ్చిమబంగలోని నదియా జిల్లా కోర్టు దోషులుగా తేల్చింది. అపర్ణా బాగ్ హత్యకేసులో వీరికి ఫిబ్రవరి 4న న్యాయమూర్తి ముఖోపాధ్యాయ మరణశిక్ష ఖరారు చేశారు. మరణశిక్ష పడిన వారిలో తృణమూల్ కాంగ్రెస్ మాజీ నేత లంకేశ్వర్ ఘోష్ ఉన్నారు. రాష్ట్ర ప్రభుత్వం శరణార్థులకు అందజేసిన భూమిని ఆక్రమించేందుకు ఘోష్‌తో పాటు ఆయన అనుచరులు 2014 నవంబర్ 23న ప్రయత్నించారు. ఆ భూమి హక్కుదారులైన 55 కుటుంబాలు ఎదురుతిరగడంతో ఘర్షణ జరిగింది. ఈ ఘర్షణల్లో జరిగిన కాల్పుల్లో అపర్ణా బాగ్ అనే మహిళ మృతిచెందారు. ఈ ఘటనకు సంబంధించి 12 మందిపై కేసు నమోదుచేయగా ఒకరు తప్పించుకు తిరుగుతున్నారు.

### కార్టునిస్ట్ సుధీర్ తైలంగ్ మృతి

పలు ఇంగ్లిష్ పత్రికలలో పనిచేసిన ప్రసిద్ధ కార్టునిస్ట్ సుధీర్ తైలంగ్ (56) ఫిబ్రవరి 6న మృతిచెందారు. ఆయన గత రెండేళ్లుగా బ్రెయిన్ కేన్సర్‌తో బాధపడుతూ ఢిల్లీలోని తన నివాసంలో మృతిచెందారు. ఆయన రాజస్థాన్‌లోని బికనీర్‌లో 1960 ఫిబ్రవరి 26న జన్మించారు. ఆయన తన పదో ఏటనే కార్టూన్లు గీయడం ప్రారంభించారు. ఇలస్ట్రేటెడ్ వీక్లీ ఆఫ్ ఇండియాలో 1982లో అవకాశం రావడంతో కార్టూనిస్ట్‌గా కెరీర్‌ను ఎంచుకున్నారు. తరువాత నవభారత్ టైమ్స్, హిందుస్థాన్ టైమ్స్, ఇండియన్ ఎక్స్‌ప్రెస్, టైమ్ ఆఫ్ ఇండియా, ఏషియన్ ఏజ్ పత్రికలలోను పనిచేశారు. 2004లో సుధీర్ 'పద్మశ్రీ' అవార్డు అందుకున్నారు.

### నిర్వాసిత వ్యతిరేక రెండో కేంద్ర మహా సభలు

'భూం'కాల్ దివస్' సందర్భంగా విస్థాపన్ విరోధి జనవికాస్ ఆందోళన్ ఆధ్వర్యంలో రెండో కేంద్ర మహాసభలను ఫిబ్రవరి 9,10 తేదీల్లో హైదరాబాద్‌లోని సుందరయ్య విజ్ఞాన కేంద్రంలో జరిగాయి. ప్రజల జీవనాధారమైన భూమి, నీరు, అటవితో పాటు ఇతర ప్రకృతి సంపదలను గుత్త పెట్టుబడిదారులకు, బహుళజాతీ సంస్థలకు కట్టబెట్టేందుకు కేంద్ర ప్రభుత్వం ఉవ్విళ్లూరుతోందని పలు ప్రజా సంఘాల నేతలు ఆరోపించారు. దేశభక్తులమని చెప్పుకునే పాలకులు దేశాన్ని సామ్రాజ్యవాదులకు తాకట్టు పెడుతున్నారని అన్నారు. అభివృద్ధి పేరిట విధ్వంసం చేస్తూ ఆదివాసులను నిర్వాసితులను చేస్తున్నారని అన్నారు. జల్ జంగల్ జమీన్ ఇజ్జత్ కోసం ఆదివాసులు చేస్తున్న పోరాటం స్ఫూర్తిదాయకమన్నారు. 106 ఏళ్ల క్రితం గుండధార్ నేతృత్వంలో భూంకాల్ ఉద్యమం ప్రారంభమైందన్నారు. ఈ సభకు 12 రాష్ట్రాల నుంచి ప్రతినిధులు హాజరయ్యారు. విస్థాపన్ విరోధి జనవికాస్ ఆందోళన్‌కు జాతీయ కన్వీనర్‌గా దామోదర్‌తురి (ఝార్ఖండ్) ఎన్నికయ్యారు.

### నక్సల్స్ ప్రభావిత ప్రాంతాల్లో మొబైల్ టవర్లు

దేశవ్యాప్తంగా నక్సల్స్ ప్రభావిత ప్రాంతాల్లో టెలిఫోన్ సౌకర్యాన్ని పెంచేందుకు ప్రభుత్వం 1356 మొబైల్ టవర్లు ఏర్పాటు చేసింది. దట్టమైన అటవీ ప్రాంతాల్లో ఉన్న నక్సల్స్‌తో పోరాడుతున్న భద్రతాదళాల ప్రయోజనం కోసం ఏర్పాటుచేశారు. తొమ్మిది రాష్ట్రాల్లో ప్రభుత్వరంగ సంస్థ బిఎస్ఎన్ఎల్ మార్చ్ వరకు మొత్తం 2199 టవర్లు నిర్మించాలి. వీటికి తోడు కేంద్ర హోంశాఖ ఇటీవలే అదనంగా 175 టవర్లను మంజూరు చేసింది. మావోయిస్టులు తరుచూ వీటిని లక్ష్యం చేసుకుంటుండడంతో ప్రస్తుతం పోలీసు ఠాణాలు, పోలీసులు, పారామిలటరీ బలగాల శిబిరాల్లో టవర్లను నిర్మిస్తున్నారు. రు.3046 కోట్ల విలువజేసే ఈ ప్రాజెక్టును కేంద్ర ప్రభుత్వం మూడేళ్ల క్రితమే ఆమోదించింది. నక్సల్స్ ప్రభావం ఎక్కువగా ఉన్న ఝార్ఖండ్‌లోనే ఇప్పటి వరకు 700 ఏర్పాటు చేశారు.

### సోనీ సోరిపై రసాయన దాడి

గిరిజన హక్కుల కార్యకర్త, ఆప్ నేత సోనీ సోరి ముఖం పై గుర్తుతెలియని వ్యక్తులు రసాయనం పోశారు. చత్తీస్‌గడ్‌లోని దంతెవాడ జిల్లాలో ఫిబ్రవరి 21న రాత్రి ఈ దాడి జరిగింది. సోనీని ఆమె సహచరులు ఆసుపత్రికి తీసుకెళ్లారు. ఆమె ముఖం నల్లగా మారిందని నిందితులు వాడింది తారు లాంటి ఓ రసాయన పదార్థమని వైద్యులు తెలిపారు. గత రెండు రోజుల క్రితం బస్తర్‌లో మహిళా న్యాయవాదులు, ఓ ఫ్రీలాన్స్ జర్నలిస్ట్‌ను బస్తర్ ఎస్‌పి సమక్షంలో బలవంతంగా ఇల్లు ఖాళీ చేయించారు. దీన్ని సోనీ తీవ్రంగా వ్యతిరేకించి నిరసన తెలిపారు. ఈ నేపథ్యంలో దాడి ఘటన చోటుచేసుకోవడం చర్చనీయాంశమైంది.

### రిజర్వేషన్ల కోసం జాట్ల ఆందోళన

ఓబిసి రిజర్వేషన్లు కోరుతూ జాట్లు నిర్వహిస్తున్న ఆందోళన యుపి, ఢిల్లీ, రాజస్థాన్ సహా ఉత్తరాది రాష్ట్రాలకు విస్తరించింది. హర్యానాలో ఫిబ్రవరి నుండి కొనసాగుతున్న నిరసనలో 12 మంది మృతి చెందగా, 150 మందికి పైగా గాయపడ్డారు. సైన్యాన్ని పలు పట్టణాల్లో దింపి కనిపిస్తే కాల్చివేత ఉత్తర్వులు జారీచేసినప్పటికీ హింస, విధ్వంసం ఆగలేదు. పది రైల్వే స్టేషన్లకు ఆందోళనకారులు నిప్పుపెట్టారు. రెండు రైలు ఇంజన్లు, రెండు ట్రాక్ మిషన్లు ధ్వంసం చేశారు. ఈ ఘటనలో 50 వేల కోట్ల వరకు నష్టం జరిగిందని ఒక అంచనా. జాట్ల డిమాండ్లను నెరవేరుస్తామని హర్యానా సి.ఎం. మనోహర్‌లాల్ ఖట్టర్ హామీ ఇచ్చినప్పటికీ ఆందోళన విరమించలేదు. ఫిబ్రవరి 24న ఆందోళనాకారులు 10 మంది మహిళలపై అత్యాచారానికి పాల్పడ్డట్లు అక్కడి గ్రామస్తులను ఉటంకిస్తూ 'ట్రిబ్యూన్' పత్రిక కథనం. వీ

### ఆల్బర్ట్ ఉడ్‌ఫాక్స్ విడుదల

అమెరికాలో 43 ఏళ్లపాటు ఏకాంత కారాగారం అనుభవించిన ఆల్బర్ట్ ఉడ్‌ఫాక్స్‌ను లూసియానా జైలు అధికారులు విడుదల చేశారు. అంగోలా చెరసాల గార్డును హత్య చేసిన కేసులో అతన్ని 1972లో అరెస్టు చేశారు. అమెరికాలోని లూసియానా రాష్ట్రంలోని అంగోలా బానిస జైలు నుంచి విముక్తి కోసం పోరాడారు. బ్లాక్ పాంథర్ పేరిట ఓ ఉద్యమాన్ని నడిపారు. బానిస క్షేత్రంలో జరుగుతున్న అవినీతిని వెలుగులోకి తెచ్చేందుకు 70వ దశకంలో ముగ్గురు నల్లజాతి వ్యక్తులు ప్రభుత్వానికి వ్యతిరేకంగా పోరాడారు. అంగోలా త్రీ కేసులో ఆల్బర్ట్‌తో పాటు రాబర్ట్ కింగ్, హెర్మన్ వాలెస్ కూడా జైలు శిక్ష అనుభవించారు. 2001లో రాబర్ట్ కింగ్ జైలు నుంచి విడుదలయ్యాడు. హెర్మన్ వాలెస్ కూడా 30 ఏళ్ల పాటు కారాగారం అనుభవించి 2013లో విడుదలయ్యాడు. అతను విడుదలైన రెండు రోజులకే మృతిచెందాడు. ఏకాంత కారాగారం ఓ అనాగరిక చర్య అని దీన్ని బహిష్కరించేందుకు శక్తి వంచన లేకుండా కృషి చేస్తానని బ్లాక్ పాంథర్ ఉద్యమ ప్రచారకర్త ఉడ్‌ఫాక్స్ తెలిపారు.

### 40 మంది మిలిటెంట్లకు ఉరిశిక్ష

రెండేళ్ల క్రితం ఇరాక్‌తో నరమేథం సృష్టించిన నిందితులకు మరణశిక్ష పడింది. మొత్తం 47 మందిని విచారించిన బాగ్దాద్ సెంట్రల్ క్రిమినల్ కోర్టు.. వారిలో 40 మందిని దోషులుగా పేర్కొంటూ, ఉరిశిక్ష ఖారారు చేస్తూ తీర్పు వెలవరించింది. ఆధారాలు లేని కారణంగా మరో ఏడుగురిని విడుదల చేస్తున్నట్టు పేర్కొంది. ఇరాక్ ప్రభుత్వ ప్రతినిధి అబ్దెల్ సత్తార్ బేయర్దార్ ఈ వివరాలను ఓ ప్రకటనలో వెల్లడించారు. 2014 జూన్‌లో తిక్రిత్ నగరంలో మిలిటెంట్లు 1700 మందికిపైగా బందీలను హతమార్చిన విషయం తెలిసిందే. ఆ కేసు 18వ తేదీనాడు బాగ్దాద్ కోర్టులో విచారణకు వచ్చింది. ఇరాక్ టెర్రరిస్ట్ వ్యతిరేక చట్టంలోని ఆర్టికల్4 కింద నిందితులకు ఈ శిక్ష ఖరారు చేసినట్టు అబ్దెల్ సత్తార్ వివరించారు.

### యావొండేలో ఆత్మాహుతి దాడి

కామెరూన్ రాజధాని యావొండే నగరంలో 19వ తేదీ శుక్రవారం ఉగ్రవాదులు నరమేధానికి తెగబడ్డారు. కామెరూన్‌కు ఉత్తరాన ఉన్న నైజీరియా సరిహద్దులో నిత్యం రద్దీగా ఉండే మార్కెట్ ప్రాంతంలో ఇద్దరు ఉగ్రవాదులు ఆత్మాహుతిదాడులకు పాల్పడ్డారు. ఈ దాడుల్లో 19 మంది దుర్మరణం చెందగా, 50 మంది తీవ్రంగా గాయపడినట్టు అక్కడి భద్రతా బలగాలు వెల్లడించాయి. కాగా ఇప్పటి వరకూ ఈ ఆత్మాహుతి దాడులకు ఎవరూ పాల్పడ్డారనేది అధికారికంగా తెలియలేదు.

### వైమానిక దాడుల్లో 40 మిలిటెంట్ల మృతి

లిబియాలో వైమానిక దాడుల తీవ్ర రూపం దాల్చాయి. ఫిబ్రవరి 19న గుర్తుతెలియని ఓ యుద్ధ విమానం గగనతలం నుంచి జరిపిన బాంబు దాడుల్లో సుమారు 40 మంది ఇస్లామిక్ మిలిటెంట్లు మరణించి ఉంటారని లిబియా అధికారులు భావిస్తున్నారు. ట్యునీషియా సరిహద్దులో ఉన్న ఐఎస్ఎస్ఎన్ సభ్యులను లక్ష్యంగా చేసుకుని యుద్ధ విమానం బాంబులతో దాడి జరిగినట్లుగా భావిస్తున్నారు. ఈ దాడుల్లో మిలిటెంట్లు సమావేశమైన ఇల్లు పూర్తిగా ధ్వంసమైంది. టిప్రోలికి సరిహద్దుగా ఉన్న ట్యునీషియా సమీపంలో ఈ దాడులు జరిగాయని హుస్సన్ ఆన దవాదీ అనే అధికారి వెల్లడించారు.

### టర్కీలో కారుబాంబు దాడి

టర్కీ రాజధాని అంకారాలో టర్కీ మిలటరీ సిబ్బందిని లక్ష్యంగా చేసుకుని ఫిబ్రవరి 18న కారుబాంబు పేలుడు సంభవించింది. ఈ పేలుడులో 28 మంది అక్కడికక్కడే మరణించారు. మరో 61 మంది తీవ్రంగా గాయపడ్డారు. ఈ మేరకు టర్కీ ఉపప్రధాని 18వ తేదీ గురువారం రాత్రి వెల్లడించారు. క్షతగాత్రులు నగరంలోని వివిధ ఆసుపత్రుల్లో చికిత్స పొందుతున్నారని తెలిపారు.

### ఆఫ్ఘాన్‌లో ఆత్మాహుతి దాడి

అఫ్గాన్ తూర్పు సరిహద్దులోని పర్వాన్ ప్రాంతంలో ఓ గుర్తుతెలియని వ్యక్తి ఆత్మాహుతి దాడికి పాల్పడ్డాడు. ఈ సంఘటన ఫిబ్రవరి 23న జరిగింది. ఈ ఘటనలో 13 మందికిపైగా మృతి చెందారని అధికారులు వెల్లడించారు. పదుల సంఖ్యలో వ్యక్తులు గాయపడి ఉండొచ్చునని భావిస్తున్నారు.

### సిరియాలో కారుబాంబు దాడి

సిరియాలోని హామ్స్ నగరంలో, దమాస్కస్ శివారులోని ఓ ప్రార్థన మందిరం వద్ద ఫిబ్రవరి 21న జరిగిన రెండు కారు బాంబు దాడుల్లో 120 మంది మృతిచెందారు. హామ్స్‌లోని అల్ జహ్రానా జిల్లాలో జరిగిన దాడిలో 57 మంది చనిపోయారు. సయిదా జినాబ్‌లో జరిగిన దాడిలో 63 మంది చనిపోయారు. పదుల సంఖ్యలో గాయపడ్డారు.

### తైవాన్‌లో భూకంపం

తూర్పు ఆసియాలోని ద్వీపదేశం తైవాన్‌లో ఫిబ్రవరి 20 తెల్లవారుజామున భూకంపం సంభవించింది. ఈ భూకంపం తీవ్రత రిక్టర్ స్కేల్‌పై 6.4గా నమోదయ్యింది. ప్రకంపనల ప్రభావంతో తైవాన్ పట్టణంలోని పలు భారీ భవంతులు నేలకూలాయి. అక్కడికక్కడే 13 మంది మరణించగా150 మందికిపైగా శిథిలాల కింద చిక్కుకుపోయారని తైవాన్ విపత్తు నిర్వహణాధికారులు తెలిపారు.

### నేపాల్ మాజీ ప్రధాని కన్నుమూత

నేపాల్ మాజీ ప్రధాని సుశీల్ కొయిరాలా(79) ఫిబ్రవరి 9న కన్నుమూశారు. గత కొంత కాలంగా ఆయన ఊపిరితిత్తుల క్యాన్సర్ వ్యాధికి అమెరికాలో చికిత్స చేయించుకుని ఇటీవలే నేపాల్‌కు చేరుకున్నారు. వ్యాధి తిరగబెట్టడంతో ఆయన స్వగ్రామమైన మహరాజ్ గంజ్‌లో మృతిచెందారు. ఆయన భారత్‌లోని బనారస్‌లో 1939 ఆగస్టు 12న జన్మించారు. ఆయన రాజకీయ ప్రస్థానం 1954లో నేపాలీ కాంగ్రెస్‌తో మొదలైంది. 1960లో నేపాల్‌ను ఆక్రమించుకున్న రాజు కొయిరాలాకు 16 ఏళ్లు రాజకీయ బహిష్కరణ శిక్ష విధించారు. 2013 ఎన్నికల్లో కొయిరాలా నేతృత్వంలోని నేపాలీ కాంగ్రెస్ ఘన విజయం సాధించింది. 2015 అక్టోబర్ 12 వరకు నేపాల్ ప్రధానిగా ఉన్నారు.

### అసాంజేను విడుదల చేయాలి

మిత్ర దేశాలతో కలిసి అమెరికా చేస్తున్న కుట్రలను బట్టబయలు చేసిన వికీలీక్స్ స్థాపకుడు జూలీయస్ అసాంజేకు అనుకూలంగా ఐక్యరాజ్య సమితి లీగల్ ప్యానెల్ ఫిబ్రవరి 5న కీలకమైన తీర్పునిచ్చింది. లండన్‌లోని ఈక్వెడార్ దౌత్య కార్యాలయంలో తాను చిక్కుకు పోవడానికి బ్రిటన్, స్వీడన్ ప్రభుత్వాలే కారణమని 2014లో అసాంజే ఐక్యరాజ్య సమితి లీగల్ ప్యానెల్‌లో ఫిర్యాదు చేశారు. మరోవైపు ఈ తీర్పుకి తాము కట్టుబడాల్సిన అవసరంలేదని బ్రిటన్ స్పష్టం చేసింది. వీ

# అసహజ మరణాల సూచి

సంకలనం: ఎస్. వెంకటేష్

మరణం ఎప్పుడయినా విషాద సూచకమే. మృతుల బంధువులకూ, మిత్రులకూ విచారకరమే కాని అందులోనూ మరణించిన మనిషి నిండు జీవితం గడిపి వయోభారంతోనే మరణిస్తే దాన్ని సహజ మరణంగా అంగీకరించి ఊరట పడవచ్చు. సగటు ఆయు ప్రమాణంలో సగం కూడా అనుభవించక ముందే మరణిస్తున్నారు. ఈ అసహజ మరణాలకు లెక్కలేనన్ని ఆర్థిక, సామాజిక, రాజకీయ కారణాలున్నాయి. మన పక్కనే మనతోనే ఉండే మనుషులు అర్థాంతరంగా అసహజంగా అకాలంగా అదృశ్యమైపోతున్నారు. ఇటువంటి అసహజ మరణాలు ఇటీవలి కాలంలో విపరీతంగా పెరిగిపోతున్నాయి. ఇవి సామాజిక సంక్షోభానికి, సమాజం దిగజారుడుకు ఒక చిహ్నం. మన రాష్ట్రంలో సాలీనా ఈ రకంగా చనిపోతున్న వారి సంఖ్య వేలల్లోనే ఉంటుందని అంచనా. నిజానికి అసహజ మరణాలన్నీ అసహజ మరణాలుగా నమోదు కావడం లేదు గనుక ఈ సంఖ్య వాస్తవంలో ఒక భాగం మాత్రమే కావచ్చు. పత్రికలలో అచ్చయిన ఇటువంటి ఘటనలన్నిటినీ ఒక్కచోట నమోదు చేయాలని భావిస్తున్నాం. ఈ శీర్షిక ప్రతి నెల ఉంటుంది. అయితే రాష్ట్రంలో ప్రతి గ్రామంలో జరుగుతున్న సంఘటనలన్నీ ఇక్కడ రిపోర్ట్ కాకపోవచ్చు. కొన్నయినా మనల్ని ఆలోచింపజేస్తే, మనం మనచుట్టూ ఉన్న మనుషుల కోసం ఇంకాస్త బాధ్యతగాను, జాగ్రత్తగాను వ్యవహరిస్తూ మొత్తంగా పరిష్కారాలవైపు వెళ్లడానికి ఏమయినా తోడ్పడితే ఈ శీర్షిక విజయవంతమైనట్లే.

**(జనవరి1 నుండి జనవరి 31, 2015 వరకు తెలంగాణలోని 10 జిల్లాలు (927), ఆంధ్రప్రదేశ్‌లోని 12 జిల్లాలలో (677) అసహజ మరణాల పాలైన వారి సంఖ్య 1604)**

| జిల్లా | ఆకలి | ఆత్మహత్యలు | | | | చికిత్స అందక, అనారోగ్యం | | | గుర్తు తెలియని | | హత్యలు | | ప్రమాదాలు | | | | పోలీసు కాల్పుల్లో | | పోలీసులు, సైన్యం | మిస్సింగ్/ లాకప్ మరణాలు | ప్రకృతి వైపరీత్యాలు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | వ్యవసాయ రంగం | చేనేత రంగం | ఇతరాలు | | | | | | | | | పనిచేసే స్థలంలో | కరెంట్ | రహదారి | ఇతరాలు | ఉద్యమ కారులు | ఇతరులు | | | |
| | | | | స్త్రీ | పు. | స్త్రీ | పు. | పి. | స్త్రీ | పు. | స్త్రీ | పు. | | | | | | | | | |
| (1) | (2) | (3) | (4) | (5) | (6) | (7) | (8) | (9) | (10) | (11) | (12) | (13) | (14) | (15) | (16) | (17) | (18) | (19) | (20) | (21) | (22) |
| ఆదిలాబాద్ | 1 | 4 | – | 18 | 16 | 4 | 5 | 6 | 3 | 3 | 5 | 3 | 1 | 1 | 24 | 27 | – | – | – | 3 | – |
| హైదరాబాద్ | – | – | – | 7 | 7 | – | – | 1 | – | 3 | 8 | 4 | – | 1 | 28 | 19 | – | – | – | – | – |
| కరీంనగర్ | – | 9 | 1 | 6 | 7 | 4 | 5 | – | – | – | 1 | 5 | – | – | 32 | 11 | – | – | – | – | 2 |
| ఖమ్మం | – | 3 | – | 9 | 12 | 3 | 15 | 2 | – | 1 | 1 | 1 | – | 3 | 23 | 11 | – | – | – | – | – |
| మహబూబ్‌నగర్ | – | 11 | – | 19 | 13 | 6 | 8 | 5 | – | 2 | 6 | 14 | 14 | 8 | 48 | 7 | – | – | – | – | – |
| మెదక్ | 2 | 5 | 9 | 8 | 2 | 6 | 2 | 1 | 14 | 12 | 19 | 22 | 16 | 9 | 12 | 9 | – | – | – | 2 | 2 |
| నల్గొండ | – | 14 | – | 5 | 7 | 3 | 7 | – | – | 1 | 1 | 3 | 2 | 8 | 27 | 10 | – | – | – | – | – |
| నిజామాబాద్ | – | 14 | – | 5 | 10 | 1 | 2 | – | 2 | 2 | 4 | – | 5 | 4 | 19 | 12 | – | – | – | – | – |
| వరంగల్ | – | 8 | – | 9 | 6 | 2 | 6 | – | – | 1 | 2 | – | – | 6 | 23 | 13 | – | – | – | – | 3 |
| రంగారెడ్డి | – | 3 | – | 3 | 4 | 1 | 2 | – | – | 1 | 3 | 2 | – | 1 | 14 | 9 | – | – | – | – | – |
| **తెలంగాణ** | **3** | **71** | **10** | **89** | **84** | **30** | **52** | **15** | **19** | **26** | **50** | **54** | **38** | **41** | **250** | **128** | **-** | **-** | **-** | **5** | **7** |
| అనంతపురం | – | 8 | 3 | 7 | 26 | 1 | – | 2 | 3 | 5 | 5 | 3 | 4 | 6 | 43 | 3 | – | – | – | – | – |
| చిత్తూరు | – | – | – | 6 | 8 | 7 | 11 | – | – | – | 6 | 9 | 8 | – | 34 | – | – | – | – | – | – |
| కడప | – | – | – | 4 | 5 | – | – | – | 2 | – | 3 | 3 | – | 1 | 8 | 2 | – | – | – | – | 1 |
| గుంటూరు | – | – | – | 2 | 2 | 4 | 3 | – | – | – | 3 | 5 | 1 | 2 | 13 | 9 | – | – | – | – | – |
| కృష్ణా | – | – | – | 2 | 1 | – | 1 | – | 3 | 1 | – | – | – | 4 | 14 | 7 | – | – | – | – | – |
| కర్నూలు | | | | వివరాలు అందలేదు | | | | | | | | | | | | | | | | | |
| తూర్పు గోదావరి | – | – | – | 5 | 8 | 3 | – | – | 3 | 3 | 1 | 1 | 4 | 6 | 20 | 18 | – | – | – | – | – |
| ప్రకాశం | – | 1 | – | 1 | 3 | 1 | 1 | – | – | – | – | 4 | – | 3 | 12 | 6 | – | – | – | – | – |
| శ్రీకాకుళం | – | – | – | 3 | 10 | 2 | 6 | 1 | – | 2 | 3 | 3 | 4 | – | 26 | 10 | – | – | – | – | – |
| పశ్చిమ గోదావరి | – | – | – | 1 | 2 | 2 | 1 | – | 1 | 1 | – | 1 | 2 | 5 | 15 | 7 | – | – | – | – | – |
| నెల్లూరు | – | – | – | 1 | 5 | 8 | 4 | – | – | 3 | 2 | 1 | – | 1 | 23 | 8 | – | – | – | – | – |
| విజయనగరం | – | – | – | 1 | 2 | 1 | 3 | – | – | – | – | – | – | – | 11 | 5 | – | – | – | – | – |
| విశాఖపట్నం | 2 | – | – | 4 | 6 | 2 | 5 | 1 | – | 1 | 1 | – | 2 | – | 20 | 18 | – | – | – | 10 | – |
| **ఆంధ్రప్రదేశ్** | **2** | **9** | **3** | **37** | **78** | **31** | **35** | **4** | **12** | **16** | **24** | **30** | **25** | **28** | **239** | **93** | **-** | **-** | **-** | **10** | **1** |

# వీక్షణం దగ్గర అమ్మకానికి ఉన్న పుస్తకాలు

### ఆర్థిక వ్యవస్థ – సామ్రాజ్యవాదం

| | | |
|---|---|---|
| ఒక దళారీ పశ్చాత్తాపం | జాన్ పెర్కిన్స్ | రూ. 75 |
| కుట్రాజకీయం | స్టీఫెన్ కింజర్ | 40 |
| అభివృద్ధిని ఇలా చూద్దాం | ముదునూరి భారతి | 80 |
| కొత్తచూపు | ఆర్.ఎస్. రావు | 120 |
| ఊరి దారి | ఎన్. వేణుగోపాల్ | 60 |
| రాబందు వాలిన నేల | ఎన్. వేణుగోపాల్ | 180 |
| వ్యవసాయం – ప్రపంచీకరణ | కె.ఆర్. చౌదరి | 100 |
| నిత్యజీవితంలో సోషలిజం | భూసారం శివన్న | 100 |
| విధ్వంసక అభివృద్ధి | డిఎస్‌యు | 180 |
| భారతదేశంలో ఉత్పత్తి విధానం– ఉత్పత్తి సంబంధాలు | విరసం | 20 |
| పోలవరంతో విధ్వంసమే | డా. ఎస్. తిరుపతయ్య | 40 |

### తెలంగాణ

| | | |
|---|---|---|
| లేచినిలిచిన తెలంగాణ | ఎన్. వేణుగోపాల్ | 120 |
| తిరగబడ్డ తెలంగాణ | ఇనుకొండ తిరుమలి | 100 |
| తెలంగాణ రాజకీయాలు | దాగ్మార్ బెర్న్‌స్టార్ఫ్, హ్యూగ్ గ్రే | 80 |
| కొత్త వంతెన | కె. శ్రీనివాస్ | 120 |
| తెలంగాణ జైత్రయాత్ర | ఘంటా చక్రపాణి | 200 |
| తెలంగాణ కాలజ్ఞాని ప్రొ. జయశంకర్ | ఘంటా చక్రపాణి | 20 |

### శాస్త్రవిజ్ఞానం

| | | |
|---|---|---|
| విశ్వాంతరాళం | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 100 |
| మానవ పరిణామం | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 100 |
| జీవకణాలూ నాడీకణాలూ | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 80 |
| ప్రకృతీ – పర్యావరణం | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 100 |
| జీవశాస్త్ర విజ్ఞానం – సమాజం | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 100 |
| విజ్ఞాన శాస్త్రం మనిషి విస్తరణ | జెడి బెర్నాల్ | 80 |

### కులం–మతం

| | | |
|---|---|---|
| భారతదేశంలో కుల సమస్య | అనురాధ గాంధీ | 120 |
| శూద్రవర్ణం ఎలా పుట్టింది | ఆర్.ఎస్. శర్మ | 80 |
| కులం వర్గం | బొజ్జా తారకం | 30 |
| ఎస్సి, ఎస్టి నిధులు, విధిలింపు - మళ్లింపు | బొజ్జా తారకం | 40 |
| ఎస్‌సి, ఎస్‌టిలపై అత్యాచారాలు | బొజ్జా తారకం | 50 |
| ఖైర్లాంజి | ఆనంద్ తేల్‌తుంబ్డే | 100 |
| గులాంగిరి | జోతిబా పూలే | 40 |
| కుల నిర్మూలన | అంబేద్కర్ | 30 |
| రాముని కృష్ణుని రహస్యాలు | అంబేద్కర్ | 20 |
| దళితులు – రాజ్యం | అంబేద్కర్ | 25 |
| శూద్రులు – ఆర్యులు | అంబేద్కర్ | 8 |
| ఆధునిక భారతదేశంలో అంటరానితనం | అంబేద్కర్ | 25 |
| దాస్య విముక్తి కోసం | అంబేద్కర్ | 15 |
| భారతదేశం ప్రజాస్వామ్యం | అంబేద్కర్ | 12 |
| ఆంగ్లేయపాలకులు – అంటరానివాళ్లు | అంబేద్కర్ | 20 |
| రాష్ట్రాలు – మైనారిటీలు | అంబేద్కర్ | 40 |
| రాముని కృష్ణుని రహస్యాలు | అంబేద్కర్ | 20 |
| మతతత్వంపై బాలగోపాల్ | కె. బాలగోపాల్ | 150 |
| దేవుని రాజకీయతత్వం | కంచె ఐలయ్య | 70 |
| నేను హిందువునెట్లయిత? | కంచె ఐలయ్య | 80 |

### సాహిత్య విమర్శ – వ్యాసాలు

| | | |
|---|---|---|
| గురజాడ దేశభక్తి | ఎన్. వేణుగోపాల్ | 20 |
| స్వేచ్ఛారావం | జి. హరగోపాల్ | 250 |
| సాహిత్యంపై బాలగోపాల్ | కె. బాలగోపాల్ | 150 |
| సాహిత్య వ్యాసాలు | చలసాని ప్రసాద్ | 100 |
| చలసాని ప్రసాద్ రచనలు | చలసాని ప్రసాద్ | 100 |
| విరసం సాహిత్య విమర్శ | విరసం ప్రచురణ | 150 |
| మహోదయం | కె.వి.ఆర్. | 200 |
| కెవిఆర్ సాహిత్య వ్యాసాలు–2 | కె.వి.ఆర్. | 250 |
| కెవిఆర్ సాహిత్య వ్యాసాలు–3 | కె.వి.ఆర్. | 250 |
| కెవిఆర్ సామాజిక వ్యాసాలు | కె.వి.ఆర్. | 300 |
| సాహిత్య సమాలోచన | కృష్ణాబాయి | 300 |
| సందిగ్ధ సందర్భం | సి.వి. సుబ్బారావు | 40 |
| సామాజికం | వి. చెంచయ్య | 30 |
| స్త్రీవాద సాహిత్యం | డా. నళిని | 70 |
| రియాలిటీ చెక్ | పూదూరి రాజిరెడ్డి | 250 |
| మన ప్రపంచం | దుప్పల రవికుమార్ | 75 |
| దారులేసిన అక్షరాలు | భారతీయ మహిళల రచనలు | 400 |

### చరిత్ర–జీవిత చరిత్ర

| | | |
|---|---|---|
| భారత చరిత్ర అధ్యయనానికి ఒక పరిచయం | డి.డి. కోసంబి | 250 |
| భారత చరిత్ర పరిచయ వ్యాసాలు | డి.డి. కొశాంబి | 40 |
| భగవద్గీత చారిత్రక పరిణామం | డి.డి. కొశాంబి | 10 |
| ప్రాచీన భారత దేశ చరిత్ర | కె. బాలగోపాల్ | 50 |
| చరిత్రలో ఏం జరిగింది? | గార్డన్ చైల్డ్ | 80 |
| తరతరాల భారతదేశ చరిత్ర | రొమీల్లా థాపర్ | 80 |
| ఆధునిక భారతదేశ చరిత్ర | బిపిన్ చంద్ర | రూ. 100 |
| ఇండియాలో దాగిన హిందుస్థాన్ | పెరి ఆండర్సన్ | 150 |
| 24 గంటలు | కె.జి. కన్నబిరాన్ | 200 |
| బాబాసాహెబ్ అంబేద్కర్ | బి. విజయభారతి | 70 |
| చేగువేరా | కాత్యాయని | 80 |
| నిర్జన వారధి | కొండపల్లి కోటేశ్వరమ్మ | 100 |
| ఇంట్లో ప్రేమ్‌చంద్ | శివరాణీ దేవి | 120 |
| నా ప్రజాజీవితం | పెండ్యాల రాఘవరావు | 50 |
| ఛత్రపతి సాహూ మహరాజ్ | కాత్యాయని | 40 |
| నూరేళ్ల కాళోజీ | వరవరరావు | 60 |
| ఆకుల భూమయ్య రచనలు | తెలంగాణ విద్యార్థి గళం | 40 |
| అలిశెట్టి ప్రభాకర్ కవిత | అలిశెట్టి ప్రభాకర్ | 150 |

### తత్వశాస్త్రం

| | | |
|---|---|---|
| మార్క్సిస్ట్ సాహిత్య విమర్శ | డా. శ్రీనివాస్ | 100 |
| మార్క్సిస్ట్ తత్వశాస్త్రం | న్యూవిస్టా పబ్లికేషన్స్ | 80 |
| మార్క్సిజం-లెనినిజం-మావోయిజం | విరసం | 125 |
| లెఫ్టిస్ట్ స్టడీ సర్కిల్ ప్రచురణలు అన్ని | | |

### విప్లవోద్యమం

| | | |
|---|---|---|
| పోలీసులు అరెస్ట్ చేస్తే | బొజ్జా తారకం | 30 |
| భారత్‌పై అరుణతార | యాన్ మిర్డాల్ | 100 |
| జంగల్‌నామా | సత్నామ్ | 100 |
| ఏది నేరం?! | బి. అనూరాధ | 75 |
| మంద్రస్థాయి యుద్ధం | విరసం ప్రచురణ | 100 |
| జగిత్యాల జంగల్‌మహల్–1 | విరసం ప్రచురణ | 75 |
| జగిత్యాల జంగల్‌మహల్–2 | విరసం ప్రచురణ | 100 |
| నేటి రాయలసీమ | విరసం ప్రచురణ | 100 |
| దండకారణ్యంలో గ్రీన్‌హంట్ | విరసం ప్రచురణ | 60 |
| రివిజనిజం | విరసం ప్రచురణ | 75 |
| అంతర్యుద్ధంలో ఆదివాసులు | విరసం ప్రచురణ | 20 |
| ఆదర్శ జీవులు అమరులు | విరసం ప్రచురణ | 30 |
| మావో రచనలు – 1 | విరసం ప్రచురణ | 170 |
| మావో రచనలు – 2 | విరసం ప్రచురణ | 220 |
| సంకెళ్ల సవ్వడి | అరుణ్ ఫరేరా | 150 |

### కథ – నవల

| | | |
|---|---|---|
| దండకారణ్య కథలు(2005–2012) | విరసం ప్రచురణ | 100 |
| వసంతగీతం | అల్లం రాజయ్య | 250 |
| రేపు కథ | వెర్నన్ గొంజాల్వెస్ | 20 |
| మిగిలేటోళ్లు | బాసిత్ | 50 |
| కాంత పున్నం వెన్నెల | పద్మకుమారి | 20 |
| ఏడుతరాలు | అలెక్స్ హేలీ | 80 |
| కథలగూడు | దేవులపల్లి కృష్ణమూర్తి | 60 |
| పథేర్ పాంచాలి | బిభూతిభూషణ్ బంధోపాధ్యాయ | 100 |
| అపరాజితుడు | బిభూతిభూషణ్ బంధోపాధ్యాయ | 100 |
| వనవాసి | బిభూతిభూషణ్ బంధోపాధ్యాయ | 120 |
| నేల నాగలి – మూడెద్దులు | బొజ్జా తారకం | 25 |
| పంచతంత్రం | బొజ్జాతారకం | 100 |
| ఇస్మత్ చుగ్తాయి కథలు | ఇస్మత్ చుగాయి | 100 |
| స్పార్టకస్ | హోవార్డ్ ఫాస్ట్ | 80 |
| రేపటి కల | రిచర్డ్ రైట్ | 50 |
| పంచమం | చిలుకూరి దేవపుత్ర | 100 |
| బీజభూమి | వరవరరావు | 100 |
| మరల సేద్యానికి | శివరామ కారంత్ | 150 |
| హింసపాదు | బమ్మిడి జగదీశ్వరరావు | 180 |

### డివిడి

| | |
|---|---|
| వీక్షణం (2003 – 2012) | 200 |
| సృజన (1966–1992) | 240 |
| అరుణతార (1970–2013) | 125 |
| 'ఓయు'ద్ధకాండ | 100 |

**వీక్షణం,** మైత్రి రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3,
హిమాయత్‌నగర్, హైదరాబాద్ - 500 029.
ఫోన్ : 040-66843495
Email : veekshanam2003@gmail.com, www.veekshanam.wordpress.com

